సంకలనం :

డా. గుమ్మన్నగారి బాల శ్రీనివాస మూర్తి





జాగృతి ప్రచురణలు

భాగ్యనగర్

జాగృతి వారపత్రిక కథలు

సంకలనం :

డా. గుమ్మన్నగారి బాల శ్రీనివాసమూర్తి

ప్రచురణ :

**జాగృతి ప్రచురణలు**
3-4-705/4, నారాయణగూడ
హైదరాబాద్ - 500 0 9.

ప్రతులకు :

**సాహిత్యనికేతన్**
3-4-842, బరకత్‌పురా,
హైదరాబాద్ - 500 027.

**సాహిత్యనికేతన్**
ఏలూరు రోడ్
విజయవాడ - 500 002.

కంపోజింగ్ :

**జాగృతి గ్రాఫిక్స్**
3- 4 -705/4, నారాయణగూడ,
హైదరాబాద్ - 500 029.

వెల : రూ. 60-00

# ప్రకాశకుల మనవి

జాగృతి వారపత్రిక సామాజిక, రాజకీయ, సాంస్కృతిక విషయాలకే ప్రాముఖ్యత నిచ్చినా సాహిత్య విషయంలో ముఖ్యంగా కథా సాహిత్యాన్ని నిర్లక్ష్యం చేయలేదు. ప్రారంభం నుండి చారిత్రక, సాంఘిక కథలను ప్రచురిస్తూ వుంది. దీపావళి, తదితర సందర్భాలలో కథల పోటీలను నిర్వహిస్తూ కథా రచయితలకు ప్రోత్సాహాన్ని ఇస్తున్నది. **1979**లో **200** మందికి పైగా తెలుగు కథా రచయితలతో రెండు రోజుల పాటు సభలను నిర్వహించింది. ఆ సభల ఫల స్వరూపమే 'అందాల తెలుగు కథ'. **1992**లో మూడు రోజుల పాటు తెలుగు కథా రచయితలకు శిక్షణా శిబిరాలను నిర్వహించడం జరిగింది. 'జాగృతి'లో ప్రచురితమైన నవలలు, కథలు పాఠకుల మన్నన పొందుతూ ఉన్నాయి.

జాగృతిలో ప్రచురితమైన కథలలో ఎంపిక చేసి కొన్ని కథల నైనా 'జాగృతి' స్వర్ణజయంతి ఉత్సవాల సందర్భంగా పుస్తక రూపంలో తీసుకొని రావాలని కొందరు సూచించిన సూచన మేరకు ఈ సంకలనాన్ని ప్రచురించడం జరిగింది. ఈ పుస్తకంలో **1961** నుంచి **1970** వరకు జాగృతి సంచికలలో ప్రచురితమైన కథల నుండి ఎంపికచేయబడిన **20** కథలను అందిస్తున్నాం. ఈ కథలను సంకలనం చేయడంలో సహాయపడిన శ్రీ గుమ్మన్నగారి బాల శ్రీనివాసమూర్తికి ధన్యవాదాలు.

– ప్రకాశకులు

# ప్రాక్కథనం

'జాగృతి' వారపత్రిక స్వర్ణోత్సవాలను జరుపుకుంటోంది. అంటే యాభై సంవ రాలుగా తెలుగు పాఠకుడి మేధకు పదును పెడ్తూనే వుంది, మధ్యలో కొన్ని నెలలు వో అవాంతరాలు - ఎమర్జన్సీ వంటివి - వచ్చి మీదపడితే, తాత్కాలికంగా తొట్రుపాటును ప్రదర్శించినా.

పాఠకుడికి సామాజిక రాజకీయ రంగాలతోపాటు సాహిత్యమూ అందుబాటులోకి రావాలనెడి దృష్టితో తనవంతు కృషిలో భ- ంగా, కవిత ను, కథానికలను, నవలలను జాగృతిలో ప్రచురిస నే వ ం. సాహి దృక్ప ్ల నిర్మించే విమర్శనాత్మక వ్యాసాలూ ప్రచురించ ం - టన్నిటి మీదా జాగృతి ముద్ర - ఒక దృక్పథం, ఒక ఆలోచనా ధోరణి, ఒక లక్ష్యం - ఒక ఏకాత్మత కనపడుతుందని సాహిత్య విమర్శకుల అభిభాషణ. అయితేనేం వీటిలో హిందూ సమాజంలో ఉన్నంత వైవిధ్యమూ ఉంది. దానికి కారణం తెలిసిందే. అవి హిందూ సమాజానికి అద్దం పట్టటమే.

ఈ యాభై సంవత్సరాలలో విశ్వనాధ, సినారె వంటి లబ్ధ ప్రతిష్ఠుల నుండి, అప్పుడప్పుడే కలం పడ్తున్న కవి కిశోరాల వరకు తమ కవితలను జాగృతిలో ప్రచురించే భాగ్యాన్ని కలిగించారు. చాలామంది ఆ తరువాత వాటిని పుస్తక రూపంలో కూడ వెలువరించారు. నవలలూ అలా విడిగా పుస్తకాలుగా వెలువడ్డాయి. ఎటొచ్చీ కథానికలకే పుస్తకరూపాన్ని పొందే భాగ్యం అంతగా లభించలేదు. అలాగని అవి మామూలుకథలు కావు. తెలుగు కథానికా సాహిత్య ప్రస్థానంలో వాటికీ ప్రాధాన్యత ఉంది. ప్రతి సంవత్సరమూ దీపావళికి కథానికల పోటీని నిర్వహించి, బహుమతులను పంచి పెట్టడంతో మంచి కథలు వచ్చాయి. విడిగా ప్రముఖ కథా రచయితల నుండి కథానికలను ఆహ్వానించి ప్రచురించటమూ జాగృతి పత్రికలో మామూలే. ఏతావాతా మంచికథలే ప్రచురణకు నోచుకున్నాయి.

అందువలన ఆ కథలను స్వర్ణోత్సవ సందర్భంగానైనా కొన్ని సంకలనాలుగా

వెలువరించాలని మా సంకల్పం. జాగృతిలో ఈ యాభై సంవత్సరాలలో చారిత్రక కథానికలు చాలా వచ్చాయి. వాటికున్న స్థానం వాటికుంది. అయితే ప్రస్తుతం వాటిని స్వీకరించటంలేదు. సామాజిక స్పృహ, నిబద్ధత మొదలైన పడికట్టు పదాలను జాతీయవాద సాహిత్యకారులు ఉపయోగించకపోయినా, సమాజ శ్రేయస్సును వాళ్ళెప్పుడూ మరచిపోలేదు. ప్రాచీనులు సూచించినట్లు సహకారం, సమన్వయం, సహజీవనం సామాజిక జీవనానికి పునాది రాళ్ళుగానూ భావించారు. హక్కుల కంటె కర్తవ్య నిర్వహణ ముఖ్యమనీ ఆలోచించారు. దోపిడీని ఎప్పుడూ సమర్థించలేదు. 'పరపీడ' నాన్ని మించిన పాపం మరొకటి లేదని నిర్ద్వంద్వంగా చెప్పారు. జాగృతి కథానికలు ఈ విషయాలనే ప్రతిబింబిస్తూ వచ్చాయి.

అయితే కథానికలను సూత్రబద్ధం చేసేటప్పుడు ఏదో ఒక పద్ధతి ఉండాలి కదా! అందుకనే కాలగతిని అనుసరించటం ఉత్తమమైన పద్ధతిగా భావించాం. ఇరవయ్యో శతాబ్దపు సప్తమ దశకం (1961-70) లో వచ్చిన ఇరవై కథలను ఈ సంపుటంలో చేర్చాం. కాలానుగుణమైన మార్పులనేకం మన వాడుక భాషలో వచ్చాయి. ఈ కథానికల రచన ముప్ఫై సంవత్సరాల క్రితం జరిగింది. అందువలన అప్పటికీ ఇప్పటికీ కొన్ని తేడాలు భాషాపరంగా మనకు కనపడవచ్చు. సినిమా, రేడియో వంటి జనబాహుళ్య ప్రచార సాధనాలు అప్పటికే తమ ప్రభావాన్ని చూపెడ్తున్నా, కేబుల్ టి.వి. ఆవిర్భావ ప్రభావం అప్పుడు లేదు. ఆ ప్రభావాన్ని తక్కువగా అంచనా వేయకూడదు. అయితే సమస్యలూ, మానవ స్వభావమూ అలాగే ఉన్నాయి.

గ్రామాలలో పంచాయితీ రాజ్ వ్యవస్థ కారణంగా ప్రారంభమైన రాజకీయ కార్పణ్యాలు, వాటిని చక్కదిద్దటానికై యువత ప్రదర్శించే తపన 'గ్రామసీమ' లో చోటు చేసుకుంటే, నిజాయితీ వలన ప్రయోజన ముండదేమోనని ముందు సందేహించినా చివరికి అదే ఉత్తమమైందని ''కలసి వచ్చిన నిజాయితీ'' చెప్తుంది. పగ, ప్రతీకారం, సమస్యల్ని పరిష్కరించవని ''మేలు కొలుపు'' లో సూచించారు. ని జీవితంలోనూ నీతిని పాటించవలసిన అవసరముందని ''పాలూ - నీళ్ళూ'' చెప్తుంది. ''ము రాక్షసం'' సైన్యంలో పనిచేసిన వ్యక్తి జీవితంలోని కష్ట సుఖాలను వివరిస్తుంది.

''జీవిత వలయాలు'' కుటుంబ వాతావరణాన్ని చిత్రిస్తూనే కరుణ రసాన్ని పాఠకులకు అందించింది. ''ధృవతార'' లో దేశభక్తుడి వైయక్తిక జీవితాన్ని మన కళ్ళముందుంచారు. చీకటి నుంచి వెలుగులోకి ప్రవేశించిన మానవుడు నిన్నటి చీకటిని మరచిపోతే? ఈ ప్రశ్నకు సమాధానం ''మేల్కొన్న మానవుడు''లో లభిస్తుంది. కళాకారుల జీవితానికి అద్దంపడుతుంది ''కళాతపస్వి'' . ''ఆరాత్రి'' నిత్యశంకితులను, విమర్శకులను మనముందుం చుతుంది.

భార్యా భర్తల అనుబంధాన్ని ''సంగమం'' వివరిస్తే ''కాత్యాయని'' సగటు తెలుగు కుటు బాలలోని అత్తా కోడళ్ళ సమస్యను చి కరిస్తుంది. మధ్యతరగతి కుటుంబంలోని ఆడ ల్లల జీవన్మరణ సమస్యలకు అద్ద పడుతుంది ''భాగీరథి''. వియోగానంతరం భార్యను కలుసుకోబోయి కు ముసురు పట్టిన వేళ కలిగిన అనుభవాలను ''ముసురు'' చిత్రీకరిస్తుంది. నిరుద్యోగి బాధామయ గాధ ''ప్రపంచాన్ని చదవనివాడు''.

గ్రామపంచాయతీ రాజకీయాలకే మరో చిత్రం ''కూలిన వంతెన''. వృద్ధాప్యంలో ఆధునికులు ఎదుర్కొంటున్న ఒంటరి తనపు సమస్యకు ఒక విశ్లేషణ ''చరమాంకం''. గ్రామీణాభివృద్ధికి ఆదర్శం చూపిన మార్గం ''ప్రగతి పథం''. ఆశయాలను, ఆదర్శాలను, తన ఇష్టం వచ్చినట్లు వ్యక్తి మలుచుకోవటం కష్టం. అనుభవాలు వ్యక్తుల జీవితాలు తీర్చిదిద్దుతాయన్న సత్యాన్ని ''నిజేచ్ఛ'' చాటి చెప్తోంది. తరాల మధ్య అంతరాన్ని, సంఘర్షణను వివరించే కథ ''కర్మయోగం''.

విశ్వనాథ వారన్నట్లు తెలుగు సాహిత్యంలో తిక్కన కాలం నాటి నుండీ అందరూ శిల్పులే. ఈ కథానికలో ఉన్న శిల్పమూ అలాంటి బావననే కలిగిస్తోంది. కథానికల్లో రేంజి తక్కువ కాబట్టి పాత్రలను రేఖాచి ిత్రంగానే చూస్తాం. అయితేనేం వాటి వ్యక్తిత్వం స్పష్టమే.

కథానికల ఈ సంపుటం తెలుగు పాఠకుల మెప్పును పొందగలదని ఆశిస్తూ

**సంపాదకులు.**

# విషయ సూచిక

# జేబు

రచన :

అవసరాల రామకృష్ణారావు

సౌజన్యతా, సహృదయతా సమీపించిన చోట బయటపడని నిజమే మున్నది? ఆత్మీయతా, ఆప్యాయతా కలుసుకున్నచోట కరగని కఠినశిల ఏమున్నది?

ఇరవైఏళ్ళు పైగా అయింది నారాయణ మూర్తీ, లక్ష్మీపతీ ఒహర్ని ఒకరు కలుసుకుని....కనులలో వెలుగులా తనువులో వెలుగులా ఒకరిని ఒకరు పెనవేసుకు బతికిన ప్రాణ స్నేహితులు వాళ్ళు. డాబాపైకి వ్యాపించి ఉన్న వేపకొమ్మల వెన్నెల నీడల్లో హృదయం విప్పి చెప్పుకుంటున్న వాళ్ళ కబుర్లువిని ప్రకృతే పులకించిపోయిందేమో.... కాలమే స్థంభించి పోయిందేమో....

''వింటున్నావా మూర్తీ....చాలా రోజుల క్రిందట ఒకసారి నీకు ఉత్తరం రాశాను జ్ఞాపకముందా! మానానమ్మ గవర్నమెంటు హాస్పటల్‌లో చేరమంటే ఇష్టంలేదంటూ... అందులో వాక్యాలు జ్ఞాపకం ఉన్నాయా? చెబుతా .... విను....' పుట్టుకలో మలచిన మనః ప్రవృత్తి వలనో, నాకొక రూపాన్నిచ్చి ఈ మంటిపై మింటిక్రింద నన్నొక మానవునిగా ప్రతిష్ఠించిన నా తల్లిదండ్రుల కృషి వల్లనో, నేనభ్యసించిన విద్యవల్లనో, నా పురాకృత 'ఖర్మ' ఫలమో, స్వచ్ఛంద జీవనమూ, స్వేచ్ఛా వర్తనమూ నాకు ఈ లోకంలోనూ, ఉందనుకునే పరలోకంలోనూ, అన్నిటికన్న విలువైనవి....సమస్తమూ కోల్పోయినా, ఈ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు వదులుకోలేను. నా ఆశలకు సంకెల వేయగలను, నా బుద్ధికి

కాలువ కట్టగలను, కాని నా స్వేచ్ఛకి కళ్ళెం వేయలేను.... అది ఏనాడేనా జరిగిందా నేను జీవన్మృతుడనే' ...ఏం మూర్తీ జ్ఞాపకం వచ్చిందా?'

మూర్తి జవాబు చెప్పనక్కరలేదు. వెన్నెలలో మెరుస్తున్న అతని తడిసిన చెంపల్ని చూస్తూ చాలు.

'అవును....నేను జీవన్మృతుడను..... ఆర్జించిన విత్తంతో సముపార్జించిన దేమున్నది? సాధించిన విజయంలో సంతోషించేదేమున్నది! నా బీరువా అరలో క్రిక్కిరిసిన నినోట్లూ, నా పెళ్ళాం మెడలో క్రిక్కిరిసిన పచ్చని నగలూ నాకు ఇచ్చే నిండుతనం ఏమున్నది? నేను పూజించే నా తల్లిదండ్రులుగాని నేను అభిమానించే నా పిల్లలుగాని నాకు చెప్పగల ధైర్యం ఏమున్నది? మనసంతా వ్యాపించిన నా వెలితి తీరే మార్గమేమున్నది? మూర్తీ. నేను చేసుకున్న ఆత్మవంచన నీలాంటివాడితో చెప్పుకునే కన్న నాకు మిగిలిన దేమున్నది! పెద్ద పెద్ద స్నేహాలూ, పెద్దమనిషి తరహాలు నేర్చిన వాడిని....కడుపులో కల్మషం ఉన్నా పైకి పవిత్రంగా కనుపించే కాసారాన్ని......నువ్వొచ్చావు....నీరాకే నాలో ఒకరాయి విసిరినట్లయింది. సవ్యమైన స్ఫటికంలాంటి, స్వచ్ఛమైన సత్యంలాంటి....మన బాల్యాన్ని గుర్తు తెచ్చేవు.... కు జ్ఞాపకముందా ఆనాడు....

* * *

అవును ఆనాడు అందరూ ఆశ్చర్యపోయే వ్యవహారమే జరిగింది మరి. ఫిఫ్తుఫారం చదువుతున్న నారాయణమూర్తి గాని లక్ష్మీపతిగాని అంత ధైర్యంగా మాట్లాడతారని ఎవరూ అనుకోలేదు.

వాళ్ళ సైన్సు మేష్టారు రావుగారు ప్రతిరోజూ సరిగ్గా టైముకు రావడం అలవాటు. ఆయన ఒక్క నిముషం లేటుగారారు. లేటుగా వచ్చిన కుర్రాళ్ళను లోపలికి రానియ్యరు. ఆవాళా అలాగే నరసింహులు అనే కుర్రాణ్ణే లోపలికి రానివ్వలేదు.

'మేష్టారూ, క్షమించండి.... రెండే రెండు నిముషాలు ఆలశ్యమయింది. ఐదు మైళ్ళ దూరం నుంచి నడచి వస్తున్నాను.....'

దూరం నుంచి బయలుదేరి వస్తే మరింత ముందు బయలుదేరడం నీ కర్తవ్యం.... అయినా ఆలశ్యమన్నాక అయిదు నిముషాలయినా. ఒకటే అరగంటయినా ఒకటే - నేను నిన్ను లోపలికి రానివ్వను....'

'అలా కాదని నేనే లోపలికి వస్తే.... కదలనని వచ్చి కూచుంటే?'

'ఎత్తి అవతల విసిరేస్తాము'

ఈ జవాబు చెప్పింది రావుగారుకాదు' లక్ష్మీపతి!

'అవును .... క్లాసులో క్రమశిక్షణ ఉండేలా చూడవలసిన బాధ్యత ఒక్క మేష్టారిదే కాదు... అందరి పిల్లలదీను....ఆలశ్యంగా వస్తే రానియ్యనని మేష్టారు ఒక రూపు పెట్టిన తరువాత అదలా జరగవలసిందే' అన్నాడు నారాయణమూర్తి. మొత్తానికి నరసింహులుకి ఆనాడు ప్రవేశం దొరకలేదు. భూమి మీద ఉండే భారవాహకస్థితి అనుభవించే బడి పంతులికి కుర్రాళ్ళు ఎదురించడం కన్న ఎడమ కన్ను అదరడం ఏముంది గనుక? ఆ పతాక సన్నివేశంలో వాళ్ళిద్దరూ అడ్డుబడకపోతే రావు గారి స్థితి ఏమయ్యేదో!

కాని 'దేముడే' అనే పదానికి 'దెయ్యం' వికృతి అని ఆ మరునాడు ఆయనికి తెలియలేదు! ఆయన ఖర్మగాలి ఆ మర్నాడు అయిదు నిమిషాలు ఆలశ్యం చేయడమే ఆయన కొంప ముంచింది.

'ఎంతో పీకపోయే పని ఉంటేగాని మేష్టారు ఆలశ్యంగా రారు' అన్నారు ఎవరో.... సమయం చూసి నరసింహులు కాస్త గట్టిగానే అందుకున్నాడు.

'అదే మనమయితే అవతలుండాలి.... మేష్టారులయితే చిన్న తప్పు క్రిందయినా లెక్కలోకిరాదు'

నరసింహులు కాస్త గట్టిగానే అందరూ వినేలాగే అనడంచేత రావుగారు జవాబుచెప్పక తప్పలేదు. లక్ష్మీపతివైపు 'అడ్డుకోక పోతాడా మళ్ళీ' అన్నట్టు ఆశగా చూస్తూ అన్నారు.

'చూశారా, చూశారా? ఇదో చిన్నతప్పా?'

లక్ష్మీపతి లేచాడు. నదురూ బెదురూ లేకుండా అనేశాడు.

'కాదు, చిన్న తప్పెలా అవుతుంది? మీరు పెద్దవారు, కాబట్టి ఇది పెద్ద తప్పు? లేటుగా రావడం తప్పా, తప్పున్నరా?'

సైన్సు మేష్టారికి మరి భూమి ఆనలేదు! క్లాసంతా ఈలలతో, చప్పట్లతో నిండిపోయింది. సమయానికి ఆ వరండాలో తిరుగుతున్న హెడ్మాష్టరు రాకపోతే ఏమయ్యేదో..... వస్తూనే అందుకొన్నాడు.

'విద్యార్థులు లేటుగా వస్తే కనుక్కొనే బాధ్యత మేష్టారిది.... మేష్టారు ఏ కారణం చేతనైనా లేటుగా [illegible] కనుక్కోడానికి మేం పై [illegible] ఉనా [illegible] మీదికాదు.... ఆ అధికారం మీకు [illegible].... [illegible] తరతమాలుంటాయి.... అలా కట్టుబడి ఉండకపోతే ఇక క్రమశిక్షణ అంటూ ఉండదు'.

'నిజమే.....కాని ఒకరి కొకరు కట్టుబడే ముందు ఎవరికి వారు కట్టుబడి ఉండడం అవసరం ' అన్నాడు నారాయణమూర్తి.

'అంటే, ఎవరిమాటకు వారు ముందు కట్టుబడి ఉండడం అత్యవసరం' అని అందుకున్నాడు లక్ష్మీపతి. మళ్లీ పెద్ద గోల అయిపోయింది.

సమయస్ఫూర్తి గల హెడ్మాష్టరు ఇక అక్కడ వాదన కొనసాగించక వాళ్ళిద్దర్నీ తనకూడా రూమ్‌కి తీసికెళ్ళి 'ఎంత నిజమైనా అంతలా పెద్దవాళ్ళని ఎదిరించడం తప్పని' బోధించి వదిలేశాడు....

అంతేనా..... బడి ముందూ, విడిచిపెట్టాక - ఆ చుట్టుపక్కల ప్రకృతిని చూచి పరవశించి పోయేవాడు. సౌందర్య పిపాసతోకాదు, స్వేచ్ఛా లాలసతో, అలలు అలలుగా వచ్చే పిల్లగాలులకు వందనాలు పెట్టే, వలయాలు చుట్టే పరిచేల వయారాలు చూసినా, పరుగెత్తే మబ్బులతో పందెంవేసి ప్రవహింపజూసే పంటకాలువ పరాచికాలు చూసినా, తరంగాలతారంగాలకు గిరికీలు కొట్టి గిరగిరాలు పోయే లేకమల లావణ్యాలు చూసినా వాళ్ళిద్దరికీ జ్ఞాపకం వచ్చేది ఏమిటి? అందమైన సృష్టి అందరికీ పంచి ఇచ్చే ఆ దేవుని చరణారవింద కరుణామరందమా? కాదు, వాళ్ళ శ్వాసలు వేరు, వాళ్ళ బాసలు వేరు : వాళ్ళ ఊహలు వేరు; వాళ్ళ ఊసులు వేరు.

'స్వేచ్ఛామయమైన ఆ ప్రకృతికి ప్రతిబంధకాలే లేవంటావా? ఇది నియమబద్ధం కాదంటావా?' ఓసారి నారాయణమూర్తి అడిగాడు.

'అదేం ప్రశ్న మూర్తీ? ఎందుకు లేవూ? స్వేచ్ఛ లేదు. విచ్ఛలవిడితనం లేదు. ఋతువులకీ, కాలభేదాలకీ కట్టుబడి ఉన్న ప్రకృతే స్వేచ్ఛావాయువుల్ని ప్రసాదిస్తోందంటే దాని అర్థం బోధపడ్డం లేదూ?'

'అవును....నాకు బోధపడింది....మంచిని నమ్మడం, నమ్మినదాన్ని కుండబద్దలు కొట్టినట్టు చెప్పగలగడం, చెప్పినదాన్ని ఆచరించడం ఇంతకన్న స్వేచ్ఛ ఏమున్నది? ఇదికాక వేరే బ్రతుకేమున్నది?'

ఆనాడు.... కిలకిలలాడే పూలచెంత, గల గల పాడే ఏటిపొంత, విశాలమైన భూమి మీద, అనంతమైన ఆకాశం క్రింద....కళకళలాడే మోహాలతో ఆ పిల్లలిద్దరూ చెయ్యీ చెయ్యీ కలుపుకుని మనసూ మనసూ తెలుపుకున్నారు. ఆ నూనూగు మీసాల వయసునాటి, ఆ ఊగూగు ఉయ్యాల మనసునాటి పదాలూ, శపథాలూ, సత్పథాలూ ఏమయ్యాయి?

*　　　*　　　*

నారాయణమూర్తి అందుకున్నాడు.

'లక్ష్మీపతీ, అంత బాధపడడం దేనికి? ఇంతకీ నువ్వు సాధించలేనిది ఏమిటి! ఒకరి క్రింద లోబడి పనిచెయ్యడం గాని ఒకర్ని ఆశ్రయించి చేజాపడం గాని మన స్వభావాలకు విరుద్ధాలు. అందుకనే నిరాటంకమైనవీ నీతివంతమైనవీ వృత్తులను ఎంచుకుని మనం స్వీకరించాము. నేను మేష్టరు నయాను.... నువ్వేమో డాక్టరు ప్రైవేటు ప్రాక్టీసు పెట్టుకున్నావు. విద్యాలయాలూ, వైద్యాలయాలూ వివిధరకబాధితుల విమోచనాలయాలు. విఘ్నేశ్వరుని విహార నిలయాలు, విఘ్నేశ్వరుని విహార నిలయాలు, ఇంతకంటె మనం చేసే మానవసేవ ఏమున్నది?

లక్ష్మీపతికి ఏమాత్రమూ ఉపశమనం కలిగినట్లు లేదు.

'ఇది మానవసేవకాదు, మానసిక మధుసేవ....నువ్వు అదృష్టవంతుడివి

హెడ్మాష్టరు వయ్యావని కూడా విన్నాను.....నీ విశృంఖలత్వమేనా వీరవిహారం చెయ్యడం నాకు గర్వకారణం. అనుకున్నదాన్ని ఆచరణలో పెట్టడంలో నువ్వైనా కృతకృత్యుడవయ్యావు..... మీ హైస్కూల్లో చదువుకున్న పిల్లలు అదృష్టవంతులు...కాని నేనా? వానచినుకుకన్న ముందు భూమితల్లి ఒడిలోచేరి ముద్దందుకుందామనే ఆనాటి పూబాలిక కాదు నా మనసిపుడు. వే చీలికలై వాడిన మందార మిది....'

మూర్తి, లక్ష్మ తి గెడ్డ ట్టుకుని పైకెత్తాడు. ఎ నిశీధిలో రాళ్ళలోంచి వచ్చే సెలఏటి ధారలా లక్ష్మీపతి కళ్ళ ధారల చ ుళ్ళు ని నారాయణమూ (తుళ్ళి డ్డాడు.

'ఇదేమిటి లక్ష్మీపతీ....నీకు పిచ్చిగాని ఎక్కిందాయేం? అన్నీ ఉండి, ఏమీలేనట్లు ఎ దుకురా ంత దుఃఖం? నేను రాకపోయినా బాగుణ్ణేమో?....'

'ఆ మాటనకురా మూర్తీ నీకు దణ్ణం పెడతాను.... నాలోని కల్మషమంతా నిష్కల్మషుడవైన నీ పాదాలముందు కడిగెయ్యనీ, కాదనకు.

పదహారేళ్ళ క్రిందట అద్దెకు తీసుకున్న రెండు తడికల గదులలో లక్ష్మీపతి ప్రైవేటు ప్రాక్టీసు మొదలుపెట్టేడు. ఆసుపత్రి మొదటి మెట్టు ఎక్కిననాడు అతని ఆలోచనలు ఇవీ;

గడగడ వణికే తనువులతో దడదడ కొట్టుకునే మనసులతో 'లేరే మ్రొక్కెద. దిక్కుమాలిన , మొరాలింపన్ ప్రపుణ్యాత్మకుల్' అని కొసకోరికతో కొనఊపిరితో రోగులు తనపంచన చేరుతారు. తనేం చేస్తాడు?

ప్రాణ స్నేహితుడిలా చెయ్యి జాపుతాడు. తల్లిలా దగ్గిరకు తీసుకుంటాడు తోడబుట్టిన వాడిలా ఆదరిస్తాడు. కట్టుకున్నదానిలా కడు మెలకువతో సేవ చేస్తాడు....భగవంతుడిలా కాపాడుతాడు. ఎదురెరగని ప్రవృత్తి తనది.... వైద్యం తన ప్రధాన కర్తవ్యం....తరవాత తన సొంతపనులు. రోగనివారణ తన విద్యుక్తధర్మం..... డబ్బు పుచ్చుకోవడం రెండో విషయం అనాడు...... ఒకరోగి రావడానికీ ఇంకో రోగి రావడానికీ మధ్య అరగంట టైమున్ననాడు మధురాలోచనల మత్తులో ఉక్కిరిబిక్కిరి అయిపోయేవాడు.

ఉబ్బి తబ్బిబ్బయిపోయేవాడు.

ఆ తరువాత తరవాత అతన్ని మైమరపింపచేసిన క్షణాల వైఖరి క్రమంగా మారిపోయింది.

'సోదరులారా! ప్రఖ్యాత వైద్యులు శ్రీ పి. లక్ష్మీపతిగారిది ఇవాళ ముప్పై రెండవ జన్మదినం కారణంగా మనమందరం ఇక్కడ కలుసుకోవడం ముదావహం... ఆయన సార్థక నామధేయులు.... 'వైద్యో నారాయణో హరిః' అని వేరే చెప్పనక్కర్లేదు. గణనీయమైన ఆయన మానవసేవకు గుర్తుగా....'

ఆ సంరంభంలో ఆ చప్పట్ల మైకపు ధ్వనిలో....

'బాబూ, డాక్టరుబాబూ.... మా అమ్మ పొద్దుట్నించీ లేవడంలేదు....పిలిస్తే పలకడం లేదు..... ఒక్కసారొచ్చి చూసిపోండి. ఏమిటో చాలా భయంగా ఉంది బాబూ అన్న పదేళ్ళ బాలుని హృదయ విదారక ఆక్రందన డాక్టరుగారి చెవుల్ని సోకదు!

'నా ఇరవై నాలుగు గంటలూ నా రోగులకు అనుకున్నవాడు ఒకప్పుడు లక్ష్మీపతి, తెల్లవారుజామున మూడు నాలుగు మధ్య ఒకసారి ఒకరు వచ్చి పిల్చినప్పుడు తన్ను లేవలేదనీ ఒకప్పుడు పెళ్ళాన్ని చెడామడా చీవాట్లు పెట్టిన వాడు లక్ష్మీపతి, ఎక్కడున్నాసరే ప్రమాదంగా ఉందని కబురొస్తే చాలు. పరిగెత్తుకుని వెళ్ళినవాడు ఒకప్పుడు లక్ష్మీపతి. ఇప్పుడు? రాబడి పెరిగింది. రాలుబడి పెరిగింది. ఇన్స్యూరెన్సులు పెరిగాయి. ఇన్‌కమ్ టాక్సులు పెరిగాయి. ఇంటి అంతస్థులూ ఇంటిల్లిపాది అంతస్థులు కూడా పెరిగాయి. మానవుడు క్రమంగా యంత్రమై పోయాడు!

'బడులకూ, కాలేజీలకు వేళలున్నాయి. అన్ని ఆఫీసులకూ టైమింగ్సు ఉన్నాయి.... ఏం పాపం చేసుకున్నానని నాకీ నిరంతర పరిశ్రమ?' అనుకున్నాడు. పెళ్ళాం తాళం వేసింది.

''అయినా అంత ఒళ్ళూ, పయీ తెలీకుండా, రాత్రీ పగలూ అనకుండా చాకిరీచేసి మీరే ఒంటికి తెచ్చుకోడం ఏం బాగులేదు. నాలుగు కాలాల పాటు రోగాలు వర్థిల్లడం వైద్యుడికి క్షేమకరంగాని వైద్యుడికే రోగం రావడం రోగులకేమంత క్షేమకరమని?

తల్లీ కూడా అందుకుంది.

''అవును బాబూ. నాగమణి చెప్పింది ఎంతో సబబుగావుంది.... ప్రైవేటు ఆసుపత్రి అయినా వేళలంటూ ఏర్పరచు....ఆ వేళల్లో తప్పితే పీకపోయినా వెళ్ళకు... అనుకోడం గాని ఇంట్లో ఉంటే మాత్రం నిన్ను బ్రతకనిస్తారా ఏమిటి? మొహమాట పెట్టి ఎవరో గొప్పింటివాళ్లు తీసుకువెళుతూనే ఉంటారు.''

తల్లీ, పెళ్ళామూ చెప్పిన మాటలు ఎంతో సబబుగా [illegible] యి.

'ముందు డబ్బు అక్కడ పెట్టాక మందు [illegible] అనరు గా ...మనం కష్టపడి పనిచేస్తున్నప్పుడు తగిన ప్రతిఫ [illegible] ం ఆ [illegible] డం అదో పెద్ద నే మా?' అన్నాడు తండ్రి.

'ఊరికి ఒక్కడవే చెప్పుకోదగ్గ వైద్యుడవు....మంచి సర్జెనువని పేరు సంపాదించినవాడవు... మంచి హస్తవాసిగలవాడవు వెళ్ళిన ప్రతిదగ్గరా పుట్టుపూర్వోత్తరాలు కనుక్కుంటూ గంటల తరబడి కూచోటానికి నీకు టైమెక్కడిది? అన్నారు స్నేహితులు, అన్నిటినీ మించి జనం ఎక్కువైన కొద్దీ విసుగూ, చిరాకూ ఎక్కువైపోయింది లక్ష్మీపతికి, ఒకప్పుడు హృదయాన్ని కలవరపెట్టే వారి మూలుగులు కర్ణకఠోరంగా మారిపోయాయి.

'చెప్పినట్టు మందు పుచ్చుకోరు. పథ్యపానాలు చెయ్యరు. ఈ అలగాజనాన్ని అందలమెక్కించడమే తప్పు. వీళ్ళ రోగాలు ఎవరు కుదర్చగలరని? అయినా ప్రయత్నిస్తే మాత్రం మన చేతుల్లో ఏముందని?' అనుకోడం ప్రారంభించాడు. పతన మన్నది జరగకుండా ఉండాలేగాని దానికి అంతెక్కడని?

ప్రస్తుతం డాక్టరుగారు రిక్షామీద వస్తారు. అరఫర్లాంగు దూరం నుంచి వచ్చినా ఎవరింటికి చూడ్డానికి వస్తారో వారు రిక్షావాడికని రూపాయి ఇచ్చుకోవాలి. ఆసుపత్రికి వచ్చినాసరే డాక్టరుగారు తలనొప్పి మాత్రయినా తన బేగ్‌లోంచి తీసి ఇవ్వరు. చీటీ మీద రాసి ఇచ్చేస్తారు. కంట్లో నలక పడినా పదిలక్షల పెన్సిలిన్ ఇంజక్షన్లు రాసేస్తారు. మందుల కొట్లవాడికీ, డాక్టరుగారికీ అవినాభావ సంబంధముందని అందరికీ తెలిసిన సత్యం. లౌక్యంలో సౌఖ్యం

అలవాటయిన కొద్దీ రోగుల్ని చూడడానికి మాత్రం డ్రాక్టరుగారికి తీరుబడి దొరకడం లేదు. అనేక సాంఘికోద్ధరణ సంఘాల్లో 'లైఫ్ వైర్' ఆయన, అనేకచోట్ల అధ్యక్షత వహించాలి. అనేకసార్లు ఉపన్యసించాలి. కాస్త క్లబ్బుకి వెళ్ళి ఓ 'రమ్మీ' ఆట వెయ్యడానికీ, అలా కాస్త సినిమాకి వెళ్ళి ఓ సీను అయినా పూర్తిగా చూడ్డానికీ - ఈ మాత్రం ఊపిరి పీల్చుకోడానికే ఆయనకి తీరుబడిలేదు! వందరూపాయల నోట్లమీద విహరించే ఏనుగులను చూడ్డం ఆయనకు పరమానందం. వంద నయాపైసలయినా తేలేని దరిద్రగొట్టు రోగపు పీనుగులను చూడ్డం ఆయనకు జుగుప్సాకరం!

★ ★ ★

అద్దంలాంటి మిత్రుడిముందు అబద్ధం దాగుతుందా? లక్ష్మీపతి ప్రస్తుతం ఆసుపత్రి నడుస్తున్న తీరుకూడా ఒక్క అక్షరముక్క తేడా లేకుండా చెప్పేశాడు. పాతమంచాన్ని నల్లు లెక్కినట్లు కనబడిన చోటల్లా నిండిపోయి కరుణా నర్సింగ్ హోమ్‌లో వివిధ రోగగ్రస్థులూ వారి బంధువులూ డ్రాక్టరుగారి కోసం వేచి ఉంటారు. చావసిద్ధంగా ఉన్నవాళ్ళని దింపెయ్యడానికైనా అక్కడ జాగా ఉండదు. బెల్లాన్ని ముసిరిన ఈగల్ని తోడుతున్నట్టు అక్కడున్న కాంపౌండరూ, వాడి అసిస్టెంటూ రోగుల్ని సరిగా కూచోమని మందలిస్తూ 'ఇది ఆసుపత్రి సుమా' అని జ్ఞాపకం చేస్తుంటారు. డ్రాక్టరు గారు ఇల్లుమీద ఇల్లు వేసుకున్నా, కొత్త ఇల్లు కొన్నా, పరిశుభ్రతలో పరమార్థం ప్రజలకు పదేపదే బోధిస్తున్నా, ఆ తడకగదుల ఆస్పత్రి పరిస్థితి మాత్రం మారదు. అక్కడే మంచాలు ఆ పక్కనే పురుళ్ళు. ఆ చుట్టు ప్రక్కలే 'యూరినల్సు' మృత్యువుతో ప్రత్యక్షయుద్ధం చేస్తూ రోగులు చేసే భయంకర రోదనలు అక్కడే. పోయినవారికోసం పోలేనివారు పెట్టే పొలికేకలు అక్కడే. వైద్యం చేయించుకుందామని వచ్చేవారు వేచి ఉండేదీ అక్కడే.

ఇలాంటి మురికికూపంలోకీ, మృత్యు గహ్వారంలోకీ, ముష్టిపీనుగుల మధ్యకీ రావడమంటే అందుకనే డ్రాక్టరుగారికి ఒళ్ళుమంట, సాధారణంగా రారుకూడా. వచ్చినా ఎక్కువ సేపు ఉండలేరు కూడా. ఏదో డ్యూటీ ప్రకారం

అలాలా వచ్చి వెళ్ళిపోతూవుంటారు. అంతే. ఒకవేళ వచ్చినా ఏవరి రోగపు సొద వారిది తప్ప ఎన్నిసార్లు చెప్పినా ఓ వరసలో రావాలనీ ఓ సభ్యత పాటించాలనీ వాళ్ళకి తెలిస్తేగా? ఇంతమంది మీద ఒక్కొక్కరిదగ్గిర ఒక్కక్షణం ఉండడానికి కూడా డ్రాక్టరుగారికి తీరుబడి ఉండదు. ఓసారి పరకాయించి చూడడం అంతగా తప్పదంటే థర్మామీటరు చూడ్డం, మరీ ప్రాణం మీదకు వస్తే సెతస్కోపుతో చూడ్డం.... అంతకుమించి తను ముందురోజిచ్చిన మందు పడిందో లేదో, రాత్రి నిద్ర పట్టిందో లేదో, కడుపునొప్పి తగ్గిందో లేదో... ఇలాంటివన్నీ కనుక్కోడానికి తనకెక్కడ తీరుబడి ఉంటుంది? ఎప్పుడో తప్పనిసరి అయిన ఆపరేషన్లకితప్ప మిగిలిన పనంతా కాంపౌండరూ, పనివారమే చూచు[illegible] టూ ఉంటారు. ఆ కంపౌండరుకూ తదితరు కూ [illegible] [illegible]ాళ్ళు విమగి ంచవచ్చు. కాని డబ్బు డికే [illegible] [illegible]ర్థతలు పాటివి? ఈ మధ్య హాస్పట[illegible] 'లో క నప్పు కూడా చేరింది. దాన్తో ఓరాత్రి వేళ [illegible] పోతో [illegible] వరేనా కేకేసినా వినిపించుకునే వాళ్ళు లేకపోయారు!

★ ★ ★

'ఒరే నారాయణా ఇది ప్రస్తుతం జరుగుతున్న' తతంగం.... అప్పుడప్పుడు ఆలోచిస్తూ ఉంటాను. తెలిసి కూడా ఈ విషవలయంలో నేనెందుకు చిక్కుకున్నానని? నాలోని మానవత్వాన్ని మంటగలిపిన దానవత్వం పేరేమిటని? ఎవరి నియమ నిబంధనలకూ లోనుగాని నేనెందుకు ఇలా చేజేతులా సర్వనాశన మయానని?'

నారాయణమూర్తి ఏమీ జవాబు చెప్పలేదు.

''అంత దూరాన్నుంచి అన్ని ఏళ్ళ తరువాత నీలాంటి ఆత్మీయుడొస్తే అర్ధరాత్రి తప్ప నాకు తీరిక లేకుండా చేసిందేమిటని?''

మూర్తి అప్పటికీ ఏం మాట్లాడలేదు.

''మూర్తీ నన్ను క్షమించు.....నా స్వార్థమే నన్నిలా ఇదంతా నీతో చెప్పుకునేట్లు చేసింది. ఇక ఈ సాలెగూడులోంచి నాకెలాగూ నిష్కృతిలేదు.

బంగారు పంజరంలో బంధింపబడక నువ్వేనా స్వేచ్ఛా విహంగంలా సంచరించడం సంతోషదాయకం....నాకు ఒక కోరిక ఉంది.....నువ్వు కాదనవు, నాకు తెలుసు' రేపొద్దున్నే మనిద్దరం ఒకసారి అలా కారుమీద ఊరవతలికి షికారు వెళ్లివద్దామా? కొంచెం సేపయినా అన్నిటినీ మరచిపోయి అలా చెట్లమ్మట పుట్లమ్మట పొలాల గట్లమ్మట తిరిగివద్దామా? అంతటా వెలుతురునిండి ఉన్నచోట ఆకాశం భూమీ కలుసుకునేచోట అవధులూ హద్దులూ లేనిచోట కూచుని ఆనాటి అమూల్యమైన బాల్యాన్ని గుర్తుచేసుకుందామా''

''కాదని ఎలా అంటాను?''

ఇంకొంచెం సేపటికి ఇద్దరూ పడుకున్నారు.

★ ★ ★

తెల్లవారిన తర్వాత లక్ష్మీపతి లేచి చూసేసరికి ప్రక్కన నారాయణమూర్తి లేడు! అతని సామానులూ లేవు! పెద్ద ఉత్తరం మాత్రం దొరికింది. ఆతృతగా తీసి చదవసాగాడు.

''ప్రియమైన లక్ష్మీపతీ.

నన్ను క్షమించు....నేను వెళ్ళిపోతున్నా....నీకు నా మొహం చూపలేను. అందుకని చెప్పకుండా వెళ్ళిపోవడం తప్ప నాకు గత్యంతరంలేదు.....ఈ పిరికివాడికి పారిపోవడం తప్ప వేరే మార్గాంతరం లేదు!

అవును.... వందల కొద్ది చదువుకుంటున్న ఒక ఉన్నత పాఠశాలకు నేను అధిపతిని....పాఠశాల స్థాపించినవారి భావాలు ఉన్నతమైనవే. పాఠశాల భవనాలూ ఉన్నతమైనవే, పరమపవిత్రమైన ప్రధానోపాధ్యాయుడి పదవీ అత్యున్నతమైనదే.....కాని ఆ స్థానాన్ని ఆక్రమించిన నేను ఒక కీటకాన్ని!

చిన్నప్పుడు, పట్టీగా ఉన్న పరువంలో అనేకం అనుకుంటాం. నిజాయితీగా బ్రతకాలనీ, మంచిగా జీవించాలనీ ఎవరికుండదు? స్వతంత్ర జీవనాన్ని కాదనేవారెవరు? కాని బుద్ధి ఎదిగినకొద్దీ అబద్ధపు ప్రపంచాన్ని ఆదర్శంగా తీసుకొని 'ఎంతవరకు ఎదుటివాడిని మోసగించి మన ఇల్లు నింపగలం' అన్న దొక్కటే రమ్యమైన గమ్యస్థానంగా ప్రస్తుత ప్రపంచంలో

భావించబడుతోంది. సర్వశక్తుల కేంద్రీకరణా స్వార్థ సముపార్జనలకే సరిపోతోంది. ఈ లోకంలో నూటికి తొంభైమంది ఎలాటివాళ్లో అలాంటివాళ్ళమే మన మిద్దరం కూడా. చిన్నప్పుడు మనం కలసిచేసుక్ను కట్టుబాట్లు అప్పుడే నేను మరచిపోయాను. ఇంటికొక పెద్దదిక్కుగా, స్కూలుకొక పెద్ద తలకాయలా. ఊరిలో ఒక పెద్దమనిషిలా బేషుగ్గా చలామణీ అవుతున్నాను. బాగానే ఉంది అనుకుంటున్నాను.

కాని......ఏదో యధాలాపంగా వచ్చి.....ఇన్నేళ్ళ తర్వాత నిన్ను కలుసుకున్నాక....నీ గురించి నీ నుంచి తెలుసుకున్నాక..... పాషాణ హృదయం కూడా ప్రతిధ్వనించింది. ఈ పాడుబడిన గుహలో కూడా పక్షులు గోలచేశాయి. 'నువ్వెవరు? నువ్వెవరు? ఓ పెద్ద మనిషీ, నువె వరు? జం అని నిలదీశాయి. నిన్న రాత్రంతా కథ విం కూ క లేదు....నా గురి చ ఆలోచి ్తనాను.....నువ్వు గురించి చెప్పిన ప్రతి అక్షరం నాకు ప్రతిక్షణం ఆత్మపరిశీలన లిగించింది....ఒక నీడ అయినా పడకుండా ఒక మచ్చ అయినా లేకుండా మనం గడిపిన నిప్పులాంటి చిన్నతనం. అదేం పెద్దతనం - ఇప్పుడు బూడిద అయిపోయిందా? కుండీలలో పెంచే గులాబి మొక్కలూ, గాజుతొట్లలో పెంచబడే చేపపిల్లలూ, పంజరాల్లో ఉండే రామ చిలకలూ - ఇలాంటివాటిని చీదరించుకునే మనిద్దరం ఇప్పుడు ఎక్కడ వున్నాం? జటపటాలు వేసుకొని కటకటాల వెనుకా!

స్వేచ్ఛామయమైన నా జీవన విధానాన్ని అరికట్టిందెవరు? పైకి కనబడేది ముగ్గురు. ఒకరు మా స్కూలు మేనేజరు. ప్రైవేటు స్కూలు అవడంచేత ఆ మేనేజరే మా పాఠశాలకు మకుటంలేని మహారాజు. సర్వాధికారి ఆయన....మా స్కూల్లో మేష్టర్ల మంచి చెడ్డలు ఎంచి చూపడానికి నేను ఉదాహరణగా చూపిన గీటురాయి ఒకటుంది, మేనేజరుగారి ఇంటి ముందు పెద్ద అరుగొకటుంది, ఎవరైనా ఆయన్ని చూడాలంటే వెళ్ళేముందు లోపలికి కబురుచెయ్యాలి. ఆయన్నించి అనుజ్ఞ వచ్చేదాకా ఆ అరుగుమీద వేచి ఉండాలి. ఆ అరుగుమీద ఎవరు ఎంతసేపు దర్శనం కోసం తహతహలాడుతూ వేచి ఉండేదీ ఆయన ఆరాదీసి కనుక్కుంటూ ఉంటాడు. ఎవరు మేనేజరు కోసం ఎక్కువకాలం వేచి ఉండగలరో వారు ఉత్తమ ఉపాధ్యాయుల క్రింద లెక్క. కాబట్టి మా స్కూల్లో

ఒక్కటీచరు యోగ్యత అతడు చెప్పే పాఠాన్నిబట్టికాక, అతని డిగ్రీలబట్టి గాక, అతడు విద్యార్థులతో చూపే అవినాభావ సంబంధాన్ని బట్టిగాక.... అతడు ఆ అరుగుపై ఎంతకాలం అఘోరించగలడో అదే అతని సమర్థతకు యోగ్యతాపత్రం, అందుకనే శ్రీవారి దర్శనం నేను తరచు చేసుకుంటూ ఉంటాను. పాఠశాలకంటె ఆ పవిత్ర వేదికపైనే ఎక్కువ కాలం గడుపుతూ ఉంటాను, కప్పతల్లికి నీళ్ళాడ పొద్దులయినా దివ్యచిత్తానికి మనవి చేసుకుంటూ ఉంటాను....నెల చివర్న మాకు ఇచ్చే జీతాలు మా శ్రమకు పారితోషికాలు అనుకోక శ్రీవారి కరుణా కటాక్షాలు అనుకొంటూ ఉంటాము.

రెండవవారు మాపై అధికారులు. అప్పుడప్పుడు 'ఆడిటింగు' అనీ 'ఇనస్పెక్షను' అనీ వస్తూంటారు. వారి 'కారు' కూతలన్నీ నాకు కంఠోపాఠం. అధికారుల అభిరుచుల నిర్ణయంలో నన్నుమించి 'రీసెర్చి' చేసినవారుండరు.....ఎప్పుడేక్షణానికేమి అవసరమో అని మా టీచర్ల నందర్నీ అరికట్టి ఉంచుతాను.... చల్లగా జరుగుతున్న స్కూలు వర్కును నా ఇష్టం వచ్చినట్టు డిస్టర్బ్ చేసి పారేసి ఊళ్ళో ఉన్న నాలుగురోడ్ల దగ్గిరా నలుగురేసి చొప్పున పంతుళ్ళకి వంతులు వేస్తాను. ఏ మార్గం వెంట వస్తారో.....ఊళ్ళో దిగాక మళ్ళీ రైలెక్కేదాకా అధికారుల్ని స్వర్గ సదుపాయాలలో ముంచడానికి నన్ను మించిన చెయ్యి ఈ చుట్టుపట్ల లేదు. వచ్చాక వెన్న కాచిన నెయ్యి స్టెయిన్ లెస్ స్టీల్ పాత్రతో పంపడానికీ, గుండ్రంగా తరిగిన అనాసముక్కలు తెల్లని గాజుప లలో వేసి అందించడానికీ....ఇలాంటి వాటికి కళాభిరుచి ఉండాలి మరి.... తో చెప్పకేం....ఏం చెప్పినా మానినా 'పాఠాలు చెప్పండి' అని ఖా ం మా ఉపాధ్యాయుల్ని నేను వేధించను. ఎందుకంటే 'రానివాడికి చెప్పి లాభంలేదు. వచ్చినవాడికి చెప్పనక్కర్లేదు' అందుకూ. మా అధికారులు కూడా ఇలాంటి చిన్న చిన్న విషయాలు అట్టె పట్టించుకోరు. వ్యక్తిగతమైన వారి స్వల్పకోర్కెలు ఏమో వారేమో అంతే పాపం.....

మూడవది మా భార్య రత్నం. స్కూలుకి సంబంధించిన సదుపాయాలు అత్యున్నత స్థాయిలో పొందడానికి ఆమె ముందు నేను తీసికట్టే.....మా స్కూలు బంట్రోతులు ఆరుగురికి పొద్దుట ఆరింటికి మా ఇంట్లో 'ఎటండెన్సు' వేసేది ఆవిడే. పరీక్షలకు అని స్కూలుకి ఎన్ని రీముల తెల్లకాయితాలు కొన్నారో, నెలకి ఎన్ని డబ్బాల కిరసనాయిలు అవుతుందో ఇలాంటి

జమాఖర్చు జాబితాలు వేసి ఇంటికి అన్నివిధాలా లాభసాటిగా నడుచుకొనేది ఇంకెవరు. ఇంటికి దీపం, ధూపం కూడా ఇల్లాలే!

లక్ష్మీపతీ! ముక్కుసూటిగా చెప్పుకోడానికి మొహం చెల్లక అన్నీ ఇలా పరోక్షంగా నీ ముందు పెట్టేను. నా జీవన విధానాన్ని నిజానికి అరికట్టింది వీళ్ళుముగ్గురేనా? ఎంతమాత్రం కాదు. నన్ను నేనే అరికట్టుకున్నాను. నా అత్యాశకూ, స్వార్థానికీ నేనే అమ్ముడైపోయాను. ఇంతింత పిల్లలు విద్యార్థులై నా ముందుకు వస్తే నా బాధ్యతను విస్మరించి గడుసుదనంగా కాలక్షేపం చేశాను...

ఇవన్నీ ఈనాడు తలుచుకుంటే తొలగిపోయే [illegible] డితే బాగుపడే కావు. కాని దర్జాగా, హాయిగా [illegible], భగవత్స్వరూపుడైన ప[illegible]మ[illegible]మి[illegible]ని ఆ[illegible]క[illegible] వి[illegible]ంటె [illegible] నాలోకి కూడా ప్రసరించి నన్ను నా కెరి[illegible]ంచి అమితమైన అసహ్యాన్ని కలుగజేసింది.

లక్ష్మీపతీ! మనం తొక్కుదామనుకొన్న ఉన్నత పథాలు ఎటువంటివి. మనం ఎన్నుకున్న ఉద్యోగాలు ఎటువంటివి. నేడు జీవిస్తున్న మన జీవితాలు ఎటువంటివి?

కాని మ[illegible] ఇద్దరికీ అతిముఖ్యమైన తేడా మరి ఒకటుంది. ఆ తేడా తలుచుకుంటే [illegible] ముందు నిలబడడానికేనా నాకు యోగ్యతలేదు! అన్ని స్వేచ్ఛలకన్న అత్యున్నతమైంది వాక్స్వాతంత్ర్యం, స్ఫటికంలాంటి సత్యాన్ని [illegible]గలగడం! అంతరాత్మలాంటి ఆప్తమిత్రుడిముందు చేసిన తప్పు చెప్పుకొనే ధైర్యమైనా [illegible]కుంది. నాకు? నీలాంటివాడి దగ్గరకు కూడా నిజం ఒప్పుకునే నిండుతనం నాకు లేదు. ఈ సంగతి తలుచుకుంటే సిగ్గుతో నా శరీరం భగ్గున మండిపోతోంది. 'ఆరడుగుల శరీరంలో మూడంగుళాలయినా లేని నాలికని అమర్చాడా ముసలి బ్రహ్మ! అది అనేకవంకర్లు తిరిగిందంటే తప్పా?' అని సమర్థించే పెద్దకబుర్లు ఇక ముందు నీతో నేను చెప్పలేను.... అందుకనే అవమానంతో నామనస్సు కాలిపోతోంది. ... అందుకే పారిపోతున్నాను. పచ్చని ప్రకృతిలోకి వెచ్చని వెలుగులోకి నీతో ఎలారాను. ఎలా రాగలనురా లక్ష్మీపతీ?''



# కూలిన వంతెన

రచన :

సి.ఎం. రామకృష్ణారెడ్డి

''సూరీ! జీవితంలో ఇంకా నీవు మొదటి మెట్టులోనే వున్నావ్. గ్రామాభ్యుదయం కోసం పాటుపడాలనుకోవడం కేవలం అవివేకమే. మన ఆశలకు, ఆశయాలకు నీళ్ళు వదలుకొని నలుగురూ నడుస్తున్న మార్గంలోనే వెళ్ళడం ఉత్తమం. లేకుంటే మనం ఈ లోకంలో మనలేం. బోలెడంత ఆస్తి, అనుకొన్నంత చదువు అబ్బింది నీకు. పట్టణంలో ఏదైనా వ్యాపారం ప్రారంభించి అధికంగా సంపాదిస్తే పదిమందిని పోషించగలవ్. హుఁ పల్లెల్లో ఏముంది. దే ఆర్ ఆల్ రెడీ డెస్ట్రాయిడ్ బై సెల్ఫిష్ పీపుల్'' మిత్రుడు రమణ అంటున్న మాటలు సూర్యారావు చెవుల్లో గింగురుమంటున్నాయి. దారికిరువైపులా వ్యాపించిన అరణ్యం నుంచి వస్తున్న చలిగాలి ప్రాతఃకాలపు వేళ రివ్వున వస్తోంది. త్రోవ కిరువైపులా అక్కడక్కడ కన్పిస్తున్న సీతాఫలం చెట్లు మంచుతొడుకుల్ని ఇంకా వదిలించుకోలేదు. మిత్రుడైన రమణను తనతోపాటు కారులో స్వగ్రామానికి తీసుకువెళ్తున్న సూర్యారావుకు తన కర్తవ్యం స్ఫురించేసరికి మౌనం వహించి మెల్లగా ''అయితే మనం గ్రామాల్ని బాగుపరచలేమంటావా'' అన్నాడు.

'బాగుపరచలేమని కాదు. దానికి ఎంతో ప్రయత్నం అవసరం. అభ్యుదయంకోసమని మనం వెళ్తే దారిలో అడుగడుగునా స్వాగతమిచ్చేవి మల్లెల మాలలు కాదు. ముళ్ళ పొదలు. పట్నంలోపెరిగిన మనకు గ్రామీణ వాతావరణంసరిపడదు. గ్రామస్తుల్ని మనం అర్థంచేసుకోలేము. ఏదైనా మంచి

విషయం తెల్పాలని వెళ్తే, మనల్ని వారు వింత మనస్తత్వం కలవారిగా గుర్తిస్తారు. మనం చెప్పే హితోక్తులు వాళ్ళకు సరిపడవు. వాళ్లు అనుసరించే త్రోవవేరు. మనం వెళ్ళే త్రోవ వేరు. తీరా ఆ రాజకీయ సుడిగుండంలో కూరకపోయిన తర్వాత మనల్ని పైకి తీసేవారెవ్వరూ కన్పించరు' దూరంగా పరుగులు తీస్తూ, కొండవాలు వెంబడి వెళ్ళే లేడిపిల్ల కేసి చూస్తూ రమణ సమాధానమిచ్చాడు.

''ఏమో! చిన్నతనం నుంచీ పట్నంలో గడిపిన నాకు ఇప్పుడు ఆ జీవితం మీద విరక్తిపుడుతోంది. ఇంకా సంపాదించాలన్న ఆశ నాలోలేదు. గ్రామస్థులందరిలో ఐకమత్యం నెలకొల్పి ప్రగతి పథం నిర్మించాలని నా ఆశయం' సుదూరంలో, ఆకాశంలో తెల్లని మబ్బుతునకల ఏక [illegible] కేసి చూస్తూ సూర్యారావు అన్నాడు.

వె [illegible] న్న కారుకు డన్‌గా [illegible]కువేశాడు సూర్యారావు హారన్ మోగిస్తూ, ' [illegible]ందయ్యోయ్ నడపడం తెలీదు. కొంచెం మనుషుల్ని చూసుక మరీ వెళ్ళండి మా మంచోల్ల లాగున్నారే!' దారిమధ్యలో నడుస్తూ వెళ్తున్న పల్లెవాడు మాసిన [illegible] ప [illegible] కుచ్చెళ్ళను మరింత బిగించుకొంటూ అన్నాడు. సూర్యారావు మరేమీ జవాబివ్వకుండా, కారుస్టార్ట్ చేసి ముందుకు పోనిచ్చాడు. ''తస్సాదియ్యా. ఈ వెధవకారుకన్నా నా కారుదుమ్మే నయం.'' తాపీగా చుట్టవెలిగిస్తూ అన్నాడు గట్టిగా పల్లెవాడు. 'అబ్బ, ఈ పల్లెటూరు వెధవలంతా ఇంతే. అసలవి రోడ్లు కావు. మన పాలిట పాట్లు' సిగరెట్ పొగలో సూర్యారావుకేసి చూస్తూ రమణ అన్నాడు. సూర్యారావు మరేం మాట్లాడలేదు. పాయలు పాయలుగా చీలి వాగు సన్నగా ప్రవహిస్తుంది. వర్షాకాలంలో వాగు ఉధృతం చెప్పనలవికాదు. దీనిమీద గ్రామస్తుల సహకారంతో ఒకవంతెన నిర్మిస్తే ప్రయాణానికి అనుకూలంగా వుంటుంది. వాగుమీద కారును మెల్లగా పోనిస్తూ సూర్యారావు అనుకున్నాడు. భవిష్యత్తులోనికి తొంగిచూస్తూ.

★ ★ ★

రాఘవాపురం ఓ మోస్తరు పల్లెవాడ. ఆ గ్రామంలో వున్నవి రెండు వర్గాలే అయినా, గతించిన గతంలోని తమ కక్ష్యలను తిరగత్రోడుకుంటూ పగతీర్చుకొనే

అవకాశం కోసం ఎదురుచూస్తున్నాయి. గ్రామోన్నతి కోసం కృషి చేయాలని స్వగ్రామం వచ్చిన సూర్యారావుకు కొద్దికాలంలోనే పరిస్థితులన్నీ అర్థమయ్యాయి. సల్ఫేట్ పంపిణీలో రెండు వర్గాల మధ్య జరుగుతున్న అవకతవకలు, నలిగిన తమ గోడల మధ్య విద్యార్థులకు జ్ఞానాన్ని పంచిపెట్టాలని చూసే పాఠశాల పూరిపాకలు, ఇవన్నీ చూసేసరికి ప్రస్తుతం వీటికి తనకు సంబంధంలేకపోయినా గ్రామస్థుల సహకారంతో గ్రామాన్ని ఒక పంచాయితీ వ్యవస్థగా అనతికాలంలోనే , అత్యున్నత స్థితిలోకి తీసుకురావచ్చు ననుకున్నాడు.

పంచాయితీ ఎన్నికలు దగ్గరగా వచ్చేసరికి రాఘవాపురంలోని రెండు వర్గాలకు చెందిన నాయకులు తమతమ బలాన్ని కూడదీసుకోసాగారు. మొదటి వర్గానికి చెందిన రామానాయుడి పశువుల్ని, రెండవ పార్టీ నాయకుడైన మునసబు రంగారావు తన చేను పాడుచేశాయని బందెలదొడ్డిలో తోలించేసరికి పరిస్థితి మరింత తీవ్రరూపం ధరించింది. రంగారావు పాలేర్లను, మామిడి దొడ్లో పండ్లు దొంగిలించారన్న ఎపంతో మొదట వర్గంవారు ఊరిబయట పొలాల్లో చావగొట్టారు. సూర్యారావు కదంతా అయోమయంగా తోచింది. ఇరువర్గాల నాయకులకు ఏదైనా పరిష్కారమార్గం చూపించి, వారు సామరస్యం వైపు మొగ్గేలా చేస్తే బాగుంటుందనిపించింది.

సాయంత్రం వేళ పంటకాలువ గట్టుమీద సూర్యారావు ఇంటికి నడిచి వస్తున్నాడు. అతని స్నేహితుడు రఘు దార్లో కనిపించి ''ఏంటోయ్! పట్నం విడిచి ఇక్కడే వుండిపోదామని వచ్చావా'' అన్నాడు. ''అవును. అలాగే అనుకొంటున్నాను'' అన్నాడు సూర్యారావు. పంటకాలువలో సుడులు తిరుగుతూ వెళ్తున్న ప్రవాహం కేసి చూస్తూ - 'సరి అలాయితే అప్పుడప్పుడు కనిపిస్తుంటావన్న మాట తమతమ బలాన్ని పెంపొందించుకొనేందుకు ఎం.ఎల్.ఏ. గారు మన ఊరు వేంచేస్తున్నారు. ఎలక్షన్లు దగ్గరకొస్తున్నాయిగా, అందుకని ఇకనుంచీ మన ఊరు పావనమయినట్లే. మన జన్మ తరించవచ్చు. పంచాయతీ ఆఫీసులో రేపు సమావేశముంటుంది. అక్కడికిరా ఏదైనా మాట్లాడుకోవచ్చు'' అని రఘు ఏదో పని ఉన్నందువల్ల వెళ్ళిపోయాడు.

కొద్దిదూరం నడిచి సూర్యారావు పంట కాలువ గట్టుమీద కూర్చుండిపోయాడు. దూరంగా హరిజన పిల్లలు పంటకాలువలో మునుగుతూ, లేస్తూ కేరింతలు కొడ్తున్నారు. ఆ నీళ్ళనే ఆడవాళ్లు కడవల్లో ముంచుక వెళ్తున్నారు. హరిజన వాడకు వెళ్ళేత్రోవంతా అసహ్యంగా వుంటుంది. చింకి గుడ్డలతో వళ్ళంతా మురికి చేసుకొని మనకు స్వాగతమిచ్చేందుకా అన్నట్లు అక్కడి పిల్లలు ఎదురుచూస్తారు. తైల సంస్కారం లేని జుట్టుతో, మాసి పీలిక లైన గుడ్డలతో , లోతుకు పీక్కుపోయిన కళ్ళతో అక్కడున్న వారు మనల్నేదో వింతగా చూస్తారు. శుభ్రత అంటేనే తెలియని వాళ్ళువారు. ఆ హరిజనవాడకి అంతా కలిసియైనా ఒక్క మంచినీళ్ళబావి లేదు. పంచాయతీ వ్యవస్థలు వెలసి ంతకాలమైనా ఒ ‿ మంచినీటి బావికైనా నోచుకోని ఆ హరిజన వాడని పరిశీలి మన అభ్యుదయం ఇట్టే బయటపడుతుంది. సూర్యారావు ఆలోచనలన్నీ కలగా పులంగా వెళ్తున్నాయి. బారులు తీరిన కొంగలు ఆకాశంలో గీతలు న్నట్లు కొండప్రాంతంకేసి వెళ్తున్నాయి. చెట్టుమీదనుంచి మరో చెట్టుమీదకు వెళ్తూ ఒకటేగా అరుస్తూ ఊరంతా తిరుగుతున్నాయి. కాకులు శవపంచాయతీకి వచ్చిన పెద్దమనుషుల్లాగే....

ప ంలో తమ కాలేజీ చదివేటప్పుడు. ఒక హరిజన బాలున్ని ఇంటికి తీసుక , డిని తన చిన్నాన్న ఎంతో గౌరవించి, భోజనానికి సహపంక్తిని కూర్చోబెట్టుకొ డు. అదే చిన్నాన్న ఇప్పుడీ హరిజన వాడస్థితి చూస్తే నా నాగ కత ఆధునిక పద్ధతులనే ముసుగుతో నానాటికి కా , ఆవ ం ం నా పెరగడం లేదు. చేతిలోవున్న మ బెడ్డ వలోకి సిరివేశాడు. మట్టి బెడ్డ ప్రవాహంలో పడ్డప్పుడు గట్టుమీదనుంచి లేచి ఇంటివైపుకు వెళ్ళాడు.

★ ★

సుప్రభా యం.ఎల్.ఏ. గారికి పచ్చని తోరణాలతో, లం చ్చారు. ఆరోజు ఆ గ్రామ

చరిత్రలో ఒక సుదినమనవచ్చు. ఇరువర్గాల నాయకులు యం.ఎల్.ఏ. గారి అధ్యక్షతన పంచాయతీ ఆఫీసులో సమావేశమయ్యారు. వారలా సమావేశం కావడం ఒక అపూర్వ విషయమని, తనకెంతో ఆనందం కలిగిస్తుందని, ఈ సంఘటన గ్రామపురోభివృద్ధికి నాంది సూచన అని ఎం.ఎల్.ఎ. గారు వాక్రుచ్చారు. సూర్యారావు రఘు ప్రక్కన కూర్చుని ఉపన్యాసం సాంతం విన్నాడు. ఎం.ఎల్.ఏ. గారి సూచన ప్రకారం ఎవరైనా యోగ్యుడినే పంచాయతీ అధ్యక్షుడుగా ఎన్నుకొంటే, అతని సహకారంతో, గ్రామస్థుల ఐకమత్యంతో గ్రామాన్ని ఒక ఉన్నత పంచాయతీ వ్యవస్థగా రూపొందించవచ్చుననుకొన్నాడు. ఇరువర్గాల వైషమ్యాలు సమసి గ్రామమంతా కలసి కట్టుగా ఏర్పడితే నిజంగా రాఘవాపురం ఒక రామరాజ్యంగా విలసిల్లుతుందని సూర్యారావు అభిప్రాయపడ్డాడు. సమావేశం జయప్రదంగా నడిచిందేగానీ చివరి భాగంలో అంతా తారుమారైంది. పందిని నందిగా, నందిని పందిగా చేయగల ఎం.ఎల్.ఎ. గారే ఈ సంఘటనకు విద్ధూరపడ్డాడు. ఇరు వర్గాలవారు రాజీ పడి తనను ఆహ్వానించారని ప్రసిడెంట్ పదవికి ఎవర్నో ఒకర్ని ఏకగ్రీవంగా ఎన్నుకొంటారని అనుకొన్న ఎం.ఎల్.ఎ. గారు పప్పులో కాలువేశాడు. ప్రసిడెంట్ పదవికి నేనంటే నేనని ఇరువర్గాల నాయకులు తగవులు ప్రారంభించడంతో ఎం.ఎల్.ఏ. గారికి గట్టి చిక్కే ఏర్పడింది. రోగం ముదిరిన వెనుక రోగిని ఆపరేషన్ గదికి తీసుకువెళ్ళినట్లు, ఎం.ఎల్.ఎ. గారు ఇరువర్గాల నాయకులను సామరస్యం నెలకొల్పేందుకు ప్రత్యేక గదిలోనికి పిల్చుకవెళ్ళాడు. ప్రముఖ దేశనాయకుల చిత్రపటాలు వ్రేలాడుతున్న ఆ గదిలో జరిగిన సంఘటనలు ప్రాముఖ్యం వహించింది కొద్దిసేపే - గంటలు గడిచినా ప్రయత్నం ఫలించనందున, ఎం.ఎల్.ఎ. గారు విసిగి వేసారి తుదకు ఏ వర్గానికి సంబంధం లేనివారిని ప్రసిడెంట్‌గా ఎన్నుకోడం ఉత్తమం అన్నారు. ఇరువర్గాల నాయకులకు, గ్రామ పెద్దలకు ఇదొక తెగని సమస్యగా తేలింది. తుదకు అందరూ ఏ వర్గానికి చెందని సూర్యారావును ప్రసిడెంట్‌గా ఎన్నుకోడం అందరికీ సమ్మతమన్నారు. గ్రామోన్నతికీ, గ్రామాభ్యుదయానికీ పాటుపడాలని ఉత్సుకతను ప్రదర్శిస్తున్న సూర్యారావును తుదకు గ్రామ పెద్దలంతా చేరి ఎం.ఎల్.ఎ. గారి ముందు నిలబెట్టారు. ఎం.ఎల్.ఎ. గారు సూర్యారావుతో

కరచాలనం చేసి 'యువకులు విద్యావంతులైన సూర్యారావు వంటి వారు పంచాయితీ ప్రసిడెంట్‌గా పనిచేసేందుకు వొప్పుకోవడం అపూర్వమని, పదవీ కాలంలో గ్రామానికి ఎంతో సేవచేసి, దాన్ని ఒక అత్యున్నత వ్యవస్థగా రూపొందించాలని పేర్కొన్నారు. ఎం.ఎల్.ఎ. గారు మాట్లాడుతున్నంతసేపు సూర్యారావుకు మౌనమే శరణ్యమైంది.

గ్రామస్తులు తనకు వీడ్కోలు ఇచ్చిన తర్వాత ఎం.ఎల్.ఎ. గారు సూర్యారావును తనతోపాటు కొద్దిదూరందాకా రమ్మన్నారు. దారిలో రాజ యాలను గూర్చి ముచ్చటిస్తూ సూర్యారావు ఎం.ఎల్.ఎ. వెంట నడిచాడు వాగుదాకా తన్ననుసరించి వచ్చిన సూర్యారావును ఎం.ఎల్.ఎ. గారు ఇక నిలబడమన్నారు, జీప్‌లో ఎక్కుతూ - మోకాటిదాకా బురదనీటిలో వాగు ప్రవహిస్తుంది. ఇక వర్షాకాలంలో దాని ఉధృతం చెప్పనలవి కాదు. ఎప్పుడో ప్రయాణానికి వీలుగా దానిపై నిర్మించిన కర్రవంతెన పాత బడేసరికి గ్రామస్థులు దాన్ని తమ స్వార్థానికి వినియోగించుకొన్నారు. వెళ్తున్న ఎం.ఎల్.ఎ. గార్కి వీడ్కోలునిస్తూ సూర్యారావు వంతెన విషయం ప్రస్తావించాడు. ఎలాగైనా వాగుపై వంతెన వేసేందుకు వారు సహాయం చేయవలసిందని - అలాగేనంటు చిరునవ్వుతో చేటంతయిన తన మొహం మీది చిరుచెమటల్ని జేబురుమాలుతో వొత్తుకుంటూ, ఎం.ఎల్.ఎ. గారు జీప్‌లో వెళ్ళిపోయారు. సూర్యారావుగారు ఎం.ఎల్.ఎ. గారు [illegible] న వైపుకేసి చూస్తూ అలాగే నిలుచుండిపోయాడు.

మరు [illegible] దినం, పొలం గట్టుమీదున్న ముళ్ళపొదను నరికి సూర్యారావు దూరంగా పారవేస్తుంటే ఆ త్రోవన వెళ్తున్న రఘు ఆగి అన్నాడు - 'ముళ్ళపొదను దూరంగా పారవేయడమే కాదు. ఇంతకు మునుపు అక్కడ పడివున్న ముళ్ళను ఏరి దూరంగా పారవే [illegible]. [illegible]ఉంటే అవి మన కాళ్ళకు గుచ్చుకొంటాయి'. ప్రసిడెంట్ కావ [illegible]ంతో సరికాదు. గ్రామాభ్యుదయానికి ప్రగతిపథం నిర్మించాలంటే, [illegible] వి[illegible]నాతకు దారితీసే విద్రోహశక్తులను దారినుంచి ముందు తొలగించా[illegible]. [illegible]ఘు మాటల్లోని వ్యంగ్యాన్ని అర్థంచేసుకొన్న సూర్యారావు మరేమీ జవా[illegible] కుండానే అతన్ని అనుసరించాడు.

★ ★ ★

కొద్దికాలంలోనే రాఘవాపురంలో ఎన్నో మార్పులు జరిగాయి. అయిదారు సంవత్సరాలుగా వసూలు కాని ఇంటిపన్నులు కొద్ది కాలంలోనే సూర్యారావు వసూలు చేయగలిగాడు. రాఘవాపురం చెరువులోని నీళ్ళు తగ్గినప్పుడు, గ్రామస్థులు ఎవరంతకు వారే చేపలు పట్టుకువెళ్ళేవారు. సూర్యారావు అతి కష్టంమీద గ్రామస్థులకు నచ్చజెప్పి, అందులోని చేపల్ని వేలం వేసి వచ్చిన ఆదాయంతోను, చందాల వల్ల సమకూరిన పైకంతోనూ హరిజనవాడలో మంచినీళ్ళ బావిని త్రవ్వించాడు. హరిజనవాడనుంచి ఒక అభ్యర్థిని పంచాయతీ బోర్డు మెంబరును సూర్యారావు ఎన్నుకునేలా చేసేసరికి, రెండుగా చీలిపోయిన వర్గాలు తిరిగి ఏకం కావడం కోసం ప్రయత్నించసాగాయి.... ఎన్ని అడ్డంకులు ఎదురైనా రఘులాంటి మిత్రుల సహాయంతో సూర్యారావు వాటిని నెట్టుకు రాగల్గాడు.

పాఠశాల అధ్యాపకులు, రామప్పపంతులు గారి బదిలీ అందర్నీ ఆశ్చర్యంలో ముంచెత్తింది. తన కొడుకును ప్యాస్ చేయలేదన్న కోపంతో, అధికార్లకు లంచం పెట్టి క్షణాల మీద రంగారావుగారు - పంతులుగారిని బదిలీ చేయించేసరికి సూర్యారావుకు కోపం వచ్చింది. ఇలా ఉపాధ్యాయులందర్నీ, తమ కొడుకులను ప్యాసు చెయ్యలేదని బదిలీ చేయిస్తుంటే , ఇక ఈ పాఠశాలలో ఏ ఉపాధ్యాయుడు ఇష్టపడి పని చేస్తాడు. పంచాయతి బోర్డు మెంబర్ల మీటింగులో సూర్యారావు అన్నాడు - 'రామప్ప పంతులుగారు బదిలీ కావడం అందరికీ విచారకరమైన సంఘటనే. మొదటి నుంచి ఆయన ఈ గ్రామానికి చేసిన సేవ అల్పమైనదికాదు. ఆయన యోగ్యుడు. పూజనీయుడు అలాంటివారిని తన కుమారున్ని ప్యాసుచెయ్యలేదనే నెపంతో ఒకరు అధికార్లకు లంచం పెట్టి బదిలీ చేయించడం సహించరాని పని. ఇక ఇలాంటి అవినీతికరమైన పనులు చేయకుండా చూడాలి'' సూర్యారావు అంటున్న మాటల్ని మధ్యలోనే తుంచివేస్తూ తన బుర్రమీసాల్ని మెలిపెట్టుకుంటూ రంగారావు అక్కడ నుంచి వెళ్ళిపోయాడు. ఒక్క హరిజన మెంబరు తప్ప తక్కినవారంతా రంగారావును

అనుసరించారు. తమ స్వార్థం కోసం ఇరువర్గాలవారు ఆనాడు తనను ప్రెసిడెంట్‌గా చేశారు. తను ఈనాడు వాళ్ళ ఆటలు ఏమీ సాగనియ్యనందువల్ల అందరూ ఒక్కొక్కరే దూరంగా తొలగిపోచూస్తున్నారు. వీరంతా సంకుచిత స్వభావులు. ఎదుటివారిని అర్థంచేసుకోలేని మానవులు. సూర్యారావు ఏమీ మాట్లాడలేదు. వెళ్తున్నవారికేసి చూస్తూ అలాగే నిల్చుండిపోయాడు.

★ ★ ★

వంతెన నిర్మాణం పూర్తి అయింది. కంట్రాక్ట్ తీసుకొన్న మునసబు రామానాయుడు చకచకా పని అంతా మూడు నెలల్లోనే ముగించి వంతెన నిర్మాణం పూ చేశాడు. వంతెన ప్రారంభోత్సవానికి వచ్చిన ఎం.ఎల్.ఏ. గా .. అన్నారు. ''ఈ వంతెన నిర్మాణం వల్ల ఈ గ్రామానికి ఎంతో ప్రయోజ ం సమకూరిం . సూర్యారావు ఆదర్శం మెచ్చుకోదగిందిగా గ్రామస్థులు అంతా ఐక్య గ్రామ పురోభివృద్ధికి తోడ్పడుతారని ఆశిస్తున్నాను'' ఎం.ఎల్.ఏ. గారు అల్పాహారం సే ంచి అప్పుడే కారులో వెళ్లిపోయారు. పట్నం నుంచి వచ్చిన రమణ వెళ్తూ సూర్యారావుతో అన్నాడు ''దీన్నికంట్రాక్ట్ చేసినవాడెవ్వడో వట్టి ఇసుక రాళ్ళతో వంతెన కట్టినట్టున్నాడు. ఎప్పుడో ఒకప్పుడు పేకమేడలా ఇదికుప్పలా కూలిపోతుంది. మిత్రుడు, ఇంజనీరు అయిన రమణ మాటలు ంటుః సూర్యారావు ఆశ్చర్యంతో శూన్యం కేసి చూస్తూ నిల్చుండిపోయాడు.

వారంలోపల్నే రాఘవాపురంపై భోరున వర్షం కురిసింది. వర్షం ఆగాక వాగుదాకా వెళ్ళిన గ్రా . లు నోరుతెరచి అలానే చూస్తుండిపోయారు. ఉధృత వె న్న ప్రవాహంలో వంతెన నామరూపాలు లేకుండా కొట్టుకుపోయి . ఎవ ఉద్ధరించాలని అనంతమైన ఆ ప్రవాహం కేసి , వం నిర్మి ఆ ( దేశం కేసి చూస్తు ) సూర్యారావు కళ్ళు బైర్లు కమ్మాయి. రామ నాయు ఏదైనా ఆనకట్ట నిర్మించుంటే ఈవేళకి కొన్ని గ్రామాలైనా పొట్ట పె . . వాడే!

గ్రామ ధలంతా సూ అ క్షతన మరుసటి దినం పంచాయితీ ఆ సులో సమావేశమయ రు. ం మానాయుడు పురోహితున్ని వెంట

పెట్టుకుని వచ్చాడు సూర్యారావు అన్నాడు - ''నాయుడుగారూ! గ్రామసౌకర్యం కోసం వంతెన నిర్మించాలని మేమంత చందాలు పోగుచేసి, కంట్రాక్ట్ మీకిస్తే మీరంతా ఆ సొమ్ము దుర్వినియోగం చేశారు. పసిపిల్లల ఆటలా ఆ వంతెన నిర్మించారు, వంతెన అలా కూలిపోయేందుకు మీరే కారకులు'' సూర్యారావు మాటల్లో మధ్యలో కలుగ జేసుకొని పురోహితుడు ''అయ్యా! వంతెన నిర్మాణం మొదలుపెట్టిన ముహూర్తం మంచిదికాదండీ'' అని అన్నాడు. సూర్యారావులో కోపం పెల్లుబికింది. ''అయితే ముహూర్తం కట్టిన నీ కొడుక్కి బుద్ధిలేదన్నమాట. కోపంతో తనేమంటున్నది సూర్యారావుకు తెలియలేదు. ''అపచారం బ్రాహ్మణుల్ని నిందిస్తే నరలోకం వెళ్తారు'' నొదుటనున్న నామాల్ని సరిదిద్దుకొంటూ పురోహితుడు సమాధానమిచ్చారు. ''ఇలాంటి అసత్యాలు పలికి తెచ్చుకొనే స్వర్గం కన్నా నరకమే న్యాయం. ఏమండీ నాయుడుగారూ! వంతెన కూలిపోవడానికి మీరేకారణం ఏమంటారు'' సూర్యారావు వస్తున్న ఆగ్రహావేశాన్ని తనలోనే అణచుకొంటూ సౌమ్యంగా అన్నాడు.

సూర్యారావు అంటున్న మాటలకు రామానాయుడు కోపంతో రెచ్చిపోయాడు.''అమాయకుడైన నిన్ను ప్రసిడెంట్‌గా చేసేసరికి నా అంతవాడు లేడని గర్వంతో విర్రవీగుతున్నావు. వంతెన కూలడం అనే విషయం ప్రస్తుతం అప్రస్తుతం. అసలు నువ్వెవరు నన్నడిగేందుకు'' అన్నాడు చుట్టూరవున్న మెంబర్లకేసి చూస్తూ.

సూర్యారావుకు తన పరిస్థితి అయోమయంగా తోచింది. గ్రామస్థులందరివైపు చూశాడు. వంతెన కూలిందన్న బాధ ఒక్కర్లోనూ లేదు. కోపాన్నంతా నిగ్రహించుకొని ''అవును నేనేమీ కాను. నిన్నడిగేందుకు'' అని సూర్యారావు అక్కడ నుంచి వెళ్ళిపోయాడు...

కారులో సూర్యారావు ప్రక్కన కూర్చున్న రఘు అన్నాడు - ''నువ్వు ఆ ప్రసిడెంట్ పదవికి రాజీనామా ఇవ్వడమే మంచిదయింది. మెంబర్లంతా వాళ్ళ రాజీనామా పత్రాలని నిన్ననే పంచాయితీ ఆఫీసరుకు పంపించారు. ఒక్క హరిజనవార్డు మెంబరు తప్ప. వెయ్యి రూపాయలు లంచమిస్తామన్నా, నీకు

వ్యతిరేకంగా రాజీనామా సమర్పించేందుకు ఆ అభ్యర్థి అంగీకరించలేదు. నీ పొలాల్ని నేచూస్తుంటాను. నీవు మాత్రం ఇక టౌనువిడిచి ఇక్కడికి రాకు'' అని కారుదిగి ఊరికేసి వెళ్తున్న రఘుకేసి, సూర్యారావు కారులో నుంచే చూస్తుండిపోయాడు. వాగు పాయలు పాయలుగా చీలి బురదనీటితో సన్నగా ప్రవహిస్తుంది. వంతెన కూలిన ప్రదేశంలోని రాళ్ళను ఎవరో గ్రామస్థుడు బండిలోకి వేసుకొంటున్నాడు. గ్రామంలో జరిగిన సంఘటనలను ఏమీ గమనించినట్లు, కాళ్ళు విరిగి నేలకూలిన వంతెన మూలుగుతుంది, వాగులో నుంచి ఆకాశం కేసి చూస్తూ - తను ఇవతలి గట్టునుంచి అవతలిగట్టుకు ఆదర్శాలవంతెన నిర్మించాలని భ్రమపడ్డాడు. కానీ, వంతెనలా అదీ కూలి పోయింది.

సూర్యారావు కారును స్టార్ట్ చేసి వాగుదాటించాకా వెనక్కు తిరిగి మెల్లగా గొణుక్కున్నాడు - ''భగవాన్! వీళ్ళని మనుషుల్ని చేయి!''

***

# పాలు - నీళ్ళు

## రచన :

## కప్పగంతుల మల్లికార్జునరావు

తట్టనెత్తికెత్తుకొని, కాలు కదిల్చింది కనకం.

చీకటి మసక మసగ్గా వుంది. వెలుతురు తళుకు తళుకుమంటోంది.

కనకం నెత్తిన తట్టలోని, పాల కడవలు, పెరుగు ముంతలు నేతి పిడతలు, కదలకుండా కూర్చున్నాయి. అంత బరువు నెత్తినున్నా, లేనట్లే, వయ్యారంగా అలవోకగా నడుస్తోంది కనకం-

ఆజానుబాహువురాలు కనకం. పొడుగు- పొడుక్కు- తగ్గ లావు పుష్టైన అవయవాల వంపు సొంపులు, నిగనిగలాడే నల్లని చాయవొకసారి ఆమెను చూస్తే మళ్ళీ మళ్ళీ చూడాలనిపిస్తుంది ఎవరికైనా! అయితే అలా చూచే వాళ్ళకు తన చూపులతోనే చురకంటిస్తుంది.

ఆ వూళ్లో చాలామందికి పాల వ్యాపారమే జీవనం-

పొద్దున్నే, తెల్లవారటానికి బారెడు పొద్దు వుండగానే, ఆ వూళ్ళోని పాలవాళ్లు తట్టలు నెత్తికెత్తుతారు. తెల్లగా తెల్లవారేసరికి, రెండు మైళ్ళ దూరంలో ఉన్న పట్నానికి చేరుకొంటారంతా. తట్ట ఖాళీ చేసుకొని, ఎంత నెత్తి మీది కొచ్చేసరికి వూరు చేరుకొంటారు మళ్ళీ.

కనకం రోడ్డుమీదికొచ్చింది. అప్పటికే కొందరు పడుచులు అక్కడికి చేరారు. కనకాన్ని చూచి 'కనకం వచ్చింది కనకం వచ్చింది' అని అరిచారు.

కనకం కళ్ళులటు పక్క నుంచి, ఆ రోడ్డు మీదికి చేరే బాట వైపు చూస్తున్నాయి ఆశగా. అంతలోనే ఆ కళ్ళల్లో నిరాశ!

పట్నం పోవటానికి వూళ్లో యేవైపు నుంచి వచ్చినా, ఆ కూడలికి రావల్సిందే. ఊరికి దక్షిణపు వైపు వాళ్లు యిటు వస్తే, వుత్తరపు వీధి వాళ్లు అటు వస్తారు అందరూ అక్కడి నుంచే వెళ్ళటం.

'ఎల్దాముటే కనకం యింక?' ఆజ్ఞ కోసం ఎదురుచూస్తున్నారు పడుచులు. కనకం వుత్తరం బాట వైపే చూస్తోంది.'

'బంగారక్క రాలేదుటే?'

కనకం బంగారక్కను గురించి విచారించటం... ఆశ్చర్యపోయారు యువతులు.

బంగారక్క వుండేది వూరికి ఉత్తరం వైపు కనకం యిల్లు దక్షిణం వైపు.

బంగారక్క ఉత్తరధృవం- కనకం దక్షిణ ధృవం. ఇద్దరి ఆలోచనల్లో, అలవాట్లలో, పద్ధతుల్లో అంత వ్యత్యాసం వుంది.

కనకం వర్తమానానికి ప్రతినిధి అవుతే, బంగారక్క భూతకాలం! పండు ముదుసలి బంగారక్క. నిగనిగలాడే నిండు యవ్వనం కనకంది.

చాలా విషయాల్లో యిద్దరికీ చుక్కెదురే. ఒక్క నిముషం పడదు. అన్ని కి ముఖ్యమైన విషయం - పాల వ్యాపార విధానం.

పాలల్లో తగు పాళ్ళల్లో నీళ్ళు కలుపుతుంది బంగారక్క. నీళ్ళల్లో కాసికి పాలు చిలకరిస్తుంది కనకం.

పాల పేరిట నీళ్ళు పోయటం పాపమంటుంది బంగారక్క. అదే వ్యాపార లక్షణం అంటుంది కనకం.

కనకా కి నోరుం . బంగారక్కకు లేనిదదే.

దూరంగా నె తట్టతో, తడ డే అడుగులు వేస్తూ వస్తున్నది బంగారక్క! కనకం క మిలమిలలాడేయి!

'జొరం వ ందటగా ంగారవ్వా రే ? ఎట్టాగుంది?

ముడుతలు పడిన చర్మం సాగింది. బోసి నోటితో చిరునవ్వు నవ్వింది బంగారక్క. 'బాగానే వుంది లేయే'

'ఇయాల రాకపోతే యేం మునిగిపోయిందంట?.. సరేలే... ఆ తట్ట యిట్టా నా నెత్తిన పెట్టు - పట్టం దాకా తీసుకొత్తా'.

అంతా విస్తుపోయారు! శత్రువుతో స్నేహం!

'ఎందుకులేయే - నే తీసుకురాగలను'

కనకం కళ్ళల్లో నిరాశ - మొహంలో కోపం.

'ఓ యబ్బో!' అదో విధంగా రాగం తీస్తూ అంది కనకం- తన తట్ట నేను తీసికొస్తే, తన పాలల్లో, నా నీళ్ళు కలుస్తాయని భయం కాబోలు! హు'

'ఓపిక పోయిన్నడు ఎట్టాగూ సేయక తప్పదులేయే కోప్పడమాకు.'

'ఉ...ఊ...' అంటూ వెటకారంగా దీర్ఘం తీసి అడుగుకేసింది వేగంగా.

కనకం వెంబడే ఆమె పార్టీ వాళ్ళంతా కదలిపోయారు చకచకా.

ఆ వూరి పాల వాళ్ళల్లో రెండు గ్రూపులు.

నీళ్ళలో పాల కలిపే గ్రూపునకు కనకం నాయకురాలు. పాలల్లోకాసిని నీళ్లు కలిపే గ్రూపునకు బంగారక్క పెద్ద.

మొదటి గ్రూపుకే బలం ఎక్కువ ఆ వూళ్లో! (ఆ మాటకొస్తే ఏ వూళ్లో లేరు కనక! అందుకు కారణాలు రెండు - మొదటిది ఆ పద్ధతి లాభదాయకం, రెండు కనకం నాయకత్వం)

రెండో గ్రూపునకు పెద్ద బంగారక్క. అయితే ఆ గ్రూపులో సంఖ్య ఎంతంటే చెప్పటం కష్టమే. ఏళ్ళ క్రితం యీ గ్రూపునకే బలం జాస్తి. అయితే క్రమంగా ఆశకు లోనయ్యారు ప్రజలు. అవినీతి సంపాదనకు రాచబాటగా కన్పించింది! పాపభీతి, పరమాత్మపై భక్తి సన్నగిల్లేయి. తరం మారింది. కనకంలాగే అంతా అక్రమ మార్గాన్ని పట్టేరు. ఇప్పుడు ఆ గ్రూపులో వుంది బంగారక్క ఒక్కతే అని చెప్పవచ్చు.

'గొల్లోల్లలచ్చనం పాలల్లోకాసిని నీళ్ళు కలపటమే. నువ్వు నీళ్ళల్లో పాలు

కలిపి పాలని అమ్మితే పాపం కదుటే పిల్లా?'

తను చేసేపని పాపమని ఎవరన్నా అంటే కనకానికి చెడ్డ చిరాకు!

అది తన వృత్తి. పాపమెలా అవుతుంది? డాకటేరు మందులో నీళ్ళు కలపకుండానే ఇస్తున్నాడా? బియ్యం పప్పు ఉప్పుల్లో రాళ్ళు కలపకుండానే అమ్ముతున్నాడా కోమటాయన? ఆ మాటకొస్తే కల్తీలేనిదెందులో? చేయనిదెవరు? మరి వాళ్ళందరికి రాని పాపం తన వొక్కదానికే వస్తుందా? ఇలా సాగుతుంది కనకం ఆలోచన - వాదన.

'మా కాలం వోళ్లు అంత దిట్టంగా వున్నారంటే ఎట్టాగున్నారు చిక్కటి పాలు పెరుగు తాగబట్టేనే. మీరు పోసే నీళ్ళు తాగే యిప్పటి మనుషులు నీళ్లు కారుతూ వున్నారు. మా కాలంలో యింత అన్నాయాలెరగమె? ఏది సేసినా దర్మంగా వుండేది.'

నిజమే. బంగారక్క గడిచిపోయిన ధర్మదినాలకు ప్రతినిధి.

ఆమె వయస్సు అర్వై అయిదు దాటిందిప్పుడు.

ఆరేళ్ళ వయస్సు నుంచి పాల వ్యాపారమే ఆమె వృత్తి. అప్పుడామె తల్లినీడని బిడ్డ.

అయి ఆరోజుల్లో పాల వ్యాపారం ఇలా ఉండేదా?

ఊళ్లో కామందులకు పాలు సరఫరా చేసే వారు వీళ్లు. ప్రతిఫలంగా డబ్బు కాదు పుచ్చుకోటం, సంక్రాంతికి గింజలు కొలిచేవారు కామందులు. పశువులకు గ్రాసం ఇచ్చేవాళ్లు. సంవత్సర గ్రాసం అదే.

త త తనే బిడ్డల తల్లి కాబోయే నాటికి కాలంలో మార్పు వచ్చింది. ఏ నెలకానె ధాన్యం కొలవటం. అదీ కామందుల యిష్టాయిష్టాల మీద కాదు, లెక్క ప్రకారం. యిన్ని పాలకు యింత ధాన్యం అని.

తన చాటు బిడ్డలు వచ్చేనాటికి మరికొంత మార్పు.

ధాన్యాలిచ్చే పద్ధతి పోయింది. పాలు పోయటం డబ్బు తీసుకోవటం. ఆ డబ్బుతో మళ్ళీ మూడో మనిషి దగ్గర ధాన్యం కొనుక్కోటం. అయినా ఇదంతా

వ్యాపార దృష్టితోనే సాగలేదు. వెనుకటి అలవాట్లు. నీతి నియమాలు యింకా మిగిలే ఉన్నాయి.

మనవళ్ళ కాలం వచ్చేసరికి అంతా తారుమారయింది.

డబ్బు, వ్యాపారం, సంపాదన, సుఖం యివే మనుష్యుల ధ్యేయం. ధర్మం విలువ నశించింది. పాపం అంటే భయం పోయింది. పాలు యిప్పుడు కావాలన్నా వూళ్ళో కామందులకు దొరకవు. అన్నీ పట్నానికి తీసికెళ్ళి అమ్మాల్సిందే!

అక్కడైతే పాలు ఎలాగున్నా కొంటారు జనం. పాల పేరుతో తెల్లగా ఉంటే చాలు. అలాంటి యాంత్రిక జీవనం అక్కడ కొందరు హోటళ్ళకే సప్లయి.

అందుకే వూళ్ళో పాల వాళ్ళంతా పట్నం మీద పడ్డారు.

పట్నం రోజు రోజుకీ పెరుగుతోంది. దాన్తో పాటు జనాభా కూడా. ఈ రెంటితో పాటు పాలకు 'డిమేండు' పెరగటం సహజమే కదా! డిమేండుతో పాటు పాలల్లో నీళ్ళ శాతం కూడా పెరిగింది.

కాలం యింత మారినా, బంగారక్కకు కాలంతోపాటు పెరగటం చేత కాలేదు! మూడవ మార్పు వద్దే ఆగిపోయిందామె.

తప్పనిసరయి పట్నానికి వెళ్ళి పాలు అమ్ముకొంటున్నా నీతి నియమాలు తప్పలేదు. అత్యాశలకు పోయి అన్యాయార్జనకొడిగట్టలేదు.

అందుకే బంగారక్క వ్యాపార జీవితంలో ఎదుగుబొదుగుల్లేవు.

పాతికేళ్ళ క్రితం యెన్ని ఖాతాలున్నాయో, యిప్పటికీ అవే. ఆనాడు నీళ్ల ఎన్ని కలిపేదో యీనాడూ అన్నే.

ఊళ్ళో వాళ్ళకు పాలు పోయటానికి సిద్ధపడేది బంగారక్క, పోయించుకోటానికి వాళ్లు సిద్ధపడేదీ బంగారక్క దగ్గరే! మిగతా వాళ్ళ దగ్గరికి పోతే ఏం జరిగేది వాళ్ళకి తెల్సు!

ఒట్టి తప్పేళా చూపించి, బర్రె దగ్గర పాలు పితుకుతూనే, తమ కళ్ళు కప్పి తప్పేళా నిండా నీళ్లు నింపుతారు. ఎలా కలుపుతారంటే - అందుకు అనేక రకాల పద్ధతులు - చిత్రాలు!

బంగారక్కకీ పద్ధతులు తెలియవు.

అందుకే పట్నంలో కూడా చాలా మంది ఆమె దగ్గర పోయించుకోటానికి ముందుకొస్తారు. అయితే పాత ఖాతాల వాళ్ళు వొప్పుకోవద్దూ? పోసే వాళ్ళ పైన, పోయించుకొనే వారి పైనా కూడా విరుచుకుపడతారు.

అందులో ప్రథమస్థానం కనకందే.

కనకం పాలల్లో నీళ్ళ పాలే జాస్తి. అలా అని పాలు పోయించుకొనే ఆసామీ అంటే మాత్రం ఆమె వూరుకోదు.

'ఈ పాలు పల్చనవి. నేను పాలల్లో నీళ్ళు కలుపుతానని మీరంటున్నారు అమ్మగారూ. ముగ్గు పెట్టుకోవచ్చీపాలతో! ఇంత చిక్కగా వుంటే అట్టాగనటం ధర్మం కాదమ్మగోరూ. ఈ మాత్రం పాలు పోసే ముండని సూపించండి నాకు' అని దబాయిస్తుంది.

ఎండాకాలం వస్తే యింకో రకం సమాధానం.

'పశువులు గడ్డి లేక సత్తున్నాయ రూ. పాలే యివ్వటం లేదు. మీరు కట్టపడ్తారని వాళ్ళ కాళ్లు వీళ్ళ కాళ్లు పట్టుకొని తీసుకొచ్చాను. ఏమిటోన రూ యాపారం కట్టంగా ఉంది. వచ్చింది గొడ్ల మేతకే సరిపోటం లేదు. యి క మేం తినేదేమిటి? ఏమిటో?' అంటూ దీనాలాపాలు పలుకుతుంది.

వర్షాకాలం వస్తే మరో ప్లేటు.

'నాలుగు బర్రెలు యినాల్సి వుందమ్మా. యియాలో రేపో అన్నట్టున్నాయి రెండు రోజులాగండమ్మా. అవి యీనితే మంచి పాలే'

ఆ బర్రెలు మళ్ళీ ఎండా కాలం వచ్చిందాకా యీననే యీనవు.

అలా సాగుతుంది కనకం వ్యాపారం.

ఎవరైనా నిష్టేల్తే కనకం కూడా తారాజువ్వలా లేస్తుంది. 'ఏంమ్మోయ్. డబాయిస్తున్నారు? ఎంత పాలుపోసే ముండనైనా నాకూ మానం మర్యాదలున్నాయి. ఇట్టం వచ్చినట్టు నోరు సేసుకొంటే వూరుకోను. మీకంత

కట్టంగా ఉంటే మరొకరి దగ్గర పోయించుకోండి.'

కానీ ఆ పోసే మరెవ్వరు? అంతా కనకం లాంటి వాళ్ళే. పైగా చాలా మంది ఆమె గ్రూపువాళ్ళు కాగా కనకం ఖాతా యింటికెళ్ళే ధైర్యం ఎవరికుంది?

బంగారక్కే వొప్పుకొందొక్కసారి. ఆ యింటి వాళ్ళు పిల్లలకు మంచి పాలు కావాలని బ్రతిమలాడగా.

మర్నాడు పాలు పోయటానికెళ్ళిన కనకం విషయం తెల్సుకొంది. అరికాలు మంట నెత్తికెక్కింది.

'నాకన్నా అంత మంచి పాలుపోసే ముండ ఎవరమ్మోయ్? నా నోటికాడ కూడు అదెట్టా తీత్తుందో చూత్తాగా నేను? రానివ్వండి.

వచ్చిన బంగారక్కను చూచి మొదట్లో కాస్త తగ్గినా తన నాయకత్వాన్ని తల్చుకొని ఉగ్రురాలే అయింది.

'నువ్వా బంగారక్కా!? యింకా వోరో అనుకున్నా, నీకిదేం బుద్ధి? మా నోటికాడ కూడు తీద్దామనుకున్నావా? ఇట్టాగయితే యాపారం సేసినట్టే!'

బోసినవ్వే బంగారక్క సమాధానం.

'మాట్టాడమంటే నవ్వుతుందీ? నా ఖాతా ఎట్టా తీసుకొంటావో. పాలెట్టా పోత్తావో సూత్తాగా?' పందెం వేస్తున్నట్లు అంది కనకం.

'నీలాగా నీళ్ళుపోత్తే వూరుకొంటావా ఏంటి?' నవ్వుతూనే అంది బంగారక్క.

'హబ్బో.' రాగం తీస్తూ అంది కనకం. 'నువ్వొక్కదానివే మహా పాలుపోసేదానివి. మేమంతా నీళ్లు పోత్తున్నాం. ఇదెన్నాళ్ళ సంబరం? రెండు రోజులాగితే మళ్ళీ వీళ్లే - అట్టాగెల్లి వూళ్ళో అడిగితే తెలుత్తుంది - ఎవరు పాలుపోత్తారో ఎవరు నీళ్లు పోత్తారో?' దబాయింపే.

'ఈ గోలంతా ఎందుకు కనకం మా ఇంటి ముందు! మాకిష్టం లేదు నీ దగ్గర పోయించుకోవటం - ఆమెను కుదుర్చుకొన్నాం. నువ్వే కుదుర్చుకోమన్నావుగా!' ఇంటి వాళ్ళు అన్నారు.

'అడిగే వాళ్ళకు మీకు లేకపోతే, పోయటానికి వొచ్చిన దానికెట్టా లేదంటా? ఇట్టా పోటీలకొస్తే యాపారం సాగినట్టే. నడు నడు బంగారవ్వా మర్యాదగా బయటికి.'

'చిన్న పిల్లలకి మంచి పాలు కావాలంటే పాపం నీళ్ళు తాగితే జలుబు చేస్తున్నదిట. పోయనివ్వవే నన్నేనా.'

'అదే మాట? బంగారం లాంటి పాలను నీళ్ళనటానికి నోరెట్టా వచ్చిందంట? నడుస్తావా లేదా నా ఇంటి నుంచి?

ఏమనగలదు బంగారక్క? ఏమంటే మటుకు వూరుకొంటుందా కనకం?

తిరిగి కనకమే ఆ ఇంటి వాళ్ళకు గతయింది.

ఇంతటి సమర్థురాలు కనుకనే నాయకురాలు కాగలిగింది మిగతా వాళ్ళకు. పోటీ ఎవరిపైకొచ్చినా అంతా చేరి 'ఖస్సు'న లేస్తారు, విజయాన్ని సాధిస్తారు.

వ్యాపార విషయాల్లో యింత అన్యాయంగా ప్రవర్తించే కనకం. మిగతా విషయాల్లో ఎంతో నిక్కచ్చి. మానం విషయంలో చురకత్తిలాటి మనిషి.

ఎంతటి భారీ శరీరమో అంతటికంత అందం ఆమెది. ఎందటి అందగత్తో అంతటి కొంటెతనం. ఒక కంట్లో కొంటెతనం. మరో కంట్లో కాల్చేసే కోపం. ఎదుటివాడిని వెధవను చేసి ఏడిపించాలంటే ఎడమ కన్ను- భయపెట్టాలంటే కుడికన్ను!

పాలు, పెరుగు ఖాళీ అయ్యాక, పట్నంలో పెద్దబజారుకు బయల్దేరుతారంతా- రకరకాల వస్తువుల కొనుగోళ్ళకు. కనకం మిగతా పడుచులతో కల్సి బజారున పోతుంటే, రాజకుమారి చెలులతో వుద్యానవనంలో విహారానికి పోయిన చందంగా వుంటుంది. అందరి కళ్ళూ ఆమె పైనే.

తన వైపు చూచిన వారిని చూచి కోపగించుకోదు కనకం. వెర్రి వాళ్ళను చేసి ఆడించటం ఆమెకు సరదా. అందరిలో, అంతా తన్ని చూస్తున్నారంటే ఎంత గొప్ప!

'అందగాడు సూత్తున్నాడేవ్...

'పెళ్లి సేసుకొంటావా బుల్లోడా - అట్టా మింగేట్టు సూత్తుండావ్?!'

'కళ్లు అరిగిపోతాయిరా నా తండ్రీ. పెళ్లాని సూట్టానికట్టే పెట్టుకో-'

ఎవరన్నా కనకం ఎగతాళిని అపార్థం చేసుకొన్నారంటే వాళ్ళ దురదృష్టం.

పిల్ల అలా అనటం తనని వాంఛించేననుకొని, రూపాయలతో వెంటబడ్డ, ఎందరికి పూరవతల చేలల్లో దేహశుద్ధి జరిగిందో? కోపం వచ్చి ఎందరికి తలల మీద ఎన్ని నేతి పిడకలను పగలకొట్టిందో?

అందుకే పట్నంలో పెద్ద మనుష్యులకు, కుర్రాళ్ళకు కనకం అంటే భయం.

ఊళ్లో మటుకు?... మోతుబరి రైతు కొడుకు పొలంలో కనకం చేయి పట్టుకొని చెంపదెబ్బ తిన్నాడు. మునసబు కొడుకు చెంగులాగి మొహం మీద వుమ్మేయించుకొన్నాడు. పంచాయితీ బోర్డు ప్రెసిడెంటు గారి పెద్దబ్బాయి కన్ను గీటి సమాధానంగా కనకం కళ్ళల్లోకి దూరి, వారం రోజులు మూసిన కన్ను తెరవలేదు.

కనకం నిప్పు. తాకబోతే చెయ్యి కాలిందే!

నిప్పు కణికెలాంటి కనకం ఎందరితో ఎంత నవ్వుతూ మాట్లాడినా, మనసిచ్చింది వొకడికే. వాడే కోటేశు.

కోటేశు ఎన్నడూ కనకంతో మాట్లాడి ఎరుగడు. కన్నెత్తి ఆమె యౌవ్వనాన్ని కాంక్షగా చూచి ఎరుగడు. అతని వృత్తి బేల్దారు పని. తన పనేమో తానేమో!

కనకం ఎంత గడుసరో, కోటేశు అంత సాత్వికుడు. ఊళ్లో యువకులందరికీ కనకం భయమైతే, యువతులందరికీ కోటేశు అంటే ప్రేమ.

కనకం పైన వో జానాబెత్తెడు ఎత్తు ఉంటాడు కోటేశు. చక్కని నిండైన విగ్రహం.

ఓ నాటి సంధ్య వేళ.

పగలంతా తిండి కోసం తిరిగిన పక్షులు గూళ్ళకు చేరే వేళ.

పొగాకు కోతలకు పోలాలకు పోయిన పడుచులు యిళ్ళ మొహాలు పట్టి వస్తున్న సమయాన.

నల్లని యౌవనాన్ని విరజిమ్ముతూ నడుస్తున్న కనకాన్ని పదం పాడమన్నారు తోటి వాళ్ళు.

పొగాకు సీజను వస్తే పాల వ్యాపారంలో సంపాదనకు తోడు, ఇదో సంపాదన.

పొగాకు కోతలు, ఆ తర్వాత బేర్నీలతో గ్రేడింగు పని.

పదం ఎత్తుకొంది కనకం. పట్నం పోయి తిరిగి వస్తున్న కామందుల ఎద్దుల బండి 'గలగల'ల శబ్దం, పాటలు లయ వేస్తున్నట్లుంది.

ఊరి పొలిమేరల్లో మునసబుగారు కొత్తగా కట్టిస్తున్న బేర్నల దగ్గరికొచ్చారంతా. ఊళ్ళో కొచ్చిన ధ్యాసే లేదు ఎవరికీ కనకం తియ్యాటి గొంతు నుంచి వచ్చే పదాల్లో భావ స్ఫూర్తి, ఉత్సాహం ఉరకలేస్తూ హుషారునిస్తోందందరికీ.

'ఏమే నాయకురాలా వూరొ- ంది.'

మునసబు కొడుకు నవ్వుతూ, తాగే కళ్ళతో చూస్తున్నాడు తన [illegible]. మెచ్చుకోలుగా, మురిపెంతో చూస్తున్నాడు అతని పక్కనున్న కోటేశు! ఆ చూపుల్లో ఏదో ఏదో వింత కాంతి! తన మనసును అతనికిచ్చేసి ఇంటికెళ్ళింది కనకం ఆరోజు.

ఆ తర్వాత చాలా రోజులు గడిచాయి. కాని తన మనసును విప్పి అతనికెలా చెప్పాలో తోచలేదు కనకానికి. మాట్లాడిస్తే మాట్లాడుతాడు. అయితే తనే అతని ఎదుట మాట్లాడలేదు. భయం కాదు! ఏదో ఏదో! ఎవరి ముందూ తలవంచని ఆమె తల అతని ఎదుట కిందికి చూస్తుంది. అందరినీ ఆట పట్టించే, భయపెట్టే కళ్ళు అతన్ని చూడగానే అరమోడ్పులు పడతాయి!

మనసు విప్పి చెప్పుకోటానికి తన వాళ్ళంటూ కనకానికున్న దొక్క తల్లే

ఆమె ముదుసలి. మంచంలో నుంచి లేవలేదు. స్నేహితురాళ్ళతో చెప్పుకొందామంటే అందరి కళ్ళూ అతని మీదే ఉన్నాయ్!

పోనీ ముసలి తల్లినే ఎలాగోలాగు కోటేశు తల్లిదండ్రుల దగ్గరకు పంపిద్దామంటే భయం వాళ్లు కాదంటే? కులం వొకటైనా అంతస్థుల్లో ఆ వంశానికీ యీ వంశానికీ చాలా వ్యత్యాసం ఉంది మరి!

కనకానికి బంగారక్క వొక్కతే తన కోరిక తీర్చగల వ్యక్తిగా కన్పించింది.

కోటేశు బంగారక్క కూతురు కొడుకు. ఆ శాంతం, ఆ మంచితనం, అన్నీ బంగారక్క గుణాలే.

గుణసామ్యమే కోటేశును బంగారక్కకు దగ్గర చేసింది? లేకపోతే బంగారక్కకు ఎందరు మనుమలు లేరు గనుక.

ఆమె చెప్పింది వేదవాక్కే కోటేశుకు.

అయితే ఆమె తనని చేసుకోమని చెప్తుతుందా?

అసలే తమ యిద్దరికీ వ్యాపార విషయాల్లో చుక్కెదురు. మరి తన మనుమడిని, పాలల్లో నీళ్లు కలిపే తనను చేసుకోటానికి సమ్మతిస్తుందా?

అసలు కోటేశుకు తనపై మనసుందా? అది తెల్సుకొనే అవకాశం త్వరలోనే కలిగింది కనకానికి.

ఆ రోజు తన యింటి ముందు నుంచే వెళ్తున్నాడు.

'మావా' అని తనే పిల్చి పల్కరించింది కనకం సంధ్య వేళ.

అతను తల యెత్తి ఆమె వైపు చూచాడు. ఆ తర్వాత చుట్టుప్రక్కల చూచాడు. ఎవరూ వున్న జాడ లేదు. తనూ, కనకం ఒంటరిగా. అతనికేదో భయం వేసింధి. హృదయం వేగంగా కొట్టుకోసాగింది.

ఆ రోజు ఆ క్షణంలో అతనికి తెల్సింది. తనకు కనకం అంటే యిష్టం అనీ.

'ఏమిటి కనకం?' అతను వారింటి అరుగు దగ్గరికెళ్ళేడు.

'కూర్చో మామా-' అంది అరుగు చూపించి. కోటేశు కూర్చున్నాడు.

ఒక్క నిముషం మౌనంగా గడిచింది. సూర్యుడు బాగా అస్తమించాడు. చుక్కలు ఆకాశంలో మెరుస్తున్నాడు. చంద్రుడు ఆకాశం వెనుకే దాక్కొని తొంగి తొంగి చూస్తున్నాడు.

కనకం ధైర్యం తెచ్చుకొంది, తల కొద్దిగా పైకెత్తి వోరగా అతని వైపు చూస్తూ అంది. 'నేనో మాట అడిగితే కోప్పడవు కదా?'

ఆమె అడగాలనుకుంటున్నదేమిటో, ఆమె స్థితి చూస్తూనే అర్థమయింది కోటేశుకు. అర్థం కాగానే వొళ్లు పులకరించింది.

తనూ, కనకం... వొకటై కల్సి జీవించటం! తీయగా వుందా భావన.

అయితే వెంటనే నిజ స్థితులు గుర్తుకొచ్చాయి. తమ వివాహానికి తల్లితండ్రులు అంగీకరిస్తారా? వాళ్ళకు కట్నాలు కానుకలు కావాలి. అంతస్థులు చూస్తారు. అన్నిటికన్నా ముఖ్యమైనది- అవ్వ యీ పెళ్ళికి అంగీకరిస్తుందా?

మౌనం అంగీకారంగా తీసికొని కనకం అంది తల వంచుకొని. ''నేను... నేను...

సిగ్గుతో మెలికలు తిరుగుతున్న కనకంలో కొత్త రూపును చూచి మురిసిపోయాడు!

మొగరాయడిలా నిర్భయంగా తిరిగే కనకంలో యింత స్త్రీ సహజమైన సిగ్గు ఉందా?

అందంలో కనకం తనకు వుజ్జీ. శరీర సౌష్ఠవంలో తనతో సరితూగుతుంది. ఆమెను పెళ్ళి చేసుకోటం ఎంత అదృష్టం?

'నువ్వు... నువ్వు... పెళ్లెప్పుడు చేసుకొంటావు మామా?'

అడగదల్చుకొంది 'నేనంటే నీకిష్టమేనా మామా' అని. అడిగింది వేరొకటి. తీరా అడిగాక నాలిక్కరుచుకొంది కనకం. అలా కొరుక్కోవటం గ్రహించాడు కోటేశు.

'తొరలోనే సేసుకుందామనుకొంటున్నానే కనకం. తగిన పిల్ల కనిపించలేదు.'

కనకం మనసు ముడతపడబోయింది.

'నీలాంటి పిల్ల కనిపిస్తే తొరగా సేసుకుందామనే వుంది' ధైర్యంగా అనేశాడు కోటేశు.

ముడతలు పడబోతున్న మనసులో మొగ్గలు విచ్చాయి.

'అబ్బో! ఏమోననుకొన్నా. ఈడూ మొనగాడేనే? సరసమాడుతున్నాడు!' అనుకొని మురిసిపోయింది.

'నాలాంటి పిల్లెందుకు? నేనే వున్నాగా? సేసుకో' అందామనుకొంది. కానీ అడగలేకపోయింది.

'సెప్పకపోయినా నీ మనసు నాకర్థమయిందిలేయే కనకం. మా బంగారవ్వ వొప్పుకొంటే మా అయ్యా, అమ్మా కాదన్నా నిన్నే సేసుకొంటా, సరేనా కనకం?'

కనకం మనసు గులాబి పువ్వులా పరిమళించింది. మల్లె మొగ్గలా వికసించింది.

'అమ్మో- అసాధ్యుడేనే కోటేశు? కాకపోతే మనసులో మాట ఇట్టే సెప్పెయ్యగలడా! సినిమాల్లోలాగా?' అనుకొంది.

కనకం కళ్ళల్లోకి చూచి నవ్వి వెళ్ళిపోయాడు కోటేశు. ఆమె యవ్వనం ఝుళ్లుమంది!

కనకం తలపులతో వుండగానే, పట్నం దగ్గరికొచ్చింది. ఆగి వెనక్కి చూచింది కనకం.

దూరంగా బంగారక్క మెల్లగా బరువుగా నడిచివస్తోంది.

ఇదే సమయం. మనసులోని మాట చెప్పి వప్పించడానికిదే సమయం. కనకం మనసు తొందరపెట్టింది.

'మీరు పోండే! నేను తర్వాత వస్తాను.' అంటూ తట్ట కిందికి దించి కూర్చుంది కనకం. మరో మాట అడగలేకపోయారు అవతలివాళ్లు.

మారు మాట్లాడకుండా వెళ్తూ అనుకొన్నారు వాళ్లు - కనకం అదో విధంగా వుందివాళ అని!

★ ★ ★

కనకం చాలా మారిందనుకొన్నారంతా. మనిషిలో మునపటి చలాకీతనం లేదు. ఉత్సాహం లేదు. ఎప్పుడూ ఏదో ఆలోచన.

కారణం తలకొక విధంగా అనుకొన్నారు.

పల్లెటూరు ఆసాముల్లో ఎవడో దాని మదం అణచాడని - పట్నంలో కుర్రాళ్లు.

పట్నంలో ఎవరో ఏదో చేశారని పల్లెలో యువకులు.

మనసిచ్చిన మగోడు కాదన్నాడని కొందరు పడుచులు - కాదు నమ్మించి మోసం చేశాడని మరికొందరు యువతులు.

రోజురోజుకీ తమకు పోసే పాలల్లో నీళ్ల శాతం తరుగుతుండటం గమనించి అసాములు, కనకం తన తప్పుని గ్రహించి మంచి మార్గానికొస్తున్నదనుకొన్నారు. శానిటరీ ఇన్‌స్పెక్టర్ పట్టుకుని శిక్షించటం వల్లనే కనకం ఇలాపాలే పోస్తున్నదని మరికొందరు.

అయితే ఇదమిద్ధంగా నిజం యెవరికీ తెలియదు.

నిజం తెల్సిన వ్యక్తులిద్దరే.

'అవ్వ పరీక్షలో నెగ్గుతోంది' అనుకున్నాడు కోటేశు.

'కనకం మనిసవుతున్నది' సంతోషించింది బంగారక్క.

కనకం మాత్రం ఎవరేమనుకొన్నా పట్టించుకోటం లేదు! ఆమె ఆలోచనల్లా బంగారవ్వ చెప్పిన విషయం మీదే!

ఆనాడు-

బంగారక్క వచ్చింది. రాగానే తన కోరిక చెప్దామనుకొన్న కనకం, తీరా ఆమె వచ్చాక ఎలా చెప్పాలో తోచలేదు. 'బంగారవ్వా మరేం మరి' అంటూ నసగసాగింది.

కనకం బాధను పసిగట్టిన బంగారక్క నిండుగ నవ్వింది.

'ఆడంతా సెప్పేడులేయే పిల్లా బంగారం లాంటి పిల్లవి, నిప్పు లాంటి గుణం కల పిల్లవి. నువ్వు ఆడికి మనసిత్తే నేను కాదంటానుటే. ఆడసలే నోరు లేనోడు. నీలాంటి పెళ్ళాం ఉంటేనే కాని బతకలేడీ రోజుల్లో. అసల్నీలాంటి ముత్తెం ఆడికి మటుకేడ దొరుకుతుందని-'

కనకం ఆనందానికి అవధుల్లేవు. బంగారక్కకు ఎన్ని దణ్ణాలు పెట్టుకొందో మనసులో!

అయితే ఇదంతా యెంత సేపు?

పెళ్ళికి బంగారక్క కోరిన కట్నం వినేసరికి కళ్ళు తిరిగాయి కనకానికి!

''డబ్బు శాశ్వోతం కాదే పిల్లా. కట్టం డబ్బులెన్నిచ్చినా నాలుగు నాళ్ళలో అయిపోతాయి. మనిసిక్కావలసింది మంచి మనసు, మంచి బుద్ధి, దైవభక్తి, పాపభీతి. అన్నీ ఉన్నాయి కాని, పాప భీతి లేదే నీకు. పాలల్లో నీళ్ళు కలపటం పాపమని నీకు తెలుసు. తెలిసీ యాపార లచ్చనం అని సరిపెట్టుకొంటున్నావ్. కానీ పిల్లా యాపారం మనుసుల్ని సంపటానిక్కాదే. బతికించటానికి కల్తీ సరుకు ఎంత మంది పేనం తీత్తున్నదో నీకు తెలీదు. నా మాట విని పాలల్లో నీ కలపటం యికనైనా మానెయ్యి. నెయ్యిలో యేపనూనె కలపకు, పెరుగును క సేయొద్దు. ఆడిని పెళ్ళి సేసుకోవటానికి నీవియ్యాల్సిన కట్టం యిదే.''

ఇట్లాంటి మాటలు బంగారక్క ఎన్నిసార్లు చెప్పిందో? అయితే యివాళ ఆమె మాటల్లో ఏదో సత్యం.. ఏదో కాంతి...!

నిజమే. పాలల్లో నీళ్లు కలపటం పాపమని తనకీ తెల్సు. అయినా అంతా చేస్తున్నారు కనుక తప్పు లేదనుకొంది. అయితే అందరూ చేసినంత మాత్రాన పాపం పాపం కాకుండా పోతుందా? అందరూ అలాగే అనుకొంటే పాపం అపరిమితంగా పెరిగిపోవచ్చు. ఒక నాటికది అలవాటుగా మారినా ఆశ్చర్యం లేదు!

కాకపోతే ఆయనెవరో ఆఫీసరు- అందుకోసం వున్నాయన పాపం చేసే వాళ్ళను పట్టుకోడేం? అందుకేగా ఆయనకి డబ్బివ్వటం? అయినా పట్టుకోడు. ఎందుకు? తాము అంతా కల్సి నెలకింత మామూలని యిస్తారు. పాలల్లో నీళ్ళు

కలపటం తమకెలా అలవాటో, మామూలు తీసికొని వూరుకోటం అతని అలవాటు!

పాపం యిలా పెరగబట్టే - ఆకాశానికంటే ధరలు - దారిద్ర్యం!

ఇది వొక వైపు ఆలోచన.

మరో వైపు - వ్యాపారం, జీవనమార్గం, బాధ్యతలు, సమస్యలు.

తండ్రి లేడు. సంపాదించి పెట్టి పోయిన ఆస్తి లేదు. తల్లికి అనారోగ్యం... మంచం. ఇద్దరు తమ్ముళ్ళు- ఇంటికి పెద్ద పిల్లగా, వారిని పెంచి పెద్ద చేసి జీవనోపాధి చూపటం తన ధర్మం - బాధ్యత.

ఉన్నవి రెండే బర్రెలు పూటకు ఆరు శేర్ల కంటే ఎక్కువ పాలివ్వవు. ఆ పాలతోనే తమ జీవనం, వాటి జీవనం, పాలు పాలుగానే పోస్తే బర్రెల మేతకే సరిపోదు సంపాదన. యింక తినేదేమిటి? తమ్ముళ్ళను చదివించి ప్రయోజకుల్ని చేసేదేమిటి?

కోటేశు తనవాడు కావాలంటే పాపాన్ని వదిలెయా లి. తన బాధ్యతలు, ధర్మం నెరవేర్చాలంటే పాపాన్ని కొ సాగించాలి. రెంటిలో ది వదలటం? దేన్ని వదిలించటం? ఆనాడు మొదలైన ఆలోచ సమస్య సాగుతూనే ఉంది. రోజులు తిరిగి తిరిగి తరిగిపోతూనే వున్నాయి?

★ ★ ★

కనకం పోసే పాలల్లో నీళ్లు బాగా తగ్గిపోయాయి. వాడికలు త ంచుకొంది పాలకు సరిపడినన్ని కాతాలే.

వెనకటిలా డబ్బును నీళ్ళలా ఖర్చు చేయటానికి లేదు. ఇంటి ఖర్చు తగ్గించింది. ప్రతి పైసా చూచి వాడసాగింది.

తన గ్రూపు వాళ్లంతా వెలివేసినట్లు చూడసాగేరు. నాయకత్వమే కాదు. ఆ గ్రూపులో సభ్యత్వం కూడా పోయినట్లే.

జీవితంలో ఒంటరితనాన్ని పోగొట్టుకోవాలన్న ప్రయత్నంలో సంఘంలో వొంటరిదయింది. అయినా బాధపడలేదు కనకం. కాగా సంతోషించింది.

ఎన్నడూ లేని తృప్తి! తాను పోసే పాలు తాగి అంతా సంతోషిస్తున్నారు. ఆరోగ్యంగా ఉంటున్నారన్న తృప్తి, తనూ నీతిగా పాపానికి దూరంగా జీవిస్తున్నామన్న తృప్తి అన్ని బాధలను మరిపిస్తోంది. ఆ తృప్తే తోడు నీడైనిచ్చింది కనకానికి.

ఇప్పుడు తాను పాలల్లో నీళ్ళు కలపాలనుకొన్నా కలపలేదు. మరి బంగారక్క కోరిన కట్నం యిచ్చేసినట్లేగా?

బంగారక్క కోసం నాలుగు రోజులు కాయలు కాసేలా చూచింది. అయిదో రోజు బయల్దేరుతుండగా, అక్కడి నుంచే కబురు.

ఎనభైయేళ్ళ జీవితంతో పండిపోయిన బంగారక్క మంచంలో పడుకొని వుంది కళ్ళు మూసుకొని.

అయిదు రోజులుగా జ్వరంట.

'బంగారవ్వా' పిలిచింది కనకం.

బంగారక్క కళ్ళు కనకాన్ని చూచి మిలమిల మెరిసాయి.

'నువ్వు మనిసివయ్యావు కనకం. నిజమైన మనిసివయ్యావు. నా పరీచ్ఛగా నెగ్గేవు. నీ తమ్ముళ్ళ బాగోగులు కోటేశే సూత్తాడు. మీ యిద్దరూ సుఖపడండి.'

బంగారక్క చివరి కోరిక ఇది!

ఇన్నేళ్ళ తన జీవితంలో, పాపమార్గంలో ప్రయాణిస్తున్న వొక్క వ్యక్తినైనా మనిషిని చేశానన్న తృప్తి మూతలు పడుతున్న బంగారక్క కళ్ళల్లో స్పష్టంగా కనిపించింది. భవిష్యత్తు మీద ఆమె చివరి నిశ్వాసంతో వినిపించింది.

కనకం కోరిక నెరవేరింది.

కోటేశు సాహచర్యం లభించింది జీవితంలో.

అయితే వ్యాపారంలో వొంటరిదయింధి.

బంగారక్క వదలివెళ్ళిన గ్రూపుకు నాయకురాలయింది.

ఉ రం వైపు నుంచి తట్ట నెత్తిన పెట్టుకొని వొంటరిగా, ప్రశాంతంగా నడిచివచ్చే కనకం, ఇప్పుడు బంగారక్కకు ప్రతినిధి, ప్రతిబింబం! వర్తమానానికి వెలుగు ఆమె!

***

# భాగీరథి

రచన :

పైడిపాటి సుబ్బరామశాస్త్రి

బాగీరథి చక్కని చుక్క. కాని, పేద యింటిపిల్ల. తండ్రి చిన్నతనంలోనే స్వర్గస్థుడయ్యాడు. తల్లి శాంతమ్మగారి పెంపకంలో పెరిగి స్కూలుఫైనల్ ప్యాసయింది. అన్న, రామారావు కూడా స్కూలుఫైనలు ప్యాసయి, తానే కుటుంబభారం వహింపవలసి ఉండటంచేత, మునిసిపల్ ఆఫీసులో ఉద్యోగానికి చేరాడు. తాను చేసే గుమా గిరీలో ఎక్కువజీతం రాకపోయినా, భాగీరథి ఒక్కతే చెల్లెలవడంచేత, సొంతచోటూ, ఒక రెండు నిట్టాళ్ళ పాకా, తండ్రి యిచ్చిపోవడంచేతా, విజయవాడ లాంటిచోట అద్దె క్కు భరింపవలసిన అవస ం ు పోవడంచేతా, రిమిత కుటుంబాన్ని లాగో సా కుంటూ వస్తున్నాడు. రామారావు లంచాలు ట్టడం తనకు తెలియనిప , టు లని పనీ కూడా. ఆఫీసు దూరమవడంచేత, నడచి వెళ్ళడానికి సాధ్యం కాకపోవడంచేత, సిటీబస్సులో సమయానికి ఖాళీలు లేకపోతే, ఆఫీసుకు వెళ్ళడం ఆలస్యం అవుతందనీ, ఆ బస్సుఖర్చు కూడా ఒకప్పుడు తన దగ్గర ఉండకపోవచ్చుననీ, ఎలాగోలా వాయిదాలుగా తీర్చుకునే పద్ధతిమీద, ఒక సైకిలు కొనుక్కొని, ఆ వాహనాన్ని తాను జాగ్రత్తగా చూచుకుంటూ కాలక్షేపం చేస్తున్నాడు. కొంపలకు నిప్పంటించే రోజుల్లో కూడా జాగ్రత్తగా ఇంటిల్లిపాదీ రోజూ పాకను దొడ్లో నూతి నీళ్ళతో తడుపుకుంటూ కాలక్షేపం చేసేవాడు. తల్లి 'నాయనా! పెళ్ళిచేసుకో. ఏదైనా కట్నంవస్తే, సిమెంటు రేకులతో ఇల్లు వేసుకోవచ్చు. నువ్వింట్లో ఉన్న

సమయం, లేని సమయమూ ఉంటుంది. ఈ కాస్త కొంపా పరశురామ ప్రీతి అయిపోతే, మనం మళ్ళీ కొంప వేసుకోలేం 'గుడ్డా గోచీకూడా కొనుక్కోలేం' అని చెప్పినపుడు కూడా, కట్నం తీసుకోవటం ఇష్టంలేని మనిషి కావడంచేత, లోకరీతిగా తల్లి చెప్పేది కాదనలేకా మాట్లాడకుండా ఊరుకునేవాడు.

ఒకరోజున తల్లి బాగా ఒత్తిడిచేసింది. అప్పుడు అమ్మా! నేను మగవాణ్ణయిపుట్టాను. నా పెళ్ళి ఎలాగూ అవుతుంది. కాని, చెల్లెలు పెళ్ళి ఎలాగమ్మా! మనం కట్నాలు పోయలేము, అసలు మగవాడయి పుట్టినందుకు వెయ్యి రూపాయలు, స్కూలుఫైనలు పాసైనందుకు రెండువేలు బి.ఏ, ప్యాసయినందుకైతే మరి రెండువేలు - ఈ అయిదు వేలు ఇస్తే పెళ్ళిఖర్చు దానిలో సగమయినా కావాలి. చుట్టాలందరూ రావాలికదా! మన 'భవంతి' అమ్మితే అంత వస్తుందంటావా! చెల్లెలి పెళ్ళి కాకుండా, నన్ను పెళ్ళిచేసుకొని కులకమంటావా అమ్మా! ముందర ఆడపిల్లను ఒక అయ్యచేతిలో పెట్టి, తర్వాత నా సంగతి ఆలోచించుకోవాలి ఎంత కట్నం పోసినా వాడికి రెక్కలే ఆధారంతప్ప వెనకాల సెంటుపొలం ఉండదు కీడెంచి మేలెంచాలి కదా అమ్మా!' తీరా వాడు 'ధామ్మం'టే ఆడదానికి ముష్టిచెంబేగతి' అని అన్నాడు. అంతవరకు శాంతంగా విని ఆలోచిస్తున్న శాంతమ్మకు చివరిమాటలు వినేటప్పటికి కోపం వచ్చి, 'ఏం మాటలురా, అశుభం మాటలు, నువ్వు పెళ్ళి చేయకపోయినా సరేకాని ఇలాంటి అఘాయిత్యపు మాటలు మాట్లాడకు!' అని గద్దించి అంది. ప్రక్కనుంచి వింటున్న భాగీరథి గుడ్లనీళ్ళు గుడ్లకుక్కుకుంది. 'అమ్మా! నేను చెల్లాయి సంగతి చెప్పలేదు. లోకంలో జరిగే విషయం చెప్పాను అంతే'' అన్నాడు రామారావు హీనస్వరంతో. అంతే - మళ్ళీ తల్లి రామారావుతో కొడుకు పెళ్ళి విషయంకాని కూతురుపెళ్ళి విషయం కాని ప్రస్తావించనేలేదు.

సూర్యుడుదయించడం మానడు అస్తమించడమూ మానడు. ంచాంగంలో తిథులూ వారాలూ గడచిపోతూనే ఉంటాయి. కాలం గ చిపోతోంది. శాంత ఒక చిన్న గొలుసు మినహా నగలన్నీ అమ్మివేసింది. ఆ సొమ్ముతో భాగీరథి బి.ఏ, ప్యాసయింది. చదువుకోసం ఖర్చుపెట్టిన

నగలసొమ్ముతో పెళ్ళి అవుతుందేమోనని ఆలోచించింది. మంచి సంబంధం రావాలంటే ఆ ద్రవ్యం చాలదని తెల్సుకుంది. దొడ్లో బాదంచెట్టు యిచ్చే విస్తళ్ళవల్లా ఆదివారం ఆదివారం తన చీరెలూ! అన్నయ్యబట్టలూ బట్టలసబ్బుతో భాగీరథి శుభ్రపరచడంచేతా, చాకలిఖర్చు తప్పడంవల్లా ఇలాంటి పొదుపు లక్షణాలవల్లా కుటుంబం సాగిపోతోంది.

అనేకులు రామారావుకు పిల్లనిస్తామని పెళ్ళిచూపులకు రావలసినదనీ, ఆఫీసుకు వచ్చి చెప్పేవారు తోడిగుమాస్తాలుకూడా 'నీ పెళ్ళివిందు మాకెప్పుడు చెప్తావ' ని రామారావు నడిగేవారు. తనదైన్యం వె డించడానికిష్టంలేక, రామారావు ఏవో మాటలు చెప్పి స్నేహితులను ప్పించుకునేవాడు. సంబంధం తెచ్చినవాళ్ళతో 'ప్రస్తుతానికి నేను చూడటానికి రాలేనండీ!' అని క్షమాపణకోరుకునేవాడు. అందరూ రామారావు ''చాలా విచిత్రమైన మనిషి'' అనీ, కొందరు ''ఏదయినా లోపం ఉన్నదేమో! లేకపోతే యిన్నాళ్ళు పెళ్ళికాకుండా ఎలా ఉంటుండ''నీ, అనుకునే స్థితి వచ్చింది. స్నేహితులు 'వివాహద్వేషి' అని వేళాకోళం చేసేవారు. కొందరు రామారావు ఇంటిదగ్గర లేనప్పుడు తల్లికి కూడా చెప్పి చూశారు. 'అడ్డాలనాడు బిడ్డలు కాని, గడ్డాలు వచ్చిన తర్వాత బిడ్డలా? వాడు పెద్దవాడయ్యాడు, వాడిదే యిష్టం' అని అనేసేది శాంతమ్మ.

ఒక రోజున ఒక దూరపు చుట్టం స్వగ్రామం అమలాపురం దగ్గరనుండి తిరుపతి వెడతూ వీరింట్లో దిగాడు. కూతురి మ్రొక్కు కావడంచేతా, కూతురునుకూడా వెంటబెట్టుకువచ్చాడు. శాంతమ్మ కాళ్ళు కడుక్కుందుకు నీళ్ళిచ్చి కుశల ప్రశ్నలు చేసి పన్నెండేళ్ళ తర్వాత చూడగలిగినందుకు సంతోషించింది. సాయంత్రం ఆ నుంచి రామారావు ఇంటికి వచ్చేసరికి చుట్టాలొచ్చారని వెంటనే ప్రక్క ఇంట్లో చేబదులు చేసి ఇంట్లోకి కావలసినవి పట్టుకొచ్చాడు. బయటకు వెళ్ళే ముందు 'అబ్బాయీ వీరు మీ నాన్నవైపు బంధువులు, ఎన్నాళ్ళకో మనయింటికి వచ్చారు' అని మాత్రమే తల్లి అన్నది. 'మీ అబ్బాయా!' అని వచ్చిన ఆయన అడిగాడు అంతే ప్రసంగం - అప్పటికి.

భోజనాలముందు చుట్టచికం తిరగవేసి 'నేను ఫలానా' అని రామారావుకు వచ్చినాయన చెప్పాడు. 'వారు బ్రతికి ఉండగా మీకూ మాకూ రాకపోకలుండేవి. వీళ్ళు చిన్నవాళ్ళు. ఆరోజులు వెళ్ళిపోయినై' అని కళ్ళనీళ్ళు అద్దుకున్నది శాంతమ్మ. తనకు ఒక్కర్తే కూతురనీ, తిరుపతికొండ ఎక్కించి తర్వాత వివాహం చేయాలని సంకల్పమనీ చెప్పాడు. 'ఎక్కడన్నా సంబంధాలు చూస్తున్నారా?' అన్నది శాంతమ్మ 'ఏం చూస్తామమ్మా! వచ్చి చూచివెళ్ళారు. కొందరికి చదువుకావాలి. కొందరికి సంగీతంకావాలి. ఇవేమీ, మా అమ్మాయిదగ్గర లేవు. పోనీ పుష్కలంగా కట్నం ఇచ్చేశక్తి ఉంటే బాగుండును. నాకు ఉన్నది ఒక్క ఎకరం దానిలో నేనూ, మా ఇంటిదీ జీవించాలి. నేనేదో కొంత వేదం చిన్నప్పుడు చెప్పుకున్నాను. ఎప్పుడయినా సభలలో పిలిస్తే ఏదయినా ద్రవ్యం వస్తే 'పైఖర్చు'కు మాకు సరిపోతుంది. ఆ ఎకరంలో పదిహేనుబస్తాలు కట్టుబడి వస్తుంది. అది తిండికి సరిపోతుంది. ఏదైనా బిల్లు వచ్చి రైతుపాలంలో నుంచి లేవనంటే - ఇంతే ఇస్తానంటే - నాకు వచ్చేవి నాలుగు బస్తాలే. ఈకాలంలో పెళ్ళిళ్ళు ఎలా చేయటం? నాకు ఒక్కర్తే కూతురుకదా! మా అనంతరం ఆపొలం ఇల్లూ మీకే వస్తాయి కూడా. ఎవరైనా పెళ్ళి చేసుకోండిరా! అంటే వాళ్ళు 'మీనమేషాలు' లెక్కపెడతారు. ఏమని అని అడగవేం? వీళ్ళెంతకాలం బ్రదుకుతారా! అని.' ఈ మాటలకు రామారావు పకపకమని నవ్వాడు. ఆయన ఇంకా యిలా అన్నాడు 'మన సంగతి మనం ఆలోచిస్తున్నాం, కాని మగపిల్లల కష్టాలుకూడా ఆలోచించాలికదా! పాపం వాళ్ళ తల్లిదండ్రులు కూడా నౌకరీ చేసి బ్రతకాలని డబ్బు ఏ అయ్యదగ్గరో పత్రాలు వ్రాసి 'చక్రవడ్డీ'కి తెచ్చినవాళ్ళేకదా? ఈ గుంటడు సంపాదనతో వాడి చొక్కాలకూ, వాడి పెళ్ళాం చీరకలూ, ఫేస్ పౌడర్‌లకూ, సినీమా ఖర్చులకూ, సిగరెట్ల ఖర్చులకే సరిపోతాయి కదా! వాళ్ళ కష్టసుఖాలు వాళ్ళవి. ఇంతకూ ఆర్షేయ పౌరుషేయాలను చూచి పిల్లను చేసుకొనేరోజులు పోయినై, 'కులం ఇంటికోతి' నయినా చేసుకోమని సామెత. మా అమ్మాయి కోతికాదుకదా!' మళ్ళీ రామారావు పక పకనవ్వాడు. ఇంతలో ఆయన కూతురు లక్ష్మి ఎదురుగా కనిపించింది. జాలిగా చూచింది నవ్వకుండా. ఆ పిల్ల నిజంగా అందకత్తె

అనుకున్నాడు రామారావు. రామారావు వైఖరిని గమనించింది శాంతమ్మ. 'శాంతమ్మా! ఇంతకూ మీ అబ్బాయి పెళ్ళి పప్పన్నం ఎప్పుడు పెట్టిస్తావు' అన్నారాయన; 'లిఖితం ఉంటే ఇద్దరి పెళ్ళి పప్పన్నం ఒక్కటే అవుతుంది' అన్నది శాంతమ్మ. 'అమ్మా! మా అమ్మాయిని నీ కడుపులో పెట్టుకుంటావా!' అన్నాడాయన దీనంగా, 'నాదేమున్నదండీ! భగవంతుడి దయ. వాడి మనసులో అసలు పెళ్ళి చేసుకోవాలని ఆ వెంకటేశ్వరస్వామి కలిగించాలి కదా! మీరు కొండకు వెడుతున్నారు కదా! దణ్ణం పెట్టుకురండి, అంతే నే చెప్పేది. ఈ పాపపు కళ్ళతో నా పిల్లలపెళ్ళి నే చూచేయోగం ఉండాలికదా!' అన్నది. ఎవ్వరూ ఏమీ మాట్లాడలేదు. భోజనాలయిపోయినాయి. రామారావు ఆయనకు తాంబూలం కూడా యిచ్చి మర్యాద చేశాడు. ఆయన 'శీఘ్రమే కళ్యాణప్రాప్తిరస్తు' అని ఆశీర్వదించాడు. చూస్తూ ఉన్న భాగీరథి చిరునవ్వుతో ఆయన కూతురు వంక చూచింది. ఆ అమ్మాయి సిగ్గుతో తల వాల్చింది. 'నాయనా! రామారావు! నాకు నా కూతురుపెళ్ళి చేసే శక్తి లేదు, పెళ్ళినాడు అల్లుడికాళ్ళు కడగడం ఆచారం ఉందికదా! అందుచేత నేను నీకాళ్ళు పుచ్చుకుంటాను. మా అమ్మాయిని నీ గృహిణిగా చేసుకో! అన్నాడాయన. 'ఈతాటాకుల గృహానికేనా?' అన్నాడు రామారావు 'నాయనా కులగోత్రాలు చూడాలి కాని, కేవలం ధనంచూచి ఏపనీ చేయకూడదు. లక్షాధికార్లు భిక్షాధికారులౌతున్నారు. పేదవాడు రాజౌతున్నాడు. ఎవరిజాతకం వాళ్ళది. మా అమ్మాయి మీయింట్లో యివాళ శ్రావణ శుక్రవారంనాడు కాలుపెట్టింది మా అమ్మాయిని చేసుకుంటే మీయింట్లో లక్ష్మి తాండవిస్తుంది అనుకో! దేనికయినా మాతృమంగళం ఉండాలి. మీ అమ్మ అభిప్రాయం తెలిసిందికదా!' అన్నాడాయన. ఆయనకూతురు లక్ష్మి గుండెలు దడదడ కొట్టుకుంటున్నై రామారావేమంటాడో అని. భాగీరథి అది గమనించింది. 'అన్నయ్యా! నేను నిన్ను ఎప్పుడు ఏమీ అడగలేదు. నువ్వు ఊం అంటే బ్రతికివున్న మేమిద్దరం, పైన ఉన్న నాన్నకూడా సంతోషిస్తాము.' రామారావుకు ఏదో భగవన్నిర్ణయం తోసుకొని వచ్చినట్లనిపించింది. శాంత లోపల నుంచి వచ్చి రామారావు ఎదురనిలబడింది. రామారావు నిట్టూర్చి తల ఊపాడు. 'మా వాడి పెళ్ళి కొండ

మీద చేయాలని ఉన్నదని మావారనేవారు' అన్నది శాంతమ్మ. ఆయన 'శుభస్య శీఘ్రం' అని భార్యకు తంతినించి పిలిపించి అందరితో తిరుపతికి బయలుదేరాడు స్వామి సన్నిధానంలో రామారావు ఒక యింటివాడయాడు తిరికి వచ్చేశారు. కొంతకాలానికి లక్ష్మికాపురానికి వచ్చేసింది.

'మొత్తం మీద 'తూర్పాయన' అదరగండ తనంచేసి మా అన్నయ్యను పెళ్ళి కొప్పించాడు' అంది భాగీరథి లక్ష్మితో నవ్వుతూ.

'తూర్పు ఆయన ఎవరమ్మా!' అంది లక్ష్మి.

'మీ నాన్నే'

'మీకు పడమర వాళ్ళకు, మీరు తూర్పు, మాకు విశాఖవారుతూర్పు, విశాఖవారికి శ్రీకాకుళం వారు తూర్పు' అన్నది లక్ష్మి.

'ఇంత చదువు నీకు వచ్చుకాబట్టే, మిమ్మల్ని తూర్పు వాళ్ళన్నాను.'

'నేనేం బి.ఎ ప్యాసయ్యానా? అసలు ను  చెప్పకపోతే మీ అన్నయ్య నన్ను చేసుకునేవారు కాదు. ఏదో పడమర పేచీవేసేవారు' అన్నది లక్ష్మి.

'అదికాదు వదినా! అదరగండతనం పడమర వాళ్ళదీ, పేచీ తూర్పువాళ్ళదీ.'

'అసలు తూర్పులేదని నేనంటూ ఉంటే'

'దిక్కులేదంటావు.'

'అసలు దిక్కులేకుండా ఎలాపోతుందీ! నాకు దిక్కు మీరయారు. వదినా! మీ అన్నయ్యతో చెప్పి ఇక నీ పెళ్ళి చేయించాలి.

'వదినవు ఎంతైనా చేయిస్తావు. చెప్పినట్లు వినేవాడు మా అన్నయ్య ఉంటే సరి.'

'పాపం! మీ అన్నయ్య ఉత్త అమాయకులు. నోటిలో వేలుపెడితే కొరకనుకూడా లేరు.'

'నాకేం తెలుసు పెట్టి చూశావ్ కాబోలు! అందుకనే నీకు తెలిసింది.'

'వదినా! మీ అన్నయ్య నాకు వచ్చినట్లుగ, నీకు కూడా మంచి సంబంధం

బాగుండును.'

'అసలు నాకు పెళ్ళే అక్కర్లేదు.

'నేను పెళ్ళి అయేదాకా ఇలాగే అనేదానిని '

భాగీరథి లక్ష్మి బుగ్గలు పుచ్చుకున్నది.

'సాగదీయి! సాగదీయి! ఏం చేస్తాం? ఆడబిడ్డ సగం మగడు-' అన్నది లక్ష్మి.

'అది కాదు - పగలు మగడు!' అన్నది చెవిలో భాగరథి.

'ఏమిటి హడావిడి' అని ప్రవేశించాడు రామారావు.

'చూడండీ, వదినె పెళ్ళి అక్కరలేదని, చేసుకోమన్నందులకు నా బుగ్గలు సాగదీస్తోంది' అన్నది లక్ష్మి.

'ఇంకా ఎంతకాలం సాగతీస్తుందిలే, దానింటికి అది వెళ్లే ఘడియ వచ్చింది' అన్నాడు రామారావు. లోపలనుంచి యీ మాట వింటున్న శాంతమ్మ వచ్చి, 'ఏం నాయనా! ఏదైనా సంబంధం అయ్యేటట్టుందా?' అన్నది.

'అవునమ్మా? 'నిరంజనరావు' అనే కుఱ్ఱవాడున్నాడు. బి.ఏ. ప్యాసయ్యాడు. అతనితో మాట్లాడి వస్తున్నా' అన్నాడు.

'నిరంజనరావా!' అన్నది భాగీరథి తనకు తెలియకుండానే ఆశ్చర్యంతో.

'మొగుడి పేరు చెప్పేసింది వదిన పెళ్ళికి ముందే' అని చప్పట్లు కొట్టింది లక్ష్మి.

'అమ్మా! పిల్లవాడికి తండ్రిలేడు, త లేదు ఆస్తిలేదు ఇల్లుకూడా లేదు. మనిషి మంచివాడు. అందమైనవాడు. మేనమామలు కొంతవరకు చదువు చెప్పించారు. కాలేజి చదువు 'స్కాలర్ షిప్'తో చదువుకున్నాడు. తన భార్యను తాను పోషించుకోగలడు. చెల్లిని కట్నం లేకుండా చేసుకుంటానన్నాడు.'

'వదిన అదృష్టవంతురాలు. అత్తమామలకు చాకిరీ చేయనక్కరలేదు. కట్నం లేకుండా సంబ ధం కుదురుతోంది' అన్నది లక్ష్మి. లక్ష్మి మాటలు నిజమే అయినా వాని వెనకాల ఉన్న మనస్తత్వం భాగీరథిని బాధించింది.

'ఏం, అలా కట్నం లేకుండా చేసుకోవడానికి ఎందుకొప్పుకున్నాడు పిల్లను కూడా చూడందే'? అన్నది శాంతమ్మ.

'ఇద్దరు ఒకటే క్లాసులో చదివారటమ్మా! అందుచేత పిల్లను చూడనక్కరలేదన్నాడు.'

'అమ్మాయి యిష్టమేమిటో! ఈడొచ్చిన పిల్లకదా! తెలుసుకోకుండా ఎలా?'

'మీ యిష్టమే నా యిష్టమమ్మా' అన్నది భాగీరథి.

వివాహం జరిగిపోయింది. పెళ్ళికొడుకూ పెళ్ళికూతురూ ఒకరికొకరు అందంలో, చదువులో తీసిపోరని అందరూ అనుకున్నారు. అక్కరచేయాలని అనుకుంటూ ఉండగా ఉద్యోగం ఎన్నికకు కలకత్తా రమ్మని అధికారుల దగ్గర నుంచి ఆదేశం వచ్చింది. తాను ఎప్పుడో పెట్టిన ఆర్జీకి యీ పిలుపు రావడం చూసి ముచ్చటపడి సామానులన్నీ సర్దుకున్నాడు నిరంజనరావు. అర్ధరాత్రి ప్రయాణమై వెడుతూ, అందరి వీడ్కోలు పుచ్చుకొని, భార్యవంక చూస్తూ వదలలేక కదలిపోయాడు. విజయవాడ స్టేషనుకు వెళ్ళిన తరువాత సరాసరి కలకత్తా టిక్కెట్టు తీసుకోకుండా చిన్నప్పుడు చదువు చెప్పించిన మేనమామల ఇంట్లో ఒక పూట గడిపి వెడదామనుకున్నాడు. కొవ్వూరికి టిక్కెట్టు తీసుకున్నాడు. నిద్రతో జోగుతూ రైల్లో కూర్చున్నాడు. కొవ్వూరు దాటిపోతోందన్నారు. ప్రక్కనెవ్వరో 'కొవ్వూరా కొవ్వూరా' అని అమాంతంగా తలుపుతెరచి నిద్రకళ్ళతో దూకాడు. ఆ బండి కొవ్వూరులో ఆగడం మానివేసిందని టిక్కెట్టిచ్చేవారూ చెప్పలేదు నిరంజనరావుకూ తెలియదు. వెంటనే కాళ్ళు ప్లాటుఫారం చక్రాల సందున పడి తెగిపోవడం, ప్రాణంపోవడం, ఒకే మాటు జరిగినై ఎవరగో గొలుసులాగారు, విసురుమీద అవతల పడ్డ సామానులో చిరునామానుబట్టి పోలీసులు రామారావుకు టెలిగ్రాము ఇచ్చారు. కగు-ండలకు వచ్చిన రామారావు మామగారు 'నదులపేర్లు పిల్లలకు పెట్టకూడదమ్మా! మను ధర్మశాస్త్రంలో చెప్పారు' అన్నాడు. భాగీరథి

లలో బాగీరథి పోటెత్తింది. శాంతమ్మ మంచమెక్కింది. క్షీణించిపోతోంది.

చివరిరోజున తనతాలూకు మిగిలి ఉన్న చిన్ని బంగారు గొలుసును తీసి 'ఇదిగో! భాగీరథీ! ఇది నీ పెళ్ళినాడు కూడా నీకివ్వాలనుకోలేదమ్మా. ఇపుడు నీకిస్తున్నాను. నీవు పుణ్యస్త్రీగా ఉండగా ఇవ్వకుండా ఇపుడివ్వడం ఇపుడు నీవు ధరిస్తావనికాదు - ఎప్పుడయినా నీకు డబ్బు అవసరం వస్తుంది. వస్తే, అమ్మ బ్రతికి ఉండి యిచ్చినదనుకోవడానికి పనికి వస్తుంది.' అన్నది. ప్రక్కనే ఉన్న రామారావు 'అమ్మా! చెల్లెలు సుఖమనేది ఎరుగదు. మళ్ళీపెళ్ళి చెయ్యమంటావా?' అన్నాడు. 'రామ! రామ! మళ్ళీ పెళ్ళి మనవంశంలో లేదు. దాని ఇష్టం. దానిగీత ఎలా ఉన్నదో!' అని కన్నుమూసింది. అందరూ గొల్లుమన్నారు.

భర్తపోయిన దుఃఖమూ, తల్లిపోయిన దుఃఖమూ దిగమ్రింగి భాగీరథి అన్నకు వదినకు పరిచర్యలు చేస్తోంది. తనకు చచ్చిపోవాలని ఉన్నా, బలవన్మరణం పాపం అని ఎవరో శా స్త్రులుగారు చెప్పారు. అలా చచ్చిపోయినవాళ్ళు దయ్యాలయి పైలోకాలకూ, క్రిందిలోకానికీ చెడతారని కూడా చెప్పారు. అందుకని ఆ ఉద్యమం విరమించుకుంది. ఇరుగమ్మలు, పొరుగమ్మలు 'నీపాల పడిందమ్మా నీ వదిన! నువ్వే సమర్థించుకోవాలి. ఇది ఒకనాటి సంగతా? జీవితం అంతా ఇక్కడ వెళ్ళాలిసిందే.' అని వచ్చిన అన్నప్పుడు వాళ్ళు చెప్పే మాటలు నిజమయినా, ఎంతో బరువు మోస్తున్నట్లు భావింపసాగింది లక్ష్మి. ఒక పొరుగమ్మ 'తల్లీ! ఆ నిరంజనం వల్ల నీ జీ తానికి రంజన మేమీ జరగలేదమ్మా!' అని ఓదారుస్తూ, తన పాండిత్యా వెల్లడించింది బాగీరథిని. ఇంకొక పొరుగమ్మ వచ్చి లక్ష్మితో 'అమ్మాయీ! నీకోసమే చెబుతున్నాను. 'బి.ఎ' దాకా చదివిందికదా మీ వదిన - మీ ఇంట్లో కుచ్చీకాయలల్లే నలుగురుకూడా లేరు. మూడుసోలలబియ్యం ఉడకేసి 'ఖరా'గా కూర్చోకపోతే, ఏదయినా ఉద్యోగం చేస్తే చన్నీళ్ళకు వేన్నీళ్ళగా ఉం దిగా ఆ స పాదన. ఈ కాలంలో ఆడవాళ్ళూ ఉద్యోగం చేయటంలా - మొగుడు బ్రతికి ఉన్నవాళ్ళు కూడా!' అని మరీపోయింది. ఈ సలహా లక్ష్మి మనస్సులో కొంత పనిచేసిం . 'ఇలా ఫలా మ్మ అని వెళ్ళిందండీ?' అని రామారావుతో కాంతంలో అన్నది.' ఇక ఆడదాని సంపాదనే తినాలి! అది ఒక్కటే తక్కువ' అని నిట్టూర్చాడు రామారావు. 'ఇది మరీ బాగా ఉంది? నేను

ఉద్యోగం చెయ్యమని చెప్పానా ఏమిటి? ఆవిడ చెప్పిందని చెప్పాను. సొమ్ముపోసీ చదువు చెప్పించారు కాబట్టి ఆ చదువుకు రాణింపుకలుగుతుందనీ, ఎప్పుడూ మొగుడు ఫోటో చూస్తూ కూర్చుంటే బెంగ ఎక్కువౌతుంది. కనుక, మనసుకు కాస్త 'వ్యాపకం' ఉంటే బాగుంటుందని, మీరు అనుకుంటేనే చెప్పండి' అని మెల్లగా తప్పుకుంది. ఎంతవద్దనుకున్నా చిన్న ఇల్లు కాబట్టీ, అట్టే ప్రొద్దుపోలేదు కాబట్టి ఆ మాటలు భాగీరథి చెవుల పడ్డాయి మనస్సు దిమ్మెక్కి ఆదిమ్మలోనే, ఆరాత్రి ఏడ్చి ఏడ్చి నిద్రపోయింది భాగీరథి. తెల్లవారిలేచి పని అంతా అయిన తర్వాత ఆలోచించింది. వదిన మాటల్లో న్యాయం ఉన్నట్లు కన్పిస్తోంది. తన జీవితం ఎన్నాళ్ళకు తెల్లవారను! తాను వారికి బరువుగా ఎందుకు అనిపించాలి? పోనీ ఉద్యోగం చేద్దామని అనుకుంది. 'అన్నయ్యా!' అన్నది 'ఏమమ్మా!' అన్నాడు రామారావు. 'పోనీ నేనుకూడా ఉద్యోగం చేస్తే ఎలా ఉంటుంది' అన్నది భాగీరథి 'నువ్వా!' అన్నాడు రామారావు. 'నేనే అన్నయ్యా! ఒక్కడవూ ఈ సంసారం ఎలా ఈదుతావు? రేపు పిల్లలు కలిగిన తర్వాత నీ సంపాదన చాలదు. ఇప్పుడే మేలుకుని, నేనుకూడా ఉద్యోగం చేస్తే తర్వాత ఇబ్బంది పడవలసిన అవసరం ఉండదు' అన్నది.

'ఆడది ఉద్యోగం చేయటంలో చిక్కులున్నవమ్మా!'

'ఎప్పుడు చిక్కులు కల్గితే అప్పుడే మానివేస్తానన్నయ్యా! అయినా నన్ను భగవంతుడు ఇప్పుడు మగవాడిని చేశాడన్నయ్యా' అన్నది భాగీరథి. ఆ ప్రసంగం అంతటితో ఆగిపోయింది. మళ్ళీ మరురోజు 'ఎక్కడయినా ఖాళీలు ఉన్నాయా అన్నయ్యా!' అని అడిగింది. 'ఎలాంటి ఉద్యోగం చూడమంటావ్' అన్నాడు రామారావు. 'గుమాస్తా ఉద్యోగాలు మరీరోత! ఉపాధ్యాయిని అయితే కొంత ఫరవాలేదనుకుంటాను' అన్నది. రామారావు ఒక హైస్కూలులో ఖాళీ సంగతి చెప్పాడు. అర్జీ పెట్టటం, వెంటనే ఉద్యోగం రావడం చేరడం కూడా కాలంలోనే జరిగిపోయింది. ఉద్యోగంలో చేరినా, మామూలుగా తానే కా లు వంటాచేసి, సరిగా టైముకు స్కూలుకు వెళ్ళేది. టీచర్లలో ఆడమాస్టర్లు న మాస్టర్లు కూడా ఉన్నారు. కాని, టీచర్సు రూము అందరికీ ఒక్కటే. చేరిన డు రోజులలోనే విద్యార్థులామె పాఠాన్ని 'మోతగా' ఉన్నదని ప్రశంసించారు.

ఒక రోజున టీచర్సు రూమునుంచి క్లాసులోకి వెడుతుంటే వెనుకనుండి ఇద్దరు విద్యార్థినులు వచ్చారు. 'మాష్టారూ! మిమ్మల్ని ఒక మాస్టరు 'ఎంగ్ విడో' అని అంటుంటే మరొక ఆయన 'బాల విధవ' అంటున్నాడడండి' అని ఒక విద్యార్థిని చెప్పింది. భాగీరథికి ఏడవాలో నవ్వాలో తెలియలేదు. 'ఎంగ్ విడో అని ఇంగ్లీషులో అంటే తెలియదేమోనని ప్రక్కనున్న మాస్టరుకు బాలవిధవ అని చెప్పి ఉంటారు' అని ఊరుకున్నది. 'విధవ అంటే తిట్టుకాదా అండి టీచరుగారూ!' అని అడిగింది ఆ అమ్మాయి. 'తిట్టేమున్నది భర్తపోయిన స్త్రీ అని అర్థం' అన్నది భాగీరథి 'మగపిల్లలను కూడా విధవ అని తిడతారు కాదాండీ' అని అడిగింది ఆ అమ్మాయి. 'అపుడు అది తిట్టే, పనికిమాలినవాడా అని అర్థం' అన్నది భాగీరథి హూందాగా, 'పీరియడ్ గంట కొట్టిన తర్వాత హెడ్ మాస్టరుగారు ఒకసారి మిమ్మల్ని రమ్మంటున్నారండీ' అని జవాను వచ్చి చెప్పాడు. ఆమె వెళ్ళింది. హెడ్‌మాస్టరు 'మీ పాఠాలు చాలా బాగున్నాయని పిల్లలనుకుంటున్నారండి' అని చెప్పాడు. ప్యూనుకు ఏదో పని చెప్పి పంపించి వేశాడు. 'మీకు అభ్యంతరం లేకపోతే ఒక విషయం చెప్పాలనుకుంటున్నాను' అన్నాడు. 'చెప్పండి!' అన్నది భాగీరథి నిలబడే 'కూర్చోండి ఆ కుర్చీలో' అన్నాడు హెడ్‌మాస్టరు. 'చెప్పండి!' అని మళ్ళీ అన్నది భాగీరథి. 'ఏమీ లేదు. మీ కులమే - సోములుగారు. మీకూ, నిరంజనరావుగారికీ క్లాసుమేటటకూడాను. తమకు అభ్యంతరం లేకపోతే వివాహమాడాలనుకుంటున్నారు. ఆయన కింతవరకు వివాహము కాలేదు.

'షటప్' అని పుస్తకాలు బల్లమీద కొట్టి గిరుక్కున వెనక్కు తిరిగింది భాగీరథి. వెంటనే ఒ ఆడపిల్ల వచ్చి 'టీచరుగారూ! మీరు నోరు ముయ్యమన్నది 'హెడ్‌మాస్టరుగారినేనా అండీ!' అన్నది. 'నువ్వెపుడు విన్నా 'నేను కిటికీ ప్రక్కనే ఉన్నానండి' అన్నది ఆ విద్యార్థిని. 'అయననే అన్నాను. రేపటినుంచి నేను మీకు టీచరునుకాను' అని రుసరుసలాడుతూ ఇంటి వెళ్ళిపోయింది. కాని ఈ విషయం చెప్పలేదు మరుసటి రోజు స్కూలుకు వెళ్ళలేదని తెలిసి 'ఏమమ్మా సెలవు పెట్టావా? అని అడిగాడు అన్న. 'సెలవెందుకు? నేను మానివేశానన్నయ్యా! మనస్సు సరిగ్గాలేదు' అన్నది ఆ పైన

రామారావు ప్రశ్నించలేదు. లక్ష్మికి మాత్రం వదిన ఉద్యోగం మానినందుకు కసకసగా ఉన్నది - ఇరుగమ్మ చెప్పినట్లుగ తన పుట్టబోయే పిల్లలకు కలిగే లబ్ధి పోయి వదిన తనమెడకు శాశ్వతంగా 'గుదిబండ' అవుతుంది అని.

సోములు తన ప్రయత్నం మానలేదు సరాసరి రామారావునే ఆఫీసులో కలిసి తన వివాహవాంఛను వెల్లడించాడు. తల్లి విధవా వివాహం మన వంశంలో లేదని అన్నా. దాని యిష్టం అనికూడా అనడం, కొంత చెల్లెలిపై జాలి - తన భార్య దృష్టి ప్రకారం తనకుటుంబానికి బరువు - ఇవన్నీ కలిసినై, హెడ్మాస్టరు సోములుతో తనను 'షటప్' అని భాగీరథి తీవ్రంగా అన్న విషయం చెప్పుకోలేదు. తనకు మర్యాద కాదని సౌమ్యంగానే చెప్పాడు - ఆమెకు ఇష్టం ఉన్నట్లు తనకు అనిపించడంలేదని అందుచేత సోములు అన్నతో తేల్చుకోవడం మంచిదనుకున్నాడు. రామారావూ, సోములూ కలసి సాయంత్రం ఇంటికొచ్చారు. సోములు వాకిట్లో కూర్చోవటం భాగీరథి చూచింది. రామారావు 'పిల్లిలా' లోపలకు వచ్చి 'చెల్లీ!' సోములట! నీ క్లాసుమేటట! నువ్వు చేసినచోటే ఉద్యోగం చేస్తున్నాట్ట. తనంత తానేవచ్చి నిన్ను వివాహం చేసుకుంటానంటున్నాడు' అని నెమ్మదిగా నగిగాడు. 'అడ్డమైన వెధవల్ని ఇంటికి తీసుకురాకు అన్నయ్యా! వాడికి బుద్ధిలేకపోతే నీకు బుద్ధి లేదా' అన్నది తీవ్రంగా, ఈ మాటలు వాకిట్లో సోములు విని అదిరిపోయి ఒక్క అంగ వీధిలోకి పెట్టి పరారీ అయ్యాడు. రామారావు నిశ్చేష్టుడయ్యాడు. లక్ష్మి జోక్యం కలిగించుకొని 'ఎవరికీ బుద్ధిలేనిది? నా మొగుడు సంపాదన తింటూ ఆడ, మొగ అని హద్దులేకుండా మగవాడిని ఎంత మాటపడితే అంత మాట అంటావా? తేరగా పీటలు విరిగేట్టుగా తిని, కూర్చోటానికి నీ అబ్బ సంపాదించిన ఎస్టేటు ఇక్కడేమీ లేదు రెక్కలు ముక్కలు చేసుకొని నా మొగుడు సంపాదిస్తుంటే తింటున్నావు. వారేమన్నారు? పెళ్ళిచేసుకోమన్నారు. ఇదేం చేదా? లోకంలో ఎంతమంది చేసుకోవడం లేదు. నేనంటున్నాను నిన్ను పెళ్ళిచేసుకోమని పండంటి ఉద్యోగం మానుకొని, 'ఎవరికోసం పెడతారు వీళ్ళని బైఠాయించుకు కూర్చున్నావు' అంది మెటికలు విరిచిపోస్తూ, ఈ మాటలకు భాగీరథి నిశ్చేష్టురాలైంది. రామారావు లోపల బాధపడ్డా మెదలకుండా ఊరుకున్నాడు. తమాయించుకుని భాగీరథి

'వదినా! నా అబ్బ ఎస్టేటులీయలేదు? మీ నాన్న ఎస్టేటులీయలేదు. నీకు నాకూ తేడా ఏమిటంటే నీకు నెత్తిపై గొడుగు ఉన్నది. నీ అదృష్టంకొద్దీ. నేను దానికి సంతోషిస్తున్నాను. నేను పూర్వజన్మంలో ఎవరికో ఎడబాటు చేసిన కారణంచేత నాకు గొడుగు పోయింది, అన్నయ్యా! నా ఉద్యోగం మానుకోవడానికి కారణం యీ సోములే. హెడ్‌మాస్టర్ ద్వారా రాయబారం చేశాడు. నేను ఆ హెడ్‌ను నోరుమూయమన్నాను. మళ్ళీ నీ కాళ్ళుచ్చుకున్నాడు ఆ సోములు. నీకు తెలియక నా మీద రోషం నీ మీదకు తిరిగి నీకూ బుద్ధిలేదన్నాను. అన్నయ్యా! నన్ను క్షమించు. ఒక రక్తం పంచుకున్న వాళ్ళం, నన్ను నువ్వనవచ్చు, నిన్ను నేననవచ్చు. కాని, వదిన ముందు నేను నిన్ననటం తప్పే; ఆధీనం తప్పినవాళ్ళని పుట్టినింటివారు ఆదరించటం లోకంలో ఉన్నది కనుక, నేను ఇక్కడ ఉంటున్నాను. నా మామా, అత్తా ఉంటే అక్కడే ఉండేదాన్ని. నేను నీకు బరువని నాకు తెలుసు. అందుచేత ఏదయినా విస్తళ్ళు కుట్టి కాని, అప్పడాలు ఒత్తికాని, నిన్ను మార్కెట్టులో అమ్ముకురమ్మని చెబుదామని ఆలోచిస్తున్నాను. నువ్వు ఏమనుకుంటావో అని సందేహించాను. వదిన చిన్నది. క్రొత్తగా కాపురానికి వచ్చింది. పనిమనిషి పెట్టుకునా యీ కాలంలో దానికి కాస్త అన్నం అదీ పడవేయాలికదా! కొంతమందికి కాఫీలుకూడా ఇయ్యాలికదా! నావల్ల మీకు ఆ సొమ్ము అయినా ఆదా అవుతోందని సంతోషించాను. వదిన లోకంలో వితంతువులు పెళ్ళిచేసుకోవడంలేదా? అని అన్నది. చేసుకునే వాళ్ళున్నారు. చేసుకో వాళ్ళూ ఉన్నారు. అది విశ్వాసానికి సంబంధించిన విషయం. చేసుకోనివా చేసుకోమని ర్బ ధించటం వాళ్ళ విశ్వాసం మీద అఘాతం కల్పించి ట్లే వు నన్ను పెళి చసుం మనడం నామీద జాలిచేత. అందుచేత నేను కొంత హించా ను. కా వ న అనటం నా మీద జాలిచేత కాదు. తనకున్నదనుకొ బరువును ది పుకోడా కి అలా అనడంలో తప్పు వదినకు తెలియటంలేదు. అన్నయా ! ఇది రకు నేను కోపంతో మాట్లాడాను ఇప్పుడు నిగ్రహంతో మాట్లాడుత ను. గినా మా అ య్య పోతే నీవు పెం చేసుకుంటావా? అ ది ం చూచి. ఈ మాటలకు రామారావు తెల్లబోయాడు. లక్ష్మి భా 'ఫెడేలుమ చెంపకాయ వేసింది. 'వదినా!

వు నన్నుకొట్టినందుకు విచారంలేదు. నీకు ఉద్రేకం కల్పించడానికే, నేను ఆమాట అన్నాను. నీవు నన్ను పెళ్ళి చేసుకోమనడం, చెంపకాయ కొట్టవలసినంత తప్పు అన్నమాట. నీవు ఆపని చేశావు. నేను ఆ పని చేయలేదు. 'రామార్రావుకు కళ్ళవెంబడి నీళ్ళు కారుతున్నై. 'ఎంతపనిచేశావు?' అన్నాడు భార్యతో. భాగీరథి 'అన్నయ్యా! నేనన్నమాట దారుణమైనది కాదా! నా అన్నను గురించి అన్నదికాదా? భర్త చావు విషయం ఇతరులు అంటే ఏ భార్య అయినా సహిస్తుందా? వదిన కొట్టకపోతే తప్పు, కొడితే తప్పుకాదు అన్నది' 'ఇవాళ నేను క్రొత్త గుళ్లలో పురాణం వినడానికి వెడుతున్నాను. నేను బ్రదుకలేకపోను; నారుపోసిన భగవంతుడు నీరు పోయడా? అన్నంతింటేనే మనుష్యులు బ్రతుకుతారనే మాట ఏమిటి? మన కాలంలో 'ముమ్మడివరం బాలయోగి' ఏమి తింటున్నాడని! వదినను మాత్రం ఏమీ అనకు చిన్నతనం ఇరుగమ్మల మాటలు నమ్మింది. ఇవాళ జరిగినదానికి వదినెకు నీవేమైనా చెప్తే నా మీద ఒట్టే' అని వెళ్ళిపోయింది.

భాగీరథి వెళ్ళేటప్పకి క్రొత్త గుళ్ళలో శాస్తుర్లుగారు పురాణం అయిపోయి వ్యాసపీఠాన్ని కట్టేస్తున్నాడు. జనం అంతా వెళ్ళిపోయారు. పళ్ళూ దక్షిణలూ పోగుచేసుకుంటున్నాడు., 'శాస్తుర్లుగారూ వితంతువులు పెళ్ళి చేసుకోవచ్చా?' అంది భాగీరథి. ఆయన ఆమెవంక ఎగాదిగా చూచాడు. పూర్వసువాసిని అని గ్రహించాడు. 'నిక్షేపంలా చేసుకోవచ్చుమ్మా! కావాలంటే రాజశాసనం కూడా ఉన్నది. పూర్వం భర్త ఆస్తికూడా దక్కుతుందనుకుంటాను.' అన్నాడు 'శాస్త్రాలలో ఏమని ఉన్నదని నా ప్రశ్న శాస్తుర్లుగారూ!' 'శాస్త్రాల ప్రసక్తి ఎందుకమ్మా! అని బూజుపట్టిపోయినై. రాజశాసనమే శాసనము. అయినా మొగుడున్న వాళ్ళే విడాకులిచ్చి హాయిగా పెళ్ళిచేసుకుంటూ ఉంటే విధవల కేమిటి? రాజశాసంలో చేసుకోవచ్చు అని ఉందిగాని చేసుకోవాలి అని ఉంటే నేను అమ్మకు కూడా పెళ్ళిచేసేవాణ్ణి' అన్నాడు. శాస్తుర్లుగారు 'నేను ఆర్తితో జిజ్ఞాసతో వచ్చాను వెటకారంగా మాట్లాడుతున్నారు' అన్నది భాగీరథి. 'అమ్మా! పూర్వసువాసిని పెళ్ళి చేసుకోవచ్చునని ఎలా ఉంటుంది? 'నష్టే మృతీ' అని పరాశరస్మృతి శ్లోకాన్నిబట్టి ఇటీవలి కొందరు చేసుకోవచ్చని ఉన్నదని

వాదించారు. ఆశ్లోకం వివాహనిర్ణయమయి వివాహముహూర్తానికి మధ్యకాలంలో మరణించిన వరుని విషయమని కొందరు సమాధానం చెప్పారు. ఇదంతా ఎందుకు? నువ్వు చదువుకున్నదానివలె ఉన్నావు. ఒక చిన్న పాయింటు చెబుతాను. సప్తపదితో ఆడదాని గోత్రం మగవాడిగోత్రాన్ని స్వీకరిస్తుంది. మళ్ళా పెళ్ళిళ్ళు చేసుకుంటూపోతే గోత్రాలెలా మారుతాయి? చచ్చిపోయినదానికి క్రొత్త భర్త తద్దినం పెడతాడా? పెడితే ఎలా ముడుతుంది?' అన్నాడు. శాస్తుర్లుగారి మాటలు భాగీరథికి నచ్చినై. 'శాస్తుర్లుగారూ! మరి శాస్త్రాలలో ఉందని ఎందుకు చెబుతారు కొందరు?' 'అమ్మా వారిది జాలిగుండె. తలచెడ్డ ఆడకూతురునుచూచి ఎవరికడుపు తరుక్కుపోదు? అందుచేత శాస్త్రం ఒప్పుకున్నదంటే ఒక తృప్తి. అమ్మా! రాజశాసనం చేశారు కదా! ఎవరో అది కావాలనుకొన్న వారికి శాసనం అభ్యనుజ్ఞ ఇస్తోందికాని నిర్బంధం లేదుకదా! మన దేశంలో ఉన్న వితంతువుల లెక్కవేయి. ఇందరిలో ఎందరు పెళ్ళిచేసుకుంటున్నారు? మనదేశంలో పూర్వసువాసినులకు పెళ్ళి చేసుకోవాలని అభిప్రాయమే కలుగదు అసహ్యించుకుంటారు, అలా చేసుకునేవాళ్ళు కూడా ఏ కొద్దిమందో లేకపోలేదు.'

'దానిని పెళ్ళే అంటారా? శాస్తుర్లుగారూ?'

'ఒకడితో కాపురం పెళ్ళి కాదేమిటి? మంత్రాలు తంత్రాలు అన్ని ఉన్నాయిగా, శుభలేఖలలో పెళ్ళి అని వ్రాస్తారుగా' భాగీరథికి నవ్వొచ్చింది.

'శాస్తుర్లుగారూ! మీరు నమ్మిన విషయం ఖండితంగా ఎందుకు చెప్పరు? మెలిత్రిప్పి మెలి( ప్పి ఎందుకు దుంపతెంపుతారు? పండితులలో నిజాయితీలు తగ్గిపోవడమే ధర్మచ్యుతికి మూలం శాస్తుర్లుగారూ'

'అమ్మా! నేను నిజం చెబితే ఈ ద్రవ్యం, ఈ కొబ్బరికాయలు ఈ పళ్ళు నా కెవరిస్తారు? కుక్కదానం పట్టి కుటుంబ సంరక్షణ చేయమన్నారు. యుగాన్నిబట్టి పండితులూ మారుతారమ్మా! అయినా నేను నిజం చెప్పకపోవచ్చుకాని అబద్ధం చెప్పటంలేదు కదమ్మా! అమ్మా! నీకు పెళ్ళిచేసుకోవాలని ఉంటే నేను చెడగొట్టలేదు కదా?'

'లేదు శాస్త్రుర్లుగారూ! ఈ శాస్త్రాలతో నిమిత్తం లేకుండానే నేను పునర్వివాహం చేసుకోకూడదనే నిర్ణయానికి వచ్చాను స్త్రీకి ఒక్కడే భర్త అని నా విశ్వాసం. విశ్వాసం వాదాలకు అతీతమైనది. రెండు రెళ్ళు నాలుగనే ఎందుకనాలి? మూడని ఎందుకనకూడదు. అంటే ఎవ్వడూ సమాధానం చెప్పలేడు. నా విశ్వాసం సరియైనదో కాదో, శాస్త్రం ఏమిచెప్పినదో అని తెలుసుకోవాలని వచ్చాను. మీ సొంత అభిప్రాయాలు ఎలా ఉన్నా, శాస్త్రంలో విషయం సరిగానే చెప్పారని నాకనిపిస్తోంది. శాస్త్రం పాటించాలా? అక్కరలేదా? అనే విషయం వేరు కాలాన్నిబట్టి పరిస్థితులనుబట్టి ఆచారాలు మారాలీ అనే విశ్వాసం కొందఱికి ఎంత బలంగా ఉంటుందో, మారనక్కరలేదూ అనే విశ్వాసం కొందరికి అంత బలంగానూ ఉంటుంది ఇవి ప్రస్తుత పరిస్థితులలో వ్యక్తులకు సంబంధించిన విషయాలూ, అలా ఎందుకయినయ్యా అంటే సంఘం ఒకే సిద్ధాంతంగా బలంగా లేదుకాబట్టి.'

శాస్త్రుర్లుగారి దగ్గర సెలవు తీసుకొని భాగీరథి ఇంటికి వచ్చింది. తలుపులు గడియవేసి లేవు. ఇంటికి వచ్చి నిశ్చింతగా పడుకుంది. మరురోజు రామారావు ఆఫీసుకు వెళ్ళబోతున్నాడు. లక్ష్మి వంటయింట్లో ఉన్నది. 'అన్నయ్యా! నా వల్ల ఎప్పుడయినా ఏమైనా తప్పు జరిగితే క్షమించ'మని రామారావు కాళ్ళమీద పడింది. రామారావుకన్నులలో నీరు క్రమ్మింది. 'అమ్మాయీ! నీవల్ల ఏమీ తప్పులేదు. నిన్ను కొట్టడం నీ వదినదే తప్పు నిన్ను కొట్టే స్వాతంత్ర్యం ఆమెకులేదు. నేను క్షమాపణ కోరుకుంటున్నాను' అన్నాడు. 'పెద్దవాళ్ళు చిన్నవాళ్ళను క్షమాపణ కోరుకోకూడదు' అంది భాగీరథి. రామారావు ఆఫీసుకు వెళ్ళిపోయాడు. భాగీరథి భోజనంచేసి తన తల్లి తనకిచ్చిన బంగారు గొలుసును బజారుకు తీసుకువెళ్ళి ఇంటికి తిరిగి వచ్చింది.

లక్ష్మితో 'వదినా! మీనాన్న నీతో మాయింటికి వచ్చినపుడు, మా అన్నయ్యకు నా పెళ్ళి అయితేనేకాని తాను పెళ్ళి చేసుకోవడం యిష్టంలేనపుడు, నేను నిన్ను చేసుకోమని మా అన్నయ్యతో చెప్పాను. మా అన్నయ్యను జాగ్రత్తగా మాత్రం చూడు - నేను నీకు ఇంతకంటే చెప్పవలసింది లేదు. నేను ఈ ఇంటిలోనుంచి వెళ్ళిపోతున్నాను. నేటితో ఋణం తీరిపోయింది ఇది నీ యిల్లు'

అన్నది భాగీరథి. 'ఎక్కడకు వెడతావు వదినా? ఏదో ఆడవాళ్ళం మాటా మాటా అనుకుంటాం. అదే మనసులో పెట్టుకు కూర్చుంటారా? నేను నిన్ను చేయిచేసుకోవడం నాకు ఒళ్ళు తెలిసి చేసిన పనికాదు. మీ అన్నయ్యకూడా ఇంట్లోలేరు. వారు లేనప్పుడు నిన్ను వెళ్ళనివ్వను. నిన్న నేను చేసిన పనికే వారు రుసరుస లాడుతున్నారు. నాతో మాట్లాడటంలేదు. నీవు వెళ్ళిపోతే నిన్ను వెళ్ళనిచ్చినందుకు దేహశుద్ధి చేస్తారు' అన్నది లక్ష్మి. 'నేనెక్కడకు వెడతానో నాకే తెలియదు. ఇదేమీ ఒక ఊరు వెళ్ళిరావడంకాదు ఈ ఇంటిలోనుంచి నేను చేతి సంచికూడా పట్టుకువెళ్లడం లేదు. ఏమోలే! నా జీవితాన్ని ఇక్కడే గడుపుదామని తొలిరోజుల్లో అనుకున్నాను. నీకూ నీ పిల్లలకు చాకిరీ చేసి యీ ఇంటికి 'కుక్కకావలి' కాద్దామనుకున్నాను; ఒక మనిషికి సేవచేసేకన్న భగవంతునికి సేవచేస్తే మంచిదనే విషయం నిన్నటి అనుభవం వల్ల తెలిసింది. ఇక్కడ ఉండే, భగవంతుని సేవచేయరాదా అని నీవనవచ్చు. మానాన్న నాకేమీ ఆ ఈయకపోయినా దురభిమానాన్ని యిచ్చాడు. ఈ వాతావరణంలో దానిని చంపుకోలేను, ఆడవాళ్ళం మాటామాటా అనుకుంటాం అని నేను సరిపుచ్చుకోలేను. ఎంత సరిపుచ్చుకున్నా 'ఎక్కడో అక్కడ' తేడారాక మానదు. వస్తే మా అన్నయ్య నా వంకకు మొగ్గితే నీ కాపురంలో చిచ్చు. నీ వంకకు మొగ్గితే నేను సహించలేను. అందుచేత మా అన్నయ్య సుఖశాంతులకోసమే నేను వెళ్ళిపోతున్నాను. వదినా. మా అమ్మయిచ్చిన గొలుసు నేను మార్చుకున్నాను. నా భర్త నాకిచ్చిన మనస్సు నా దగ్గరే ఉంది.' ఏటికి ఎదురీదుతున్నావు వదినా? ఆడది ఒంటరిగా వెళ్ళడం క్షేమంకాదు' అన్నది లక్ష్మి.

'నిజంగా ఇది ఎదురీతే వదినా! చక్కగా చెప్పావు. నేను ఆడదాన్ని అనే భావంకూడా చంపుకోడానికే యీ ప్రస్థానం. నీవు నాకు చేసే ఉపకారం ఏమిటంటే, మా అన్నయ్యను నాకోసం వెదకి వృధాగా డబ్బుపాడుచేసుకోవద్దని చెప్పటమే. అసలు నేను మా అన్నయ్యకుకూడా కనబడను. కనపడినా తిరిగిరాను', అని నివాస గృహానికి నమస్కరించి భాగీరథి వెళ్ళిపోయింది. లక్ష్మి కన్నీటితో నిలచి ఆమె పోయిన దారివంకనే చూస్తోంది.

రామారావు సాయంత్రం ఇంటికి మామూలుగా వచ్చాడు. విషయం అంతా విన్నాడు. ఆమె సాక్షాత్తూ భాగీరథియే అనుకున్నాడు. ఆరోజుకారోజు ఇంటికి కావలసిన మనిషి లేకపోవడంతో ఉండేకష్టం లక్ష్మికి తెలిసివస్తోంది.

ఇటు సంతానం లేదనే బెంగ. మనశ్శాంతిగానైనా ఉంటుందని రామారావు లక్ష్మితో తీర్థయాత్రలకని బయల్దేరాడు. పలు క్షేత్రాలు దర్శించారు. కాశీలో పనులన్ని పూర్తయిన తరువాత భర్తతో లక్ష్మి అన్నది. ''ఏమండీ ఇక్కడ ఒక యోగిని ఉన్నదట. యాత్రికులందరూ చెప్పుకుంటున్నారు. ఆశీర్వదించి ప్రసాదం ఇస్తే వెంటనే సంతానం కలుగుతుందిట. వెళ్ళివద్దామా?'

ఇంత దూరం వచ్చి అదెందుకు కాదనాలి - అని సరేనన్నాడు రామారావు. యోగిని అపాదమస్తకం కాషాయాంబరాలతో ఉన్నది. కాంతులీనే ఆ కండ్లు మాత్రమే కనుపడేలా ముసుగు వేసుకున్నది. వరుసలో జనం వస్తుంటారు. నమస్కరించి వెళ్తుంటారు. ఆమె మాట్లాడదు. వీరు మాట్లాడరు. మనస్సులో ఏదైనా కోరికలుంటే తలచుకుంటారు. కొందరికి ఆమె ప్రసాదం ఇస్తూ ఉంటుంది. ప్రసాదం లభించినవారి కోరికలు సి స్తుంటాయి. ఇదీ అచటి పద్ధతి. రామారావు దంపతులకు ప్రసాదం లభించింది. లక్ష్మి ఆనందానికి మేరలేదు.

ఇంటికి రాగానే లక్ష్మికి నెలతప్పింది. ఆ తరువాత పండువంటి బిడ్డ కలిగాడు.

ఆ దంపతులు పదేపదే యోగినిని స్మరించుకున్నారు. తమకు పుత్రభిక్ష పెట్టినదని మనస్సులోనే పలుమార్లు కృతజ్ఞతలు చెప్పుకున్నారు. అయితే ఆ ప్రసాదమిచ్చింది తమ భాగీరథియే అని నాటికి నేటికి కూడా వారికి తెలియదు!

***

# ముద్రా రాక్షసం

రచన :

*గంధం యాజ్ఞ్యవల్క్య శర్మ*

విధి ఒక విషాదగీతి నాలాపించింది -

త్యాగాన్ని స్వరంగా, కరుణను రాగంగా, ఆర్ద్రతను ఆలాపనగా, అంతఃకరణను పల్లవిగా మేళవించింది. ఆ గీతికకు ''కరుణ'' బాబాయి జీవితం ఆలంబన.

ఆ గీతికను సరిగా ఆలకించక ; పరిశీలించక ముద్రారాక్షసం చేసిందీలోకం.

★ ★ ★

గోగులమూడి డొంక దగ్గర బస్సు దిగేపాటికి సాయంత్రం ఆరున్నర గంటలయింది. అక్కడకు 3 మైళ్ళుంటుంది మావూరు. గంట ప్రయాణం. అప్పటికే మసక చీకటి కమ్ముకొంటోంది. చుట్టూ ఏపుగా పెరిగిన జొ పొలాలు. వాటి మధ్యగా కాలిబాట. మరెప్పుడైనా అయితే భయం వేసేది.... కాని ఆనాడలాలేదు; గత అయిదు సంవత్సరాలుగా, ఉద్యోగం కోసం తిరిగి తిరిగి, విసిగి వేసారిన, నాకు 'ఇండియన్ ఎయిర్ లైన్స్‌లో ఉద్యోగం కాబోతున్నది. ఆ సంతోషంలో శ్రమ, భయం అనేవి తెలియటంలేదు.

ఏవో ఆలోచనలతోపాటు నడక సాగిపోయింది చాలా దూరం.

''ప్రతిసారి, ఇంటర్వ్యూకు వెళ్ళి, అక్కడ ఏ అరముగ్గిన అదృష్టమో

వెంటాడక, ఇంటికి తిరిగి వచ్చినప్పుడల్లా ఏదో తప్పు చేసినవాడిలా బాధపడేవాడిని.

''ఎందుకురా నాయనా, బాధపడిపోతావు?..... ఆరోజు రావాలి.'' అనేవారు నాన్న.

'మన అబ్బాయికి ఏం తక్కువని అండీ.' అని కళ్ళనీళ్ళు పెట్టుకొనేది అమ్మ.

పిచ్చిదానా! ఉద్యోగం రావటం, రాకపోవటం, వాటి తెలివితేటలకు, చదువు సంధ్యలకు కొలమానం కాదు. ఆ ఘడియ రానిది ఎవరూ, చేయగలిగిందేమీ లేదు' అనేవారు నాన్న.

నా చదువు సంధ్యలకై నిక్షేపంలాంటి మూడు ఎకరాల పొలాన్ని వెచ్చించి ఈనాడు సంసారాన్ని ఆస్తూబిస్తుగా సాగదీస్తూ, దమ్మిడి సంపాదన లేని నా భారాన్ని కూడా వహించాల్సి వచ్చినా, లవలేశమైనా విచారించక, ఎంతో ప్రశాంతంగా, గంభీరంగా వుండే, ఆ పితృహృదయాన్ని తలచుకొన్నప్పుడల్లా వినమ్రుడనై పోయేవాణ్ణి. అంతకన్నా నేనేం చేయగలను?

ఆలోచనల నుండి తేరుకొనేపాటికి రంగయ్యమాన్యం దరిదాపులలోనికి వచ్చేశాను. దూరంగా, సన్నగా పెద్ద గుడిగంటలు విన్పిస్తున్నాయి. అవి నాన్న నిండు హృదయం నుండి వస్తున్న గంభీర వచనాల్లా తోచాయి.

మొన్న సాయంత్రం, నాన్న మడకపొలంగట్టున కూర్చొని ఏదో చదువుకొంటున్నారు. 'ఇంటర్వ్యూకు గుంటూరు రేపు ప్రొద్దున వెళుతున్నాను' అని చెప్పటానికి వెళ్ళాను. అంతావిని ఎప్పటిలాగే, గంభీరంగా చూచారు. అంతే....!

'ఎందుకు? అనవసరం, అనే భావం దొరలిందేమో'' అనుకొన్నాను; కాదు. ''వస్తానుండు'' అంటూ వూళ్ళోకి వెళ్ళారు. మరో అరగంటలో ఎక్కడనుండో అయిదు రూపాయలు అప్పు తీసికొని వచ్చి ఇచ్చారు.

''గుంటూరు పదిమైళ్ళు. ఏం నడిచివెళతావు నాయనా గోగులమూడి డొంకదగ్గర బస్సు దిగి వెళ్ళు-ఈపూటే.'' అన్నారు.

నా ఆలోచనలకు అంతరాయంగా ఒక తెల్లటి పక్షి దారికడ్డంగా రెక్కలల్లార్చుకొంటూ లేచి వెళ్ళిపోయింది. అప్పటికే ఆ కనుచీకటిని చీలుస్తూ వస్తున్న వెన్నెటి తోట పొలం. పొగాకు బ్యారను కనిపించాయి. నాలోని ఆనందాన్ని ఎవరికైనా పంచి పెట్టాలనే కుతూహలం ఎక్కువయింది. త్వరత్వరగా పరువెత్తినట్లు నడిచాను.

కొష్టం, బ్యారన్ చూచాను. నాన్నలేరు. చింతల దగ్గర వున్నారేమోనని అటుకేసి వెళ్ళాను. పెద్దచింత క్రింద నిండా ముసుగు వేసికొని, ఏకాంతముగా వెన్నెలలో కూర్చుని ఉన్నారు.

దగ్గరగా వెళ్ళి ''నాన్నా'' అన్నాను. ''ఎవరూ.....మురారీ - '' అన్నారాయన.

నాన్నకాదు. 'కరుణ' బాబాయి. గతుక్కు మన్నాను.

'ఏరా! ఎక్కడనుండి రావటం! మీ నాన్న ఇంటికి వెళ్ళినట్లుంది' అన్నారాయన. నా ఉత్సాహం ఆరిపోయినట్లైంది. పోనీ కరుణ బాబాయికి చెపుదామా అనిపించింది. ఇంతటి శుభవార్త ఈయనకా అనే సంశయం చుట్టుముట్టింది.

''ఏం కరుణబాబాయి ఈ వార్త వినతగడా?'' ఈ ప్రశ్న గాఢనిద్రలోవున్నవాని ముఖాన పుడిసెడు నీళ్ల కొట్టినట్లు నన్ను తాకింది. ఆ నిద్రనుండి జడుని మాదిరి స్తబ్దత నొందక జాగృతమైంది నా మనసు.

ఎక్కడదీప్రశ్న? నిశ్శబ్దతరంగాలనుండి, ఏకాంత, ప్రశాంతత నుండి, గాలి నుండి, వెలుగునుండి....ఎక్కడనుండో పుట్టినట్లుందీ ప్రశ్న.

కరుణ బాబాయి మానవుడు కాదా?

నిశ్శబ్దాన్ని చీలుస్తూ ''ఏరానాయినా? అలా నిలబడిపోయావు - '' అన్నారాయన. త్రుళ్ళిపడ్డాను.

''లేదుబాబాయి! గుంటూరునుండి వస్తున్నాను. నేను ఇండియన్ ఎయిర్‌లైన్సు, మెకానికల్ బ్రాంచిలో ఉద్యోగానికి సెలెక్టు అయ్యాను-'' అన్నాను.

''అలాగా'' అన్నారాయన.

''సంతోషం నాయనా! చాలా సంతోషం!'' అంటూ ఆయన లేచి దగ్గరకు వచ్చారు. అంతటి చీకటిలోను, చూడగల్గాను ఆయన కళ్ళలో మెరసిన ఆనందాన్ని, ఆనందాశ్రువులను.

నా అదృష్టానికి బాబాయి హృదయం ఉప్పొంగిందా.....?

''వస్తాను - బాబాయి'' అంటూ బయలుదేరాను.

దారిలోనే వుంది పెద్దగుడి. నాన్నగారు, అర్చకులు భద్రయ్యగారు కూర్చుని మాట్లాడుకొంటున్నారు. నన్ను చూస్తూనే, 'అడుగో మురారి, మాటల్లోనే వచ్చేశాడు' అన్నారు అర్చకులు.

ఈ వార్తవిని ఆ పితృహృదయం ఉప్పొంగి పొంగి, వెల్లువై ఎత్తుపల్లాల విచక్షణ లేకుండ నిర్ఝరియై ప్రవహించి ఉంటుందని, ఏమని చెప్పను?

''ఊఁ సంతోషం - '' అని మాత్రం అనగల్గారు గంభీరంగా.

''మురారి కేం పట్టా పుచ్చుకొన్నవాడు. తెలివి, మెలకువ, అణకువ కలవాడు......'' అంటూ ఏదో అంటున్నారు అర్చకులు భద్రయ్యగారు. నాన్న గుడిలోకివెళ్లి గంటలుకొట్టి విభూది, రుద్రపాదాల దగ్గరి పూలు, అక్షింతలు తెచ్చి నా తలమీద వేశారు. ఇంటికి వెళ్ళాం.

'అమ్మ' - తన పేదగృహానికి, నూలివాసి పొరపాటునో, గ్రహపాటునో ఒక మహారాజు విడిది చేయడానికి వేంచేసినట్లు చూచింది నాకేసి; మానెడు ఉప్పు నూతి పాలయింది.

''ఏమిటమ్మా? ఇదంతాను'' అన్నాను.

''నా నమ్మకాలు నావిరా! నీకేం?....లే....లే..... ఈ ఉద్యోగం ధ్యాసలోపడి అసలు అన్నం తిన్నట్లే లేదు - ఆ మొహం అంతా ఎలా పీక్కుపోయిందో చూడు'' అంది.

రాత్రి ప్రొద్దుపోయేంతవరకు ఏవేవో కబుర్లతో గడిచిపోయింది. పైగా అర్చకులు భద్రయ్యగారు తన సహజసిద్ధమైన ప్రసారగుణాన్ని పరిసరాలకు

పనిచేయించినట్లుంది - మునసబు వెంకయ్య, మరికొందరు - ''మన మురారికి పెద్ద ఉద్యోగం అయిందంటగా'' అంటూ వచ్చి నాన్నగారిచేత అవుననిపించుకొని వెళ్ళారు.

రాత్రి 11 గంటలకు అంతా నిద్రించాక మిత్రులకు జవాబు వ్రాద్దామని టేబిలు ముందు కూర్చొన్నాను. వీధిలోనుండి ఎవరిదో పిలుపు విన్పించింది.

'ఎవరది?' అన్నాను.

అమ్మ లోపలికి వచ్చింది. మీ 'కరుణ' బాబాయిలా ఉన్నాడు అంటూ 'లోపలకు రమ్మను' అందామనుకొన్నాను..... అనలేకపోయాను. ఏదో శక్తి నన్ను నిలవేసింది. పదిహేను సంవత్సరాలుగా గ్రామంలోనికి రాని బాబాయి, వచ్చారు. అలాంటి బాబాయిని లోనికి రమ్మనలేక పోయాను. ఈ సంఘం గీచిన ''గిరులు'' అడ్డొచ్చాయి. కొరడాతో చరచినట్లు బాధపడ్డాను.

'అదేదో త్వరగా మాట్లాడి వచ్చేసెయ్ నాయినా! ఎవరన్నా చూచినా, మర్యాద కాదు' అంది అమ్మ.

ఈ సంఘం చూసిన చోట కూర్చొనగలిగిన అమ్మ అంతకన్న ఏమనగలదు?

తలనిండా గుడ్డ కప్పుకొని, గోడవారగా చీకటిలో నిలువబడిన బాబాయి దగ్గరకు వెళ్ళాను.

''ఏం బాబాయి?'' అన్నాను.

''అబ్బే, మరేం లేదురా, నీవు బెంగుళూరు రేపే వెళతావు. మళ్ళీ కన్పించవుగా....మాట్లాడుదామని'' - అన్నాడు.

''లేదు బాబాయ్. వచ్చేశుక్రవారం, మదరాసులో మెడికల్ టెస్టు వుంది. ఆతరువాత బెంగుళూరు'' అన్నాను.

''వారం రోజులుంటావన్నమాట. అయితే సరే, ఓసారి రేపు వీలుంటే తోటపొలంకేసి రా' అన్నారాయన.

''సరే'' అన్నాను. బాబాయి వీధి మలుపు దాటి వెళ్ళిపోయారు. లోపలికి

వచ్చి, టేబిలు ముందు కూర్చున్నాను. దీపం మసివారింది. వెలుగు సరిగ్గా రావటంలేదు. నా మనసు బాబాయి జీవితంవైపు మళ్ళింది. నా ఆలోచనలు, బాబాయిని గురించి నాకు తెలిసిన గాధ వైపు మళ్ళాయి.

★ ★ ★

'కరుణ' బాబాయి. నాన్నగారికి పినతండ్రి కొడుకు. నాన్నగారికన్నా వయస్సులో చిన్న. అయినా ఇద్దరూ సమవయస్కుల్లానే మెలిగే వారు.

మాతాతగారల కుటుంబాలు సమష్టి కుటుంబాలే. అందువలన తెలియనివారు 'కరుణ బాబాయి, మానాన్నగారు సొంత అన్నదమ్ములే అనుకొనేవారు.

★ ★ ★

అవి స్వాతంత్ర్య సముపార్జనకు దేశం ముందంజవేస్తున్న రోజులు. గాంధీమహాత్ముని శంఖారావం దశదిశలా మార్మోగింది. దేశం దేశం ఒక్కటై నిలచిన స్వర్ణయుగమది, బందరు జాతీయ కళాశాలలో చదువు ముగించిన నాన్న, మెట్రిక్యులేషన్ పరీక్షకు చదువుతూన్న బాబాయి, దేశమాత పిలుపును ఔదలదాల్చి సర్వసంగపరిత్యాగులై జాతీయోద్యమంలోకి దూకారు.

''తండ్రి గతించి, క్రొత్తగా పెళ్ళి అయిన వాడివి.....ఇదేమిట''ని ప్రశ్నించినవారికి నాన్న ''దేశం - నా దేశం'' అని మాత్రమే సమాధానం చెప్పారట.

పోలీసువారి లాఠీలకు శరీరాలను అర్పించారు. బ్రిటిష్‌వారి ఘాతుక చర్యలకు గురి అయ్యారు. జైళ్ళకు వెళ్ళారు. అహింసావ్రత నిరతులయ్యారు.

నాగపూర్ జైల్లో వుండగా అర్థరాత్రి ఒడలు మరచి నిద్రిస్తున్న వారిపై లాఠీచార్జి చేశారట. నాన్నకు నుదుటి దెబ్బకు రక్తం వెల్లువై ప్రవహించిందట.

'ఈ రక్తంతో, నా మాతృదేశపు ఋణం తీర్చుకొంటున్నా' నన్నారట నాన్న. కాని 'కరుణ'బాబాయిలో కోపం కట్టు తెంచుకొంది. అహింసా సిద్ధాంతంపై ఆయనకు ఏహ్యాభావం కలిగింది, గాంధీజీని తిట్టారు.

'తప్పుకాదా, కరుణా? అన్నారట నాన్న.

ఆ మరునాడు పోలీసు ఆఫీసరుపై చేయిచేసికొన్నారు బాబాయి. ఫలితంగా నాగపూారు జైలునుండి వేరుచేయబడి చతల్వాడు జైలుకు పంపబడ్డారు.

జైలులో విడివడి పోతున్నప్పుడు ఆ(భాతృహృదయాలు ఎంతో విచారించాయి. ''అన్నయ్యా (బతికివుంటే, ఈ (బిటీషు సా(మ్రాజ్యాన్ని పట్టుకొని, నిన్ను జైలునుండి విడిపిస్తాను -'' అన్నారట కరుణ బాబాయి.

''నాన్న, కరుణ బాబాయి శరీరాలే వేరు కాదు. వారి దృక్పథాలూ వేరయ్యాయి. ఒకరు 'హింసకు', మరొకరు 'అహింస'కు అంకితమయ్యారు.

ఆ తరువాత బాబాయిని గురించి నాన్న చూచింది తక్కువ. విన్నదే ఎక్కువ. బాబాయి చితల్వాడ్ జైలునుండి తప్పించుకు పారిపోయారు. ఆ పారిపోవటంలో చేజిక్కిన రివాల్వరుతో అడ్డు వచ్చిన పోలీసులను ఇద్దరిని చంపివేశాడు. ఆ వార్త విన్న నాన్న హృదయం వేగిపోయింది. బాబాయి పట్ల అసహ్యం, జుగుప్స కలిగాయి.

ఆ తరువాత సుభాసు చం(ద్రబోసు స్థాపించిన ఆజాద్ హింద్ ఫౌజులో చేరాడు బాబాయి. బోసు నడిపిన యుద్ధ తం(త్ర యం(త్రాంగంలో శిక్షణ పొంది, బోసుకు అతి ముఖ్యుడయ్యాడు.

(ప్రభుత్వం బాబాయిపై ఆంక్ష విధించింది. బహిష్కరించింది. పట్టి తెచ్చిన వారికి బహుమతి (ప్రకటించింది.

జబల్పూరు జైల్లో ఉండగా కొట్టిన దెబ్బలకు, నాన్నగారికి, ఆరోగ్యం పూర్తిగా దెబ్బతింది. స్వచ్ఛంద సేవకుడుగా, ఆయన పని చేయటానికి, ఆయన ఆరోగ్యం అనుమతించ లేదు. ఉద్యమ పెద్దలు నాన్నను వి(శ్రాంతి తీసుకొమ్మని ఇంటికి పంపివేశారు. తిరిగి వచ్చిన నాన్న వ్యవసాయం చేయించుకొంటూ, ఆధ్యాత్మిక చింతనతో కాలాన్ని వెళ్ళతీశారు.

అప్పుడప్పుడు 'కరుణ' బాబాయి వార్తలు రహస్యంగా తెలిసేవి నాన్నకు.

ఒకనాటి వార్త నాన్నను విచారంలో కృంగతీసింది.

'ఆయన బోసుబాబు నుండి కూడ దూరమయ్యాడు బహిష్క-రింపబడి. కారణం నైతికపతనం, తన శరీరాన్ని, మనస్సును, ఆత్మను, దేశంకోసం అంకితము చేయవలసిన తాము, ఒక స్త్రీతో సంబంధం కలిగి వుండడం.

బాబాయి స్త్రీలోలుడు- త్రాగుబోతు అయ్యాడట. ఈ వార్త విన్న నాన్న హృదయం వేగిపోయిందట. ఏమూలనో మినుకు మినుకు మంటున్న ఆ భ్రాతృప్రేమ ఓడిపోయింది. మా ఊళ్ళో 'కరుణ' బాబాయిని గురించి నలుగురు చెడ్డగా చెప్పుకొన్నారు. అనాదిగా గౌరవ ప్రపత్తులతో వెల్గిపోయిన మా కుటుంబ ప్రతిష్ట బాబాయి మూలకంగా కళంకితమైపోయింది.

నాన్న తలెత్తుక తిరుగలేకపోయారట.

'కరుణ' తిరిగి రాడా? వాడికి పెళ్ళికాదా? అంటూ క్రుంగి, కృశించి కన్నుమూసింది వియ్యమ్మ నాయనమ్మ: బాబాయి తల్లి. ఆమె కర్మాంతరాలు నాన్నే నిర్వహించారు.

నాకప్పటికి 10సంవత్సరాలుంటాయి. దేశం స్వాతంత్ర్యమైంది. ఏవాడ చూచినా ఆనందం వెల్లివిరిసింది. నాన్న ఆనాడు గాంధీ ఫొటో ముందు కంటినిండా ఆనందాశ్రువులతో నిలుచుండిపోయారు.

ఆనాటికి మూడవనాడు తెల్లవారేసరికి ఊరంతా చెప్పుకొన్నారు. ''కరుణ''బాబాయి వచ్చారని.

నేనూ వెళ్ళాను పాతింటికి బాబాయిని చూడటానికి. మాసిపోయిన బట్టలు; గుబురుగా పెరిగిన గడ్డం, చిక్కిపోయిన శరీరం, అదే ఆయనను నేను ఊహ ఎరిగిన తరువాత చూడటం.

అక్కడేవున్న పాలేరు గంగులు చెప్పాడు నన్ను గురించి. ఆయనలో ఆనందరేఖ తళుక్కుమంది. ఎత్తుకోవటానికి చేయిచాచారు. మళ్ళీ అంతలోనే ఆ ప్రయత్నాన్ని విరమించి జ్యోతుల్లాంటి తన కళ్ళతో తృప్తిగా నాకేసి చూచారు.

ఊరంతా గుసగుసలాడారు బాబాయి వెంట నున్న ఎవరో ఆడమనిషిని గురించి. నాకంతా అర్థంకాలేదు. కాని బాబాయిని దుశ్చరిత్రుడు అని నిర్ణయించింది గ్రామం.

ఆనాడు ఇంటిలోనుండి బయటకే వచ్చారు కాదు నాన్న.

బాబాయి ఆ ఆడమనిషిని ఎక్కడనుండో తీసికొని వచ్చాడు. ఆమెకు బాబాయితో పరిచయం కాకముందే, ఒక ఆడపిల్ల వుందట. ఆ పిల్లను వెంటపెట్టుకొని వచ్చారు బాబాయి.

'అగ్నిహోత్రం లాంటి వంశాన్ని మంటకలిపాడు' అన్నారంతా. ఆ రాత్రి ఊరు సర్దుమణిగాక, ఈ సంఘం నిర్ణయించిన ''నీతి నియమాల'' ధర్మకర్తలు కన్ను మూశాక, నాన్న ఒంటరిగా పాతింటికి వెళ్ళి బాబాయిని నూతిదగ్గరకు తీసికొని వెళ్లి -

''కరుణా! ఏమిటీ చిచ్చు......''అని వాపోయారు.

సమాధానం లేదు.

జరిగిందేదో జరిగిపోయింది. తెల్లవారక ముందే, దానిని వదిలించుకొని తిరిగి రా'' బ్రతిమిలాడారు నాన్న.

''కుక్కతాకిన యజ్ఞపాత్రను శుద్ధిచేద్దామనే ప్రయత్నమాయనది''

తెల్లవారేసరికి పాతింటిని వదలివేశారు బాబాయి. ఊరికి వెలుపలగావున్న తోట పొలంలో, వీరన్న కుంటకు ఉత్తర దిశగా, చింతలకానుకొని, పూరిపాక వేయించి అందులో చేరారు తనవెంట వున్నవారితో.

నాన్న తెల్లపోయారు.

హృదయంలో లీలామాత్రంగా జాలు వారుతూన్న బాంధవ్యరేఖను త్రుంచివేసుకొన్నారు. ఎవరి పొలం వాళ్ళకు, ఆస్థిపాస్తులు చెరిసగంగా పంచి, ఫారీకత్తులు వ్రాయించి బాబాయికి పంపించివేశారు మధ్యవర్తిచేత.

ఆనాటి నుండి. బాబాయి నాన్నకు కనుచూపు మేరలో కనిపించేవారు కాదు. ఊరిలోనికి వచ్చేవారు కాదు. పగలు నాన్న పొలం దగ్గర వుంటే ఆ వూరి

పాకలో ఏమూలనో ఒదిగి వుండేవారు. చీకటి పడిన తరువాత బయటకు వచ్చేవారు. ఎవరితోనూ అనవసరంగా, పలికే వారుకాదు, పొలం కౌళ్ళకు ఇచ్చివేశారు.

పదునాలుగు నిండు సంవత్సరాలు గిర్రున తిరిగిపోయాయి. కాలం తనలో ఎన్నో మార్పులను, చేర్పులను, రూపభావాలను ఇముడ్చుకొంటూ సాగిపోయింది. 5 సంవత్సరాల క్రిందట బియస్సీ పాసయి, నిరుద్యోగినై ఇంటిపట్టునే వుండిపోయాను. కొన్ని ఆర్థిక పరిణామాల మూలంగా, నా చదువు మూలంగా, ఆస్థిపాస్తులు దెబ్బతిన్నాయి. ప్రతికష్టాన్ని చిరునవ్వుతో స్వీకరించే నాన్న అలాగే కాలానికి తల వంచారు.

ఈ నిరుద్యోగిగా వున్న కాలంలో ఏమీ తోచక ఇంకా ఉద్యోగం రాలేదా అనే ప్రశ్నలకు జవాబు చెప్పలేక ఎక్కువ కాలాన్ని పొలం దగ్గరే గడిపేవాణ్ణి. శాపం వరంలా ఫలించినట్లు, నేనలా పొలం దగ్గర తిరుగుతూ వుండటం బాబాయితో పరిచయానికి కారణ భూతమయిందేమో. మొదట్లో మొదట్లో దూరంగావుండి బాబాయిని చూచేవాణ్ణి. ఆయనలో వృద్ధాప్యపు జాడలు ఎక్కువ కన్పించేవి. ఆ గుబురుగా పెరిగిన గడ్డం తెల్లబడింది. నుదుటిమీద ముడతలు ఏర్పడ్డాయి.

ఒకనాటి సాయంత్రం వీరన్న కుంటమీద కూర్చొని ఏదో పుస్తకం చదువుకొంటున్నాను.....సూర్యాస్తమయం కాబోతోంది. బాబాయి వచ్చారులా వుంది. నీటి అలికిడికి తలెత్తి చూశాను.

సంధ్య వార్చుకొంటున్నారు.

ఆశ్చర్యపోయాను. ఆ సంధ్యవార్చటం పూర్తి అయ్యాక ''బాబాయ్'' అన్నాను. తలెత్తి చూశారు.

ఆయన నుండి ఏ సమాధానములేదు. మౌనంగా నాకేసి చూచారు. అంతే ; కాని జారిపోతున్న ఆ సంధ్యా కాంతిలో చూచాను ఆయన కనుకొలకులనుండి అశ్రుకణాలు రాలిపోయాయి, దగ్గరగా వెళ్ళాను. బొంగురు పోయిన గొంతుతో 'నాయినా, మురారీ నాకు దూరంగా వుండు నాయనా! ఈ సంఘం దృష్టిలో అపవిత్రుడివి ఔతావు' అంటూ వెళ్ళిపోయారు, పూరిపాక కేసి.

చాలా చీకటి పడేంతవరకు, ఆ కుంట గట్టుమీదనే, ఆ కటికచీకటిలో జీవితమార్గాలను విలువలను గురించి ఆలోచిస్తూ వుండిపోయాను.

కాలం మరికొంత సాగిపోయింది.

బాబాయి వెంటనున్న స్త్రీ, 15 సంవత్సరాల ఆమె కూతురూ అదృశ్య మయ్యారని ఊరంతా చెప్పుకొన్నారు. ఈ సంఘటన, బాబాయి దుశ్చరిత్రను మరిచిపోతున్న గ్రామానికి మరోసారి ప్రసంగ విషయమయింది.

ఇది బాబాయి గాథ.

★ ★ ★

స్మృతులనుండి తేరుకొనేటప్పటికి, ఇల్లు చీకటిగా వుంది. దీపం పూర్తిగా మసివారి పోయింది. ఆ దీపాన్ని చూస్తే, బాబాయి జీవితం ధ్వనించింది. ఆ దీపపు గ్లాసును, తీసి తుడిచి శుభ్రం చేస్తే కాంతి మనకు లభించినట్లు బాబాయి జీవితాన్ని సంస్కరించవచ్చా అనిపించింది. ఏమో అయినా, అంతటి రాత్రి, ఆ దీపకాంతిని జాజ్వల్యమానం చేయాలనే అవసరం, ఓపికా, నాకు లేకపోయాయి. నిద్రించాను.

మరునాడు బంధుమిత్రుల అభినందనల పరంపరనుండి, అమ్మ తీసి వేస్తున్న దిష్టి నుండి తప్పించుకొని పొలంకేసి బయలుదేరేపాటికి సాయంత్రం 3 గంటలయింది. ''ఇంకా నీవు పొలానికెందుకురా'' అంది అమ్మ - అప్పటికి నేనిక రాజ్యాలేలాలేగాని పొలాలకు వెళ్ళరాదన్నట్లు. ''మళ్లీ మళ్ళీ ఎన్నాళ్ళకో..... ఒక్కసారి వెళ్ళి వస్తానమ్మా'' అంటూ బయలుదేరాను.

పె చింత దగ్గర బాబాయి నా కోసం ఎదురుచూస్తూ కూర్చొని వున్నారు. నా సెలక్షన్ పట్ల ఎంతో ఆనందాన్ని, ఉత్సాహాన్ని కనపరచారు బాబాయి.

''ఎయిర్‌లైన్స్ ఇంజనీరంటే ఎలా వుండాలో తెలుసా, చాలా హుందాగా, ఘనంగా వుండాలి - '' అంటూ ఏవేవో చెప్పారు. నన్ను ఇంటర్వ్యూలో అడిగిన ప్రశ్నలు , వారికి నా సమాధానాలు, వారు నా తెలివితేటలకు సవాలుగా పెట్టిన పరీక్షలు....వాటిని నేను పరి ష్కరి చిన విధానాలు విని ఎంతగానో మురిసిపోయారు.

నైతికంగా ఎంతో కూలిపోయిన బాబాయి దగ్గర ఇంతటి మంచి హృదయం ఎలా మసలుతుందా అనిపించింది.

ప్రసంగవశాత్తు, నన్ను ఇంటర్వ్యూ జరిపింది కెప్టెన్ రావు అని చెప్పాను. బాబాయి ఆశ్చర్య పోయారు.కెప్టెన్ రావు తనకు జాతీయ కళాశాలలో సహాధ్యాయుట ఆ తరువాత వారి దృక్పథాలు వేరయ్యాయి. అతడు ఆంగ్ల కళాశాలకు మారి చదువు సాగించాడు. మిలటరీ ఉద్యోగి అయ్యాడు.

''కాని, నేనంటే ఎంతో ప్రాణం వాడికి'' అన్నారు బాబాయి. వారి మిత్రభావం ఎంతటి ఉత్కృష్టమయినదో!

బాబాయి ఎయిర్ లైన్సును గురించి, అక్కడ నేను నిర్వర్తించవలసిన విధులను గురించి, ఎంతో విమర్శగా చెప్పారు. నాకు బాబాయికి, ఇవన్నీ ఎలాతెలుసా అని సందేహం కలిగింది.

అదే అడిగాను.

''నేను, మీ నాన్న చీలిపోయాక నేను అజాద్ హింద్ ఫౌజులో చేరాను. అక్కడ నన్ను బోసు బాబు, ఈ విమానాలశాఖలోనే నియమించారు. ఆ శాఖ మొత్తానికి, ఇన్చార్జిగా, రక్షకుడిగా, వివిధ హోదాలలో వ్యవహరించాను'' అన్నాడు.

'అజాద్ హింద్ ఫౌజ్కు, భారతదేశంలోనే విమానాలుండేవా?'' అన్నాను.

అది చాలా రహస్యమైన విషయం. 'ఉండేవి' అన్నారాయన. ఆనాటి వీరగాధలు ఎన్నో దొర్లిపోయాయి. మా ప్రసంగంలో....రక్తం వేడెక్కి సలసలా కాగిపోయింది ఆనాటి వీరగాధలను తలచుకొంటే.

చీకటి పడ్డాక ఇల్లుచేరాను.

★ ★ ★

శుక్రవారం నాటి ప్రొద్దున వైద్యపరీక్ష జరిపి నాటి సాయంత్రం 6 గంటలకు ఫలితాలు చెప్పారు. నా అరముగ్గినదనుకొన్న అదృష్టం కుళ్లిపోయింది.

వెంటాడుతున్న దురదృష్టం తన ఉక్కు కౌగిలిలో మరొక్కసారి నన్ను పొదవి పట్టుకొంది. నేనొక్కణ్ణే, కంటి చూపులో దోషం వుందని, ఉత్తీర్ణుల సంఖ్య నుండి తొలగింపబడ్డాను. ఆవార్తవింటూనే కూలబడిపోయాను. వారం రోజులనుండి ఆవరించిన ఆనందం ఓ శిఖరాగ్రం నుండి జారిపడి మంటలో కలిసిపోయింది.

ఏమిటీ శిక్ష నాకు - ? నా యెడల నాకే, జారిపోతున్న విశ్వాసాన్ని, ఎన్నాళ్ళని కూడతీసికొని జీవించటం - ?

ఇంటికి తిరిగి రాబుద్ధి వేసింది కాదు. అక్కడే మద్రాసులో రెండుమూడుచోట్ల ఉద్యోగానికి ప్రయత్నించాను చివరికి, అటెండరు ఉద్యోగమైనా దొరుకుతుందేమోనని. ఫలితం శూన్యమయింది.

తిరిగి వచ్చి వేశాను.

ఈవార్త విన్న నాన్న చలించలేదు. పొడిగా నవ్వారు. ఆ నవ్వు ఆయన నాకోసమే నవ్వారు. నాకు తెలుసు; నా మనస్సెక్కడ బాధపడిపోతుందో అని.

ఆనాడూ నాన్న పెద్ద గుడికేసి వెళ్ళారు. అమ్మ మాత్రం కనులవెంట నీరు కార్చింది.

ఉద్యోగం రానందుకు కాదు. మదరాసులో సరిగా వేళకు తిండి తినక దిగులుపడి, ఈ నాలుగు రోజులకే చిక్కి సగమయ్యానని.

కాలమాన పరిస్థితులతో నిమిత్తంలేనిది, అర్చకులు భద్రయ్యగారి ప్రసార కేంద్రం, పుట్టుకకు గిట్టుటకు, ఒకే ప్రాముఖ్యత వుందని నిరూపించేది వారి సిద్ధాంతం, నాకు ఉద్యోగం రాకపోవటాన్ని గురించి, యధోచితంగా శ్రమించింది వారి ''వాణి''

ప్రశ్నించే వారికి సమాధానాలు చెప్పటం దుర్భరమై తోట పొలంకేసి పోవటం ప్రారంభించాను మళ్ళీ. నాకు ఉద్యోగం లభించనందుకు, నాకన్నా, నాన్నకన్నా, అమ్మకన్నా ఎక్కువ విచారించారు బాబాయి.

నేనే బాబాయిని ఊరడించాల్సి వచ్చింది;

''మురారీ? నీవు ఆఫీసరుగా వుండగా బెంగుళూరు వద్దామనుకున్నాను'' అన్నారాయన. అలా అంటున్నప్పుడు ఆయనలో ఏదో వేదన చేతినుండి జారిపోతున్నదాన్ని దక్కించుకోలేని వ్యధ వ్యాకులత కన్పించాయి.

ఆనాటినుండి ప్రతిరోజూ బాబాయికి కన్పిస్తూనే వుండేవాడిని. ఆయనను అర్థంచేసికోవాలని ప్రయత్నించేవాడిని. ఒకనాడు బాబాయి 'చింత' దగ్గర కన్పించలేదు. పూరిపాకలోనికి వెళ్ళాను. అప్పటికే మసకచీకటి పడింది. బాబాయి దీపపు బుడ్డి ముందు కూర్చొని 'గీత' చదువుతున్నారు. ఎదురుగా దేవుని పీఠం వుంది. ఆ పీఠానికి అటు, ఇటు, ప్రక్కల బోసుబాబు మానాన్నగారల ఫోటోలు వ్రేలాడుతున్నాయి.

ఆదృశ్యాన్ని చూచాక బాబాయిని ఏమని నిర్ణయించను? నాకనుల ముందు వేయిసౌదామినులు తళతళమని వెలిగిపోయాయి. చిమ్మ చీకటి అయింది.

అలికిడికిలావుంది. బాబాయి తన ధ్యానముద్రనుండి లేచి 'నీవు ఇక్కడకువచ్చావా?-' అన్నారు. కొన్ని దినాలక్రితమైతే లోకులతో పాటు నేనూ అక్కడ కాలు పెట్టటమంటే తీరని అపచారంగా భావించి వుండేవాడినేమో; కాని నా హృదయ పరిధిలో బాబాయి స్థానమేర్పరచుకొన్నారు. ఆయనలోని కాంతి పుంజాలేకాని, చీకటి కోణాలు నాకు కన్పించటం మానివేశాయి.

బాబాయి తాను విశ్రమించే గదిలోనికి తీసికొని వెళ్ళారు. తాటి ఆకుల చాపమీద బాబాయి పడకవుంది! ప్రక్కనే ఏవో పుస్తకాలు చాల పెట్టివున్నాయి. నన్ను కూర్చోమని చాప పరిచారాయన. బాబాయితో మాట్లాడుతూ, అక్కడి పుస్తకాలను త్రిప్పిచూచాను. విజ్ఞానశాస్త్రం, తత్వశాస్త్రం, మానసిక శాస్త్రం, చరిత్ర, వేదాంతం....వీటికి సంబంధించిన పుస్తకాలవి.

అవ్వన్నీ మానవ మేధస్సులోని మహోన్నత శిఖరాలు. బాబాయి జిజ్ఞాసాజీవి.

మహా జ్ఞాని.

  

తెలతెలవారేసరికి స్నాన జపాదులు ముగించి పెద్దచింత క్రింద కొన్ని క్షణాలు మౌనముద్రలో గడుపుతారు బాబాయి. కొంతసేపు ఏదో వ్రాతపని చూచుకొంటారు. ఆ తరువాత పంటపని. ఆయన అపక్వాహారి. ఉప్పు, కారం వర్జనీయాలు. పెసలు, శెనగలు, నానపెట్టుకొని తినేవారు. పండ్లు, పండ్ల రసం త్రాగేవారు. పూర్తిగా ప్రకృతి వైద్యశాస్త్రాన్ని అనుసరించి మెలిగేవారు. మృణ్మయపాత్రలు ఉపయోగించేవారు.

మధ్యాహ్నం పుస్తకాలలో మునిగిపోయేవారు.

మూడు పూటలా సంధ్యవార్చేవారు.

ఆ పూరిపాకముందు ఎప్పుడూ బియ్యం చల్లి వుండేవారు. ఆయన మి .లా అన్నట్లుండేవి ? కలు, పావురాళ్ళు, గోరువంకలు ఆ బియ్యా తింటూ.

★ ★ ★

నేను ఊహించ సంఘటన జరిగింది.

బెంగుళూరు నుండి జాబు వచ్చింది - నన్ను మళ్ళీపరీక్షిస్తారట. ఈసారి వైద్య పరీక్షమాత్రమే. అదీ గుంటూరులోనేనట. హాజరు కావలసిందని.

'ఆశ'వెంటాడింది.

ˊˊ సారి ఈవార్త నాన్నకు, అమ్మకు, బాబాయికి తప్ప మరెవ్వరికీ తెలియ...యలేదు.

బాబ .. .. ందా?' అన్నారు సంతోషంగా. అలా వస్తుందని తనకు తెలుసన్నట్లు చి దా మాట.

'ఈసా తప్ప సె... ..వు' అన్నారు.... గుంటూరు వెళ్లాను. ఈసారీ కెప్టెన్ రా ˊ . .. నేను వెళ్లేప్పటికే రెండుసారులు నా కోసం వాకబు చేశారట. నేను వెళ్ళ...ి రచాలనం చేసి, తన్నకై నిర్దేశించిన గదిలోనికి తీసికొని వెళ్ళి మురారీ, రుణ లావున్నాడు?.....కులాసానా. నీ మూలంగా నైనా 20 సంవత్సరాల తరువాత నైనా వాడి జాబు చూడగల్గాను-' అన్నారు.

నాకంతా అర్థమయింది.

'నేనూ వాడూ ఎంత ప్రాణంగా వుండేవాళ్ళమో తెలుసా......! కరుణ దేశానికి గర్వించదగ్గ పుత్రుడు' అన్నారాయన.

''వీళ్ళందరికి దేశంతప్ప మరొకటి కన్పించదా'' అన్పించింది.

వైద్య పరీక్ష జరిగిపోయింది. కెప్టెన్ రావుగారు నా కనులలోనికి తీక్షణంగా చూచారు. 'చాల బాగున్నాయి' అన్నారు. అంతే అక్కడక్కడే ఎయిర్‌లైన్స్ ఇంజనీరింగులో నెలకు 250 రూపాయల స్టైఫెండుమీద శిక్షణకు తీసికొంటున్నట్లు ఉత్తరువు లిచ్చారు. 2 సంవత్సరాల తరువాత 450 రూపాయల మీద నా ఉద్యోగ జీవితం ప్రారంభమౌతుంది.

'వెంటనే బయలుదేరు' అన్నారాయన. సంకోచించాను - ; ''ఆల్‌రైట్. ఇంటికివెళ్ళి 10,15 రోజులలో వచ్చి జాయిన్ అవ్వు. అందరిని చూచిరా! మళ్ళీ 2 సంవత్సరాల వరకు తిరిగి రావటానికి వీలుండదు - ; బైదిబై నేను ఢిల్లీ అర్జంటుగా వెళ్ళవలసిన పని తగిలింది. కరుణను వెంటనే కలుసుకోలేకపోతున్నాను. వస్తున్నానుకదా అని జాబూ వ్రాయలేకపోయాను - తిరిగి వస్తూ తప్పక కలుసుకొంటానని చెప్పు ''అన్నారాయన.

ఆ రాత్రి తిరిగి రావటానికి పడింది కాదు. మరునాటి ప్రొద్దుననే హృదయం పట్టలేని ఆనందంతోను, కెప్టెన్ రావు ఇచ్చిన ఆర్డనుతోను, బాబాయిపట్ల తలమున్కలైన కృతజ్ఞతతోను తిరుగుముఖం పట్టాను.

★ ★ ★

తెల్లవారకమునుపే, గోగులమూడి డొంక దగ్గర దిగి బయలుదేరాను. తెలతెలవారుతోన్న ఛాయలు తూర్పుదిక్కున పొడచూపాయి. నా జీవితంలోని ఉషఃకిరణాలలా చల్లగా మలయమారుతం వీచింది. సన్నగా గొంతుకలో మలయ మారుతరాగాన్ని ఆలాపిస్తూ రంగనాధునిపై భక్తి గీతాలు పాడుతూ వుండే కరుణ బాబాయి కళ్ళలో కన్పించారు. వెళుతూనే, ధ్యానముద్రలో పెద్ద చింత దగ్గర కూర్చొని వుండే బాబాయి దగ్గర ఆశీర్వాదం పొందాలనుకొన్నాను.

రంగయ్య మాన్యం దగ్గర కొచ్చేటప్పటికి తెల్లవారింది. చెరువు

మరగొమ్ముదాటి, సీతయ్య మామయ్యగారి పొలం గట్టు ఎక్కి చూచేప్పటికి కరుణ బాబాయి పూరిపాక చుట్టూ జనం కన్పించారు.

ఆశ్చర్యపోయాను. ఏనాడూ అలా బాబాయి వాటికకు జనసందోహం వస్తుందనుకోలేదు.

మరికొన్ని గజాలు వెళ్ళాను. పాలేరు గంగులు ఎదురయ్యాడు.

ఆ వార్తవిన్నాను.

ఈ జగత్తు కొన్ని క్షణాలు స్తంభించిపోయిందేమో: నేను నీరయిపోయానేమో!

ఏ మహాభాగ్యుడు నిష్కామకర్మ ఆచరించి నా జీవితానికి వెలుగుఆధారం చూపించారో, ఆయన, ఆ మహత్తర మూర్తి ఈ శూన్యాంకమైన ఇహం నుండి పూర్ణాంకమైన పరంలోకి నైమిత్తికమైన బాహ్యం నుండి, శాశ్వితమైన ఆ 'కువలయం'లోనికి భీష్మ ఏకాదశినాడు తెల తెలవారుతుండగా తన జీవితాన్ని తెలవార్చుకొని వెళ్లిపోయారు.

మౌనంగా, నిమీలిత నేత్రాలలో, పెద్ద చింతక్రింద, ధ్యానముద్రలో వుండే బాబాయి కడకు మరణం రాగల్గిందా? అబ్బా! నమ్మలేకపోయాను.

దూరంగా పరువెత్తి ప్రశాంత వాతావరణంలో జీవితాన్ని గురించి ఆలోచిద్దామనిపించింది. నాన్న పెద్దచింతవద్ద కన్పించారు. దగ్గరగా వెళ్ళాను. సముద్రం కట్టలు తెంచుకొని ఈ పృథ్విమీదకు విరుచుకపడినట్లు, బావురుమన్నారాయన. నాన్నలాంటి గంభీరమూర్తి బాబాయి మరణం పట్ల అంతటి విహ్వాలత చెందటం చూచి నివ్వెరపోయాను.

అంతా సానుభూతి వాక్కులు పలుకుతున్నారు.

అర్చకులు... . ' కరుణ.... దేశం గర్వించాల్సిన బిడ్డ కదటండి....కాకపో గత 20 సంవత్స—లుగా....'' అంటున్నారు.

పూరిపాకలో కి వె. ... బాబాయి నిశ్చింతగా నిద్రిస్తున్నట్లు వుంది. తలవైపు పెట్టబడిన దీపక ంతికన్నా, మరణించినా, ఆయన మోముపై

తొణికిసలాడుతూన్న కాంతే బహుళంగా వుంది. ఆయన పుస్తకాలన్నీ చేతికందుబాటులో దగ్గరలోనే వున్నాయి. గీత మరీ చేరువలో వుంది. దహనక్రియలు ముగిసే పాటికి సాయంత్రం అయింది. చీకటి పడింది.

ఆరాత్రి నాన్న మామయ్యతో చెపుతున్నారు -

''క్రిందటి నాటి సాయంత్రం నాన్న పొగాకు బ్యారన్ దగ్గర వుండగా, పాలేరు గంగులు వచ్చి 'కరుణ'య్యగారు తమతో మాట్లాడతారంట. రమ్మంటారా-'' అన్నాడట. నాన్న ఆశ్చర్యపోయి ఎటూ మాట్లాడలేదట. ఆయన అలా సందిగ్ధావస్థలో వుండగా బాబాయి దగ్గరగా వచ్చారట. ఒకరినొకరు చూచుకొని ఏమీ మాట్లాడలేకపోయారట.

కరుణబాబాయి, మౌనంగా నాన్న కళ్ళలోనికి చూచి, వంగి నమస్కరించి, తిరిగి వెళ్ళిపోయాడట. అలా వెళ్లిపోతూన్న వాడిని 'కరుణా, రేపు ఇంటికివచ్చి తలంటిపోసి కొని, అన్నం తినిపో' అన్నారట నాన్న. వెళుతూన్న బాబాయి ఆగి, 'రేపు భీష్మ ఏకాదశి... అయినా వుంటే వస్తాను' అని సాగిపోయారట.

''ఉంటే అంటే ఎక్కడికైనా ప్రయాణం పెట్టుకొన్నాడేమో అనుకొన్నాను- ఈ తిరిగి రాని ప్రయాణమని నాకేంతెలుసు'' అన్నారు నాన్న.

కొంచెంసేపటికి అర్చకులు వచ్చారు.

''విచిత్రం! దైవమాయ చూడండి! కాకుంటే నాకు తెలిశాక ఏనాడూ ఆయన గుడికి రాలేదు. అలాంటివాడు రాత్రి ప్రొద్దుపోయాక నేను గుడితలుపులు మూయపోతూవుండగా వచ్చాడు. ఆశ్చర్యపోయాను. అబ్బా! గుడి గంటలు ఎంతసేపలా వాయించాడో!''

ప్రసాదాన్ని కనులకు అద్దుకొని తిని వెళ్లిపోయారు'' అన్నారు.

బాబాయి భగవంతునిదగ్గరకు ప్రయాణమై పోయారు. ఆయన తపశ్శాలి.

ఈ 11 రోజులూ కర్మాంతరాలన్నీ నాన్నే చేశారు. పేరుపేరునా యధావిధిగా దానాలన్నీ చేశారు. ఎవరో 'ఆయనకు కర్మేమిటి - ఆయనకు ఆ

కర్మార్హత లేదు' అన్నారట.

నాన్న కోపంతో నిలువెల్లా కంపించిపోయారు.

'నాకరుణ'కు కర్మార్హత లేకుంటే, ఈ పృథ్విలో మరెవ్వరికీ అలాంటి అర్హతలేదు' అన్నారు.

వెల్లువలైనా భ్రాతృప్రేమకు ఎవ్వరడ్డు?

ఈపది పదకొండు రోజులూ, నాన్న కన్నుల ముందర బాబాయి మెదులుతూనే వున్నారు. ప్రతిక్షణానా, బాబాయిని గురించి నాన్న దుఃఖిస్తూనే వున్నారు.

ఇదంతా చూచాక నాలో అనుమానరేఖలు తమ క్రీనీడలను వ్యాపింపచేశాయి. బాబాయి జీవితాన్ని గురించి పరిశోధిద్దామనిపించింది. బాబాయి ఇలాంటివాడు అనే [illegible]యానికి కొద్దామనిపించింది.

బాబాయి పూరిపాకలోని ఆయన పుస్తకాలను, డైరీలను, జ్ఞాపకాల పుస్తకాలను శోధించాను.

ఆయ[illegible] స్వచ్ఛందమూర్తి సాక్షాత్కరించింది.

★ ★ ★

కరుణ బాబాయిని గురించి ఈ లోకానికి తెలిసింది, బాబాయిని గురించి ఈ [illegible]ం నిర్ణయించింది ఒక ముద్రారాక్షసం. ఆ ముద్రారాక్షసాన్ని గుర్తించి [illegible] క మ[illegible]త్తర త్యాగధన జీవితగాధను, శుద్ధ ప్రతిగా దృశ్యతకాంచిన వ్యక్తిని నేనవటం నా [illegible]ం.

[illegible], ఆ [illegible] రాక్షసా[illegible] గుర్తించటానికి ఒక జీవిత కాలం పట్టింది. ఈ విశ[illegible] [illegible]ానికి [illegible] బాబాయి డైరీ పుస్తకాలు, జ్ఞాపకాలు అనే మరో పు[illegible] ఉపక[illegible]ంచాయి.

ఈ [illegible] డ వా[illegible] లోని కొన్ని కొన్ని భాగాలు, 'కరుణ' బాబాయి జీ[illegible] [illegible]నట చూపించాయి.

★ ★ ★

అది 17 సంవత్సరాల నాటి అర్థరాత్రి గాథ:-

''ఎక్కడి నుండో వైర్‌లేస్ ద్వారా ఆజ్ఞ వచ్చింది. 'బ్రిటిషువారి యుద్ధ స్థావరాలను పట్టుకొనమని' - అంతా సర్వసిద్ధమయ్యాం. ముఖ్యంగా భాయ్ కరుణా జాగ్రత్తగా వ్యవహరించాలి. విమాన దళంతోచితల్వాడ్ దరిదాపులలో వున్న చిన్న కంటోన్మెంటుపట్టుకొని, అక్కడ బంధించబడిన రాజకీయ ఖైదీలను విడిపించాలి'' అని మరీ మరీ చెప్పారు.

అలాగే వ్యూహం సాగిపోయింది.

ఆనాటి అర్థరాత్రి విమానాలతో చితల్వాడ్ అడవులలో దిగాం. కంటోన్మెంటును ముట్టడి చేశాం. అంతా పారిపోయారు.

మాకు చేజిక్కినది కొద్దిమంది సైనికులు. ఒక గుడారంలో, ఒక పసిపిల్ల త .

ఆమెను బందీగా తీసికొనివచ్చి నా ముందు నిలువ పెట్టారు. పులినోట చిక్కిన లేడిలా వణికిపోయింది. పసిపాపను హృదయానికి హద్దుకొని విలపించింది.

నా హృదయం కరిగిపోయింది.

ఎవరని అడిగాను. ఒక జమేదారుభార్యట. 'సోదరిని రక్షించండి' అని కనులవెంట నీరు కార్చింది.

నా హృదయం వ్రయ్యలయింది.

హింస ఓడిపోయింది; అహింసాసిద్ధాంతాన్ని బోధిస్తున్న మహాత్మాజీ కన్పించారు కనులలో.

ఆరాత్రికి మా గుడారాలలోనే వుండిపొమ్మనీ, తన కెలాంటి ఆపదారాదనీ చెప్పాను. కాని ఆ మాతృమూర్తికి తనబిడ్డకు హాని కలుగుతుం దేమోనన్న భయం, సంతోషం వెంబడించాయి. అందుకై రక్షగా ఆ పాపను నేను ·· డారంలో పడుకోపెట్టుకొని ఆమెను నా ప్రక్కగుడారంలో ఉండమని చెప్పాను.

రెండు గంటలలా గడిచాయో లేదో, మాపైకి అకస్మాత్తుగా ఒక పెద్దసేనావాహిని విరుచుకపడ్డది. ఎటువారమటు చెల్లాచెదరయ్యాం. ఆ తొందరలో ఆ పసిపాపతో విమానంలో పారిపోవలసి వచ్చింది. అలానే చేశాను. ఆ బిడ్డను తల్లినుండి వేరుచేయవలసి వచ్చింది. తప్పలేదు . చేశాను. తీరా మా రహస్య స్థావరాలు చేరాక ఆ బిడ్డ నాకెలాంటి ప్రతిబంధకమో గోచరమయింది. ఆ మాతృమూర్తి ఎంతగా విలపించిందో తలచుకొంటే మనసు విహ్వలమయింది.

ఆ మాతృహృదయం నన్ను వెంబడించింది. పైగా నా రహస్య జీవితానికి, ఈ పాపనెలా సాకటం....? ఎక్కడైనా ఇచ్చివేద్దామని పించింది. కాని రెండుమూడు రోజుల, ఆ పాప స్నేహం, మమతగా మారింది. మరో ప్రక్కనే 'అహింసా' తత్వం నన్ను తన వలయంలోకి ఆకర్షించి, లాగుతోంది.

సిద్ధాంతాల మధ్య, కర్తవ్యం మధ్య, నన్ను వెంటాడుతున్న మాతృహృదయం మధ్య వేగిపోయాను. చివరకు ఒక నిర్ణయానికొచ్చాను. ఆ బిడ్డను, ఆ తల్లి కడకు చేర్చాలని. ఆ పాపాకు దారి నేర్పరచాను.

నా దగ్గర ఓ స్త్రీ, పాప వున్నారని , నా అనుచరులు తెలసికొన్నారు. ఫలితం బోసు బాబు నన్ను బహిష్కరించారు.

బోసుబాబు దయామయుడు. నిజాన్ని తెలియచేస్తే నమ్మగలడు - కాని..ఎందుకో ఆ పాపతో వెళ్లిపోవాలనుకున్నాను. నాపై దేశంలో బహిష్కరణ వుంది. మారువేషంలో దాది, పాపతో బయలుదేరాను.

దాది 'కమ్మ' - ఎంతో దయార్ద్రహృదయ. దిక్కులేనిది. నా వెంట వచ్చింది.

ఆమె నా సోదరి లాంటిది.

★ ★ ★

అత్యాగమయ జీవితగాథలో మరోకొన్ని పుటలు త్రిప్పాను. అవన్నీ

కరుణా పూరితాలు, మానవత్వపు విలువలు, మహోన్నత శిఖరాలు, మధురవేదనా ఘట్టాలు.

'రెండు సంవత్సరాలు, ఆ పాప తల్లి కోసమై తిరుగాడాను ప్రతి తిరునాళ్ళు, తీర్థాలు, పుణ్యక్షేత్రాలు చూచాను. వాడవాడలా గాలించాను. ఆమెకుగా నాదగ్గర ఏగుర్తులూ లేవు. ఒక్క వరలక్ష్మి అనే ఆమె పేరు తప్ప. ఈ సువిశాల దేశంలో ఆమె ఎక్కడ వుందని వెతకను - ? అసలు జీవించి వుందని ఎలా భావించను - ?

పూరీ జగన్నాథంలో వుండగా, దేశం స్వాతంత్ర్యాన్ని పొందింది. తిరిగి జన్మస్థలానికి పోదామనిపించింది. మా వూరుచేరాను.

ఆనాటికే నాపేరున ఎన్నోగాథలు వెలిశాయి. తెలిసికొన్నాను. అన్నయ్యకూ నిజం తెలియదు. నేనుగా నిజం చెప్పినా, అప్పటిలో ఫలితం శూన్యమనిపించింది.

కాలాన్ని నిర్లిప్తంగా గడపటానికి నిశ్చయించుకొన్నాను. ప్రశాంత వాతావరణమైన తోటపాలంలో ప్రవేశించాను. నా జీవితానికి మమతను పంచిపెట్టింది పాప. ఆ పాప కనులలో కాంతి పుంజాలను చూడగల్గాను. ఆమెను 'జ్యోతి' అని పిలుచుకొన్నాను.

★ ★ ★

పాపకు ప్రపంచమంటే తెలిసేస్థితి వచ్చింది. ఈ ప్రకృతి ఏమిటి? జీవితమంటే ఏమిటి? అని ప్రశ్నిస్తోంది. ఆమెను ఈ వాతావరణంలోవుంచి, ఈ సంఘం, ఆమెను గురించి మాట్లాడే భాషకు అర్థం నేనే ఆమెకు చెప్పవలసివచ్చే దుస్థితి నుండి విముక్తుణ్ణి కావాలనుకొన్నాను. అందుకే మిత్రుడు భుజంగరావు దగ్గరకు బెంగుళూరు పంపించి వేశాను. ఆ జ్యోతికి, ఎలాంటి పెనుగాలి నుండి ఏ ఆపదా రాకుండా కాపాడగలడు భుజంగరావు. నాకావిశ్వాసం వుంది. జ్యోతి జీవితం పదిలపరుపబడినట్లే.

'ఇక నాకింకేం పని?'

★ ★ ★

బాబాయి జ్ఞాపకాల పుటలు అయిపోయాయి.

ఆయన పవిత్ర జీవితమునే ఈ శుద్ధ ప్రతిని తీసి ఆయన జీవితంపట్ల జ్ఞానలవదుర్విదగ్ధంగా వ్యవహరించిన సంఘం ముందుంచాను.

సంఘం ఓడిపోయింది.

నాన్న బాబాయి ఫోటో ఒకదానిని, దేవుని పీఠంపై వుంచుకొన్నాను.

పెద్ద గుడి అర్చకులు ద్విగుణీకృతోత్సాహంతో బాబాయి జీవిత గాథను ప్రసారం చేశారు.

కెప్టెన్ రావు రమ్మన్నరోజు రయింది. బాబాయి పుస్తకాలను, జ్యోతి ఫొటోలను, తీసికొన్నాను. బెంగుళూరులో జ్యోతిని కలుసుకొని గట్టిగా ఏడవాలనిపించింది. ఆ నా చెల్లిని తాకి నా జీవితాన్ని పునీతం చేసికోవాలనిపించింది.

రేపే బెంగుళూరు బయలుదేరుతాననగా కెప్టెన్ రావు మావూరు వచ్చారు, ఢిల్లీనుండి తిరిగి వస్తూ గుంటూరు వచ్చి ఎవరో ఓ వ్యాన్ తీసికొని వచ్చారు. బాబాయి మరణవార్త వింటూనే జేబులో నుండి పిస్టలు తీసి గాలిలోకి మూడుసార్లు ప్రేల్చి కనులు మూసికొన్నారాయన.

'న ం రాలిపోయిం ' అన్నారాయన. అతి బలవంతంమీద ఆనాటికి ఆపగల్గాం కెప్టెన్ రావుగారిని.

కరుణ బాబాయి, పూరిపాక, పెద్దచింతలు, వీరన్నకుంట, తోటపాలెం చూచి 'మునా శ్రమంలావు నాయినా' అన్నారు.

పెద్ద చింత ం కూర్చొన్నాక బాబాయి జీవితంపై నా పరిశోధ ఫలితాలను వినిపించాను. నా మాటలు వింటూనే బాబాయి డైరీలను, పిచ్చిగా గబగబా వెతికారు కెప్టెన్ రావు - 'కరుణా' అంటూ ద్దగా కేకవేసి, వెంటనే లేచి మా ఇంటికేసి పరుగెత్తారు. నాకేమీ అర్థంకాలేదు. ఆయనను వెంబడించాను.

ఆయన కిట్, ఫ్లాస్కు, బ్యాక్ తీసికొని, ''మిస్టర్ మురారి బయలుదేరు. ఈ రాత్రికే, బెంగుళూరు బయలుదేరాలి......త్వరగా త్వరత్వరగా......'' అన్నారు.

ఆవేశ శిఖరాలపై ఉద్వేగంతో ఊగిపోతూన్న కెప్టెన్ రావును, గట్టిగా పట్టుకొని 'ఏమిటిది' అని ప్రశ్నించారు నాన్న.

''ఏమని చెప్పను ? నా కరుణ నా పాలిటి దైవం. ఆ జ్యోతి ఎవరో కాదు - 18 సంవత్సరాల క్రిందట జమేదారు. 'రావు'నేటి కెప్టెన్ రావు కూతురు. ఆ జ్యోతి తల్లి వరలక్ష్మి బెంగుళూరులో, 18 సంవత్సరాలుగా కంటిమింటికి విలపిస్తోంది పాపకోసం. క్షమించండి, ఆలస్యం చేయలేను.' అన్నారు కెప్టెన్ రావు.

విధి విలాస విన్యాసంలో ఇది ఒక వంపు!!! విధి పాడిన విషాద గాథలో ఇది ఒక మధుర గీతి.

క్షణాలలో నేను తయారయ్యాను. అమ్మ నన్ను దీవించి; దిష్టి తీసింది. జ్యోతికిమ్మని అమ్మవారి కుంకుమ, పూలు ఇచ్చింది.

వ్యాన్ బయలుదేరింది.

తోట పొలం దగ్గర క్షణకాలం వ్యాన్ ఆపారు కెప్టెన్ రావు. అప్పటికే చీకటి పడి, మసక మసకగా వుంది. కురణ బాబాయి పూరిపాక ప్రశాంతంగా కనపడి కనపడనట్లు అగుపించింది. మూగగా వుందా ఆకృతి.

నా కనులముందు, ఏనాటిదో కణ్వాశ్రమం కన్పించింది , బాబాయి కన్పించారు.

క్షణంలో రెండూ కరగిపోయాయి. ఒక నిట్టూర్పుతో వ్యాన్ కదలిపోయింది.

★ ★ ★

విధి ఒక విషాదగీతి నాలాపించింది -

త్యాగాన్ని స్వరంగా, కరుణను రాగంగా, ఆర్ద్రతను లయగా, అంతః కరణను పల్లవిగా మేళవించి.

ఆ గీతికకు 'కరుణ' బాబాయి జీవితం ఆలంబన.

ఆ గీతికను సరిగా ఆలకించక, పరిశీలించక ముద్రారాక్షసం చేసింది లోకం.

ఆ ముద్రా రాక్షసాన్ని గుర్తించి విశుద్ధ ప్రతిని 'దృశ్యత' గాంచటానికి ''ఒక జీవిత కాలం ''పట్టింది.

***

# మే ఎపోలుపు

రచన :

''తటవర్తి''

రాత్రిపన్నెండు గంటలయింది! లోకం నిద్రపోతోంది.

హోరున వర్షం కురుస్తూ ప్రకృతిని భీభత్సం చేస్తున్న సమయంలో ఆ భవనం నుంచి బయటకు పరుగుదీశాను. గుండెలకంటె వేగంగా కాళ్ళు దడదడలాడుతున్నాయి. కాళ్ళ నెవరో బలంగా లాగుతున్నట్లుగా అడుగు వేయటానికే ఆయాసం ముంచేస్తోంది. దేహంలోని శక్తినంతటినీ కూడదీసు కొని పరిగెత్తుతున్నాను.

''దొంగ! దొంగ!....''వెనకాల కేకలు. పోలీసు విజిల్సు....

సాధ్యమైనంతవరకు తారాజువ్వలా దూసుకుపోతున్నాను. మెయిన్ రోడ్డు వదలి చిన్న చిన్న సందులవెంట అడ్డదిడ్డంగా పరిగెత్తాను. శివాలయం వీధి దాటుతున్నప్పుడే ప్రక్కనేవున్న తోటలో స్వామీజీ ఆశ్రమం గుర్తుకు వచ్చింది. ఎక్కడలేని శక్తినన్నావరించుకొని ఆ తోటలోకి నడిపించింది. ఇప్పుడాపత్సమ యంలో ఆ శ్రయం ఇవ్వగల్గింది స్వామీజీ ఆశ్రమ మొక్కటే అనిపించి అటే పరుగుదీశాను.

స్వామీజీ కుటీరంలోకి వెళ్ళాను. నా బట్టలు పూర్తిగా తడిసిపోయాయి. ఆయాసం తీర్చుకుంటూ పంచలో నిలబడ్డాను..... కుటీరం తలుపులు దగ్గరగా

వేసి వున్నాయి. స్వామీజీ లోపల పడుకున్నారు కాబోలు! తలుపుసందుగుండా సన్నని దీపపుకాంతి రెపరెపలాడుతూ బయటకు (..)రిస్తోంది.

దూరంగా వినవస్తున్న పోలీసు విజిల్సు అంతకంతకుదగ్గరౌతున్నాయి. నన్ను నిలువునా భయం చుట్టేసింది.... ఇది వరకొక ఖూనీకోరిట్లాగే తప్పించుకుపోతే స్వామీజీ ఆశ్రమంలో పట్టుకున్నారు పోలీసులు. బహుశ వాళ్ళిప్పుడిటే రావచ్చు. ఏం చేయాలి? ఇప్పుడు బయటకు పోదామంటే మార్గమొక్కటే వుంది. అక్కడ తప్పకుండ పట్టుపడిపోతాను. ఇక తోటలో చెట్లలోకి దూరి ఆత్మరక్షణ చేసుకోవాలనుకుంటున్నాను. ఇంతలో ''ఎవరయ్యా నీవు?'' అన్న స్వామీజీ గొంతు వినిపించి నాలో నవచైతన్యం కల్గించింది. నేను వెనుదిరిగే లోపల చేత దీపంతో స్వామీజీ బయటకు వచ్చారు.

''నన్ను కాపాడండి స్వామీజీ! పోలీసులు తరుముతున్నారు. నేనేం తప్పుచేయలేదు.....'' అన్నాను గాద్గదికంగా, నా కళ్ళల్లో నీళ్ళుబికి వర్షపు నీటితో కలిసిపోయాయి.

స్వామీజీ ఒక క్షణం అన్యమస్కంగా ఉండిపోయారు. పోలీసుల విజిల్సు చాలాదగ్గరగా వినవస్తున్నాయి. నాలో కంగారు ఎక్కువైంది.

''సరే! లోపలికి వెళ్ళు. కదలకుండ తడిక చాటున కూర్చో!'' అన్నారు స్వామీజీ.

నాకు పోతున్న  ణం నిలబెట్టినట్లయింది. కుటీరం లోపలికి వెళ్ళి లో లగా తడికచాటున కూర్చుండిపోయాను. ఇద్దరు శిష్యులు మాత్రం ముందు గదిలో ఒడలు మరచి నిద్రపోతున్నారు. పోలీసుల సవ్వడి వినిపిస్తుందేమోనని చెవులు నిక్కించి వింటునాను.

కిరీటినం గదినం చక్రహ

మిచ్చామిత్వాం ద్రష్టు మ ం తథైవ

వ రు  ణ చతుర్భుజేన

సహస్ర బా  భ విశ్వమూర్తే.

స్వామీజీ కోమల కంఠంలోంచి భక్తిరసం జాలువారుతోంది. ఎప్పుడూ తలచుకోని ఆ భగవంతుడు ఇప్పుడు విశ్వరూప సందర్శనమిచ్చినట్లైంది....నా ఒడలు గగుర్పొడిచింది. ఆపద మొక్కులు మొక్కినట్లే అయింది మనస్సు. చలివల్ల బిగుసుకుపోయిన శరీరం సిగ్గుతో మరీ ముడుచుకుపోయింది.

''ఎవరది?'' స్వామీజీ గొంతు వినిపించింది నాకు. పోలీసులు వచ్చివుంటారు. నాగుండెలు దడదడకొట్టుకున్నాయి. వాయుస్తంభన చేసినట్లయింది నాకు....

''మేము స్వామీజీ! ఒక ఖూనీకోరు ఇట్లా పారిపోయివ డు. మీ ఆశ్రమం వైపు వ నట్లు మా అనుమానం.....'' అన్నదొక గొంతు. నా తలపై పిడుగుపడినట్లయింది అది. స్వామీజీ నమ్మి నన్ను పోలీసులకప్పగిస్తే! హతాశుడనై పోయాను. క్షణాలు లెక్కపెట్టసాగాను.

''ఖూనీ చేశాడా?'' స్వామీజీ గొంతులో ఏ మాత్రం కూడ ఆత్రుత, సందేహం లేవు.

''లేదు ప్రయత్నించాడు. విఫలమైంది. అదృష్టవశాత్తు సమయానికి మేము వచ్చాము. లేకపోతే నిష్కారణంగా చనిపోయేదామె!'' అని అతడే అన్నాడు.

''ఆమె ఎవరు?''

''ప్రఖ్యాత నర్తకి సులోచనాదేవి. ఆమె భర్త ఊళ్ళోలేడట. అర్ధరాత్రివేళ ఈ ఖూనీకోరు ఆమె భవనంలోకి చొరబడ్డాడు. డబ్బుకోసం బెదిరించాడట. ఆ గడబిడవిని దాసీది మాకు ఫోను చేసింది. మేము ఆ ఇల్లు చేరేసరికి పారిపోయాడు. తరుముకుంటూ వచ్చాము. శివాలయం వీధిలో అడుగుపెట్టేవరకు మా కళ్ళముందే పరిగెత్తినవాడు ఇట్టే మాయ మయ్యాడు.....''

అతడొక్కడే స్వామితో మాట్లాడుతున్నాడు. కాని తక్కినవాళ్ళు కుటీరం చుట్టుప్రక్కల తచ్చాడటం నాకు వినిపిస్తూనే వుంది. నా ప్రాణాలు స్వామీజీ చేతుల్లో ఉన్నాయని అనుకున్నాను.

''ఎక్కడా కనపడలేదోయ్ ఫోర్‌నాట్ వన్! తూర్పువీధివైపు పోయాడేమో! పదండి పోదాం....'' అని ఒక డన్నాడు. అంతా వీధి గుమ్మం ముందు చేరినట్లున్నారు.

''మేమిక వెడతాం స్వామీజీ! ఎవరైనా ఇటు వస్తే దయచేసి మాకు తెలియజేయండి.''

స్వామీజీ తల పంకించారో లేదో నాకు తెలియదుకాని, ఆయన గొంతు వినపడలేదు. ఐదు నిమిషాల్లో వాళ్ళ బూట్ల చప్పుడు మాయమై పోయింది.

స్వామీజీ లోపలికి వస్తూ కుటీరం తలుపులు మూయటం చూసి నేను బయటకు వచ్చాను తడిక చాటునుంచి....ఆయన ఒక్క క్షణం పాటు నావైపు తీవ్రంగా చూసి తల పంకించారు. వారి ముఖంలో ఏదో దివ్యతేజస్సు వెలిగిపోతోంది. నాకు ప్రాణదాతగా అయి దైవమనిపించారు వారు. నా హృదయం భక్తిభావంతో నిండిపోయింది.

''బట్టలు మార్చుకో నాయనా!.....''అని పొడి అంగవస్త్రాలు ఇచ్చారాయన. నేను నా బట్టలు విడిచి ఆరవేసుకున్నాను.

వారు కృష్ణాజినంపై కూర్చొని నన్ను చాపపై కూర్చోమన్నారు. అప్పటికి వర్షం త పోయింది.

''సులోచనని చంపబోయావని పోలీసులంటున్నారే! ఏది నిజం?''అని అడిగారు స్వామీజీ.

నేనొక్కక్షణం ఆగి అన్నాను:''స్థూలంగా చూస్తే వారిమాటే నిజం. కాని, దానికి బలవత్తర మైన కారణముంది''

''పొరపాటు, కారణమేదైనా ఒక ప్రాణిని హింసించే అధికారం నీకెవ్వరిచ్చారు?'' స్వామీజీ కంఠం తీవ్రమయింది. అయినా నేను జంకలేదు. అప్పటికే తేరుకొ వున్నాను.

''చేసిన ఉపకృతికి కృతఘ్నత చూపే వ్యక్తికి గుణపాఠం నేర్పవద్దా?''

''దానికి హింస ఆలంబన అనుకుంటున్నావా? వెర్రివాడా!..... అంతటి

ప్రతీకారవాంఛ నీలో ఉందంటే ఆ వ్యక్తికి నీవు గొప్ప ఉపకృతియే చేసియుంటావు. దానిమాట మరచి అవతలివ్యక్తి కృతఘ్నత చూపారన్న క్రోధంతో నీ హద్దులనే అతిక్రమించావు....దానివల్ల నీవిప్పుడెంత అపాయానికి గురయ్యావో చూశావా?.......''

''మీకు సులోచన ఎటువంటిదో తెలియదు స్వామీజీ! తెలిస్తే మీరిట్లా అనరు'' అన్నాను ఆవేశంగా.

ఆయన మందహాసం చేశారు. ''సరే! ఎటువంటిదో చెప్పు....''

''కటిక దరిద్రులింట్లో పుట్టిన సులోచనను, ఆమె తల్లిని కాపాడిన నేను నా ఆస్తిని పంచుకొని అన్నదమ్ములకు దూరమయ్యాను. దీనావస్థలో వున్న స్త్రీలు కదా అని, సాటివారుకదా అని వారితో సహజీవినై వారిని పోషించాను. అంతకుముందు సులోచన నాట్యం నేర్చుకుంటూ ఉండేదని, తండ్రి మరణంతో ఆర్థిక దుస్థితి వల్ల అది విరమించుకుందని నేను విన్నాను. పదమూడేళ్ళ వయసు పిల్లగా నాపోషణలోకి వచ్చిన సులోచన ఆరేళ్ళల్లో ''నాట్య సరస్వతి'' అయింది. ఆమె నాట్యకళ కోసమే నా ఆస్తిని వెచ్చించాను. ఆమె అభివృద్ధి నాకు కీర్తి తెస్తుందని ఎంతో పాటుపడ్డాను. ఆమె తల్లి ఏడాదిక్రితం మరణించింది....అయినా, ఆమెను నేను కంటికి రెప్పలా కాపాడుతూ వచ్చాను. రెండేళ్ళుగా దేశమంతటా చాలా ప్రదర్శన లిచ్చి సులోచన పేరు తెచ్చుకొంది. నా ఆశలు పండాయని ఆనందించాను. ఆమె నంతటిదానిని చేశానని ప్రపంచం గుర్తించకపోయినా నేను కించపడలేదు. ఆమె ఇంత ఉన్నత స్థితికి రావటానికి కారణమైన నన్ను కాలదన్ని ఒక ధనవంతుని పెళ్ళి చేసుకుంది. ఇదేనా కృతజ్ఞతచూపే విధానం? ఆమెను నేను ప్రేమించాను. అంతకు వెయ్యింతలు ఆమెకోసం నా సర్వస్వం త్యాగం చేశాను. బంధువులకు, ఆత్మీయులకు దూరమయ్యాను. కాని, ఒకనాటి ప్రదర్శనానికి వెళ్ళి ఆమె తిరిగిరాలేదు. నాకు జ్వరం వల్ల ఆ ప్రదర్శనానికి వెళ్ళలేదు. ఆమె ప్రదర్శనకు వెళ్ళనంటే నేనే పట్టుపట్టి పంపాను.....అదే ఆఖరి కలయికయింది.....

''ఆమె నన్ను కూడా ప్రేమిస్తుందనుకునే వాడిని కాని, ధనాశకు

లొంగిపోయింది. అయినా ఆమె నన్ను వివాహమాడలేదని నేను బాధపడలేదు. కనీసం తాను చేయబోయే పనిగురించి నాతో ఒక్కమాట మాట్లాడలేదు సరికదా పెళ్ళి చేసుకొని కూడా ఒక్కసారయినా నన్ను చూడడానికి రాలేదు. బయట కనిపించినా తల తిప్పుకు పోయేది. అదే నన్ను ప్రతీకారానికి పురికొల్పింది. అప్పటికీ ఈరాత్రి ఆమెను చంపివేద్దామని ఆమె ఇంటికి వెళ్ళినా ఆమె కాళ్ళపైపడి ప్రాధేయపడేసరికి నీరైపోయాను. ఇంతకు అదంతా మొసలి కన్నీరని పోలీసు విజిల్సు వినిపించేవరకు నాకు తెలియదు. లేకపోతే, ఆమెను దారుణంగా చంపివుండేవాడిని. పైగా తాను కొంత డబ్బిస్తానని వెళ్ళిపొమ్మని అంది. నాకు అసహ్యమేసింది, వెంటనే వెనుదిరిగాను.....పోలీసులు వచ్చినా న్ను కాపాడే ఉద్దేశ్యం లేదు సరిగదా నన్ను - హత్యాప్రయత్నం చేయబోయినందుకు - పట్టివ్వబోయింది. నా అదృష్టం వల్ల మీచేత రక్షించబడ్డాను. మీరే చెప్పండి స్వామీజీ! అంతటి నీచురాల్ని చంపి కాకులకు, గద్దలకు వేసినా పాపముంటుందా?'' అన్నాను ఆవేశాన్నణచుకుంటూ.

''( ని అ ం చేసుకోవటానికి ప్రయత్నించదలిస్తే ఆమెను ప్రేమించటం నే కోవాలి. ఆపని నీవు చేశావు. అందుకు తగిన ఉపకృతి చేశావు.....ఆమె నుండి నేర్చుకున్నది 'ధనంతో ఎటువంటి పనినైనా చేయవచ్చు''నని మాత్రమే! నీ ధనంతో ఆమెను కళాసరస్వతిని చేశావు. ఇక నీ వశక్తుడవు. ఆమె వేరొక మార్గం అనుసరించిందంటే ఆశ్చర్యమేముంది? అర్థాపేక్ష వున్న వా కి ప్రేమ, కృతజ్ఞత, పాపచింత అనునవి దరికిరావు. ఆమె ధనవ్యామోహం వల్ల నిన్ను దూరం చేసుకుంది. ఎప్పటికైనా ఆ మైకం నుంచి ఆమె తేరుకుంటే పశ్చాత్తాపపడి కు క్షమార్పణ చెప్పుకుంటుంది....నువ్వు ఉద్రేకంతో ఆమెకు నీతి నేర్పబోయి దారుణాన్ని తలపెట్టావు. కాని ఇంతగా నువ్వామెకై త్యాగం చేసినా ఆమె నీకు దూరమైందన్న స్వార్థగుణం నిన్ను వదలలేదు. అదే లేకపోతే నీ హృదయం కలుషితమై వుండేదికాదు.....''

స్వామీజీ మాటలకు నీరైపోయాను. ''ఒక వ్యక్తి వున్నతికోసం జీ త సౌలభ్యమే త్యాగం చేసిన నేను ఆ స్వార్థానికై నోచుకోకూడదా స్వామీజీ?'' అన్నాను గాద్గదికంగా.

''నీ ఆవేదన నా కర్థమైంది నాయనా! కాని, నీవా స్వార్థాన్ని కూడ విడనాడి తిరస్కరించిన వ్యక్తినే అధికంగా ప్రేమించ గల్గినప్పుడు సార్థక్యం వుంటుంది''

నేనింకేమీ మాట్లాడలేకపోయాను. హృదయం మా ం బరువుగా వుంది. ''ఇక పడుకో! మనస్సు నిర్మలంగా ఉంచుకుంటే కారు మబ్బులవే విడిపోతాయి.......'' అన్నారు వారు పైకి లేస్తూ.

చాపపై వాలిపోయాను. స్వామీజీ మాటలంతగా రూచించకపోయినా వాటిలో ఏదో నిజముందని మాత్రమనుకున్నాను. వారి మాటల్లోని విశిష్టతే అట్లా అనిపింపచేసింది. పైగా, పోలీసులు కూడ అనుమానించలేనట్లు వ్యవహరించగల్గినవారి వాక్శుద్ధి నా మనస్సు నుత్తేజపరచినట్లయింది....ఏదో విరక్తి భావం నన్ను చుట్టేసింది. ఎప్పుడు నిద్రపట్టిందో నాకు తెలియదు.

అరుణ కిరణాలు కిటికీలోంచి మీద పడగా మేల్కొన్నాను. ఒళ్ళంతా నొప్పులుగా వుంది. గత రాత్రి స్మృతులన్నీ ఒక్కసారి కనులముందు మెదిలాయి. పైకి లేచి కూర్చున్నాను.

పూజగదిలో స్వామీజీ ధ్యాననిమగ్నులై వున్నారు. నేను కుటీరం వెలుపలికి వచ్చాను. స్వామీజీ శిష్యులు ఏదో గ్రంథపఠనం చేస్తున్నాను. నన్ను చూడగానే వారిలో ఒకతను అన్నాడు ''బాబూ! కోనేటిలో ముఖం కడుక్కురండి. ఫలహారం చేద్దురుగాని....''

నేను మౌనంగా కుటీరం దాటి తోటలోపలికి వెళ్ళాను. మచ్చుకొకటి చొప్పున అక్కడ అన్నిరకాల చెట్లు ఉన్నాయనిపించింది నాకు. పక్షుల కలకలనాదంతో ఆ ప్రదేశమంతా చైతన్య వంతంగా వుంది. మనస్సు ఆర్ద్రతచెంది కడిగిన వెండిపళ్ళెరం సూర్యరశ్మికి మెరసినట్లుగావుంది. తోటమధ్యలో వున్న కోనేరు చేరుకున్నాను. ఒక ఉత్తరేణిపుల్లతో పళ్ళుతోముకొని ముఖం కడుక్కున్నాను.

ఆ చైతన్య ప్రకృతిని చూస్తూ పావుగంటసేపు నిలబడిపోయాను. ఇక ఆశ్రమం దాటి బయటి ప్రపంచంలోకి వెళ్ళాలనిపించలేదు. స్వామీజీ అనుమతితో ఇ డనే ఉండిపోవాలనుకున్నాను. గబగబ అడుగులు వేస్తూ కుటీరాన్ని చేరుకున్నాను.

''మా తోట మీ మనస్సు ఆకట్టుకున్నట్లుంది. రండి.... ఫలహారం చెయ్యండి'' అనా డొక శిష్యుడు.

''అవును, ఇక్కడ జీవించేవారికి అన్నం, నీళ్ళు అక్కర్లేదని ఇప్పుడే తెల్సుకున్నాను..... అది సరే, మీ పేరు?'' అని అడిగాను.

''విశ్వానంద. అతనిపేరు వజ్రానంద..... మేము స్వామీజీ ఉపదేశం పొంది నాల్గు సంవత్సరాలైంది. మాకు ప్రపంచమెట్లా మారుతుందో తెలియదు కాని, ఈ ఆశ్రమం, తోట నిత్యనూతనంగా ఉండటం తెలుసు. మేమిప్పుడే ఆత్మ సంయమయోగ సాధన చేస్తున్నాము. మీ విషయాలు స్వామీజీ చెప్పారు. వారు పూజనుంచి లేచే లోపల మీరు ఫలహారం చేస్తే తర్వాత మాట్లాడుకోవచ్చు''

నేను చదరాపై చతికిలబడ్డాను. విశ్వానందుడొక అరటాకులో అరటిపళ్ళు, బత్తాయి తొనలు, రెండు సీతాఫలాలు ఉంచి నా ముందు పెట్టాడు. నేను మ  లో నవ్వుకొని ఇటువంటి ఘడియ నా జీవితంలో వస్తుందని ఎప్పుడూ ఊహించనందు కాశ్చర్యపోయాను.

''మా ఆశ్రమవాసుల ఉపహారమిదే!'' అని నవ్వాడు వజ్రానందుడు.

విశ్వ వజ్రానందులు నా కంటె ఐదారేళ్ళు పెద్దవాళ్ళయి వుంటారు. వారి జీవనాన్ని నేను కూడ అనుభవించాలనిపించేసరికి ఒళ్ళు గగుర్పొడిచింది. ఫలహారం చేసి పాలుత్రాగిన ఐదు నిమిషాలకు స్వామీజీ పూజ ముగించుకొని వచ్చారు. నేను గౌరవంగా లేచి నిలబడి నమస్కరించాను.

''కూర్చో నాయనా!''అన్నారు వారు కృష్ణాజినంపై కూర్చుంటూ, నేను కూర్చున్నాను.

''ఇప్పుడు మనస్సు నిర్మలంగా వుందా?'' అని అడిగారు వారు ఆదరపురస్సరంగా.

''తమ ఆశీస్సుల వల్ల ఆ నిర్మలత్వం చెడకుండా వుండాలి. జీవితాన్ని మీ శుశ్రూషలోనే గడిపి జన్మధన్యతపర్చుకోవాలని వాంఛిస్తున్నాను''

స్వామీజీ మందహాసం చేశారు. ''యోగ సాధన సామాన్య విషయం కాదు నాయనా! మనఃక్లేశం వల్ల అది ఎదురుదెబ్బ తీస్తుంది కూడా. అయినా పట్టుకుని పాతికేళ్ళు నిండని నీవు సన్యాసాశ్రమవాసి వవటానికి వలనుపడదు''

''ఎందుచేత? మనోబలాన్ని చేకూర్చుకునే అర్హతకూడా లేదా నాకు?'' నాకంఠం ఆవేశపూరితమైంది.

''స్థూలంగా చూస్తే లేదనేచెప్పాలి. నీ ఆవేశ పూరిత హృదయానికి చిరుతవయస్సులో యోగసాధన అసాధ్యము వైరాగ్యభావాలతో సుడులు తిరుగుతున్నా నీ మనోసాగరం మా ఆశ్రమ జీవన మందమారుతానికి ప్రశాంతత వహించిందే కాని, నీవు దీర్ఘకాల మిక్కడ వుండలేవు''

''బయట ప్రపంచంలో మనశ్శాంతి కరువైన నాకు మీ శుశ్రూషవల్ల నిగ్రహశక్తి కల్గుతుందనే నా మనస్సు ఘోషిస్తోంది. నా ఈ ప్రస్తుత పరిస్థితికి అన్యచింత వల్ల నైతిక జీవనమే కలుషితమై నేనింకా భ్రష్టుడనైపోవచ్చును కదా తర్వాత నేను పశ్చాత్తాప పడిమాత్రం ప్రయోజనమేముంటుంది.''

స్వామీజీ ఒక్కక్షణం పాటు కళ్ళు మూసుకున్నారు. వెంటనే తెరచి ''మనశ్శాంతి కోసం ఇక్కడుండటానికేమి అభ్యంతరం లేదు....'' అన్నారు.

''మరి సాధన మాట.......'' అని నసిగాను.

ఆయన నవ్వి ''జిజ్ఞాసువు అయిన వాడిని విచ్చలవిడిగా పోనిచ్చినా, పూర్తిగా నిర్బంధించినా ప్రమాదమే!.....సరే, నా నిబంధనలు చాల కఠినంగా ఉంటాయిసుమా?'' అన్నారు.

''అవి నా మనో నిగ్రహాని కాలంబనలు కాకూడదా?'' అన్నాను చిన్నగా హసిస్తూ.

''నీ వయస్సుకు మించిన ఉత్తమ సంస్కారం ఉన్నందుకు సంతోషమే కాని దుస్సాహసం చేస్తున్నావని సందేహిస్తున్నాను. సరే పురోగామిని నిరుత్సాహపర్చటం నా కభిమతం కాదు. త్వరలో నీవు మనశ్శాంతినైనా పొందగల్గితే నేనే తృప్తిపడగలను.''

''మహాప్రసాదం'' అని నమస్కరించాను.

''.......రేపు ఉదయమే అనుష్ఠానము బోధిస్తాను. ఈపూట ంధస్థమైన నా ఉపన్యాసాలు చదువుదుగాని. కోనేటిస్నానం చేసిరా....'' అన్నారు స్వామీజీ.

సంతోషంతో స్నానం చేసి గబగబ కుటీరాన్ని సమీపిస్తుండగా స్వామీజీ మాటలు నాకు వినిపించాయి.''.... విశ్వం! ఇతడు మీకంటె త్వరలోనే నిగ్రహచిత్తుడు కావచ్చు. కాని ఏదో ఒకనాడు అంతటి నిగ్రహం కూడ నీటి బుడగలా వీగిపోతుంది. ప్రస్తుత స్థితికి అతని సంకల్పమే ఉత్తమ మనిపిస్తోంది నాకు కూడా....''

ఆశ్రమంలోకి నడిచాను. స్వామీజీ పల్కులు సగం ప్రోత్సాహాన్ని, సగం సందేహాన్ని కల్గించాయి. అయినా , భావికాలంలో కూడా నా నిగ్రహ శక్తినే దేదీప్యమానంగా వెలిగించాలని దృఢచిత్తుడనయ్యాను. విశ్వం పాడిబట్టలు ఇస్తే కట్టుకున్నాను. స్వామీ తన ఉపన్యాస గ్రంథాన్నిచ్చారు ఆసక్తిగా చదువసాగాను. గీతను సోదాహరణంగా వివరిస్తూ చక్కని శైలిలో ఉపన్యసించారు స్వామీజీ, నా మనస్సు తాదాత్మ్యం చెందినట్లే అయిపోయింది. మధ్యాహ్నం రెండు గంటలకు కాబోలు స్వామీజీ పిల్చేవరకు అట్లాగే ఉండిపోయాను. ''భోజనం చెయ్యి నాయనా! ఆ ధ్యాస కూడా మరచిపోగలిగిన నీ నిష్ఠ నాకు సంతోషం కలిగిస్తోంది'' నేను చిన్నగా నవ్వటం తప్ప మాట్లాడలేదు అప్పటికిగాని ఆకలివేస్తోందని తెలియలేదు.

''ఇటురండి'' అని విశ్వం బయటకు పిలిచాడు. అతన్ననుసరించాను. ఆ తోట ఆరెకరాల మేర వుంటుంది. ఐదునిమిషాల్లో వాయువ్య దిశగా ఒక పెద్ద కుటీరాన్ని చేరుకున్నాము. ''రా బాబూ! వేళకు అన్నపానీయాలు లేక యోగసాధన ఎట్లా చెయ్యగల్గుతావు?'' అంది వృద్ధమాత నవ్వుతూ ఆమె యోగిని అని చూడగానే అనుకున్నాను. నావివరాలడిగినప్పుడే అందరికీ తెలిసినందుకు క్షణం పాటు సిగ్గుపడ్డాను.

ఆమెకేభైయ్యేళ్ళుంటాయి. ఎంతో ఆప్యాయతగా భోజనం పెట్టిం .

పొన్నగంటికూర, పెసరపప్పు, సన్నబియ్యం అన్నం, గోధుమ రొట్టెలు, వెన్న..... ఈ స్వాతిక ఆహారం గొడ్డుకారం అలవాటయిన నాకు రుచించకపోయినా ఇక పరిపాటి కావలసింది అదే కదా అని తిన్నాను. తర్వాత కుటీరానికి వచ్చేశాము. వారిలో యోగిని స్వామీజీ భార్యయేనని, ఇరవై ఏళ్ళక్రితమే ఆ దంపతులిద్దరూ సన్యసించారని విశ్వం చెప్పాడు.

ఆ మరునాడు తెల్లవారుఝామున నాల్గుగంటలకే స్వామీజీ నన్ను మేల్కొల్పారు. యోగాసనాలుకొన్ని ఆచరించి చూపారు. ఇప్పట్లో నాకు దీక్షనిచ్చే వుద్దేశ్యం వారికిలేదని తెలుసుకున్నాను ఏమైనా వారేది చెప్తే అది ఆచరించే తలంపుతో వున్నాను. అనుష్ఠానవిధం బోధించారు.

నాకు 'శివానంద్' అని స్వామి నామకరణం చేశారు. నాకు క్రొత్త జన్మ ఎత్తినట్లే వుంది.

క్రమంగా నేను యోగాభ్యాసాని కలవడిపోయాను. ప్రతిరోజు తెల్లవారుఝామున నాల్గు గంటలనుంచి తెల్లవార వచ్చేవరకు ఆసనాలు వేయటం.....వెన్నతో ఒళ్ళంతా మర్దనా చేసుకొని వేడినీళ్ళతో తొట్టి స్నానం చేయటం, తర్వాత ఒక శేరు పాలు త్రాగటం అలవాటయిపోయింది. తర్వాత భగవత్ప్రార్థనతో రెండుగంటలు గడుపుతాను. అప్పుడు స్వామీజీతోగాని, వారి శిష్యులతోగాని తాత్వికచర్చ. పన్నెండింటికి భోజనం. ఒక గంట విశ్రాంతి. మరోరెండు గంటలు గ్రంథ పఠనం, లేకపోతే స్వామీజీ ఉపన్యాసాలు, బోధనలు మరికొన్ని గ్రంథస్థం చేస్తాను. నాల్గునుంచి ఆరు గంటలవరకు విశ్వ వజ్రానందులతో తోటపని చేస్తాను. స్నానం చేసి ఒగ గంట మౌనముద్ర వహిస్తాను. అప్పుడు మళ్ళీ ఫలహారం. తొమ్మిది గంటల వరకు ఎవరితోనో ఒకరితో చర్చ. మరో అరగంట ప్రార్థన చేసుకొని పడుకుంటాను.

ఇంచుమించు ఈ దినచర్యతో మూడు నెలలు నాకు తెలియకుండానే గడిచిపోయాయి. నా శరీరం ఎంత దృఢంగా ఉంటుందో, నాకప్పటికికాని తెలియలేదు. మనఃఫలకంపై సులోచన రూపం అస్పష్టమైపోయింది. క్రమంగా శాంతిని పొంద గలిగాను.

కాని, ఒంటరిగా ఉన్నప్పుడు స్వామీజీ తత్వగీతాలు పాడుకుంటూ ఉండేవాడిని. సులోచన నా దగ్గరికి రాకపూర్వం నేను సంగీతసాధన చేశానన్న విషయం నేనే మర్చిపోయాను. ఇప్పుడు నాకు తెలియకుండానే కంఠంలోని గానం ప్రవహించసాగింది. ఒకనాడు స్వామీజీ ఆవిషయం తెల్సుకొని గీతాపారాయణము, చర్చలు చేసేముందు నన్ను దగ్గర కూర్చోపెట్టుకొని ''శివా! నీ కమనీయ కంఠంతో ఆతత్వం పాడునాయనా!'' అనేవారు. నాకాయన ఆజ్ఞ వెయ్యి ఏనుగుల బలమిచ్చినట్లుండేది. నేను శ్లోకం పాడటం, తర్వాత వారు వ్యాఖ్యానం చేయడం దినచర్య అయిపోయింది. క్రమంగా నేనందరికీ తలలో నాలుక అయిపోయాను.

ఒకసారి ప్రక్కనే ఉన్న వూళ్ళో శ్రీరామసప్తాహానికి స్వామీజీని ఆహ్వానించారు. మేము వెళ్ళాము. నాల్గవ రోజున మధ్యాహ్నం మూడుగంటల నుంచి ఆరుగంటలవరకు వారి ఉపన్యాసం జరిగింది. పూర్తిగా వేదాంత బోధ కాక మానసిక రోగాలను మాన్పుకునే విధానాన్ని వారు చక్కగా చెప్పారు. పరిచయస్తులు చాలామంది నా స్థితి చూసి ఆశ్చర్యపోయారు. ప్రశ్నల వర్షం కురిపించారు. నేను నవ్వి వూరుకున్నాను. ధౌతవస్త్రాలలో, పెరిగిన గడ్డంతో నేను కూడా యోగిలా కనిపిస్తున్నాను కాబోలు వారికి!

'రాత్రి ఏడుగంటలకి ప్రఖ్యాత నర్తకి సులోచన భరతనాట్యం ప్రదర్శిస్తారు' అని మైక్‌లో ఎవరో చెప్తుంటే కొన్ని క్షణాలపాటు నా తల తిరిగిపోయింది. నేను కంగారుగా స్వామీజీ ముఖంలోకి చూసి తలదించుకున్నాను. వెంటనే అక్కడ నిలబడలేక మాబసవైపు నడిచాను. వెనకాల విశ్వం పిల్చినట్లే అయినా వెనక్కు వెళ్ళాలనిపించలేదు. బసలో ఉన్నా అ డ కూడ ఏదో అశాంతి ఆవరించుకుంది. అక్కడికి దగ్గరలోనే ఉన్న కాలవలో స్నానం చేద్దామని వెళ్ళాను. దూరంగా దీపాల కాంతిలో కన్పిస్తోంది. స్నానం చేద్దామని వెళ్ళానేకాని రేవులో చీడీపై కూ ండిపోయాను. తిరిగి మనస్సు పాడైపోవటానికే ఈ సప్తాహానికి వచ్చాననిపించింది. ఈ ప్రపంచంలోకి వస్తే నిగ్రహించుకునే శక్తి సడలిపోతోందని అప్పుడు కాని నాకు తెలియలేదు.

ఏదో ధమ్మ్మని నీళ్ళలోపడిన చప్పుడైతే ఆలోచనల్లోంచి ఉలిక్కిపడి

అటు చూశాను. ద్వాదశ చంద్రోదయం కానున్న ఆ వెలుగులో నాకు ఎవరో కాలవలోకురికినట్లే కన్పించింది. ఒక్క క్షణం ఆలోచించాను. ఎవరైనా స్నానం చేయటానికైతే ప్రక్కనే రేవు ఉండగా అక్కడ ఎందుకురుకుతారు? ఆ ఆలోచన రాగానే వెంటనే అంగవస్త్రం నడుముకు కట్టుకొని గబుక్కున నీళ్ళలో కురికాను. ఆ వ్యక్తి ఉరికిన చోటుకి ఈది బుడింగిన మునిగాను. చేతికి బారెడు పొడుగున ఏదో దొరికింది. పట్టుకొనేసరికి బరువుగా ఉండటంతో నీటిపైకి తేల్చాను. ఆమె ఒక స్త్రీ! నా చేతిలో ఆమె జడ వుండి, నా గుండెలెందుకో దడదడలాడాయి.

రెండుచేతులతోను ఎత్తుకొని రేవువైపు నడిచాను. గట్టుపై పడుకో బెట్టాను. ఆమె స్పృహ కోల్పోయింది. ఇరవయ్యేళ్ళకు లోపే ఉంటాయి. ఇంతవరకు పరాయిస్త్రీని తాకి ఎరుగను. కాని, ఆపత్సమయం అని మనస్సు హెచ్చరించింది. వెంటనే పొట్ట గట్టిగా నొక్కి మింగిన నీళ్ళన్నీ బయటకు రప్పించాను. ఆమెను మళ్ళీఎత్తుకొని బస చేరుకున్నాను. నన్ను చూసి స్వామీజీ, విశ్వం ,వజ్రం తెల్లబోయారు. విశ్వం నాకు ఆసరా వచ్చాడు. ఇద్దరం ఆమెను చాపపై పడుకోబెట్టాము. ముగ్గురం కలిసి ఆమెకు ప్రథమ చికిత్స చేశాము. వజ్రం కుంపటితో నిప్పులు తెచ్చాడు. కాళ్ళు చేతులు కాచాము. పావుగంటకామెకు స్పృహ వచ్చింది. మా ముఖాలు వికసించాయి..... నన్ను స్వామీజీ ఏమీ ప్రశ్నించక పోవటం నాకు ఆశ్చర్యం కలిగించింది.

ఆమె కళ్ళుతెరుస్తూనే మమ్మల్ని చూసి తెల్లబోయి పైకి లేచింది. ''ఈమధుపర్కం కట్టుకురామ్మా! తర్వాత మాట్లాడదాం!'' అని స్వామీజీ పొడివస్త్రం ఇచ్చారు. ఆమె హరితేక్షణయై ప్రక్కగదిలోకి వెళ్ళి కట్టుకుని ఐదునిమిషాల్లో వచ్చింది జుట్టు అరవిప్పుకుంది.

''నీవెందుకు నీళ్ళల్లో పడ్డావమ్మా!'' అని అడిగారు స్వామీజీ అదే వారి ఉపజ్ఞ!

ఆమె తలవంచుకుంది కనులలో నీరుబకడం నేను గుర్తించాను. ''నేను నిర్భాగ్యురాల్ని స్వామీ! జీవితంపై రోతపుట్టింది.....''

''ఎంత పిచ్చిదానవమ్మా! ప్రాణాలు తీసుకునే హక్కు మానవులకి లేదు. కష్టాలకుభయపడి ఆత్మహత్య చేసుకోవడం అవివేకం. ఇంతకీ నీకు వచ్చిన కష్టమేమిటో చెప్పు. నీకు అన్నివిధాల నేనుసహాయం చేస్తాను'' అన్నారు స్వామీజీ.

ఒక్క క్షణం తటపటాయించి ''నేను ఒక అనాధని. చిన్నతనంలో నా తల్లి పతిత అయిన చిహ్నంగా నేను జన్మించాను. ఇంతవరకు నా తల్లిగా నేను ఆరాధించిన స్త్రీ ఒక వేశ్య అని నాకు కొన్నాళ్ళక్రితమే తెల్సింది నన్ను ఆ వేశ్య ఇంతవరకు పెంచి పెద్దచేసినది ఆ నీచ వృత్తిలోకి దించటానికే.....కాని, నేనందు కంగీకరించలేదు అందుకునన్ను నరకయాతనలకి గురి చేసింది. అయినా, నేను లొంగలేదు. ఈరాత్రి లొంగినట్లు నమ్మించి ఇల్లువదలి పారిపోయివస్తూ దారిలో కాలవలో కురికాను. నన్ను కాపాడండి నాకు ముక్తిమార్గం చూపించండి, నా అదృష్టం కొద్దీ నన్ను మీరు రక్షించారు'' అంది ఆమె.

''నిన్ను కాపాడినవాడు మా శివానందుడు''అని నావైపు చూపారు స్వామీజీ. ఆమె నావైపు కృతజ్ఞతతో చూసింది. నా ఒళ్ళు గగుర్పొడిచింది.

స్వామీజీ ఒక్క నిమిషం ఆలోచించి, 'వజ్రం వెంటనే పట్నానికి బండి సిద్ధం చేయించు'' అన్నారు.

వారి ఆజ్ఞ అయినదే తడవు అతడు తనవిధి నెరవేర్చుకున్నాడు. ''శివా! నువ్వీమెను తీసుకొని ఆ మానికి వెళ్ళిపో!'' అన్నారు. నాకాయన మాటలు ఆశ్చర్యం కలిగించాయి. అయినా, ఎందుకూ అన్న ప్రశ్న వేసే అలవాటు తప్పిపోయింది. ఐదునిమిషాల్లో ఆమె నేను ఒంటెద్దుబండిలో బయలుదేరాము. ఒక నిండుప్రాణాన్ని రక్షించగల్గానన్న తృప్తి నాకు హాయిని చేకూర్చింది. మనస్సు ప్రశాంతం వహించింది. నేనామెను పలకరించలేదు. రాత్రి పదిన్నరకి పట్నంలో ఆశ్రమానికి చేరుకున్నాము. వృద్ధమాత కామెనప్పగించి పాలుత్రాగిపడుకున్నాను. మరునాడు ఉదయం ఐదుగంటలకికాని మెలకువ రాలేదు. దినకృత్యంలో ప్రథమ భాగం పూర్తయ్యే సరికి సూర్యుడు బారెడు ప్రొద్దెక్కాడు. అప్పుడే స్వామీజీ శిష్య ప్రజానందులతో వచ్చారు.

నేను పాలుత్రాగుదామని కుటీరానికి వెళ్ళాను. పంచలో కూర్చొని ఆమె

పూలమాల గుచ్చుతోంది. కణ్వమహర్షి ఆశ్రమజ్యోతి శకుంతలయేమో ననిపించిందినాకు. మనస్సు నిమిషం పాటు చలించకపోలేదు, ఆమె చిన్నగా నవ్వింది. ఆ నవ్వును అర్థంచేసుకోవటానికి నేను ప్రయత్నించలేదు. కళ్ళుమూసుకొని నిగ్రహాన్ని తెచ్చుకున్నాను. లోపలికి వెళ్ళి మాతనడిగి పాలు త్రాగాను తిన్నగా కుటీరాన్ని చేరుకున్నాను. వృద్ధమాత వెనకాల పిల్చిన పిలుపునుబట్టి ఆమె పేరు గౌరి అని తెల్సుకున్నాను.

''శివానంద్! రాత్రి నీవటు వెళ్ళగానే సులోచన నాట్యమైన తర్వాత స్వామీజీని కలుసుకుంది. ఆమె ఇప్పుడు పశ్చాత్తాపపడుతోంది. స్వామి మాటలు నిజమయ్యాయి. ఆమె కిప్పుడు నీ త్యాగం అర్థమయింది. అది మాత్రం నిజం. వస్తువు దూరమయ్యాక కాని దాని విలువ తెలియదు'' అన్నాడు విశ్వం.

''దయయుంచి ఆమె విషయాలు నా వద్ద చెప్పకు'' అని అక్కడ నుంచి గ్రంథపఠనానికి వెళ్ళిపోయాను. సులోచన తాలూకు వాద్యగాంద్రంతా నాకు పరిచయస్తులే. వాళ్ళల్లో ఎవరో నన్ను చూచి సులోచనకు నా ఉనికిని తెలియపర్చివుంటారు. ఇప్పుడిప్పుడే ఆమె మనస్సు పరితాపంచెందటం నాకకొవిధంగా సంతోషం కల్గించినా తీవ్రవ్యధ కల్గింది ఆమె తలంపువల్ల. క్రమంగా స్త్రీ ప్రసక్తే మర్చిపోవాలని ప్రయత్నం చేయసాగాను.

రోజులు దొర్లిపోతున్నాయి. దినకృత్యం యధాతథంగానే వుంది. కొన్నాళ్ళవరకు అందులోని మార్పు నాకు తెలియదు. నాకేవస్తువు కావలసినా, నాకు భోజనపదార్థాలు సిద్ధంచేయవల్సినా గౌరియే చేసేది. స్వామీజీ బోధనలు వినేటప్పుడు , పూజలోను ఆమె కూడ అనుసరించటం వల్ల నేను సోదర శిష్యులతోసమంగానే ఆమెను పరిగణిస్తూ వచ్చాను. కాని, నాకు ప్రత్యేకంగా సేవచేయటం నాకాశ్చర్యం కలిగించింది. అప్పటికీ ఒకరోజున ఆమె నట్లా చెయ్యవద్దంటే ''స్వామీజీ ఆజ్ఞ నేనుమాత్రం నిర్వర్తించవద్దా? యోగుల సేవ యటంతో నైనా నా జన్మ చరితార్థత నొందాలనుకుంటున్నాను. మిరనుగ్రహించండి. ''అంది నేను మ్రాన్పడిపోయాను.

స్వామీజీ నన్ను పరీక్షిస్తున్నారో, లేక యోగసాధననుంచి నన్ను

మరల్చటానికి ఆటంకపెడుతున్నారో నాకర్థంకాలేదు. అయినా అదీ నామేలుకేననిపించింది. నా నిగ్రహ శక్తి మరింత పటిష్టం కాగలదు. వారు దీక్ష నివ్వకపోయినా కఠినదీక్షను నాకు నేనే ఇచ్చుకోవాలనుకున్నాను. కాని, తక్షణం సౌదర్యలతికలా మెరిసిపోతూ నా ఎదుట చరించే గౌరి నా మనస్సు నుద్రేకపర్చటం నాకు సంకటప్రాయమైంది. ఆ పరిస్థితి నధిగమించుదామని ఎక్కువగా భగవత్ప్రార్థనలో గడపసాగాను. మండుటెండలో కొన్ని గంటల సేపు రాతిమీద కూర్చొని ఓంకారాన్ని జపిస్తూ ఉండేవాడిని. మొదట్లో కాళ్ళుకాలి బొబ్బలెక్కినా శరీరం బండబారిపోయింది కొన్ని రాత్రిళ్ళు తీవ్రంగా వర్షం కురిస్తే ఆ గాలివానలోనే కొన్ని గంటల సేపు ఉండిపోయేవాడిని. ఒకనాటి రా నేనట్లా వర్షంలో ఒక గంటసేపు అధికంగా వున్నాను. చలివల్ల ఈతిబాధ మనస్సుకంటలేదు. కాని, శరీరం భరించలేదుగా! మరునాడుదయం ఒళ్ళంతా నొప్పులతో పేలిపోయే జ్వరం వచ్చేసింది. నాకు రెండురోజుల దాకా తెలివిలేదని మూడోనాడుదయం వృద్ధమాత, గౌరి, విశ్వం, వజ్రం స్వామీజీ - అంతా నామంచం చుట్టూ ఉన్నప్పుడు స్వామీజీ నోటి వెంట వినేవరకు నాకు తెలియలేదు.

నేనా జ్వరం నుంచి తేరుకోవటానికి సరిగ్గా ఇరవై రెండు రోజులు పట్టింది. ఇన్ని రోజులూ గౌరి నన్ను కంటికి రెప్పలా కాపాడి సేవచేసింది. నేనుతిరిగి పూ ్స్థితికి వచ్చేశానేమోనని పించింది. ఆమెపై అనురాగ భావాలు మనస్సును చుట్టవేసాయి. మొదట్లో అవి కృతజ్ఞతతో కూడుకున్నవే కాని తర్వాత అనామకురాలైన ఒక యువతీహృదయం తోటి ప్రాణికోసం అహర్నిశలూ పాటుపడుతోందే అన్న భావం మనస్సును ఆర్ద్రతతో నింపివేసింది అయినా, ఌ చూపుల నుండి తప్పించుకొ ధ్యానముద్రలో పడిపోయేవాడిని.

ఆవేళ్టికి పూర్తిగా ఆరోగ్యవంతుడనయ్యాను. సాయంత్రం స్వామీజీ నన్ను తోటలోకి తీసుకువెళ్ళి ''నాయనా! నీవు శరీరాని కధిక పరిశ్రమ ఇవ్వటం నే మనోనిగ్రహాన్ని సంపాదించలేవు. మరి దీక్షకు సిద్ధంగా ఉన్నావా?'' అన్నారు.

''తమ ఆశీర్వాదం వల్ల ఆ అ ్ ్ర దక్కాలనే కోరుతున్నాను'' అన్నాను

ఆనందంగా. కాని, వారి పెదవులమాటున చిరుహాసం నన్ను సందిగ్ధంలో పెట్టింది.

''సరే! ముందు వ్యక్తిత్వం వ్యామోహం తగ్గి మనస్సుమీదనే దీక్ష పనిచేయాలంటే నీ వన్ని ఈతిబాధలకు అతీతుడవు కావాలి. నేను చెప్పిన పని అల్లా చెయ్యగలవా?''

''ఆ ప్రశ్న నాకు ప్రత్యేకించవద్దు'' అన్నాను చిరుహాసంతో.

తత్ఫలితంగా వారి నూతన శిష్యులతో నేను క్రొత్తరకం జీవితానికి పాల్పడవలసి వచ్చింది. స్వామీజీ పంపినచోటుకల్లా వెళ్ళాము. ఒక ఊరిలో తీవ్రంగా కలరావ్యాధి ప్రబలివుంది. అనాథులైన వారికి సేవ చేయడానికి వెళ్ళాము. వారి మల మూత్రాలు ఎత్తాము. ఒక కుష్ఠురోగుల చికిత్సాలయంలో పదిరోజులుండమని స్వామీజీ ఆజ్ఞాపించారు. అప్పటికే మానవసేవా తత్పరులమై అందులోని ఆనందాన్ని చవిచూస్తున్న మాకు ఏహ్యమనే వస్తువు ఈ ప్రపంచంలో లేదనిపించింది. అరిషడ్వర్గాలను జయించటానికే స్వామీజీ మమ్మల్నిట్లా పరీక్షిస్తున్నారని మాకుతెలుసు. మనోవాక్కాయ కర్మలా అట్లే ఆచరించాము. మరో పదిరోజులు ఒక పిచ్చాసుపత్రిలో గడిపాము. ఇట్లా దేశాటన చేస్తూ మూడు నెలలకి ఆశ్రమాన్ని చేరుకున్నాము. స్వామీజీ ఆనందం వర్ణనాతీతమైంది. మాకూ తృప్తి కల్గింది.

ఒకరోజున స్వామీజీ మమ్మల్నిపిల్చి పట్నం భిక్షాటనకి వెళ్ళమన్నారు. ఆపని మాకు ఏహ్యమనిపించలేదు. అయినా పంచమస్థులెక్కువగా లేనివైపుకే భిక్షాటన కెళ్ళటానికి మనస్సు మొదటి రోజున లొంగిపోయింది. కాని మరునాడు ఆ స్థితిని కూడ అధిగమించగలిగాము. కొందరు ప్రశ్నలు వేసినా "జీవితాన్వేషణ అనేది మానవధర్మం. అందులో నాకు కనబడిన సుగమ్యమైన దీమార్గమే....." అని మాత్రం అన్నాను. తత్వాలు పాడుకుంటూ భిక్షాటన చేశాను. పదిహే రోజులట్లా గడిచిపోయాయి. రోజూ రెండు మూడుకుంచాల బియ్యం వచ్చేవి. ఆవేళ ఇక ఆ పని మానివెయ్యమన్నారు స్వామీజీ. రేపే దీక్షని నన్నారు. నాకు చాల ఆనందమైంది. క్రమంగా ఆత్మ సంయమ యోగాన్ని

సాధించాలని దృఢచిత్తుడనయ్యాను. స్నానం చేసి సంధ్యావందనం ముగించుకొని, ఒక గంటసేపు మౌనముద్రలో ఓంకారాన్ని జపించాను. భోజనం చేయటానికి కుటీరాన్ని చేరుకున్నాను. గుమ్మంలో నా కోసమే ఎదురుచూస్తున్నట్లుగా నిలబడివుంది గౌరి. ఆమె ముఖంలో జ్యోత్స్న తళుకుమంటోంది. మౌనంగా భోజన శాలలోకి వెళ్ళికూర్చున్నాను. అరటియాకులో భోజనం వడ్డిస్తోంది గౌరి. ప్రతి రోజు మాతయే అన్నం పెట్టేది. కాని ఆమెకీవేళ ఆరోగ్యం సరిగాలేదని మధ్యాహ్నమే తెలుసుకున్నాను. మాటిమాటికీ అది వడ్డించనా, ఇది వడ్డించనా- అని గౌరి అడిగేది, వద్దని చేతితో సంజ్ఞ చేశానే తప్ప పలుకాడలేదు. భోజనం వేళ మౌనం పాటించటం నా కలవాటైపోయింది. తలవంచుకొని భోజనం ముగించుకొని తిన్నగా బయటకు నడిచాను.

దారిలోకోనేటి పక్కనుంచి వస్తుంటే పౌర్ణమి చంద్రుని వెన్నెల వెలుగులో కలువలు విచ్చుకొని తళతళ లాడటం చూచాను. తోటలో ప్రతిదీ నవచైతన్యంతో వెలిగిపోతోంది. నా మనస్సుని ఏదోమైకం క్రమ్మినట్లయింది. ఒకరాతిబండపై చతికిలబడ్డాను. చంద్రునివైపు చూస్తూ వెనుకనున్న రాతికి జారగిలబడ్డాను. అకస్మాత్తుగా చంద్రబింబంలో గౌరిముఖం కనిపించింది. వెంటనే ఆ బింబం సులోచనదిగా మారిపోయింది. ఆ అనుభూతి క్షణం మా త్రమే! ఉలిక్కిపడి తెలివితెచ కొన్నాను. మళ్ళీ మనస్సు చలించకుండా కళ్ళుమూసుకొని ధ్యానముద్రలో వుండిపోయాను.

అట్లా ఎంతసేపు వున్నానో తెలియదు కాని వర్షపు చినుకులు పాదములమీద పడి ట్లయి తెలివితెచ కున్నాను. నా పాదాల వద్ద అవనత శిరస్కయై ఉన్న గౌరిని చూసేస కులిక్కి పడ్డాను. నాలో కంగారు ఎక్కువయింది.

''గౌరీ!'' అంతవరకు ఆమె నెప్పుడూ నేను పేరు పెట్టి పిల్చి ఎ... . అసలు మాట్లాడటమే తక్కువ, ఆ పిలుపు నా నుండి రావడంతో ఏదో శక్తిక్షీణించి గగుర్పాటు అధికమైంది. ఆమె తల ఎత్తి నా వైపు చూసింది. ఆమె

చెక్కిళ్ళపై కన్నీటిధారలు స్పష్టంగా కనిపించాయి! నామనస్సు వికలమైపోయింది. ఏదో ఓడిపోతున్నట్లని పించింది. మనస్సులో ఏదో అపశ్రుతి గొంతెత్తి పలుకుతున్నట్లనిపించింది. అక్కడ నిలబడలేకపోయాను. గబగబ కుటీరం వైపు అడుగులు వేశాను. పక్కమీద కూర్చున్నాను. అయినా మనస్సు గౌరిబాధను తెలుసకోందే వచ్చేశానని నిందిస్తోంది. ఆత్మనిగ్రహశక్తిని కోల్పోతావా అని హెచ్చరిస్తోంది. 'నిగ్రహానుగ్రహాతీతమైన శక్తి సాధించిన వారికి తప్ప అన్యులకుకాదు యోగసాధన' అన్న స్వామీజీ హెచ్చరిక అంతరాలలో వినిపించింది. ఉద్రేకాన్ని భరించలేకపోయాను. గబగబా దీపజ్వాలపై నా రెండు అరచేతులు పెట్టి కళ్ళుమూసుకున్నాను. భగ్గున మండిపోయాయి చేతులు. మరోక్షణంలో ఏమయ్యేదో ఊహించలేనుకాని, ''శివా! శివా!'' అన్న స్వామీజీ గంభీర కంఠధ్వని గట్టిగా వినిపించటంతో చేతులు జ్యోతినుంచి వేరుచేశాను. అప్పుడు శరీరం వణక నారంభించింది. చేతులు జ్వాలపై ఉన్నప్పటికంటె మరీమండిపోతున్నాయి. చేతులు రెండూ పుళ్ళుపడిపోయాయి. స్వామీజీ ఏదో పసరు తెచ్చి చేతులపై పోశారు. మరీ మంట ఎక్కువైంది. నా కళ్ళలో నీళ్ళు నిలిచాయి. గుండెలు బరువెక్కిపోయాయి.

''శివా! ఎంతపనిచేశావు నాయనా! మనస్సు చలించినందుకు దానిక వెయ్యవలసిన శిక్ష శరీరానికి వెయ్యటం ఉచితమేనా? ఇన్నాళ్ళనుంచి నీకుచెప్పలేదు - నీ నిష్టను పాడుచేయటం ఇష్టం లేక. నీవిక్కడికివచ్చి అప్పుడే పదకొండు మాసాలయింది. నిన్ను దూరంచేసుకున్నాక సులోచన పశ్చాత్తాపపడటం నాకు తెలుసు. ఐదు నెలలప్పుడు ఒక ప్రదర్శనకి వెడుతూండగా కారు ప్రమాదంలో సులోచన భర్త మరణించాడు. ఆమె కుడి కాలు విరిగిపోయింది. ఆమె అన్నివిధాల దురదృష్టవంతురాలైంది. నీవు ఆమధ్య కుష్టు రోగుల చికిత్సాలయానికి వెళ్ళినప్పుడు రెండుసార్లు ఇక్కడికి వచ్చింది. వెంటనే ఆమె దగ్గరకు వెళ్ళునాయనా! ఆమె నెలలునిండిన గర్భవతి. నీ కోసం ఎదురుచూస్తోంది. సాయంత్రం కబురువచ్చింది కూడా!......'' అన్నారు స్వామీజీ.

అప్పటికే నా కళ్ళు వరదలై పారుతున్నాయి. దుఃఖం ముంచుకు వస్తోంది. బరువు తీరేవరకు ఏడ్చాను. నాచేతుల విషయం మర్చేపోయాను. విశ్వం నాకు సాయం రాగా సులోచన దగ్గరికి పరుగుతీశాను......ఒక పావుగంటలో ఆ భవంతి చేరుకున్నాను. అప్పుడు రాత్రి పదకొండయివుంటుంది. క్రితంసారి నేనా ఇంటికి వెళ్ళింది అదే సమయానికి. మనస్సు పూర్తిగా కల్లోలితమై పోయి అడుగులు బరువుగా పడసాగాయి. వాకిట్లో దీనముఖంతో వున్న ఆనాటి దాసీది నన్ను క్షణంలో గుర్తుపట్టి ''వచ్చారా బాబూ! అమ్మగారు పురుటినొప్పులతో బాధపడుతున్నారని, ఆపరేషన్ చేస్తేగాని లాభంలేదని హాస్పటలు కింతకుముందే తీసుకువెళ్ళారు'' అంది అయోమయంగా పిచ్చిగా బయటకు పరిగెత్తాను.

రోడ్డుమీద అడ్డదిడ్డంగా నడుస్తుంటే విశ్వం నా చెయ్యి పట్టుకొని నడవసాగాడు. నేను పూర్తిగా అచేతన స్థితిలో ఉన్నాననే చెప్పాలి. మేము హాస్పటలుకు చేరుకున్న ఐదు నిమిషాలకు ఆపరేషన్ అయిందని మొగపిల్లవాడు పుట్టాడని నర్సు చెప్పేసరికి కొంత తేరుకున్నాను.

అరగంటకి డాక్టరు సులోచనను చూడటానికి మాకనుమతి ఇచ్చారు. ఆమెను చూడగానే ఇద్దరూ కన్నీటి ప్రవాహంతో మాటలు స్తంభించిపోయాయి.

''బావా! నన్ను క్షమించావా? నిన్ను కాలదన్నుకున్న ఈ పాపి కింతకంటె ఏం శిక్ష కావాలి?.....తు ఘడియల్లో నిన్ను చూడలేక పోయాన్న బాధ కుండా పోతున్నందుకు నాకిప్పుడెంతో ఆనందంగా వుంది. నీ జీవితం ధారపోసి పెంచిన ఈ పుష్పలత స్వార్థం వల్ల ఎంత అధోగతి పాలైందో చూశావా? అటువంటి క్ష ఈ పసిగుడ్డుకు పడకూడదని నిన్ను అర్థిస్తున్నాను. నాకామాట ఇస్తే హాయిగా మరణిస్తాను.....'' అంది సులోచన.

. చిన్ననాటి ఆమె లుపు నామనస్సుని మరింత వశం చేసుకుంది. ''సులోచనా! నువ్వు చావటానికి వీల్లేదు నేను నీ తిరస్కృతి వల్ల నిన్ను ద్వేషించినా నిన్ను తప్ప ఎవ్వర్నీ ఇంతవరకు ప్రేమదేవతగా ఆరాధించలేదు''

ఎన్నో మాట్లాడాను. భగవంతుని మనస్ఫూర్తిగా ప్రార్థించాను. ఎన్ని చేసినా సులోచన తగ్గలేదు....నాకు తెలివి తప్పిపోయింది. తెలివి తెచ్చుకునేసరికి

తెలతెలవారుతోంది. అప్పటికి కాని ఆశ్రమానికి నన్ను తీసుకువచ్చారని తెలియలేదు. స్వామీజీ ఒక్క నా ప్రక్కన ఉన్నారు.

గబుక్కున పైకి లేచాను. స్వామీ! సులోచన.....ఆపైన నానోటినుంచి మాటలు రాలేదు. నీ హృదయంలో ఆమె స్మృతి, ఆమె రూపం ధరించిన పసిబిడ్డ తప్ప ఆమె ఇక లేదు సులోచన అంతటి ఉన్నత స్థితికి రావటం నీ వల్లనే! ఆమె తదుపరి భ్రష్టత వేరేవిషయం. ఇప్పుడు నీపై ఆ పసిబిడ్డ ఆధారపడివున్నాడు. నువ్వు నీ ప్రేమపుంజాన్ని ఆ బిడ్డపై ప్రసరించవల్సివుంది. శివా! నువ్వ బాధ్యతాయుతమైన జీవితాన్నుంచి పారిపోదామని ప్రయత్నించావు. ప్రత్యక్ష పరోక్షాలుగా అది నిన్ను వెంటాడుతూనే వుంది. గౌరి నీ వల్ల రక్షింపబడటమే కాకుండ అందుకు కృతజ్ఞతగా నీకహర్నిశలూ సేవచేస్తూ మనస్సు కూడా అర్పించింది. యోగసాధనా నిమగ్నుడవై మనస్సు నిగ్రహించుకోనూ లేక, బాధ్యతాయుత జీవితాన్ననుభవించనూ లేక నలిగి పోయావు. ఒకరి కానందం కల్గిస్తునీవానందిస్తు పురుషార్ధ సాధన చేయడంలో గల తృప్తి ఈకఠిన యోగనిష్ఠలో కలుగదు. ఇప్పుడు నీవా అనాధ హృదయాలలో ప్రేమామృతాన్ని నింపవల్సివుంది. మాతృవిహీనుడైన ఆ బిడ్డను తన పొత్తిళ్ళలోకి తీసుకొంది గౌరి. ఆమె నీకంటె నిగ్రహవంతురాలు. నీ నిష్ఠను భంగపరచలేక నీపైనుంచి మనస్సును త్రిప్పుకోలేక ఎంతోబాధపడింది. నీలో సంపూర్ణ మానవత్వం మేల్కొనవలసిన సమయం వచ్చింది. జీవితం జీవించటానికే అన్న సత్యం వంటిదే. ఒకరి హృదయంలో స్థానం సంపాదించినందుకు వారికి హృదయ మర్పించడం కూడా మానవత్వమన్న సత్యమూను. నీ జిజ్ఞాసవల్ల ఈ సత్యం తెలుసుకుంటే ధన్యుడవౌతావు'' అన్నారు స్వామీజీ నా ఒళ్లు నిమురుతూ.

అంతవరకు వారు నన్నెప్పుడూ తాకి ఎరుగరు. వారి స్పర్శతో నాలో ఏదో శక్తి ఉత్పన్నమైనట్లయింది. వారి తేజోమయ నేత్రాల నవలోకించేసరికి ఏదో ఉన్నత భావానుభూతి కల్గినట్లయింది. ''తమ ఆజ్ఞ శిరసావహిస్తాను. స్వామీ! నాకో ప్రగతి పథం చూపారు'' అన్నాను. ఆనంద బాష్పాలతో గౌరిని కల్సుకుందామని వృద్ధమాత కుటీరంవైపు వడివడిగా అడుగులు వేశాను.

# జీ వలయాలు

రచన :

శ్రీమతి దర్భా భాస్కరమ్మ

భుజం మీది పాపను జోకొడుతూ పచార్లు చేస్తున్నాడుజగన్నాధం! నిరాశా నిరుత్సాహాల కూడలిలా ఉందాతని ముఖం. సగం నెరిసిన శిరోజాలు చిందరవందరగా ముఖం మీద పడుతున్నాయి. లోతుకు పోయిన కళ్లు నీళ్ళనిముడ్చుకుందుకు విఫల ప్రయత్నం చేస్తున్నాయి. ఆవేదన దాచలేని హృదయం, నిట్టూర్పులను వెలికి పంపుతోంది. యాంత్రికంగానే అవయవాలు వేటిపని అవి నెరవేరుస్తున్నాయి.

పాపను ఉయ్యాల్లో పడుకోబెట్టి పెద్ద లైటార్పి వచ్చి పడక్కుర్చీలో కూలబడ్డాడు జగన్నాధం. బెడ్‌లైట్ సన్నని కాంతి ఇల్లంతా ప్రసరిస్తోంది. మరో కుర్చీలో పదహారేళ్ళ అమ్మాయి కూర్చుంది. దూరంగా ప్రక్కల మీద వరస వారీగా చిన్నా పెద్దా పడకలేసేరు.

జగన్నాధం ప్రక్క అమ్మాయి నిద్రపోలేదని నిర్ధారించుకున్నాక 'జయ భోం చేశావా తల్లీ' అను డు.

'లేదు మామయా ! ఇంకా బజారుకెళ్ళిన బాబూ, మామయ్యా రాలేదు.'

'లోపలకెళ్ళి ను అమ్మకేదైనా సాయం చెయ్యమ్మా'

'అన్నీ చేసే ను మామయ్యా. ఆకులు పీటలు వేసే వుంచాను. మంచినీళ్ళు పెట్టే వచ్చాను.'

'ఉమేది తల్లీ. అప్పుడే పడుకుందా'

'అదేడుస్తోంటే అమ్మా అమ్మమ్మా దానికి కథలు చెప్పి ఇప్పుడిప్పుడే నిద్రపుచ్చారు, పిన్ని ఇంకా వెక్కెట్టి ఏడుస్తూనే ఉంది'

'ఏడుపు కాక దానికి మిగిలిందేమిటి తల్లీ! ఇంత చిన్న వయస్సులో ఇలాంటి స్థితిలో దాని బ్రతుకలా అయింది. పాతికేళ్ళు రాని మాణిక్యం పసుపు, కుంకుమ దూరం చేసుకుందంటే దాన్నలా చూళ్ళేక మేమెంత కుళ్ళిపోతు న్నామో త ! నువ్వెంత దురదృష్టవంతురాలవో ఉమా, రమా కూడా అలాటి నిర్భాగ్యురాలైపోయారు తల్లీ! అయిపోయారు.'

'నా దారి వేరు మామయ్యా. నాన్నారుపోయేసరికి నాక్కా జ్ఞానమైనా వచ్చింది. వాళ్ళకదీలేదు. బాబయ్య వాళ్ళను క్రింద దించేవాడు కాదు. అనుకోని ఈ సంఘటన వాళ్ళ పసి హృదయాలు గాయపరచింది.

'ఏం చేస్తాం తల్లీ! వాళ్ళ రాత అలా ఉంది. తలాతలా కొలచి కూర్చినా, తలరాత తప్పించలేం, కాకుంటే ఏం సుస్తీ కనక. ఇలా హఠాత్తుగా పోయాడు బావ.'

అంతట్లో కామేశ్వరి వాకిట్లోకొచ్చింది. 'అన్నయ్యా! నువ్వన్నా చెప్పు. అదలా ఏడ్చిందేడ్చినట్టుగా ఉంది. ఎలా ఓదార్చడం ఎదటికెవళ్ళం పోకూడదాయె ఎలా, అసలే వట్టి మనిషి కాదాయె.'

'వేడతానమ్మ! నేనేమని ఓదార్చను, ఎలా ఓదార్చను, అది ఏం చూచుకుని ధైర్యం తెచ్చుకుంటుంది? నీ ఏడుపు చూచి చూచి నీ కోసం ఏడ్చి ఏడ్చి మా గుండెలు ఇప్పుడిప్పుడే కోలుకుంటున్నాయి. మానే గాయం మళ్ళీ రేగింది. మాణిక్యాన్ని ఇలా చూడాల్సొస్తుందని కల్లో కూడా అనుకోలేదు.'

సావడీ, గదీ, దాటి దక్షిణపు గదిలోకెళ్ళేడు జగన్నాధం. జగన్నాధం ఓదార్పు వింటూ కళ్ళొత్తుకుంది కామేశ్వరి. చెల్లెలు దయనీయ స్థితి తలచుకు తలచుకు తల్లడిల్లిపోయింది. తన నిండు జీవితం మోడువారినా, తన చెల్లి క్షోభ తలచుకు కుమిలిపోయింది.

'అమ్మా! పిన్నికన్నం పెట్టమ్మా! నే పెట్టొస్తా!'

'జయ్యా, దాన్ని మంచిది కాందే ఎవరం చూడకూడదమ్మా'

'పెద్ద మామయ్యున్నాడుగా, వాడీ చాకిరీలకే అంకితమైపోయాడు. మీ నాన్న పోయినపుడు ఏడుస్తూనే నన్నం తినకపోతే కలిపి నోట్లో పెట్టేవాడు. ఇప్పుడు దానికి చేస్తున్నాడు. వాడందుకే బ్రహ్మచారిగా ఉండిపోయేడేమో, మా రాతలలా ఉంటే వాడింకెక్కడి కెడతాడు. నీ పెళ్ళవగానే వాడేదో ఆశ్రమంలో జేరతానంటున్నాడు, ఈ సంకెళ్ళు వాణ్ణి కదల్నియ్యవు, వాడందుకే పుట్టేడు' కామేశ్వరమ్మ బిగ్గరగా ఏడ్చింది.

'అమ్మా! ఎందుకే మామయ్యే పెట్టడం అన్నం. నువ్వూ అమ్మమ్మా కూడా పిన్నిని చూడకూడదా!'

'చూడకూడదమ్మా. ఈ వేళ తొమ్మిదో రోజు. రేపు మంగళవారం, ఎల్లుండి అంతా చూడచ్చు. అసలే నెల్లు నిండిన మనిషి, ఈ బాధెలా తట్టుకొంటుందో' కామేశ్వరమ్మ కళ్ళొత్తుకుంది.

అంతలోగా వీధిలోకెళ్ళిన రవీంద్రబాబూ ఇంకా కొందరు వచ్చేరు; అందరికీ అన్నాలు పెట్టింది కామేశ్వరి.

'అబ్బా అప్పుడే తొమ్మిదైందక్కా' అన్నాడు రవీంద్ర. 'ఎంత సేపు నాయనా, తొమ్మిది గంటలూ అయాయి. తొమ్మిది రోజులూ అయ్యాయి. మాణిక్యం పచ్చని ముఖం ఇంక మనక్కనబడదు'

మౌనంగా బాధగా భోజనాలు ముగించుకు చావట్లోకొచ్చారంతా. కామేశ్వరమ్మ వాకిట్లోకొచ్చి 'అన్నయ్యా కాస్త మజ్జిగైనా త్రాగు' రేపు మళ్ళీ చాకరీ చేయద్దూ?'

'నాకేం వద్దమ్మా! నా కళ్ళ ముందు జరిగినవన్నీ చూస్తూంటే కడుపు నిండిపోతోంది. అయిన బాధలయినా మాణిక్యాన్నిలా చూడాల్సొస్తుందనుకోలేదు. అన్నట్టు దానికన్నం పెట్టొద్దూ...'

'అది చెబుదామనే వచ్చాను'

'పదమ్మా! ఏ చేత్తో దాన్ని కళ్యాణ వేదిక దగ్గరికి నడిపించానో, అదే చే

ఇలాంటి స్థితిలో అన్నం పెట్టాల్సొస్తూంది' అన్నం ఆకు తీసుకుని చెల్లెలి గదిలోకెళ్ళాడు జగన్నాథం. నేల మీద బోర్లా పడుకుంది మాణిక్యం. జుత్తంతా నేలను కప్పేసింది. అన్నం తెచ్చిన అన్నను చూచి ఆవురుమంది మాణిక్యం.

'నాకొద్దన్నయ్యా నన్నిలా ఉండనియ్'

'లే తల్లీ! బ్రతికున్నవాళ్ళకన్నీ కావాలి. ఇంత పసుపూ, కుంకుమా పెట్టుకుని మా కళ్ళ యెదుట తిరుగుతూంటే చూచే యోగం మాకు లేకపోయింది' బలవంతంగానే కూర్చోపెట్టేడు.

'చూడమ్మా పిల్లలకోసమైనా నీ బాధ దిగమింగుకోవాలి. ఉమా, రమా ఈ వారం రోజుల్లో పోలిక పట్టలేకుండా అయిపోయారు.

'వాళ్ళదృష్టవంతులైతే ఇలా ఎందుకవుతుందన్నయ్యా! నిర్భాగ్యులయ్యారు. కాకుంటే ముప్పై ఏళ్ళయినా లేని వారికీ చావెందుకొచ్చింది' బిగ్గరగా రోదించింది మాణిక్యం.

మాణిక్యాన్నెలా బుజ్జగించాలో తెలీక, జగన్నాథం వరండాలోకొచ్చాడు జయ. ఉమను నిద్రపుచ్చి చాప మీద పడుకోపెట్టింది కామేశ్వరమ్మ. వంటింటి పని చక్కపెట్టుకు ఆరుబయట నడుం వాల్చింది, ఎక్కడి చుట్టాలక్కడ సొమ్మసిల్లి నిద్రపోయారు. గడచిన దినాలు ఒక్కసారి జగన్నాథం కళ్ళముందు పరుచుకొన్నాయి.

★ ★ ★

మాణిక్యం అందరికన్నా చిన్నది. గారాల చెల్లి కావటాన్న ఏదడిగినా వెంటనే అమర్చేవారంతా. తన పట్టు వల్లే మాణిక్యాన్ని హైస్కూల్లో జేర్చేరు. ఎస్.ఎస్.సి. ప్యాస్ అయ్యింది. అంతలోనే నాన్న సుస్తీ. కామేశ్వరి భర్త పోవడం అన్నీ ఒకదాని వెనుక ఒకటిగా సంభవించాయి. పెద్ద బావ రామేశం విజయవాడలో ప్లీడర్‌గా ఉండేవారు. కామేశ్వరి కలవారింట కోడలైనందుకు అంతా ఆనందించేరు. జయ బాబూ, పుట్టేక అనుకోని సంఘటన జరిగింది. కోర్టు నుంచి తొందరగా రావాలి, ఆ రోజు జయ పుట్టిన రోజని అనుకుంటూ కాస్త పరధ్యానంగా నడిచేరు. స్పీడ్‌గా వచ్చే కారు బ్రేకు వేసేటప్పటికే దాని క్రింద

ఆయన పడ్డారు కబురందీ అందగానే అంతా వెళ్ళేరు. కానీ ఆయన అస్తమిం చారు.

నాన్న జబ్బు కీ బెంగ కొంత కారణమైంది. కూతురి కష్టానికి కుములుతూ భర్త శుశ్రూషతో క్షణం తీరక అమ్మ కూడా బెంగపడిపోయింది. అమ్మకీ అందరికీ ధైర్యం చెప్పాల్సిన బాధ్యత తనదే అయింది.

తనకెన్నెన్నో సంబంధాలు వచ్చినా తానిష్టపడలేదు. తన దృక్పథమే వేరు. తను ఈ బంధనాలలో చిక్కుపడక ముముక్షువై తరించాలని ఆకాంక్ష. ఆ నిశ్చయంతోనే తమ్ముడి పెళ్ళి చేసెయ్యమన్నాడు. తమ్ముడో ఇండివాడవటం అతనితో ఇల్లాలు రావడం, పిల్లాజెల్లా ఏర్పడ్డం తద్వారా స్వార్థం తొంగిచూ ం జరిగింది.

ఎప్పుడేనా పదో వరకో పంపడానికేపెద్ద బాధపడిపోతూ ఓదార్పులు ఏకరువు పెడతాడు. ఇదీ వాడి వరస తల్లీ తండ్రీ మాణిక్యం వీళ్ళ బాధ్యతా బరువూ తనెత్తుకోక తప్పలేదు.

మాణిక్యం పెళ్ళయి అదీ ఒకింటిదైతే అమ్మా నాన్నలను చూచుకోడం తప్ప మరే బాధా ఉండదు. కాకుంటే వాళ్ళయినా మాణిక్యాన్ని విడవలేకపోతే దాన్దగ్గరే ఉంటారు. తనకీ మరీ నిశ్చింత. ఏ ఆశ్రమానికో పోవచ్చు అని ఆశ పడ్డాడు.

తానొకటి తల  దైవమొకటి తలస్తాడనే సామ్యం నిజమైంది.

మాణిక్యా  కు  ర్చిన సంబంధం చూచి తను విస్తుపోయాడు. 'మాట మాత్రం తనతో చెప్పకుండా ఇలా చేస్తారా నాన్న' అని మధనపడ్డాడు విసురుగానే తండ్రితో అన్నాడు.

'ఏం ఖర్మ కాలిందని దా  రెండో పెళ్ళివాడికియ్యడం'

'వేలు వేలు కట్నాలు పొయ్యలేక' మరి మాట్లాడలేక తన గదిలో కొచ్చేసేడు. అవతల వీధి మాధవరావుగారు తనకు తెలయని వారేమీ కాదు. ఆయన భార్య మహాలక్ష్మమ్మా తనకి తెలిసిందే. అమ్మతో మాట్లాడ్డాని కాస్తమానం తమరింటికి వస్తూనే ఉండేది. ఐదారుగురు పిల్లలున్నారు. అసలు

మాణిక్యం ఎందుకొప్పుకుందో. సమయానికి తను మక్తాలు వసూళ్ళకెళ్ళడం వచ్చింది.

వరండాలో మల్లెలు గుచ్చుకుంటూన్న మాణిక్యం దగ్గరకెళ్లేడు.

గడపలో అడ్డమైన తల్లితో 'ఏవిటమ్మా- ఇదంతా' అన్నాడు.

'ఎవరిదృష్టానికెవరు కర్తలు బాబూ' అంది బాధగా తన్ని చూచి కామేశ్వరి తలొంచుకొంది. అందరికీ బాధే ఇందరికి బాధ కల్పించే ఈ సంబంధం తప్పిస్తే. మెరుపులాంటి ఆలోచన వచ్చింది.

మాణిక్యం దగ్గరకెళ్ళి 'చెల్లీ' అన్నాడు. తలెత్తి నిస్సహాయంగా తనకేసి చూసింది. మన మనస్సు చిన్నాభిన్నమైందా చూపుతో.

'ఎందుకొప్పుతున్నావు చెల్లీ! ఈ పెళ్ళికి... మేం ఇందరం ఉండీ... నీ మనస్సు విప్పి చెప్పే ఆత్మీయులం కాలేకపోయాం'

మాణిక్యం కళ్ళనీళ్ళు వర్షించాయి. మాధవరావుగార్ని కలుస్తే, తలపు రాగానే పై మీది కండువా వేసుకొని వాకిట్లోకెళ్ళిపోయాడు.

★ ★ ★

మాధవయ్య గారిల్లు పెద్దదే. ఇంటి ముందు తోట. ఎత్తైన అరుగుల మధ్య మండువా నాలుగు వైపులా గదులూ

నలుగురు పిల్లల్నీ పెట్టుకు మధ్య హాల్లో ఉయ్యాల బల్ల మీద కూర్చున్నారు.

వెళ్ళగానే నవ్వుతూనే యెదురొచ్చారాయన భారీ అయిన విగ్రహం విశాల ఫాలం, ఖద్దరు ధోవతీ, లాల్చీ. కొద్ది కొద్దిగా నెరిసిన శిరోజాలు, కళ్ళజోడు హుందాతనం ఉట్టిపడే ఆయన తనకేమీ క్రొత్త కాదు.

'రావోయి... జగన్నాధం'

తను మౌనంగా ఆయన చూపించిన కుర్చీలో కూర్చున్నాడు. అయితే అనేక విషయాల మీద ఆర్థిక స్థితిగతుల మీద జనాభా పెరుగుదల మీద మంత్రుల మార్పులూ, వ్యాపారంలో సాధక బాధకాలు, విదేశ రవాణా వివరాలు, రైల్వే వాళ్ళ

అజాగ్రత్తలూ, టైమ్ విలువ తెలియని బద్ధకస్తులూ తీరూ ఇంకా ఎన్నోఅన్నీ అయ్యాకే తనూ తన భార్యా వేసుకున్న ప్లాన్లూ. వాటి ఫలితాలు, పిల్లల భవిష్యత్తులూ. అన్నీ కాకుండా అనుకోని అఘాతం, భార్య మరణం అ చెప్పినవే మరీ. మరీ చాదస్తంగానే చెప్పి కొసకి సారాంశంగా బంధువులంతా పట్టుబట్టి తనకిష్టం లేకపోయినా ఈ పెళ్ళికొప్పించారని చెప్పేడు.

తను సౌమ్యంగానే 'మాధవరావుగారూ! అంత ఇష్టం లేని ఈ పని ఎందుకు చెయ్యడం రవీ, రఘూ కవలలు కదా, వాళ్ళిష్టపడితే వాళ్ళ పెళ్ళి చేసేస్తే మీ ఇంటికో ఆసరా లభిస్తుంది కదా!'

'అదేనోయ్ నేననుకొంటుంది. కానీ చెబితే వినరుగా కుర్రాళ్లు. రవి మెడిసిన్ పూర్తి కావాలిట. రఘు నీ శిష్యుడేగా. పెళ్ళే చేసుకోట్ట. 'జలజకి ఈవేళో రేపో పెళ్ళి కాగానే ఇంట్లో ఇంకెవరు దక్షత. ఇదీ నా ఆలోచన.'

జలజ కప్పులతో కాఫీ తెచ్చిపెట్టింది. చామంఛాయగా పొడుగ్గా ఉన్న జలజ బాగా ఎదిగింది. తనీ మధ్య చూళ్లేదు.

మల్లె చెట్టుకి ఉయ్యాల కట్టి. అట్ల తద్దెరోజున మాణిక్యం తన స్నేహ బృందంతో పెద్ద దొడ్లో ఆటలాడి ఉయ్యాలలూగేది. తన్ను 'అన్నాయి పెద్దూపులెయ్యవూ' అని మారాం చేసే పిల్లల్లో జలజొకర్తి. మాణిక్యం నేస్తురాండ్రంతా తనకు చేరికే, అలాంటి మాణిక్యం, తనీడు పిల్లకి తల్లిగా ఆ గడపలోకి అడుగు ట్టడమా! కాఫీ గుటక పళ్ళేదు జగన్నాధానికి. కళ్లు నీళ్ల చిప్పిల్లేయి. జలజ తనకేసి చూచింది. ఆ చూపులో వెనుకటి ఆప్యాయత లేదు. ఏదో భయం, మరేదో బెదురు, భగవాన్ అనుకొన్నాడు బాధగా.

'మాధవ మామయ్యా బాగా ఆలోచించండి, మాణిక్యం బ్రదుకు మీ చేతుల్లో ఉంది' అని మా ం అనగలిగాడు. మెట్లు దిగే తనతో 'జగన్నాధం సాయంత్రం కనపడు' అని మాత్రం మాధవరావుగారన్నారు.

అన్నప్రకారం సాయంత్రం వెళ్ళేసరికి చిరున తో మాధవరావుగా ఎదురేగి 'గెలిచావోయ్ జగన్నాధం. బాగా ఆలోచిస్తే ఇప్పుడు జలజ నేనేం చేసినా ఇష్టమున్నా ఇష్టం లేకపోయినా వప్పినట్టే, అక్కడా పెద్దల ఒత్తిడితో ఒప్పందం

జరిగుండొచ్చు. అది అంత మంచి పని కాదని అనుకుంటూనే ఉన్నాను, మానవుని మేధ ఎంత పదునైందైనా, బలహీనత దాన్ని లొంగదీస్తుందొక్కోసారి. రేపే అబ్బాయికో సంబంధం ఖాయం చేస్తా, దాంతో మా సమస్యలు తీరిపోతాయి ఏమంటావు.'

ఇది నిజమేనా? ఈ పెళ్ళి తప్పిపోయి మాణిక్యం జీవితంలో వసంతోదయమౌతుందా! మానవుల్లో ఇంతటి మంచితనం నిక్షిప్తమై ఉంటుందా? ఆ క్షణంలో మాధవరావుగారు దేవుడులా అనిపించాడు. ఆయన పాదాలు తాకేడు సజల నయనలాల్తో మీరు దేవుళ్ళండీ అంటూ, 'తప్పు తప్పు లే ఇది దైవ నిర్ణయం, మనం నిమిత్తమాత్రులం' అన్నారాయన నిగర్వంగా, బరువు దించుకున్న మనస్సుతో ఇల్లు జేరాడు తను.

మర్నాడు మాణిక్యం పెళ్ళాగిపోయిందంటే ఆగిపోయిందన్నారు.

నాన్నా అమ్మా నెత్తీ నోరూ కొట్టుకొన్నారు. అసలు కారణం రహస్యంగా ఉన్నా పీటల మీద పెళ్ళి చెడిపోయినందుకు తలో వ్యాఖ్యానం చేశారు... ఇరుగు పొరుగులు.

'దీన్ని పెళ్ళి మాకు చూచే రాత లేదంటూ' అమ్మ గోల పెట్టింది.

తను వాళ్ళకి ధైర్యం చెప్పి సంబంధాల కోసం గాలించాడు. 'కట్నం... కట్నం... కట్నం...' ఈ నినాదంతో చెవులు తడికలు కట్టేయి. కాళ్ళు బలపాలు కట్టాయి. గత్యంతరం లేక సంబంధం ఖాయం చేసుకొన్నాడు ఐదువేల రూపాయల కట్నానికే. 'ఏవిటో వీడి భరోసా. ఎలా ఇస్తాడో కట్నం పెళ్ళి వారం లేదని' నాన్న తల్లడ పడ్డా దైవికంగా కుదిరిన సంబంధానికి తన తెలివీ యుక్తీ ఉపయోగించి ఫలితం లేకపోగా రూపాయి వడ్డీకి ఓ మార్వాడీ దగ్గర అప్పు తెచ్చేసేడు. పెళ్ళి ఘనంగా జరిపించాడు. అంతా ఈడూ జోడూ బాగుందన్నారు. కళ్యాణ తిలకం కాళ్ళ పారాణి తలంబ్రాలు పోసుకొనే దంపతుల్ని చూచి ఆనంద బాష్పాలు విడిచాడు' నా చెల్లి అదృష్టవతి 'రతీ మన్మధుల్లా ఉన్నారు' అనుకొన్నాడు.

వెనకాలే తన భుజం మీద పడ్డ చెయ్యి మాధవరావు గారిది. తన కళ్లల్లో

మరొక్కసారి కృతజ్ఞతా భావం తొంగి చూచింది.

'వెడతానోయ్ జగన్నాధం. ఏదైనా అవసరమైతే నాక్కనిపించు. సర్దుతాను' అన్నారు రహస్యంగా.

'దైవం మానవ రూపేణా' అంటారిదేలా ఉంది అనుకొన్నాడు.

అప్పగింతలప్పుడు కుందనం బొమ్మ మాణిక్యాన్ని పాలల్లో చేయి ముంచి వరుడి కప్పగిస్తుంటే సంతృప్తిగా నిట్టూర్పు విడిచాడు.

★ ★ ★

వ్యాపారంలో వేలకు వేలు గణించాడు బావ; ఇంకా గడిస్తాడు కూడా. కారూ, హోదా, డబ్బూ అన్నీ ఉన్న అదృష్టవతి మాణిక్యం.

ఓ మహారాణీలా అన్నపూర్ణలా, అత్తిల్లు దిద్దుకుంటోంది. మాతృమూర్తియై ఉమా, రమా పుట్టేరు.

ఆ సంతృప్తి పడ్డాక మనపనేమిటన్నట్టు నాన్న ఆకస్మికంగా దాటిపోయారు. దినాలయ్యాక లాంఛనంగా తమ్ముడూ, మరదలూ త , తల్లినీ రమ్మ ; తన భారం ఎవ్వరికీ వెయ్యకూడదని ఆ ఇంట్లోనే ఉన్నాడు. అప్పుకు వడ్డీ ఐదింతలైంది. ఉన్న కొంప వేలం వేసే స్థితిలో మాధవరావు గారే ఆదుకొని ఆ అప్పు తీర్చేరు, వారి రుణం తనకేనాడో తీరేది?

జయకు పెళ్ళి నిశ్చయం చేసేడు. నెల క్రితం జయ పెళ్ళయిపో కామేశ్వరి బరువు బా తా తగ్గుతే తల్లిని తమ్ముడింట్లో విడిచి కొంపమ్మి అ ప్పు తీర్చి, తానీ బంధనాలకు దూరంగా పోయి తరుణోపాయం మాచుకోవాలనుకున్నాడు.

తనెళ్ళినప్పుడు మాణిక్యం, బావ చిన్న ఫిర్యాదులు తనతో ఏకరు పెట్టేవాళ్ళు నాలుగు రోజులు కులాసాగా గడిపి వచ్చేసేవాడు.

పదిరోజుల క్రితం బావకు సు అంటూ మాణిక్యం టెలిగ్రాం ఇప్పిస్తే, 'దీనిగ్గాభరా ఎక్కువ' అనుకొంటూనే బయల్దేరి వచ్చాడు.

హఠాత్తుగా వచ్చిన తన్నుచూచి బావ 'నాకేం లేదండి కాస్త పడిశం పట్టినా

మీ చెల్లి ఆర్భాటం చేస్తుంది' అన్నాడు. అలా పడిశమే అయితే ఎంత బాగుండును. అనుకోని జబ్బేదో ఆవహించి రెండ్రోజుల్లో బావనెత్తుకు పోయింది.

బావ చిలిపి హాస్యం ఇంకా ఇంట్లో ఎక్కడో వినిపిస్తూన్నట్లే అనిపించేది.

మానవుని విజ్ఞానాన్ని కాలం సాధిస్తూనే ఉంది. అయినా మరణాలు తప్పలేదు; రోగాలకు మందులున్నాయి. కానీ ఆయుష్షుకు మందుల్లేవన్నారు అనుభవజ్ఞులు.

ముప్పై నిండిన బావ ప్రాణం ఏ మందూ నిలబెట్టలేకపోయింది.

★ ★ ★

గడియారం రెండు కొట్టింది. ఉయ్యాల్లో ఉమ ఏడ్చింది. ఓ ఊపు వేసి మళ్ళీ కూర్చున్నాడు. మళ్లీ చుట్టుముట్టాయి ఆలోచన్లు.

బావ పోయిన నక్షత్రం మంచిది కాదు. ఇల్లు విడవాలిట. కాక ఎవ్వరూ మాణిక్యం ఉన్న చాయలకిపోరు. పెళ్ళయిన ఆడవారూ, మగవారూ, పిల్లలూ, ఆఖరుకు విధవలూ ఎవ్వరూ మాణిక్యాన్ని చూడకూడదు ఈ రెండ్రోజులూ,

తానొక్కడే చూడొచ్చు. తనకే తప్పూ లేదు? జరిగే నష్టం లేదు; తనకి పెళ్ళామా? పిల్లలా తను ఏకాకి. కానీ అందరి బాధలూ తనవే ఒక చెల్లి భర్త పోయాడని ఏడుస్తూనే వున్నాడు. మరో చెల్లికీ అదే స్థితా ఒక్క కన్ను లొత్తపోతే ఓర్చుచ్చు రెండు కళ్ళూ పోయినట్లయింది. మాణిక్యం బాధ చూళ్ళేకుండా ఉన్నాడు. రోడ్డు మీద వెడుతూంటే మాధవయ్యగారు మళ్ళీ పరామర్శించారు. ఓదార్చారు. ఏడేళ్ళ క్రితం ఎలా ఉన్నారో అలాగే ఉన్నారాయన. కొడుకులిద్దరికీ కూతురికీ కూడా వివాహాలు చేసేరుట ఉన్న చిన్నాళ్ళిద్దర్నీ చూచుకుంటూ కాలం గడుపుతున్నారుట.

మాణిక్యానికి వచ్చిన కష్టానికి మరీ మరీ బాధపడ్డారు. ఆయన అటు వైపు వెళ్ళగానే మళ్ళీ బజారు పని చూచుకు ఇంటిదారి పట్టాడు.

తనెవరు? సన్యాసా? సంసారా? ఇహమా, పరమా తన కష్ట సుఖాల్లో

పాలు పంచుకునే ఇల్లాలు లేదు. పిల్లా పాపా బరువూ బాధ్యతా లేదు. కాని... కానీ ఈ అంటీ అంటని బాధకై ఆరాటపడే అజ్ఞాని. ముముక్షువై దైవ చింతన చేయవలసిన తరుణంలో ఇంకా... ఇంకా బంధనాలు బలీయమై పోతున్నాయి. తన భావాల మీద తనకే విశ్వాసం సన్నగిల్లుతోంది.

బావ పోవడం తనింకా కూరుకుపోవడానికే. తల్లిని పిడికెడు బూడిద చేసి తనే ఆశ్రమానికేనా పోవాలనుకున్నాడు కానీ ఈ సంకెళ్లు ఇంక వీడేవి కావు. తనది త్రిశంకు స్వర్గం. స్వర్గ పాతాళ మధ్య ఊగాడే జీవితం. అయిదేళ్ళ రమా, రెండేళ్ళ ఉమా, పుట్టే బిడ్డా. ఇరవై మూడేళ్ళ మాణిక్యం వీళ్ళనెవరు చూస్తారు, ఎలా తను విడవగలడు.

గడియారం నాలుగు కొట్టింది. ఎదురింట్లో పాలు పిండే చప్పుడు కుళాయిల రాక తెలిపే రొదా, పాచి పనివాళ్ళ చీపురు చప్పుళ్లు. చెంబు నీళ్ల చిలకరించి జల్లే కళ్ళాపు చప్పుడూ, దూరంగా బుడబుక్కలాడి గిలక చప్పుడూ అన్నీ వినిపిస్తున్నాయి.

కామేశ్వరమ్మ నీళ్ళ పొయ్యి వెలిగించింది. జగన్నాధం లేచి బాత్‌రూమ్ వైపు వెళ్ళాడు. రాత్రి నిద్ర లేక కళ్లు మండిపోతున్నాయి. ముఖం కడుక్కొని స్నానం చేసి సరికి కా అందించింది జయ.

ఉమా రమా నిద్ర లేవలేదు. వాకిట్లో బండాగింది. ఇంకా పరామర్శకు జనం వస్తూ పోతూ ఉన్నారు.

మాణిక్యం ఇద్దరాడబిడ్డలూ మరిదీ బండి దిగారు.

'అన్నయో యి! ఎంత పని చేశావురోయి, మాకెవర్రా దిక్కు. కొండంత అన్న వున్నావనుకున్నా యి. ఎంత నిర్భాగ్యులంరోయి' అంటూ రాగం పెట్టి అన్నగారి గుణగణాలు చి వర్ణించి ఏడుస్తున్నారు. మరిది సురేంద్ర మాత్రం మౌనంగా తల వంచుకొని నించున్నాడు.

అందర్నీ ఓదార్చే వంతు జగన్నాధాందే అయ్యింది. 'ఊరుకోండొదినా, ఊరుకో సురేంద్రా అలాంటి అన్న మీకు, అలాంటి బావ నాకూ ఉండే యోగం లేకపోయింది' అని ఓదార్చేడు.

పిల్లలిద్దరూ ఈ యేడ్పుకు లేచి, బిక్కుమంటూ చూస్తూ మేనమామ ప్రక్క జేరారు.

కామేశ్వరమ్మ కాఫీ తెచ్చింది. 'ఇందడమ్మా కాఫీ తీసుకోండి, ఏం చేస్తాం, అతనికాయుష్షు తీరిపోయింది. పోయిన వారితో పోతామా, ఉన్న వాళ్ళకన్నీ కావాలి.'

ఏడుస్తూనే సుందరమ్మ, కాంతం కాఫీలు తాగేరు.

'కామేశ్వరీ మా మరదలేదీ' అంది సుందరమ్మ.

'దక్షిణపు గదిలో ఉందమ్మా. దాన్ని చూడ్డానికీ వేళ ఇంకా మంచిది కాదు. నక్షత్రం మంచిది కాదు.'

'అలాగా!' అంటూ సామాను అదీ సర్దుకున్నారు. సుందరీ...కాంతం.

జగన్నాధానికి క్షణం తీరిక లేదు. ఇంటి పనీ బజారు పనీ వచ్చేపోయే చుట్టాల్ని చూచుకోడం ఉన్నవీ లేనివీ సరుకులు చూచుకోడం, ఇవి కాక చెల్లికి డ్వాక్టర్నడిగి మందులూ, నీరసం రాకుండా హార్లిక్సు, గ్లూకోజు పట్టించడం, క్షణం తీరిక లేదు.

అటు కామేశ్వరి పనీ అలాగే ఉంది. వంట మనిషి వండినా ఆవిడకన్నీ అందించడం కాఫీలూ, పిల్లల చద్దులూ చూచుకోడం, పరామర్శకొచ్చిన జనానికన్ని సదుపాయాలూ చూడ్డం కర్మకాండకు కావల్సిన సరుకులు అమర్చడం వీటితో చాలిపోతోంది ఆవిడ.

తమ్ముడి భార్య యశోద. తన పిల్లల్ని తాను సముదాయించుకోలేక మధ్య మధ్య వాళ్ళనో చరుపు చరుస్తోంటే, జయ వాళ్ళని సముదాయిస్తోంది. తల్లికీ, మేనమామలకీ చేదోడువాదోడవడం, వచ్చిన సరుకులు లెక్క చూచుకోడం, ఖర్చు చేసింది రాయడం, దాంతో ఆ పిల్లకి మరీ తెరిపి కనపళ్ళేదు.

'అమ్మా...' అంటూ జయ గావుకేక పెట్టింది. జగన్నాధం, కామేశ్వరీ వెళ్ళేసరికి తల్లికి ఫిట్సు వచ్చింది. ఆ ముసలి ప్రాణం కూతురు కష్టానికి కుమిలిపోయింది. ఒక్కొక్కళ్ళే పరామర్శించినప్పుడల్లా ఫిట్సు వస్తోంది. ఈ మాటు కాస్త హెచ్చుగానే వచ్చింది.

జగన్నాధం డ్డాక్టర్ని పిలుచుకొచ్చాడు. ఆవిడకి వస్తే పక్షవాతం రావచ్చుననీ కాస్త జాగ్రత్తగా ఉండమని చెప్పి ఇంజక్షనిచ్చి వెళ్ళేరు. జగన్నాధానికి మతిపోయినట్లయింది. ఈ పెద్ద వయస్సులో ఆవిడకి పక్షవాతం వస్తే ఎవరు చేస్తారు! తనే. అన్నింటికీ తనే.

ఆవిడకి కాస్త గాలీ వెలుతురు వచ్చే మధ్యగదిలో పడుకోపెట్టాలని అక్కడున్న చుట్టాల్ని పక్కగదిలోకి సామాను సర్దుకోమన్నాడు జగన్నాధం.

ఆ గదిలో ఫేన్ ఉంది. అందులోంచి లేవనంది యశోద.

'ఏమిటే యశోదా. జబ్బు మనిషి కదా. ఆవిడ సదుపాయం చూడద్దా' అంది కామేశ్వరి.

'ఎవరికి కోపం వచ్చింది? ఈ చావులు కావు కానీ మా చావుకొచ్చింది. పిల్లల బళ్ళు పోతున్నాయి' అంటూ సాధింపు మొదలెట్టింది.

కామేశ్వరి విసురుగానే అంది 'నిండింట్లో ఏమిటా మాట్లా' చావులు చావులూ అంటావు చ  న వాళ్ళు చాలరుటే పుట్టెడు నీళ్ళోసుకుంది. ఆ గండం గడిచి పిండం బయటపడి దాని బిడ్డల్ని అది చూచుకొంటే మాకంతే చాలు. ఇలాగేనా వెళ్ళనీ రోజుల్ని'

'నేనావిణ్ణన్నానా? నన్నే నేను తిట్టుకున్నాను. నేనే చస్తానన్నాను. నే చస్తే అందరి కళ్ళు సు  ంగా ఉంటాయి.'

మరదలి మూ  పు మాటలకి జగన్నాధం మనస్సు చివుక్కుమంది. ఊరుకోలేక అన్నాడు.

'ఏమిటమా   లా  ంటావు. నువ్వు నూరేళ్లు బాగుంటేనే ఈ వంశం నిలిచేది. అలాటి మాటలనకు.   మేలు కోరేవారే కానీ చావుకోరే వారిక్కడ లేరు'

తమ్ముడు రావడంతో ఆ సంభాషణ ఆగిపోయింది. యశోద ఏడుస్తూనే ఉంది. బైటకి తమ్ముడు కేకలు  నిపించాయి.

''ఏం మనుషులు, ఏం స్వభావాలు'' అనుకొన్నాడు జగన్నాధం.

★ ★ ★

తిరిగి తిరిగీ బజారు పనిచూచుక వచ్చేసరికి పన్నెండైంది.

వంటింట్లోంచి గలాట వినిపిస్తోంది.

''మా అన్న పోయాక ఈ ఇంట్లో స్వతంత్రించడం మాదే తప్పు'' అంటోంది సుందరమ్మ.

''అదేవిటమ్మా. ఇప్పుడు నేనేమన్నానమ్మా. పసివాళ్లు ఏదో అనుకుంటారు. మళ్ళీ ఆడుకుంటారు. అంత మాత్రానికి మనం కల్పించుకోడం దేనికన్నానంతే' కామేశ్వరి గొంతు.

'అవును వదినగారూ! మా ఇంట్లోంచి పొమ్మంది ఉమ మా రమని. అక్కడికీ మేం ప్రతీదానికీ బెరుకు బెరుగ్గానే ఉన్నాం. దాని మాటెలా ఉన్నా ఉదయం కాఫీ ఒలికిపోతే ఇంకాస్త పొయ్యమంటే జయ మాత్రం ఏమంది. 'ఇప్పుడే కదా మీరు పట్టికెళ్ళేరు అంది' అక్కడికి నేనబద్ధమాడి కాఫీ తీసికెళ్ళి తాగుతానా'

'బాగుంది సుందరీ! అసలే మనసు చెదరి మేమేడుస్తూంటే మీరిలా చిన్నపిల్లల మాటలు పట్టించుకోడం ఏమీ బాగోలేదు.''

''అవును మేం చిన్నదానికీ పెద్ద దానికీ రభస చేసేవ్వాం. మీ మరదలు యశోద మాత్రం తక్కువదా, 'మా ఆడబిడ్డ ఇట్లా మా ఇష్టమొచ్చినట్టూ చేస్తామంది' మా అన్న పోయాక మాకేం స్వతంత్రం ఉందీ. 'అన్నయ్యోయి... మాకేం స్వతంత్రం ఉందిరోయి, మేం పరాయివాళ్ళమయిపోయాంరోయి'... అంటూ రాగాలందుకొంది సుందరమ్మ.

'అక్కా నువ్వూరుకో. ఏదో వాడి ప్రసాదం ఓ పిడిచ తిని చక్కాపోదామని వచ్చాం కానీ మనకేం ఉందిక్కడ నల్లరాయి లాంటి మనిషే పోయాక మనకివన్నీ ఎందుకు?'' కాంతం మందలించింది.

'నాకేం వద్దే ఇక్కడొక్క క్షణం ఉండను త డూ! బండి పిలు' అంటూ విసవిస చేతి సంచి మరచెంబూ పుచ్చుకు సుందరమ్మ వాకిట్లో కొచ్చేసింది.

సురేంద్ర ఖంగారు పడ్డాడు. అక్కగారి పట్టు అతనికి క్రొత్తేమీ కాదు. ఉమ బారసాల కొచ్చినప్పుడు మరియాద తక్కువైందని అప్పుడికప్పుడెళ్ళిపోయింది. ధైర్యం తెచ్చుకు అన్నాడు 'చూడక్కా, మనం ఇలా వెళ్ళిపోతే ఏం బాగుంటుంది. రేపు లేదు ఎల్లుండి భోం చేసీగానే వెళ్ళిపోదాం, నా మాట వినక్కా'

సురేంద్ర ఊరకోపెట్టేకొద్దీ రెచ్చిపోయింది సుందరమ్మ. మాణిక్యం పెళ్ళిలో లాంఛనాల మొదలు రమ అన్న ప్రాసనకి ఉమ బారసాలకీ తన్నలక్ష్యం చేసిన వరుస కధనాలనీ వర్ణిస్తూ, అయిదోతనం తక్కువదాన్ని చేసుకొని తన అన్న చచ్చిపోయాడని రాగాలందుకొంది.

అంతా విన్నాడు జగన్నాధం.'చూడందొడినా! ఈ పరిస్థితిలో మనం మనం జగడమాడుకుంటే చూచేవాళ్ళేమనుకుంటారు? శాంతపడండి'

'అవున్నాయనా! నేను గయ్యాళిదాన్ని, జగడాలమారిని మీరంతా మర్యాదస్తులు. అందుకే నే వెడతా. మన జగడాలెవరూ వినక్కర్లేదు వాడు పోయాడు. మాకీ ఇంటితో ఋణం తీరింది. ''అన్నయ్యోయ్ రమని నా కొడుక్కిస్తారనుకొన్నారోయ్' మళ్ళీ రాగాన్నందుకొంది.

'ఒదినా! మీ అన్నయ్య పోయినా పిల్లలున్నారు! సంబంధాలు త్రెంచుకుంటే పోతాయా, లేవండి అపరాహ్ణమైంది భోంచేద్దురుగాని'' ఎలాగో సమాధానప   డు జగన్నాధం.

''అన్నయ్యా! మాటిలా వస్తావా?'' పెరట్లోంచి కామేశ్వరి పిలుస్తోంది.

పెరట్లోకొచ్చాడు.

వేసిన పిడచ ముట్టకుండా కావ్ కావ్ మంటూ చుట్టూ తిరుగుతున్నాయి కాకులు.

''బావ మనస్సులో ఏ కోర్కెలున్నాయో? పిడచ ముట్టలేదు కాకి '

చుట్టాలంతా పెరట్లో గుమిగూడారు.

ఎవరికీ తోచిన దండాలు వాళ్లు పెట్టుకున్నారు. సుందరమ్మ 'అన్న

రమని నా కొడుక్కీ తప్పకుండా చేసుకొంటాను' అని దణ్ణం పెట్టుకొంది.

ఎన్నెన్ని దణ్ణాలు పెట్టినా కావ్‌మంటూ కాకులు చుట్టూ తిరగడమే కానీ, పిడచ దగ్గరకు రాలేదు. జగన్నాధం కళ్ళు మూసుకొని 'బావా మాణిక్యాన్ని పిల్లల్నీ నేను చూస్తా బావా వదిలి ఎక్కడికి పోను' అలా దండం పెట్టగానే కాకులు పిడచ తన్నుకుపోయాయి.

అంతా ఇంట్లోకొచ్చారు ఆశ్చర్యంగా రకరకాల కథలు చెప్పుకుంటూ. ఆ పిండం దగ్గర పోయిన వ్యక్తి నిలుచుండి తన కోర్కె తీరేదాకా కాకుల్ని పిడచ ముట్టనియ్యడని చెప్పుకున్నారు.

★ ★ ★

'మాణిక్యం ఏం చేస్తోందో' అని గదిలో అడుగుపెట్టగానే జగన్నాధం ఖంగారు పడిపోయాడు. వెల్లకిలా గుమ్మం దగ్గిర పడుంది మాణిక్యం.

ముఖం మీద నీళ్ళు జల్లి మణీ! మాణిక్యం అంటూ లేపేడు జగన్నాధం.

పిలుస్తే పలకలేదు ఒళ్ళంతా చెమట్లు పోసేసేయి. పెరట్లో గొడవ విని నీరసం వచ్చింది.

జగన్నాధం ఖంగారు పడ్డాడు 'జయా... జయా రా తల్లీ, పిన్నికి స్పృహ తప్పింది. గ్లూకోజ్ కలిపి పట్రా' హడావిడిగా గ్లూకోజ్ కలిపి తెచ్చింది జయ. వెళ్ళే జయ వెనుక మాటలు వింది.

'అలా ప్రధానమైన పిల్లను మంగళారం పూటా చూణ్ణిస్తావేమిటి కామేశ్వరీ' అంటోంది పెద్ద ముత్తయిదువు.

'జీలకఱ్ఱేనా నోట్లో వేసుకొందా!' మరో ముసలమ్మ మందలింపు.

'జయా ఇవతల నుంచి అందించవే' మరో ముసలమ్మ మందలింపు.

జయకు ఒళ్ళు మండింది. 'అవతల పిన్ని నీర్సంతో పడుంటే మంగళవారంట మంగళవారం మనిషి ప్రాణం కన్నావా, ఎప్పుడో ఏదో వస్తుందని మనుషులు మానవత్వం మరచిపోతారా? విసురుగా గదిలోకెళ్ళిపోయింది జయ.

'ఇప్పటి కుర్రాళ్ళకి చెప్పలేం'

'మంచి చెడూ చూచుకోకుండా ఏమిటీ చొరవ'

'ఈ పుస్తకాలు నవల్సూ వీళ్ళనిలా తయారుచేస్తున్నాయి. ఆదర్శా లంటూ వాళ్ళు వర్ణిస్తారు. వీళ్ళుపాడైపోతున్నారు'' సుందరమ్మ సాగదీసింది.

జయ రానే వచ్చింది 'మీకు పుణ్యాలుంటాయి కాస్త ఊరుకుంటారా. ఇప్పుడిప్పుడే స్పృహ వస్తోంది పిన్నికి'

'మాకేం తల్లీ నూరేళ్ళ బ్రదుకు ముందుంది'

'మంచీ చెడూ చూచుకోకుండా ఇల్లా చేస్తారా? మరి'

'అమ్మమ్మా నేనో మాట చెప్పనా. పిన్నక్కడికెళ్ళి చూస్తే ఇలా ఐంది? పిన్ని నమ్మకాలు మనందరికీ తెలిసినవే. కుంకుమ ఒలికితే తప్పు. దీపం కొండెక్కితే తప్పు శుక్రవారం మంగళవారం వాకిట్లో ముగ్గాలిశ్యమైతే తప్పు. ఇప్పుడు మామయ్య లేకపోతే ఏమయ్యేది. సమయానికా గ్లూకోజ్ పోయకపోతే పిన్నేమయ్యేదో'

'పెద్దలెందుకు పెట్టేరో ఏమిటో మంచీ చెడూ అంటూ. అలా చెయ్యడమే తప్ప ఇలా వాదన్లకి దిగలేదు నీలా' సుందరమ్మ అందుకొంది.

'పెద్దలు - ఎవరమ్మా పెద్దలు. మీకు ముందువారు మీకు పెద్దలు మాకు మీరు పెద్దలూ. మనలో ఈ మూఢాచారుల మరో నూరేళ్ళకైనా వెయ్యేళ్ళకైనా పోతాయా.

ఒకడి ప్రాణం పోతే అందరికి మైలే. అసలు మైలంటే ఏమిటీ అని ఆలోచించారా? దుఃఖితులైన మృతు స్వజనం. ఈ విచారంతో ఓ దగ్గర కూర్చుని సేదతేరుతారని ఆ బాధలో వాళ్ళటూ అటూ తిరిగితే ఏ అఘాయిత్యాలైనా చేస్తారని. అంతేకానీ మైల మన వంటిని పట్టుకు కూర్చోదు అదేమీ అంటూ జాడ్యమూ కాదు'

'జయా ఏమిటే పెద్దలతో ఆ వాదన' కామేశ్వరమ్మ కసురుకుంది.

మళ్ళీ గదిలోకి వెళ్ళిపోయింది జయ

మాణిక్యం నీరసంగా మూలుగుతోంది.

'ఏమ్మా అలా పడిపోయావు' జగన్నాధం అడిగేడు.

ఏడుస్తూనే 'కాకులు ముట్టుకున్నాయా అన్నయ్యా'

'తిన్నాయమ్మా! నువ్విలా అన్నింటికీ కుమిలిపోతే ఎలా బయటపడతావో? డాక్టరేమంది.

'మరో రెండ్రోజుల్లో పురుడు రావచ్చుంది' వెక్కుతూనే చెప్పింది మాణిక్యం. 'నా ఖర్మ అన్నయ్యా ఎంతలో... ఎంత మార్పు.'

'ఊరుకో తల్లీ ఏం చేస్తాం'

'జయా' నీరసంగా పిలిచింది మాణిక్యం.

'ఏం పిన్నీ'

'ఎందుకొచ్చావు తల్లీ మంచిది కాన్నాడు చూస్తావా అమ్మా! నేనేమై పోతానని నీ భయం. నేనేమీ అవను. ఇంత బాధ భరించి, ఇంకా బతికున్నాక ఇంకేమవుతాను తల్లీ' రోదించింది.

'పిన్నీ! ఈ వారం రోజుల్లో నీ ముఖం ఏం పాపం చేసుకొంది. మేం చూడక పోడానికి'

లాలనగా తల నిమిరింది మాణిక్యం. 'పిచ్చి తల్లీ నీకేం తెలీదమ్మా ఇంక వెళ్ళమ్మా' కళ్ళొత్తుకుంటూ వెళ్ళింది జయ.

★ ★ ★

చిన్న చిన్న ఘర్షణలు వచ్చినా వచ్చిన బంధూలంతా భోజనాలై పడుకొన్నారు.

కర్మలకి తెచ్చిన డబ్బు చాలలేదు. మళ్ళీ మాధవరావుగార్నడగాలంటే బిడియపడ్డాడు. గోదానం, భూదానం అన్నీ చేసేడు జగన్నాధం.

తెల్లారితే ఎలాగో. ఆ మధ్యాహ్నం - అవగానే మాణిక్యాన్ని అందరూ చూడొచ్చు. నలుగురూ దగ్గర కూచుంటే కాస్త మనస్సు కోలుకొన్నాక పురుడొచ్చినా భయం లేదు.

ఇలా ఆలోచిస్తూండగానే ఆ పది రోజులకి ఆ రోజే కన్ను మూతపడింది జగన్నాధానికి.

ఉలిక్కిపడి అంతలోకే మెళుకువ వచ్చింది. లోపల్నుండి మాణిక్యం మూలుగుతోంది.

గాభరాగా... గడపలో కాలు పెట్టేడు.

'అన్నయ్యా!...

ఏం తల్లీ!

'మన కష్టాల కంతులేదు'

'ఏమిటమ్మా అదీ' 'కాస్త డ్కాక్టర్నో నర్సునో పిలుస్తావా?'

గాభరాపడిపోయాడు జగన్నాధం. 'ఇప్పుడే పిలుచుకొస్తానమ్మా. డ్కాక్టరు కీవేళ ఆపరేషనుందని చెప్పినట్టుంది. నర్సుని పిలుస్తా'

'నేనొచ్చేదాకా ఇక్కడెవరుంటారమ్మా'

'నాకెవ్వరూ అక్కర్లేదన్నయ్యా. నువ్వెళ్లు' అలికిడికి మళ్ళీ గుమ్మం దగ్గర గుమిగూడేరంతా.

ఈ టయిములో కూడా ఈ చాదస్తానికి విసుగొచ్చింది జగన్నాధానికి.

'కామూ కాస్త కాఫీ కాచు. నే నర్సుని పిలుచుకొస్తా' విసురుగా వెళ్ళిపోయాడు.

కాఫీ గ్లాసు గుమ్మంతో పెట్టి 'అందుకోగలవా అమ్మా' అంది కామేశ్వరి.

'నేనిస్తానమ్మా' జయ తల్లి చేతిలో గ్లాస్ అందుకొంది.

చెయ్యి పుచ్చుకు ఆపేసింది కామేశ్వరి

'మొండితనం మాను' గదమాయించింది.

మాణిక్యం పెద్దగా మూలుగుతోంది... నీరసంతో ఆమె కంఠం ఒణికిపోతోంది.

భగవాన్ నాకీ బాధలు విముక్తి చెయ్యి అంటూ ఏడుస్తోంది.

నర్సుని తీసుకురావడానికెళ్ళిన జగన్నాధం ఇంకా రాలేదు.

అందరూ విలవిల్లాడుతున్నారు. అయినా ఒక్కళ్ళూ దగ్గిరగా వెళ్ళడానికి జంకుతున్నారు. ముసలమ్మ కదల్లేకుండా కాలూ చెయ్యీ బిగుసుకుంది. కామేశ్వరి గాభరాపడిపోతోంది.

మాణిక్యం మూలిగింది. చంటిపిల్ల క్యార్ మంది.

జగన్నాధం డాక్టరూ ఇంట్లో అడుగుపెట్టేరు.

డాక్టరు పరుగుతో గదిలోకొచ్చి కొయ్యబారిపోయింది.

మాణిక్యాన్ని మరెవరూ చూడక్కర్లేదు. ఆమె ప్రాణాలు పంచ భూతాల్లో లీనమయ్యాయి. ఇళ్ళంతా రోదన ధ్వనులు నిండిపోయాయి. జగన్నాధం శిలా ప్రతిమలా నిలబడిపోయాడు. పురిటి గదిలో క్యార్ క్యార్ మనే మగబిడ్డను చూచినవారే లేరు. అప్పుడే ఉదయించిన లోక బాంధవుడు మాత్రం కిటికీ గుండా తన కిరణ హస్తాల్తో బాబుని స్పృశించాడు.

***

# ధృవతార

రచన :

శ్రీమతి ఎ. జానకి

''ఒరే! విస్సూ!

విస్సూ! ఎక్కడ తగలడ్డావ్'' అంటూ గావు కేకలతో గుమ్మంలో అడుగుపెట్టేడు శేషాద్రి.

వంటింట్లో పనిచేసుకుంటూన్న రాజ్యం కేక విని బయట కొచ్చింది..... కళ్ళ వెంట నిప్పులు కురిపిస్తూ కోపంతో వూగిపోతున్నాడు శేషాద్రి.....''ఏడీ! ఆ రౌడీ వెధవ ఎక్కడ చచ్చాడు'' అంటూ అరిచాడు అదే గొంతుకతో. ఈసారి అరుపు పెరట్లో నీళ్లుతోడుతున్న విస్సుకి వినిపించింది. తోడుతూన్న బకెటు నక్కడ పడేసి తొందరగా వచ్చి అన్నకెదురుగుండా నిలబడ్డాడు.. విస్సుని చూడగానే శేషాద్రి కో ం కట్టలు తెంచుకుంది 'ఏంరా! రాస్కెల్! ఆ ప్లీడరుగారమ్మాయిని అలా 'డీ' కొడతావా! వొళ్లు పొగరెక్కిందా! కళ్ళు బైర్లు కమ్మాయా!'' అంటూ రెండు చెంపలు'చెళ్ళు' మనిపించాడు శేషాద్రి.... 'లేదన్నయ్యా' 'నేను కావాలని అలా చెయ్యలేదు వదిన యేవో సామాన్లు తెమ్మని కిరాణాకొట్టుకు పంపింది అక్కడ జనం ఎక్కువగా ఉన్నారు. అందువల్ల నేను నిలబడవలసొచ్చింది. ఇంతట్లో నా పక్కనున్నాసామి తన జేబులో పదిరూపా యల నోటు పోయిందంటూ కేకలేశాడు నాక్కూడా నోటు సంగతి గుర్తొచ్చింది వదిన ఇచ్చింది కూడా పది రూపాయలనోటే నోటు నా జేబులో వుందో లేదో నని బయటికి తీసి చూసుకున్నాను. నోటు పారేసుకున్నతను నావేపు అదోలా

చూశాడు. అప్పుడు నాకు భయమేసి గుంపులో నుండి తప్పుకుంటూ వస్తుంటే 'అదిగో దొంగ!' అన్న అరుపులు వినపడ్డాయి. నేను మరింత భయంతో పరిగెత్తుకువస్తూ ఆ అమ్మాయిని ఢీ కొట్టానన్నయ్యా!... అంతేకాని నేను కావాలని చెయ్యలేదు'' అన్నాడు గుడ్ల నీరు తిప్పుకుంటూ.... 'ఛీ పాడు - వెధవా! ఏనుగులా తమ్ముణ్ణి మేపి వూరుమీద కుసికొలిపాడు అంటూ ఆ ప్లీడరు నన్ను ఆ నలుగురి ఎదుటా నడివీధిని ఎన్నిమాటలన్నాడని. పెడుతూంటే తిని బలిసిందే చాలక తెల్లారి లేచింది మొదలూ ఏదో వొక పాడుపనిచేసి నా పరువు తీస్తున్నావ్'' అంటూ పళ్లు పటపటలాడించాడు...

''అయితే ఎప్పుడొచ్చినట్టూ! అసలు సామాన్లేవి'' అంటూ రాజ్యం బుగ్గలు నొక్కుకుంది..... ''నాకక్కడ భయం వేసొచ్చిసానొదినా మళ్ళీ వెళ్ళలేదు'' అన్నాడు విస్సు జాలిగా.... ''అఘోరించావ్ ఇలా తగలెయ్యి ఆనోటు'' అంటూ చెయ్యి జాచాడు శేషాద్రి...

విస్సుల చేతివేళ్లు జేబులో తడిమాయి.... గొంతుక తడారిపోతూంది. భూమి కాళ్ళకింద నుండి కదలుతున్నట్లయింది. తన కాళీజేబు లోంచి చేతివేళ్లు వణుకుతూ ఇవతలకొచ్చాయి. నిస్పృహోయుడై కొయ్యబారిపోయాడు. అచేతనుడై నిలబడిపోయాడు విస్సు...

''ఏం? అలా నిలువుగుడ్లేసుకునిలబడ్డావే? తేరా!'' గద్దించాడు శేషాద్రి...

బిక్కు బిక్కు చూస్తున్న కళ్ళవెంట నీరు టపటప నేలమీద రాల్తూంది...

విస్సు మొఖంలోకి చూసింది రాజ్యం. ''నోటు పారేశాడులావుంది'' అంది. శేషాద్రి వేపు చూసి.....

శేషాద్రి తోకతొక్కిన త్రాచయ్యాడు మూలనున్న కర్రతీసి ''పదిరూపాయలూ పారేశావా! వెధవా! ఎంత కష్టపడితే వస్తాయిరా! పదిరూపాయలు, గడించిపోస్తూంటే, గుణిస్తూన్నది, చాలక, ఇలాటి నష్టాలన్నీ నా నెత్తిన రుద్దుతున్నావ్'' అంటూ ఒళ్లు తెలియని ఆవేశంతో గొడ్డుని బాదినట్టు బాదడం మొదలెట్టాడు...

తల్లి ప్రాణం గిలగిల కొట్టుకుంది ''ఒరే! శేషాద్రి! పది రూపాయలకోసం వాడి ప్రాణాన్నే తీసేటట్టున్నావ్. వాడు నీ చావు దెబ్బలకి బలైపోకుండావుంటే ఎప్పటికైనా , తీర్చుకుంటాడులేరా! నీ ఋణాన్ని వుండిపోడు'' అంటూ మంచంమీంచే గట్టిగా అరిచింది.

''నువ్వు నోర్మూయ్యి. నీ అండదండలు దండిగా వున్నాయని నాకు తెలుసు. నోరు మూసుకు పడివుంటే వుండు, లేదా ! నువ్వు, నీ కొడుకు పోయి ఆ గంగలో దూకండి. ఋణం తీరుస్తాడట, ఋణం. ఈ వెధవలకి నేనేనాడో ఋణపడ్డాను వీడి దుండగాలు నాకు ఎన్ని దండుగలు తెస్తున్నాయో. మొన్న ఆ కరణంగారబ్బాయితో వీడి బలమంతా చూపెట్టి కుస్తీపట్లు పట్టి ఆ అబ్బాయి కాలుకాస్తా వంచేడు. వీడి జీవాల కుసూరు మంటూ వారంరోజులు మంచాన పడ్డాడు. అదృష్టం బాగుంది కాబట్టి మంత్రాలకి ఏవో నూనెలకి కాలు నయమైంది గానీ లేకుంటే, వాడి అమ్మా, నాన్నా తెల్లారిలేచింది మొదలూ మంగళ హారతులన్నీ నాకు పడుదురు. వీడి నేమన్నా వీడికి సిగ్గా! లజ్జా! ఆత్మాభిమానం అంటూ అసలు శూన్యం. ఇలాటి ముదనష్టం గాడిదని ముద్దించమంటావా?'' అంటూ తల్లి మీద విరుచుకుపడ్డాడు శేషాద్రి.

వీధి తలుపు చప్పుడయింది. చేతిలో కఱ్ఱ కిందపారేసి కోపంతో భళ్ళున తలుపు తెరిచాడు శేషాద్రి. ఎదురుగా 'పెద్దగాపు' బంగారయ్య!.

బంగారయ్యను చూడగానే శేషాద్రి కోపం కొంచెం దిగజారింది.

'ఏం? బంగారయ్యా! ఇలా వచ్చావ్' అన్నాడు వగర్చుకుంటూ.

'ఏంనేదు బాబూ మన చినబాబుగారు కిరాణా కొట్టుకాడ పది రూపాయలు పారేసుకున్నారు. అదేంటో ఎవరో డబ్బుపోయిందంటూ కంగారుపడుతుంటే మధ్య ఈ బాబేమో బెదిరిపోనారు. అదే పరుగు, ఆకంగారులో జేబులో నోటు కిందపడిపోయింది. అది నా కళ్ళబడింది. తీసిచ్చేలోగా వొకటేపరుగు. ఆ బాబు వెనకానే వద్దును. గానీ ఆ దొంగ యెదవడో తెలుసుకుందామని కొట్టుకాడ వుండిపోనాను ఆకరికి దొరికాడునెండి' అంటూ బొడ్డు కట్టులో భద్రంగా దోపిన పది రూపాయల నోటునుతీసి శేషాద్రి

చేతికందిచ్చాడు బంగారయ్య.

''చూసేవా! బంగారయ్యా! నీకు దొరికింది గాబట్టి తెచ్చిచ్చావ్ ఇంత నిజాయితీగా మసలేవాళ్ళెవరోయి ఈ కాలంలో. ఈ చచ్చు పీనుగ జాగ్రత్తకి వీణ్ణేంచెయ్యాలంటావ?'' అంటూ బంగారయ్య చేతిలోంచి నోటు తీసుకున్నాడు శేషాద్రి...

''యేంటో బాబూ! చినబాబు కాస్త ''అమాయకం'' పాపం! అన్నాడు విస్సు పరిస్థితి నర్థంచేసుకున్న బంగారయ్య.

''శలవు బాబూ'' అంటూ రెండు చేతులూ జోడించి అక్కడ నుంచి కదిలాడు బంగారయ్య చుట్ట నోట్లో పెట్టుకుంటూ...

''కష్టార్జితం, కాబట్టి కాలవలో కొట్టుకుపోతున్నది కాళ్ళకు తగిలినట్లు తిరిగి దొరికిం''దంటూ శేషాద్రి చేతిలో నోటు తీసుకొని కళ్ళకద్దుకొని కొంగున కట్టుకుంది రాజ్యం.

మూలకొదిగి కళ్ళు తుడుచుకుంటూ నిలబడ్డ విస్సుని చూసి కనుబొమలు ముడుచుకుంటూ వంటింట్లోకెళ్ళిపోయింది రాజ్యం.

''ఛీ పాడు వెధవలు. బాగా దాపురించారు'' గొణుక్కుంటూ బయటికి పోయాడు శేషాద్రి. విస్సు కళ్ళుతుడుచుకుంటూ వదలి పెట్టిన పని పూర్తి చెయ్యడానికి పెరట్లోకి పోయాడు.... రెండు గంగాళములనిండా నీళ్ళు తోడేడు. పెరడంతా బాదంచెట్టురాల్చిన జీవంలేని ఎండుటాకులన్నీ వూడ్చి ఒక మూల కుప్పగా పోసేడు పండి నిస్సారమై ఎండిపోయి, చెట్టునుండి రాలిన ఎండుటాకుల పోగువేపు చూసి తన బ్రతుకు కూడా, సారంలేకుండా, నిరుపయోగంగా, వుండి ఎప్పుడో, రాలిపోతుందంటూ నిట్టూర్చాడు. అర్థంలేని తన బ్రతుకు, అన్నా, వదినెలకి ''వ్యర్థమే.'' తనకి మాత్రం? తన బ్రతుకులో ఏం ప్రయోజనాన్ని ఆశించాలి? మంచంమీద నుండి సరిగా లేవలేని తన ముసలి తల్లికి తన అండ ఏపాటిది? అన్నా. వదినల వడగాల్పులాంటి మాట కి తల్లి తల్లడిల్లిపోయి విసిగి వేసారిన తల్లికి చల్లగా నీడనిచ్చి సేదతీర్చలేని తనొక మోడుమాను తల్లీ తనూ కూడా వాళ్ళ గుండెలమీద కొండంత బరువు, తను ఏం చేస్తాడు. అన్నయ్య

చదువు చెప్పిస్తే చదువుకోనేవాడే. నుదుట రాత చదివినట్టు, చదువురాని వెధవనని ముందు నుండి అప్రయత్నమే మానుకున్నాడు. తను వూరికే తిని తిరగలేదే! పెట్టిన తిండరిగే వరకూ రెక్కలు విరుచుకుచాకిరీ చేస్తూనే ఉన్నాడు. పాచిపనులు చేయడానికి'పనిమనిషిలా' పొలం పనులు చెయ్యడానికి 'పనిమనిషిలా' పొలం పనులు చెయ్యడానికి పాలేరులా, గొడ్లు మేపడానికి పాలికాపులా, అన్నిటికి తనొక్కడే నిర్దేశింపబడ్డాడే; అయినా , అన్నయ్య దయకు నోచుకోలేదు అన్నయ్యన్నది నిజమే. బ్రతికుండీ ఏం ప్రయోజనం. ఇంట్లోనైనా మెప్పు పొందలేని బ్రతుకు తనది అనుకున్నాడు విస్సు.

నూతి చపటా మీద మోకాళ్ళకి చేతులు చుట్టుకొని శూన్యంలోకి చూస్తూ....తదేకంగా.....ఆలోచించుకున్నాడు....

విస్సుకి, అడపా, తడపా, అన్నావదినల చేత, తిట్లు తినడం పరిపాటే. అయినా ఆవిషయం గురించి ఆలోచించకుండా వుండలేడు. ఈ ఆలోచనల వల్ల ప్రయోజనం శూన్యమని తనకుతెలుసు. తను ఏం చేయ లేడు. పలానావిధంగా మసలుకో అని తన అంతరాత్మయినా చెపుతే బాగుండును. అదీ మూగ పోయింది. పర్యవసానం వెదికి, దారి చూపించడానికి మార్గదర్శి అయిన మెదడు మొద్దుబారి మట్టిముద్దయింది ఏమిటో అలాగని నిర్జీవంగా వుందామన్నా పైకి పెట్టలేని పౌరుషం, ఆంతర్యంలో ఆవేదన రేపుతూంది. ఏ పని స్వతంత్రించి చేయలేని అర్భకుడు. అయితే ఈ అభిమానం ఎందుకు? అన్నారని ఆవే నెందుకు, ఏ ప్రశ్నకి, జవాబుదొరకక బావురుమన్నాడు విస్సు.....అలా ఎంతసేపో శూన్యంలోకి చూస్తూ కూర్చున్నాడు....

''విస్సూ!'' నూతిలోంచి పిలిచిన పిలుపులా వినిపించింది తల్లి పిలుపు....

విననట్లూరుకున్నాడు.

మళ్ళీఅదే స్వరంతో పిలిచింది....జవాబు రాకపోయేటప్పటికి మంచం దండె నానుకొని మె గా లేవబోయి సరిగా వూత దొరకక ఫెనక్కి పడిపోయింది.....

నూతి చపటామీంచి చూశాడు విస్సు. గబగబా తల్లి మంచం దగ్గరకి పరుగెత్తాడు...తను చేయూతనివ్వందే, లేవలేదు తల్లి, ఆవిడని నిర్లక్ష్యంతో, తనకేమీ పట్టనట్టు వొదిలేస్తే, ఏమౌతుంది? ఇంతసేపూ తల్లి కి కూడా ఉపయోగపడలేనని అనుకున్నాడే....లేదు తన తల్లికి తను దగ్గరున్నంతవరకూ శక్తి వంచన లేకుండా సేవచేస్తాడు. అంతే అదే తృప్తి.

విస్సు తేలికైన మనసుతో గబగబా వచ్చి తల్లి తలకింద తలగడ సరిచేస్తూ మంచం మీద కూర్చున్నాడు.

'విస్సూ! ఆకలిలేదురా! అన్నంతినవూ?'' అంది కళ్ళనీరు నింపుకుంటూ.

అన్నంపంగతప్పుడు జ్ఞాపకమొచ్చింది. 'అయ్యో అమ్మకి అన్నం పెట్టకుండా శుష్క ఆలోచనలతో ఎంత పొద్దు పోగొట్టాను'

'ఇదుగోనమ్మా! అన్నం పెడుతున్నాను' అంటూ తల్లి మంచందగ్గర రాజ్యం పెట్టిన అన్నం గిన్నె ముందుకు తీసి కంచం శుభ్రంగా కడిగి తోడిన నీళ్ళు గ్లాసునిండా నింపుకొని తీసుకొచ్చాడు.

''నాకు అన్నం పెట్టమనిట్రా నిన్ను పిలిచాను. నా ఆకలి తీర్చమనా నిన్ను పిలిచా''నంటూ నీళ్ళునిండిన కళ్ళతో విస్సు వేపు చూసింది తల్లి.

''అది కాదమ్మా! నీకు ముందర పెట్టి నేను తర్వాత తింటాను.....'' అన్నాడు అన్నం కలుపుతూ.

ఆమాట ఎంత నమ్మవచ్చో ఆ ముసలి హృదయానికర్థమైంది.

''ఒరే విస్సూ! ఆ కంచం అక్కడపడేయ్ నువ్వుతినని అన్నం నాకుమాత్రం కావాలా'' అంటూ, గోడవైపు తిరిగి పడుకుంది.

వెక్కి వెక్కి ఏడుస్తున్న తల్లిని ఎడంచేత్తో ఇటుపక్కకి తిప్పుకున్నాడు.

''లేదమ్మా నేనుతింటాను. నా వల్ల నీకే సదుపాయం లేకపోగా, నిన్ను తిండి తిననివ్వకుండా వుపవాసాలుంచలేను. నీ కోసం నేనూ తింటాను. తినకపోతే ఈ మాత్రమైనా నీకు సాయపడవద్దూ? 'లే' నీకు ముందు పెట్టాక

తర్వాత తింటాను.'' అంటూ తల్లికి చేయూతనిచ్చి లేవదీశాడు.

అన్నంపెడుతున్నంతసేపూ ఆలోచించుకున్నాడు తను తినాలి. అన్నం 'తినాలి' తినకపోతే అమ్మకి ఆసరాగా ఎలా వుండగలడు.

తల్లి తిన్నతర్వాత కంచం కడుక్కొని మిగిలిన అన్నం పెట్టుకొని తల్లికి తృప్తి కలిగేలా తింటున్నాడు.

'ఒరే! విస్సూ' తన మంచం దగ్గరగా కంచంలో అన్నం తింటూన్న విస్సు తలనిమురుతూ పిలిచింది తల్లి.

''ఏమమ్మా! ' తలెత్తి తల్లివైపు చూశాడు.

''అదికాదురా! అన్నయ్య నిన్నన్నాడని బాధపడుతున్నావా! వాడు నిన్నన్నది నీకోసమేరా! ఎప్పటికైనా నీ గురించి నువ్వు శ్రద్ధ తీసుకొని బాగుపడతావని అంటాడు.... అంతేకాని..... వాడికి నీమీద కక్షా? చెప్పు'' అంది .... ఆ మాటల్లో నిజం ఎంతవరకూ వుందో తల్లికి తెలియక కాదు కానీ విస్సు మనస్సు వ్యర్థ ఆలోచనలనుండీ తేరుకోడానికన్నమాటలే...

తను ఎంత తెలివిలేనివాడైనా....విస్సు వొకొక్కప్పుడు పరిస్థితుల నర్థంచేసుకోగలడు. తల్లి అంటూన్న మాటల్లో యదార్థం మరుగునపడి తన తృప్తికోసం ఆవిడ పడుతూన్న శ్రమంతా స్పష్టంగా కనిపించింది.....

చిరునవ్వు నవ్వుకున్నాడు.....

''అవునమ్మా నిజమే, అన్నయ్య నా మంచికోరే, అంటాడు..... అన్నయ్యకి నా మీద కక్షా....అసలంతికీ, అన్నయ్యకి నేనేం అపకారం చేశానని'' అంటూ తల్లివేపు తలెత్తి చూశాడు...

తల్లి ఇంటికప్పువేపు చూస్తూ గబుక్కున విస్సువేపు చూసింది...

చమర్చిన కళ్ళు నీళ్ళతో పూర్తిగా నిండుకున్నాయి. ఆ కన్నీళ్లు తల్లికి కనబడకుండా తలవంచేసుకొని అన్నం తింటూనే కన్నీటిని టపటపరాల్చుకొని అన్నంతోటే జీర్ణం చేసుకున్నాడు విస్సు...

'నా పిచ్చి విస్సూ, నువ్వు ఏనాటికైనా ప్రయోజకుడవుతావురా.....

ఆశతోటే సంతోషంగా బతుకు. అంతేకానీ నాకళ్ళెదురుగా కుమిలి, కృశించిపోకురా'' అంది జాలిగా....

'అలాగేనమ్మా! ఇక పడుకో'' అంటూ కంచంలో చెయ్యి కడుక్కొని పడుకున్న తల్లికి దుప్పటి కప్పేడు.

తనకూడా తిన్న కంచం కడుక్కుని మంచం కిందనున్న చాప వేసుకుని దెబ్బలతో మొండిదేలిపోయిన శరీరాన్ని చాపమీద చారవేశాడు.

★ ★ ★

ఆ రోజు గ్రామదేవత పండగ. ఊరంతా చాలా హడావిడిగా వుంది.

''విస్సూ!' వంటింట్లోంచి రాజ్యం కేకేసింది. చావిడి తుడుస్తున్న విస్సు వొస్తున్నానొదినా అంటూ చీపురు చేతపుచ్చుకొని వంటింట్లోకి వెళ్ళాడు.

ముందా చీపురు అవతల పారవేసి, పాపని కొంచెం చూసిపెట్టు, అల్లరిపెడుతోంది. నేను అమ్మవారికివాళ నైవేద్యం పెట్టాలి, అంటూ ఏడుస్తున్న పాపని చూపెట్టింది.

'దా! పాపా! అలా వెడదామ్' అంటూ చేతులు చాచాడు విస్సు.

పాప రాకుండా మరింత ఏడుపు మొదలెట్టింది.

''ఇద ఈ బిస్కెట్లు తీసుకొని పాపని తీసికెళ్ళు'' అంటూ రెండు చేతిలో పడేసింది.

బిస్కెట్లు విస్సు చేతిలో వుండడం చూసి ఏడుస్తూనే విస్సు దగ్గరకొచ్చింది పాప.

పాపనెత్తుకొని వీధిగుమ్మంలో కూర్చోపెట్టుకున్నాడు విస్సు.

రెండు బిస్కెట్లు రెండు సెకండ్లలో పూర్తిచేసింది పాప..... మళ్లీ ఏడుపు.

ఎంత సముదాయించినా వూరుకోకపోతే మళ్లీ వంటింట్లోకి వెళ్ళాడు విస్సు.

'పాప ఏడుస్తోంది వదినా' అన్నాడు.

''బిస్కెట్లయిపోయాయా!'' అంది ఎన్నో ఇచ్చినట్లు.

విస్సు మౌనంగా వుండిపోయాడు.

''అవి నీ నోట్లో పడివుంటా'' యంటూ బిస్కెట్ల డబ్బా తేవడానికెళ్ళింది.

''వదినా!'' గట్టిగా అరవాలనుకున్నాడు. ఏదో అదృశ్య హస్తం పీక గట్టిగా నొక్కినట్లయింది. మనసులోనే ఆవేశంతో అనుకున్నాడు వదినా అని.

మళ్ళీ మరో రెండుబిస్కెట్లు చేతికిచ్చింది.

బిస్కెట్లని చేతితో కసిగా నొక్కి పట్టుకొని తొందరగా అక్కడనుంచి పాపనెత్తుకు వెళ్ళిపోయాడు.

వదిన మాట బాకు పోటులా, గుండెల్లో గుచ్చుకుంది. పాప బిస్కెట్లు తను తిన్నాడా! ఛీ, మనసంతా అసహ్యంతో నిండిపోయింది. ఈ ఆలోచనతో సతమతమౌతున్నాడు విస్సు.

పాప ఏడుపు విని చేతిలో బిస్కెట్లు చూసుకున్నాడు. లేవు...

చచ్చాను భగవంతుడా ఇవిగూడా అయిపోయాయి. ఇంక మళ్ళీ వదినమ్మ గార్ని అడిగేనా.... మధ్యలోనే వదిన మాట గుర్తొచ్చింది. బాబోయి ఈసారి నన్ను చిత్రవధ చేసే మాట విసురుతుంది అనుకున్నాడు.

ఇంతలో ఏదో బాజాలు కత్తిసాము అటువచ్చాయి.

హమ్మయ్యా! బతికాను బాబూ అంటూ పాపనెత్తుకొని గుండ్రంగా మూగిఉన్న జనసమూహంలో జొరబడ్డాడు.

బాజాలకి పాప సంతోషంతో చప్పట్లు కొట్టింది. తనుగూడా వింతగా చూస్తున్నాడు.

పాప కె ˙ న అరిచింది. ...

''లేదమ్మా! భయపడ్డావా! అబ్బే కర్రతో మన్ని కొట్టడమ్మా! అది కర్రసాము చూడు....ఎంత బాగా కర్రతిప్పుతున్నాడో'' అంటూ సముదాయించాడు పాపని.

కత్తి, కర్రసాము అయిపోయింది. బాజాలు వెళ్ళిపోయాయి. గుండ్రంగా

నిలబడ్డ గుంపు కదలిపోయింది. విస్సు పాపని వీధి అరుగు మీద నించోపెట్టాడు....

''విస్సూ! పాపనిలాతే'' అంటూ రాజ్యం వచ్చింది. గౌను విప్పింది, పాప మెడ బోసిగా వుంది...

''విస్సూ! పాపమెడలో గొలుసు కనబడలేదు ఏంచేశావ్?'' అంటూ గుడ్లెర్రజేసింది.

నిర్ఘాంతపోయాడు విస్సు...

''పాపమెడలో గొలుసుందా!'' అన్నాడు అయోమయంగా.

''ఏడిసినట్టేవుంది. దాన్నెక్కడ తిప్పావో ఏమిటో వెళ్ళు. మొద్దులా అలా చూస్తూ నిలబడిపోతావేం ఈ సంగతి మీ అన్నయ్యకే తెలుస్తే ఇంకేమన్నా వుందా!వెళ్ళు'' అంటూ వురిమింది.

చేసేదిలేక చేతులు నలుపుకుంటూ బయటికిపోయాడు విస్సు.

తను పాపనెక్కడికీ తీసుకెళ్ళలేదే? కత్తిసాము దగ్గరకే తీసికెళ్ళాడు. బహుశ గొలుసక్కడ జారిపోయిందేమో? అలా అయితే ఇంకా అక్కడ వుంటుందా? జాతర ఎప్పుడో అక్కడ నుండి వెళ్ళిపోయింది అనుకొంటూ అనుమానంతో తను నిలబడ్డ స్థలం వెతికాడు. ఫలితం శూన్యం.

ఒకవేళ మెళ్ళో గొలుసు ఎవరైనా దొంగలు కత్తిరించారేమో?

అదే అయుంటుంది అన్నట్టు అప్పుడు పాప కెవ్వున అరచినట్టు.....ఆ! గుర్తొచ్చింది. అప్పుడు తను పాప జడిసిపోయిందని అనుకున్నాడు మెళ్ళో గొలుసు కత్తిరిస్తూంటే పాపకి నొప్పెట్టి ఏడ్చుంటుంది.

అయ్యో దేముడా! ఇప్పుడేమిటి దారి అన్నయ్యరాగానే వదిన చెపుతుంది గొలుసు పోవడానికి కారకుడు తనే అని.

అప్పుడు అన్నయ్య!...... పదిరూపాయల కోసం ప్రాణం తీసేంత హడావిడి చేసిన అన్నయ్య!.....ఇంక ఊహించలేకపోయాడు. విస్సు.... గజగజ వణికి పోయాడు. అన్న రెండవ యముడిలా తన మనోనేత్రానికి కనిపిం

చగానే....''అయ్యో బాబోయ్'' అన్నయ్యా అంటూ అక్కడనుండే పారిపోయాడు విస్సు.

ఈ సంగతి తల్లికి తెలిసింది. రాబోయే ప్రళయానికి తను తట్టుకోలేదు. అహంకారంతో అమాయకుడైన విస్సుని హింసిస్తుంటే తన గుండె బ్రద్దలై పోతుంది. ఆ హింసాకాండని విస్సుకూడా భరించలేడు. ఈ రోజుతో విస్సుకి నూరేళ్ళు నిండాయి. ఇద్దరికీ వొకే సారి ఈ చెరనుండి విముక్తిని ఆలోచించుకుంది.

ఏ క్షణంలో విస్సు ఈ యమద్వారంలో అడుగుపెడతాడో.... కళ్ళు భయంగా ద్వారం వేపు చూస్తున్నాయి.

భగవంతుడా ఈ రోజు విస్సు రాకుండా ఉంటే బాగుండును...అదెలా సాధ్యమౌతుంది....

పరిపరి విధాల ఆలోచనలతో మెల్లిగా కర్ర ఊత పట్టుకొని వీధి గుమ్మంలోకొచ్చి కూర్చుంది.

తల్లిని గుమ్మం దగ్గర ఎన్నడూ చూడని శేషాద్రి చీదరింపుతో పక్కకి తప్పుకొంటూ ఇంట్లోకొచ్చాడు.

శేషాద్రి రాగానే జరిగిందంతా చెప్పింది రాజ్యం. శేషాద్రి తారాజువ్వలా లేచాడు. 'రానీ, ఈరోజుతో వాడికీ నాకూ సరి. ఇంక వీణ్ణి భరించ ....మెరుపులా పెరిగిన, వెధవని మేపడం కష్టంగానే వుంది' అంటూ కర్ర పట్టుకూర్చున్నాడు.

ండు, వొంటిగంట దాటింది శేషాద్రి ప్రాణం విసిగి కర్ర అవతల పారేశాడు.

రాక ఎక్కడి పోతాడు. కడుపు మాడితే కుక్కలా వాడేవస్తాడు. ఈ చవట పీనుగని చేరదీసి దగ్గర పెట్టుకొని వీడి దండగలన్నీ భరిస్తూ కూర్చోడానికెవరి కోపిక అంటూ కాళ్లుకడుక్కొని భోజనానికి పోయాడు.

భోజనాలయ్యా అ .. కి గిన్నెలో గిరవాటెయ్యకుండా, ఆకులోనే అన్నీ పెట్టి మంచం దగ్గరగా పడేసి పోయింది రాజ్యం.

★ ★ ★

విస్సు బాబు లేకపోవడం వల్ల తల్లికి శారీరకంగా కష్టాలెక్కువయ్యాయి. తను ఈ పట్టున చచ్చిపోగూడదూ? తన ఆలోచనలకి తనే నవ్వు కుంది.....చచ్చిపోతే.....తను చేసిన కర్మల ఫలితాలన్నీ తనవంతు ఎవరనుభ విస్తారు.....పూర్తి అనుభవం కాకుండా. మధ్యన చావడానికి తనకి హక్కేముంటుంది. తన గురించి ఆలోచన అంతమయ్యేటప్పటికి విస్సు మనసులో మెదిలాడు.

''విస్సూ! ఎక్కడికెళ్ళావురా? నీకింత ధైర్యం ఎలా వచ్చింది, ఇంటివాళ్ళ దయకు నోచుకొని నీకు పరులపంచన నీడ దొరుకుతుందా! ఇంట గెలవలేనివాడివి రచ్చన' విజయం సాధించగలవుట్రా! ఎండలోనడచి గొంతుక తడారిపోతూంటే మంచినీళ్ళని ఎదుటవారినడగందే వారికి తెలియదన్న సంగతి కూడా నీకు తెలియదే? ఏ ఆధారం చూసుకు బయటికి పోయావురా!'' అంటూ వెక్కి వెక్కి ఏడ్చింది.

వారం, నెల, రెండు నెలలూ, గడిచిపోయాయి విస్సుబాబు జాడ తెలియలేదు తల్లి బెంగతో మరింత దీనావస్థకొచ్చింది.

శేషాద్రి మాత్రం వొక శని వదలిపోయిందనుకున్నాడు మనస్సులో.

★ ★ ★

''శెహబాస్ విస్సుబాబూ! నువ్వీ రైఫిల్ ట్రెయినింగ్‌లో ఈ మూడునెలలకే ఇంత పైకొస్తావనుకోలేదు దీనంతటికీ నీ పట్టుదలా, కార్యదీక్షే ముఖ్యకారణం నీవంటి కార్యదీక్షాపరులే మన దేశ సౌభాగ్యానికి ప్రధమ సోపానాలు'' అంటూ చేతిలో చెయ్యి వేసికరచాలనం చేశాడు ల్ఫ్టెనెంట్.

''నాయీ ఉన్నత స్థితికి కారకులు మీరే. ఆనాడు ఈ నిర్భాగ్యుడిపట్ల దయ చూపించకపోతే ''దారం తెగిన గాలిపటం, ఏనాడో, ఎక్కడో రాలిపోయేది..... అలాంటిది తమ కరుణా కటాక్షం చేత నాకీ ఉన్నతి కలిగించారు. ఎందుకూ పనికిరానివాడినై హీనంగా బ్రతుకుతూన్న నన్ను ఈ మహోన్నత శిఖరాలకెక్కించారు. నా బ్రతుకుని సార్థకతపరుచుకుంటాను. నా

రక్తమాంసాలని ఈ పవిత్ర భారతభూమి కర్పించి, ఈ గడ్డపై పుట్టినందుకు భారతాంబ ఋణం తీర్చుకుంటాను' అని విస్సుబాబు అంటూంటే ల్ఫ్టినెంట్ కళ్ళు ఆనందంతో మెరిసాయి......''విస్సు బాబూ! నీలో దేశసౌభాగ్యకాంక్ష ఇంతగా గడ్డకట్టుకొని వుందా! అంటూ'' హృదయానికత్తుకున్నాడు.

★ ★ ★

పోస్టు...

పోస్టుమేన్ కిష్టయ్య చేతిలోంచి శేషాద్రి కవరు ఫర్రున లాగి చించాడు ఉత్తరం చదువుతున్నంతసేపూ శేషాద్రి కనుబొమలు ముడుచుకునేవున్నాడు. పూర్తిగా చదివి తల్లి మంచంమీదికి ఉత్తరాన్ని విసిరి 'చదువు' నీ ముద్దుల కొడుకు రాసాడు' అంటూ స్నానానికి పోయాడు. పోతూ 'వెధవ, ఆఖరికి మిలట్రీలో చేరాడన్నమాట' అన్నాడు హేళనగా.

కొడుకు దగ్గరనుంచి ఉత్తరం అంటే! విస్సు....విస్సు బతికున్నాడా....నాకు తన ఉనికి తెలియజేస్తూ ఉత్తరం రాశాడా! విస్సూ! ఇన్నాళ్ళకి నేనున్నానని గుర్తొచ్చిందా?....ఆనందంతో ఉక్కిరిబిక్కిరై పోతోంది తల్లి.. ఆ ఆనందం నీటి బుడగలా వువ్వెత్తుగా లేచి చప్పున అణగారిపోయింది. బతికు- డు మిలట్రీలో....చేరేడు మృత్యువు ముఖద్వారానికి.. అంటూ గొల్లుమంది ఇంకా...యేమిటి రాసాడో? తనకి చదువురాదన్న సంగతి తెలుసుకదా! కాస్త, చదివి పెడితే తప్పొచ్చిందికాబోలు అనుకుంటూ ఉత్తరా మ-ి ) తలగడ ద జాగ్రత్తగా పెట్టింది.

సాయంకాలం రాజ్యం కోవెలకి వెళ్ళింది. శేషాద్రి యేదో పనిమీద బయటకి పోయాడు. మెల్లిగా నడిచి వీధి గుమ్మంలో కూర్చుంది తల్లి....పక్కింటి గోపి, జారుకు పోతున్నాడు..... కళ్ళకి చెయ్యడ్డం పెట్టుకొని గోపీని గుర్తుపట్టింది.

''ఒరే! గోపీ! ఇలారా! చిన్న సహాయం చేసిపెట్టవూ!'' అంది చిన్నపిల్ల తల్లిని తాయిలం ఇమ్మని అడిగి ట్టు.

''అలాగే మామ్మా! ఏమిటి చెయ్యమన్నావు చెప్పు'' అంటూ సంచీ

పూపుకుంటూ వచ్చాడు గోపీ....

''ఒరే! గోపీ నువ్వు ఆరుక్లాసులు చదివావు కదా కొంచెం ఈ వుత్తరం చదవరా!'' చేతికి వుత్తరాన్నందిస్తూ అంది...

''ఎక్కడనించొచ్చింది మామ్మా!'' వుత్తరం విప్పాడు గోపీ.

'యేమోరా! ఎక్కడనుంచో నాకూ తెలియదు చదువు'.....

గోపీ చదవడం మొదలెట్టాడు.

పూజ్యురాలైన అమ్మకి....

కొన్ని వందల మైళ్ళ దూరంలో వున్న విస్సు..... నమస్కారములు చేసి వ్రాయునది... అమ్మా! నీకు చెప్పకుండా ఇంతదూరం ఎలా వెళ్లానని ఆశ్చర్యంగా వుంది కదూ! నీ విస్సుకి ఇంత ధైర్యం ఎక్కడనుంచొచ్చిందని అనుకుంటున్నావు అవునా! అమ్మా! ఇన్నాళ్ళకి నా జీవితానికి గమ్యం కనిపించిందమ్మా! నా బ్రతుకుకి సార్థకత ఏర్పడింది. అన్నయ్య ఏనుగులా పెరిగానని ఎప్పుడూ అంటూండేవాడు ఈ ఏనుగు భారత భావి భాగ్యోదయానికి పునాదిరాయిగా వుపయోగడ్డదమ్మా! ఇంతకంటె అదృష్టమింకేం కావాలి! నేను మనిషిగా అందరిదృష్టిలో గుర్తించబడ్డాను ఇంతకాలానికి నా ఆవేదన అంతమొందింది. నాకు సంపూర్ణ ఆత్మశాంతి లభించింది. ఇన్ని మాటలు నీ విస్సు.....'చేతకానివాడు' ఎలా రాశాడా అనుకుంటున్నావ్ కదూ ఇక్కడ నాకు మంచి స్నేహితుడు దొరికాడు. అతని ద్వారా వుత్తరం రాయడమైంది. ఇప్పుడిప్పుడే కొంచెం చదువు నేర్చు కుంటున్నాను. నీకు సాధ్యమైనంత త్వరలో, నా స్వహస్తాలతో వుత్తరం రాస్తాను. నా స్నేహితుడు నే చెపుతున్న మాటలను వుత్తరంగా నీకు రాసాడు. నా గురించి నువ్వు బాధపడకు. నాయీ వున్నత స్థితి తలచుకొని ఆనందించి ఆశీర్వదించు నీ విస్సు భారతాంబ మెడలో వున్న పువ్వుల మాలలో వొక పువ్వుగానైనా, అధమం పువ్వులలోవున్న రేకుగానైనా లెక్కించబడుతే ఆ పేరు నీకుకాదా? ంతకంటే రాయడానికి నాకు చేతకాలేదు అన్నట్లు నీకు ఆ రోజు సంఘటన లియజెయ్యడం మరచాను....

★ ★ ★

ఆ రోజు... అంటే....గొలుసు పోయిన రోజు అన్నయ్య నన్ను బతకనీయడని అంటే 'నాప్రాణం మీద తీపిచేత కాదు సుమా' ఆ పని నేనే స్వయంగా చేసుకుందామని స్టేషనుకి పారిపోయాను. అక్కడ కదలిపోతున్న రైలు కళ్ళపడింది. ఏ ఆలోచనా తట్టక వొక పెట్టె గొళ్ళెం పట్టుకు వేలాడి పోయాను. రైలు వేగంగా సాగిపోతూంది...

ఇంతలో తలుపు తెరుచుకొని వొక బలమైన హస్తం నా బుజం, పట్టుకొని లోపలికి లాగింది...ఎదురుగా సీటుమీద కూర్చోమన్నారు. కొంతసేపటికి నాకుతెలిసిందేవిటంటే, నేనెక్కింది వొకటవ తరగతి పెట్టె అనీ, నా ఎదురుగా వున్నవారు, మిలట్రి ''అధికారి'' ల్ఫ్టినెంటని. నా సంగతి అంతా అతను నన్నడిగిన తరువాత చెప్పాను. అంతా విన్నారు. నా పరిస్థితి నేనుండే పరిసరాలు అన్నీ అర్థం చేసుకున్నారు. తరువాత నీకు ప్రతినెలా కొంత డబ్బు పంపిస్తాను, నీ అవసరములన్నీ వాటితో తీర్చుకో. అన్నయ్య పేర గూడా పంపుతాను....నేను పారేసిన గొలుసు పాపకి తిరిగి చేయించమను.

ఇట్లు

విస్సుబాబు....

గోపీ ఉత్తరం పూర్తి చేసేటప్పటికి రెండుమూడుసార్లు కళ్ళొత్తుకుంది.

''ఏం? మామ్మా! అలాకళ్ళు నులుపుకుంటున్నావెందుకు?'' అన్నాడు అమాయకంగా.

''ఏం? లేదురా, కంట్లో ఏదోపడి బాధపెడుతూంది....వెళ్ళు, పాపం! చాలా సేపయి వచ్చావ్'' అంటూ గోపీ చేతిలో ఉత్తరాన్ని తీసుకుంది.

గోపీ వొక్కసారి ఆవిడ కళ్ళలోకి చూసి ఏమీ అర్థమవక బజారుకుపోయాడు.

తల్లి మంచం చేరి గొల్లుమంది....పెళ్ళలూడి, శిథిలావస్థలోకి జారిపోతున్న గోడలు మాత్రం ఆవిడ గోడు విన్నాయి.

అన్నమాట ప్రకారం విస్సు బాబు డబ్బు పంపించాడు. వేలుముద్దర ముసిలమ్మ వేయగానే డబ్బుని మూటగట్టేవాడు శేషాద్రి. ఆవిధంగా మూడు నాలుగుసార్లయింది.

★ ★ ★

అనుకోకుండా 'వారు' వచ్చింది.

ముష్కరులు అమాంతం దేశాన్ని హస్తగతం చేసుకుందామన్న దాహం ఎక్కువై దాడి ప్రారంభించారు.

భారతీయ సైనికులు వీరావేశంతో ''వారు'' ఫీల్డులో ప్రవేశించారు. శతఘ్నుల భీషణ ధ్వనికి దిక్కులు చీకట్లు దేరుతున్నాయి. భారతీయ వీరులకి అపజయమెన్నడూ లేదు. ఆ రోజు విస్సుబాబు ప్రతాపానికి తోటి యోధులందరూ నివ్వెరపోయారు. విస్సు రణరంగములో తుపాకి పట్టుకొని ఎడతెరిపి లేకుండా శత్రువులను చెండాడుతుంటే శహబాస్ అని అరచారు. ఈ సంగతి ల్యూటినెంట్‌కి తెలిసి వార్ ఉద్రిక్తత కొంచెం తగ్గగానే విస్సుబాబుకి అమూల్యమైన బిరుదిచ్చి ఘనంగా సన్మానించాలనుకున్నారు. శత్రుసేన అలసిపోయింది. భారతవీరుల ధాటి కాగలేక వెనుకంజ వేసింది.

హమ్మయ్యా! అనుకున్నాడు విస్సుబాబు. అజాగ్రత్త పనికిరాదని తుపాకిలో గుండ్లు సరిచూసుకుంటున్నాడు. ఇంతట్లో శత్రుసేన నుండి వొక గుండు వచ్చి విస్సు గుండెల్లోంచి దూసుకుపోయింది. అమ్మా! అంటూ గుండె చేత్తో పట్టుకొని నేలకొరిగిపోయాడు విస్సు బాబు....

నలుగురూ, గబగబ, విస్సుబాబుని సాయంపట్టి ఫీల్డు నుండి, టెంట్‌లోకి, చేర్చారు. డాక్టరొచ్చేలోపల శస్త్ర చికిత్స చేద్దామంటే అప్పటికే, విస్సు శరీరం నుండి , రక్తం చాలా వరకూ, పోయింది. డాక్టరొచ్చారు. లాభం లేకపోయింది.

విస్సుబాబు చుట్టూ, ప్రముఖ యోదులందరూ నిలబడ్డారు. ''విస్సుబాబూ మీ వాళ్ళకి ఏదైనా చెప్పదలచుకుంటే చెప్పు. తెలిజేస్తా'' నన్నాడు ల్యూటినెంట్.

నీరసం వల్ల నోటమాట రాలేదు. అటు నుంచి ఇటు తలమాత్రం తిప్పాడు ఏమీ లేదన్నట్లు.... తన చుట్టూ నిలబడ్డవారందరి వేపు ఒక్కసారి చూసాడు. రక్తంతో తడిసిన గుండెని పట్టుకొన్న తన చేతిని మెల్లిగా నుదిటి మీదకి చేర్చాడు. ఆఖరి సారిగా అందరికీ 'సెల్యూట్' చేశాడు. చెయ్యి నుదుటిమీంచి నేలకొరికిపోయింది. విస్సుబాబు ఆత్మ అనంతవాయువుల్లో లీనమయి పోయింది.

యుద్ధభూమిలో వీరులు కంటతడి పెట్టరాదన్న సూక్తి తెలిసుండీ కూడా ఆచరించలేక పోయారు. రెండు కన్నీటిచుక్కలు టపటపమని విస్సు మృతకళేబరముపై రాల్చారు.

అన్నా వదినలకి రెక్కలు ముక్కలయ్యేటట్లు చాకిరీ చేసి ఎందుకూ కొరగానివాడైన విస్సు పవిత్రమైన జన్మభూమికి తన రక్తమాంసాలు ధారపోసి శాశ్వతకీ నార్జించి, వీరలోకమంతటిలోనూ ధృవతారయ్యై ప్రకాశించాడు.

***

# చరమాంకం

రచన :

రుద్రవరపు పాండురంగ విఠల్

కాలం మారింది. గత నెలభై సంవత్సరాలలో గుర్తుపట్టలేనంతగా మారింది. కాలంతోపాటు ప్రకృతి కూడా విచిత్రంగా మారింది. మారుతున్న రోజుల కనుగుణ్యంగా మనిషి కూడా రకరకాలుగా రంగులు మారుతున్నాడు. తన జీవిత విధానాన్నే పూర్తిగా మార్చుకున్నాడు.

ఆనాటి ఆచార వ్యవహారాలు ఈనాడు లేవు. ఆనాటి సంస్కృతీ సభ్యతా సంస్కారం ఈనాడు తన స్వచ్ఛతను కోల్పోయాయి. అంతటా సహజత్వం సమసిపోయి కృత్రిమత్వం స్థానమేర్పరుచుకుంది. మానవునిలోని సహజమైన మమత, మమకారం, ఆపేక్ష, అంతఃకరణలు అంతరించిపోయి స్వార్థం, సంకుచితత్వం, మోసం, ద్వేషం విజృంభిస్తున్నాయి. విద్వత్తు, వినయం, సంస్కారం, పరిహాసాల పాలై డాబు, దర్పం, వాచాలత్వం మానవుని మనుగడకే యోగ్యతా పత్రాలయ్యాయి.

రోజులు మారాయి. కాని మారిన రోజులతోబాటు మారలేకపోయిన తన బ్రతుకు హరిహాసాల పాలైంది. ఒకప్పుడు తనకు కీర్తిని, గౌరవాన్ని గడించిపెట్టిన తన విద్వత్తు, శాస్త్రం, పాండిత్యం ఇప్పుడు నిష్ప్రయోజనాలై నలుగురిలోనూ అపహాస్యం పాలయ్యాయి.

కాలు క్రింద పెట్టకుండా దివాణం వారి పల్లకీలో తిరిగిన రోజులు జ్ఞాపకం వచ్చి శాస్త్రిగారి కళ్ళు చెమర్చాయి. ఐపోయింది. ఈనాటితో ఈ ఊరికీ

తనకూ ఋణం తీరిపోయింది. ఒక్కమారు వెనుదిరిగి తను పోగొట్టుకున్నదేమిటో చూడాలని ప్రయత్నించి ఆయన విఫలులయ్యారు. అస్తాద్రిని చేరుకుంటున్న కర్మసాక్షి కాంతి కిరణాలు ఆయన కళ్ళను కప్పివేశాయి. ఉత్తరీయంతో కన్నులద్దుకుని ఆయన అడుగు ముందు వేశారు.

ఆలోచనాభారంతో తలవంచుకుని నడుస్తున్న శాస్త్రిగారు తనకు చిర పరిచితులెవరో తనను వెన్నంటి వస్తున్నట్లు తల పైకెత్తి ప్రక్కకు తిరిగి చూసి స్థాణువులా మరీ కదలలేక నిల్చుండిపోయారు. 'గంగా' అంటూ, ఆప్యాయంగా, తన చేతిని నాకుతూ నిల్చుండిపోయిన గంగిపోయి గంగడోలు నిమిరారాయన.

తను శాశ్వతంగా దూరమైపోతున్న విషయం ఎట్లా పసిగట్టి కట్టు త్రాళ్ళను సైతం త్రెంచుకుని తన వెంట పడగలిగిందా నోరు లేని సాధుమూర్తి!

అంత దూరం నుండి ఆవుకోసం పరుగెత్తుకుంటూ వచ్చిన పాలికాపు ''ఏమండోయ్! శాస్తుర్లుగారు. ఆవుని గాని తమతోబాటు రైలెక్కించేద్దామనుకుంటున్నారేంటి'' అని వగరుస్తూ ''కట్టుతాడు మా సిత్రంగా తెంపుకుంది లేండి'' అన్నాడు ఆమె మెడలో ఉచ్చు తగిలిస్తూ.

దాన రూపేణా తనకు సంక్రమించిన ఈ గోమాతను వెల కట్టి అమ్మడం ఇష్టం లేక జప్తు ద్వారా తన ఇంటిని స్వాధీనపరచుకున్న ఆసామికే దాన్ని కూడా వదిలేశాడు తను. మనిషి గాబట్టి తను అంత త్వరగా తన బంధాన్ని త్రెంచుకోగలిగాడు. నోరు లేని అమాయక ప్రాణిగాబట్టి మనతో బంధాన్ని త్రెంచుకోలేక బాహ్య బంధనాన్ని త్రెంచుకుని, కన్నీరు కారుస్తూ తన వెంట పడింది!

కన్న కొడుకులు సైతం వృద్ధాప్యాన్ని దారిద్రంతో మిళాయించి అనుభవిస్తూ బ్రతకమని నిర్దాక్షిణ్యంగా తనను ఒంటరిగా వదలి తమ దారి తాము చూచుకున్నారు. కాని, కారుణ్యం మూర్తీభవించిన గోమాత ఎక్కడెక్కడో తిరిగి తన కుక్షి నింపుకుని క్షీరదానం చేసి తన ప్రాణాలను నిలిపింది ఇన్నాళ్ళూ.

పగ్గంత్రాడు పట్టుకుని బరబరా ఈడ్చుకుపోతున్న ఆ పాలెకాపునేమీ అనలేక, ఆ గోమాత కళ్ళల్లో చారికలు కట్టిన జాలిని భరించలేక, ఒక్క

నిట్టూర్పు విడిచి పైపంచతో కన్నీళ్ళు తుడుచుకుంటూ మరి వెనుదిరిగి చూడకుండా నడక సాగించారు శాస్త్రిగారు.

పుట్టి, పెరిగి ఇంత జీవితాన్ని గడిపిన తన స్వగ్రామం కుమారపురాన్ని కడసారిగా అంత దూరాన్నుండి దారి పక్కనున్న మైలురాయికి జేర్లబడి తిలకిస్తున్న శాస్త్రిగారు, మువ్వలు చప్పుడు చేసుకుంటూ వేగంగా పితాపురం దిక్కుగా వెళ్తున్న ఎద్దుబండి తనకు దాటి పదిగజాలు వెళ్ళి హఠాత్తుగా ఆగిపోవడం గమనించే స్థితిలో లేరు.

బండిలో నుండి క్రిందకు దిగిన వ్యక్తి శాస్త్రిగారిని సమీపించి వినయ విధేయతలతో చేతులు జోడించి ''నమస్కారం శాస్త్రిగారు, బహుకాల దర్శనం'' అని పలుకరించాడు.

''నమస్కారం'' అని యాదృచ్ఛికంగా జవాబిచ్చి ఆలోచనల నుండి తేరుకుని, ఆ వ్యక్తిని పరకాయించి చూసి ''ఓహో నువ్వాబాబు, కులాసాగా ఉన్నావా రామారావు. మన వాళ్ళంతా క్షేమంగా ఉన్నారు గదా'' అని తెచ్చిపెట్టుకున్న సంతోషంతో తన దీనావస్థను కప్పిపుచ్చాలని ప్రయత్నం చేస్తూ పలుకరించారు శాస్త్రిగారు.

''ఆహా! తమ దయ వల్ల అంతా కులాసాగానే ఉన్నాం బాబయ్యగారూ, అసలు చేరువకు వచ్చిందాకా తమర్ని పోల్చుకోలేకపోయాను. పూర్తిగా మారిపోయారు. జరాభారం తమర్ని పూర్తిగా కృంగదీసింది'' అన్నాడతను.

శాస్త్రిగారు సమాధానంగా చిరునవ్వు నవ్వారు.

''ఉద్యోగరీత్యా విశాఖపట్నం వెళ్ళివస్తూ దారిలో దిగి మా స్వగ్రామం చూసి వస్తున్నానండి.'' అన్నాడతను మళ్ళీ.

''అలాగా! సంతోషం. అన్నట్లు ఎవరున్నారిప్పుడు మీ ఊళ్లో''

''ఊరు విడిచి వెళ్ళి పదిహేనేళ్ళయినా స్వగ్రామం మీద మమకారం ఇంకా మాసిపోలేదు బాబయ్యగారూ. మావాళ్ళెవరూ లేకపోయినా రెండు మూడేళ్ళకోమారు ఇటువైపు వచ్చినప్పుడు ఇక్కడ దిగి ఒక్క మారు మా ఊరు

చూడకుండా ఉండబుద్ధి కాలేదు. క్రిందటి మారు వచ్చినప్పుడు తమ దర్శనం కాలేదు. మా ఊళ్లో వాకబు చేస్తే తమర్ని చూసి చాల కాలమైందని సమాధానం చెప్పారు. పొరుగూరి విషయాలు కూడా పట్టనంతగా మారిపోయారు మన వాళ్లు. ఏమైతేనేం అనుకోకుండా తమ దర్శనమైంది. అదే ఆనందంగా ఉంది. నాకు బొంబాయి వైపు బదిలీ ఐంది. మళ్ళీ తమ బోటి పెద్దల దర్శనం సాధ్యపడుతుందో లేదో'' అన్నాడు రామారావు.

''నీ అభిమానం మహా గొప్పది రామారావు'' అంటూ అతన్ని మనసారా కౌగలించుకున్నారు శాస్త్రిగారు.

''మిమ్మల్ని చూస్తుంటే స్వర్గాన వున్న మా బాబయ్యగారు నాకు జ్ఞాపకం వస్తున్నారు. ఘనాపాఠీలు, వేదశాస్త్ర పారంగతులు, సాక్షాత్తూ కుక్కుటేశ్వర పదభక్తులూ, నన్ను ఆశీర్వదించండి. బాబయ్యగారూ'' అంటూ అంజలి ఘటించాడు రామారావు.

''అలాగే బాబూ అంతకన్నా భాగ్యమా'' ఆకాశం వంక చూస్తూ రెండూ చేతులూ పైకెత్తి జోడించి వేదోక్తంగా సహజమైన తన కంచుకంఠంతో గంభీరంగా పనస పఠించి, మనస్ఫూర్తిగా మంగళాశీర్వాదం పలికారు శాస్త్రిగారు.

శాస్త్రిగారి చేతిలో పది రూపాయలు పెట్టి మరోసారి నమస్కరించి, ఆయన దగ్గర సెలవు తీసుకుని వెళ్ళి బండెక్కాడు రామారావు.

చేతిలో ద  డీ లేకుండా ఎవ్వరికీ ఋణపడటం ఇష్టం లేక దైవం మీద భారం వేసి బయల్దేరిన శాస్త్రిగారు దైవమే తనకీ రూపేణ పది రూపాయలు పంపించాడని సంతోషించి తిరిగి నడక సాగించారు.

జ్ఞానం వచ్చిన వాడిలా తను సేవించుకుంటూ వచ్చిన తన ఇష్టదైవం దక్షిణ కాశీగా పేరుపొందిన పాదగయా తీర్థంతో నిత్యం అభిషిక్తుడయ్యే కుక్కుటేశ్వర స్వామిని కడసారిగా దర్శించుకుందామని జీర్ణావస్థలో ఉన్న ఆలయ ప్రాంగణంలోకి అడుగుపెట్టిన శాస్త్రిగా కి రామారావు తిరిగి ఎదురయ్యాడు.

''పొరపాటు జరిగింది. నన్ను మన్నించండి బాబయ్యగారూ. తమరు కూడా ఇటువైపు వస్తునా రనుకోలేదు. లేకపోతే నా బండిలోనే రమ్మనేవాడిని''

అన్నాడతను.

''మరేం ఫర్వాలేదు బాబూ. అసలు మా అబ్బాయి దగ్గరకు వెళ్ళాలని ప్రయాణమై వస్తున్నాను.''

''ఆహా! అలాగా. మీ అబ్బాయి హైదరాబాదులో కదూ ఉంటూంట. ఐతే మీరు నాతో బాటే వస్తున్నారన్నమాట. దైవదర్శనం చేసుకుని రండి. మనం త్వరగా వెళ్ళకపోతే రైలందదు. మీరు వచ్చేదాకా ఇక్కడే ఉంటాను'' అంటూ పాదగయ మెట్ల మీద కూర్చుండిపోయాడు రామారావు.

''భర్గా! పార్వతీ వల్లభా! సర్వాంతర్యామివి. నీకు తెలియని విషయం లేదు. నా జీవిత చరమాంకం పరిసమాప్తి కానున్నది. నా అంత్యఘడియలు నీ సాన్నిధ్యంలో గడుపుకుందామని ఆశించాను. కాని నా చేత ఇప్పుడీ ప్రయాణం ఎందుకు కట్టిస్తున్నావో నీకే తెలియాలి. నా వారికీ, పరులకూ కూడ దూరమయ్యే హీనస్థితి నాకు కలుగకుండా కాపాడే భారం నీదే స్వామీ'' అని మహేశ్వరుని ప్రార్థించి నొసట విభూతి ధరించి సాష్టాంగ పడి లేచి, వెలికివచ్చి రామారావు ననుసరించారు శాస్త్రిగారు.

తన దగ్గరున్న పదిరూపాయల తోటీ హైదరాబాదు వరకూ వెళ్ళటం సాధ్యపడదు కాబట్టి ముందు బెజవాడ వరకూ వెళ్ళి తన కుమార్తెను చూసి, ఆ తర్వాత హైదరాబాదు వెళ్దామనుకున్న శాస్త్రిగారి ఉద్దేశ్యాన్ని తారుమారు చేస్తూ బలవంతాన తానే హైదరాబాదు దాకా టిక్కెట్టు కొని ఆయనను రైలెక్కించాడు రామారావు.

రైలు కదిలింది. రైలు స్టేషనూ, చక్కెర ఫ్యాక్టరీ అంతకంతకు దూరంగా వెనక్కు వెళ్ళిపోయ్యాయి. ఏపుగా పెరిగిన చెఱకు తోటలు పందేలు వేసుకుని వెనుకకు పరుగెడుతున్నాయి. నిశ్చలంగా కూర్చుని, పరుగులు పెడుతున్న ప్రకృతిని పరికిస్తున్న శాస్త్రిగారి ఆలోచనలు కూడా గతంలోకి పరుగులు తీసి ఆయన జీవితంలోని అమూల్య సంఘటనలను ఆయన స్మృతిపథంలోకి తెచ్చి ఆయన చేత సుఖదుఃఖాలను బేరీజు వేస్తున్నాయి. ఆ అనుభూతి ఆయన హృదయాన్ని ద్రవింపజేసింది.

శాస్త్రిగారి సజల నయనాలను చూసి రామారావు చకితుడయ్యాడు.

''శాస్త్రిగారూ. అన్నీ తెలిసిన మీరే ఇల్లా కంటనీరు పెడితే ఎలా. నేను మా ఊళ్లో ఉండగానే తెలిసింది. మీ ఇల్లు కూడా చివరకు మీకు కాకుండా పోయిందని. ఎంతో బాధపడ్డాను. ఏం చేస్తాం గ్రహస్థితి అలా ఉంది'' అన్నాడతను అనునయంగా.

శాస్త్రిగారు పై కండువాతో కళ్లొత్తుకున్నారు.

''నాకు బాగా జ్ఞాపకం. నా చిన్నతనంలో మా బాబయ్య గారితో కలిసి మీ ఇంటికి వస్తూండేవాడిని. విశాలమైన ఆ లోగిలి ఘనజటలు వల్లెవేసే శిష్య బృందంతో, జ్యోతిషం కోసం, ముహూర్త నిర్ణయానికి వచ్చే వర్తక వ్యాపారులతో నిత్య మంగళంగా కళకళలాడుతూండేవి. ఈ ప్రాంతాలకు వచ్చిన పండితులు తమ దర్శనం చేసికోనిదే వెళ్ళేవారు కారు. దివాణంలో కూడా తమకు చాలా పలుకుబడి ఉందని బాబయ్యగారంటుండేవారు.'' అన్నాడతనే మళ్లీ.

''అవును. విద్వత్తుకూ, పాండిత్యానికీ బ్రహ్మరథం పట్టే ఆ రోజులు గతించాయి. అంతటా అకారణమైన బ్రహ్మద్వేషం ప్రబలిపోయింది'' అన్నారు శాస్త్రిగారు నిర్లిప్తంగా.

సామర్లకోటలో చక్రకేళీలు కొన్నాడు రామారావు. రైలు తిరిగి బయల్దేరింది.

''ఇన్నాళ్లు ఒంటరిగా అన్ని అవస్థలు పడుతూ చెయ్యి కాల్చుకోకపోతే హాయిగా మీ అబ్బాయి దగ్గరకు వెళ్ళకపోయారా బాబాయ్'' అనడిగాడు రామారావు శాస్త్రిగారికి చక్కెరకేళీలందిస్తూ.

''ఏమోనోయ్. మీ పిన్ని పోయి పదేళ్లు కావస్తోంది. ఈ పదేళ్ళూ స్వయంపాకంతోనే గడిచింది. వాళ్లు పట్నంలో ఉంటున్నారు. వాళ్ళ సంసారపు గొడవలు వారికున్నాయి. వాళ్ళ గొడవల్లో వాళ్ళుండిపోయి తమకో తండ్రి ఉన్నారనే ధ్యాసే మరచిపోయారు వాళ్ళు.''

''ఐతే ఈ పదేళ్ళలోనూ వాళ్ళు ఎప్పుడూ వచ్చి మీ స్థితి గమనించనేలేదా బాబాయ్''

''రాకేం వచ్చారు. నాలుగేళ్ళ క్రితం పెద్ద వాడి కూతురి పెళ్ళి చెయ్యాలంటూ అన్నదమ్ములిద్దరూ వచ్చి ఉన్న రెండెకరాలూ నా చేత అమ్మించి ఆ డబ్బు కాస్తా పట్టుకొని పోయారు. పెళ్ళికి శుభలేఖ పంపిస్తూ 'ఎండలు తెగ కాస్తున్నాయి. ఈ గాడుపుల్లో మీరు ఇల్లు విడిచి కదలలేరు. మీరు రాకపోయినా వచ్చినట్లుగానే భావించుకుంటాం. అనవసరంగా కష్టపడకండి' అంటూ ఓ కార్డు ముక్క వ్రాసి పడేశారు. అంతే, మళ్ళీ ముసలాడు చచ్చాడా బ్రతికాడా అనే చింతే లేకపోయింది''

''మరి ఈ నాలుగేళ్ళుగా మీ జీవనం?''

''ఆవుపాలు, ఆప్తుల ఆదరణ, ఆకలి తీర్చటానికి అంతకన్నా ఇంకేం కావాలి నాకు. అమ్మాయి పెళ్ళికి తాకట్టు పెట్టిన ఇంటి బాకీ తడిసి మోపెడైంది. అందుకే దాని జోలి వాళ్ళకు అక్కరలేకపోయింది.''

''ప్చ్! ఎలాంటి వారు ఏ స్థితికి వచ్చారు. పోనివ్వండి. అనవసరంగా మీకు మనస్తాపం కలిగించినట్లున్నాను. అలా కాస్త నడుం వాల్చి విశ్రాంతి తీసుకోండి'' అని తాను ప్రక్కకు తిరిగి శాస్త్రిగారికి చోటు చేశాడు రామారావు.

మర్నాడు ప్రొద్దున్న పది గంటలకు శాస్త్రిగారిని హైదరాబాద్ చేర్చింది రైలుబండి. శాస్త్రిగారికి హైదరాబాద్‌లోని వారి కుమారుని ఇంటికి వెళ్ళడానికి కావల్సిన వివరాలన్నీ చెప్పి ఆయన దగ్గర సెలవు తీసుకుని సికింద్రాబాద్ స్టేషన్లోనే రామారావు దిగిపోవటము వల్ల శాస్త్రిగారిప్పుడు వంటరిగాళ్ళయ్యారు.

ఇల్లు వెతుక్కుంటూ పన్నెండు గంటలకు ఆయన గమ్యం చేరారు. వాకిట్లోనే ఎదురైన ఆరేళ్ల కుఱ్ఱాడు ఆయన్ని గుమ్మంలోనే అటకాయించి ''ఎవరు కావాలండీ'' అని నిలేశాడు.

''నారాయణ ఉన్నాడా'' అని అనుమానిస్తూ అడిగారాయన.

''మా నాన్నగారా. లేరండీ. ఏం కావాలి'' అని తిరిగి ప్రశ్నించాడు కుర్రాడు.

ఏడాది ఈడులో చూసిన మనవడ్ని పోల్చుకుని ఆయన ''ఎవరు కావాలో నా మనవడు కావాలి'' అంటూ గబుక్కున ఎత్తుకున్నాడాయన.

''అమ్మా, చూడే ఈ తాతెవరో'' అని అరుస్తూ గింజుకున్నాడా కుఱ్ఱాడు.

వెనుక నుండి వచ్చిన ఆయన కోడలు ''ఎవఱ్ఱా అదీ'' అని మామగార్ని చూసి నాలుక కరుచుకుని ''మీ తాతగారేరా బాబూ'' అంది నవ్వుతూ..

''మా తాతయ్యా భలే భలే. ఊరి నుంచి వస్తున్నావా తాతయ్యా, నాకెప్పుడూ కనిపించలేదేం మరి'' అని ఆయన చంక దిగి, ఆయన చేతిలోంచి సంచీ లాక్కుని అందులోని గుడ్డలు గబాగబ్బా తీసి బైటపడేస్తూ, ఏమీ కనిపించక ''ఏం తాతయ్యా. నాకేం తెచ్చావు'' అనడిగాడు.

ఏదో మనస్థిమితం లేని స్థితిలో అయోమయావస్థలో, ఇంట్లో చిన్నపిల్లవాడికేమైనా తీసుకుపోవాలనే విషయమే మఱచిపోయిన తన మతిమరుపును నిందించుకుంటూ, జేబులోంచి పావలా కాసు తీసి, వాడి చేతిలో పెట్టి సంచిలో ఏముందిరా బాబూ. ఇంద ఇది తీసుకుపోయి ఏమైనా కొనుక్కో'' అన్నారు.

''వెఱ్ఱివెధవా! ఇంటికెవరొస్తే వాళ్ళమీదికి ఎగబడి డబ్బులు తీసుకోవడమేనా? రోజూ ఎవరో తెచ్చి నీకిస్తున్నట్లు, వెళ్ళు. ఆ నీళ్ళ గదిలోంచి తాతగారికి కాళ్ళు కడుక్కోవడానికి నీళ్ళు తెచ్చిపెట్టు'' అని కుఱ్రాడిని గదిమి మూతి విరుచుకుంటూ లోపలికి వెళ్ళిందాయన పెద్ద కోడలు.

శాస్త్రిగారు అప్రతిభులై చూస్తూ నిల్చుండిపోయి ''తాతయ్యా! ఇవిగో నీళ్ళు'' అని మనవడు పిలవగా తిరిగి యధాస్థితికి వచ్చి కాళ్ళు కడుక్కుని, తుడుచుకుని అక్కడే ఉన్న చాప పరుచుకుని కూర్చున్నారు.

ఆయన మనుమడు తాతగారిచ్చిన పావలా చూసుకుని మురిసిపోతూ వీధిలోకి పరుగెత్తాడు.

ఇంటి కోసం తిరగటం వల్ల కలిగిన నీరసంతో అలవాటు లేని రైలు ప్రయాణం వల్ల కలిగిన బడలికతో నడుం వాల్చిన శాస్త్రిగారు ఓ చిన్న కునుకు తీసి రెండు గంటలకు ఏదో చప్పుడవడంతో లేచి కూర్చున్నారు అప్రయత్నంగా. లోపల గదిలో తన కొడుకూ కోడలూ మధ్య జరుగుతున్న సంభాషణ ఆయన

కర్ణపుటాలకు సోకింది.

''ఈయనెప్పుడొచ్చాడు.''

''ఇంతకు ముందే.''

''చెప్పకుండా చెయ్యకుండా ఉన్నట్లుండి ఊడిపడ్డాడేమిటి!''

''బాగుంది. కన్నకొడుకు ఇంటికి రావడానికి ముందుగా చెప్పి ఒకళ్ళ అనుమతి తీసుకుని రావాలా ఏమిటి.''

''అది కాదే, అర్థాంతరంగా వస్తేనూ, ఎందుకా అని.''

''ఇంకెందుకూ? నన్ను కాల్చుకు తింటానికి, ఈ నాలుగేళ్ళ నుండీ ఏ రాద్ధాంతం లేకుండా నా మానాన నేనున్నాను గదూ. అది గుర్తుకొచ్చి మళ్ళీ మొదలైంది నా బ్రతుక్కి తంపట.''

''ఛ.ఛ! అదేమిటే అట్లా అంటావు. రాక రాక ఇన్నాళ్ళకు ఆయన వస్తే, ఐనా ఎన్నాళ్ళుంటాడూ? ఆయన సంగతి తెలియందేముందీ? రేపే పాటికి నా కుక్కుటేశ్వరుడూ కుమారపురం పిలుస్తున్నాయంటూ పరుగెత్తడూ.''

''ఆ. మీకేం తీరిగ్గా కూర్చుని ఎన్ని కబుర్లయినా చెప్తారు. ఆయన మడీ దడీ ఆచారం అన్నింటితోటి అవస్థ పడేది నేనేగా. వంటంతా అయి తీరి కూర్చున్నదాన్ని. మళ్ళీ తలనిండా స్నానం చేసి వార్చి పడేసేసరికి నా తల ప్రాణం తోకకు వచ్చింది. మగరాయుళ్ళం గదా అని టింగు రంగా అంటూ నాలుగు బజార్లు తిరిగి నాలుగు కప్పులు కాఫీ తాగి రావటం కాదు. ఆడదాని బ్రతుక్కి అంతే మరి. అందరికీ అడుగులకు మడుగులొత్తుతూ అఘోరించాలిసిందే''

''అబ్బ! మెల్లిగా, ఆయన లేస్తాడు. నీకెందుకు నేనున్నానుగా అనవసరంగా.''

ఆ పై మాటలు శాస్త్రిగారి చెవిన బడలేదు. ఎందుకంటే అప్పటికే ఆయన చేతి సంచీ పట్టుకుని ఆ యింటిలో నుండి బయటికి వచ్చి, త్వరత్వరగా అడుగులేసుకుంటూ చాలా దూరం వెళ్ళిపోయారు.

నాలుగరటిపళ్ళు కొనుక్కుతిని హుస్సేన్ సాగర్‌లో కడుపు నిండా నీళ్ళు

ఱాగి ఆత్మారాముడ్ని తృప్తిపరచిన శాస్త్రిగారు కాళ్లీడ్చుకుంటూ సికింద్రాబాదు స్టేషనుకు చేరి తన దగ్గరున్న డబ్బుతో బెజవాడ దాకా టిక్కెట్టు కొనుక్కుని, ఆ రాత్రి బండికి ప్రయాణం కట్టారు.

జన సమ్మర్దంతో కిటకిటలాడుతున్న రైలులో యమయాతన పడి అర్ధరాత్రి మూడు గంటలకు విజయవాడ చేరుకున్నారు శాస్త్రిగారు. ఆ సమయానికి విజయవాడ నగరంపై వరుణ దేవుడు ఆగ్రహించినట్లు కుంభవృష్టిగా వర్షం పడుతోంది. వంతెన మెట్లెక్కి ఆవలి వైపుకు దిగిన శాస్త్రిగారు అసలుకు రెట్టింపు బాడుగకు రిక్షా కుదుర్చుకుని, వర్షంలో తడుస్తూ గాంధీనగరంలో ఓ ఇంటి ముందాగి రిక్షా వాడికి బాడుగ ఇచ్చి అరుగు మీద చేరి పై పంచతో తల తుడుచుకుని కాసేపు అట్లాగే నిల్చుండిపోయారు.

తన కుమార్తె, అల్లుడు, పిల్లలూ అంతా గాఢ నిద్రలో మునిగి ఉంటారు. వాళ్ళని లేపటమా మానడమా అని ఆయన సంధిగ్ధంలో పడిపోయారు. ఇంతలో ఆయన ప్రక్కగా ఉన్న కిటికీ తెఱచుకుని ఎవరో తొంగి చూసి

''ఎవరది'' అని ప్రశ్నించారు.

ఆ కంఠం ఆయనకు చిరపరిచితమైనదే. కోటి కంఠాల మధ్యనైనా ఆ కంఠాన్ని ఆయన సులభంగా పోల్చుకుని ''అమ్మా! కుమారీ నేనే'' అని స్పష్టంగా చెప్పగలరు ఆయన.

''నేనేనమ్మా. నా తల్లీ. నిద్రపోలేదూ'' అని కిటికీకి దగ్గరగా చేరారాయన.

''నువ్వా నాన్నా. రిక్షా వచ్చి ఇంటి ముందాగిన చప్పుడైతే ఎవరా? అని చూస్తూన్నా. ఇంత వానలో ఎట్లా వచ్చావు నాన్నా'' అంది కంగారుగా ఆయన కూతురు, కళ్ళు నులుముకుని చూసి.

''అమ్మా. చలి చంపేస్తోంది. వణుకొస్తోంది. ముందు తలుపు తియ్యి తల్లీ. తర్వాత అన్నీ మాట్లాడుకోవచ్చును'' అన్నారు శాస్త్రిగారు దూరంగా మెఱసిన మెఱుపు కాంతి చూడ్లేక కళ్ళు మూసుకుంటూ.

తండ్రి పరిస్థితి చూసి చలించిపోయి అక్కడి నుండి కదలివెళ్లిన ఆమె అంతలోగానే గాభరా పడుతూ కిటికీ దగ్గఱకు వచ్చి ''అయ్యో, నాన్నా. ఎట్లా

నాన్నా.'' అంది అస్పష్టంగా.

''ఏమిటమ్మా! ఏమిటి? ఏమైంది. చెప్పు తల్లీ'' అనడిగారు అప్పటికే ఓర్పు నశించిన శాస్త్రిగారు.

''ఏం చెప్పమంటావు నాన్నా. ఆయన గుమ్మానికడ్డంగా పెద్ద మంచం మీద పడుకున్నారు. ఎక్కడెక్కడో తిరిగి ఇంతకు ముందే వచ్చి పడుకున్నారు. అందులో మనిషి మనస్పురణలో లేరు. ఉండు, వస్తున్నా'' అంటూ తిరిగి అక్కడి నుండి లోపలకు వెళ్లింది కుమారి.

శాస్త్రిగారికి ఆమె మాట్లాడిందేమిటో ఏమీ అర్థం కాలేదు. నోరు తెఱచి చూస్తూ నిల్చుండిపోయారు.

మరి కాసేపటికామె తిరిగి వచ్చింది.

''ఏమిటమ్మా. ఏమిటి ఏమైంది అల్లుడుకి''

''ఏం లేదు నాన్నా. కంగారుపడకు. మామూలు సంగతే. రోజుకన్నా కాస్త మోతాదు మించినట్లుంది. అంతే''

''అదేంటమ్మా''

''ఏం చెప్పమంటావు నాన్నా. కడుపు చించుకుంటే కాళ్ల మీద పడుతుంది. మంచి నిషాలో ఉన్నారు. ఇప్పుడే మాత్రం కదిలించినా నానా రభసా చేస్తారు. ఊరూ వాడా అంతా లేస్తారు. పరువు పోవడమే కాకుండా పోలీసుల చుట్టూ తిరగలేక చావాలి. నన్ను క్షమించు. నువ్వా చలిలో ఎంత సేపుంటావు. నాకేం చెప్పడానికి పాలు పోవటం లేదు. ఇంద. ఈ పది రూపాయలు తీసుకో. రిక్షా కట్టించుకుని సెంటర్లో ఏ హోటల్లోనైనా గది తీసుకుని తెల్లవారిందాకా పడుకుని ప్రొద్దున్నే రా. త్వరగా వెళ్ళు నాన్నా. లేకపోతే చలికి మరీ అవస్థ పడిపోతావు. ఏమిటా? అంతా నా ఖర్మ. అదిగో ఆయన కదుల్తున్నట్లున్నారు'' అంటూ కిటికీలోంచి చెయ్యి బైటకు పోనిచ్చి గుప్పిట్లో ఉన్న పది రూపాయల కాగితం ఆయన చేతిలో పెట్టి, కళ్ళు తుడుచుకుంటూ గబగబా లోపలికి వెళ్లిపోయింది.

ఆ ప్రక్కనే రిక్షాలో ముడుచుకుని కూర్చున్న రిక్షావాడిని పిలిచి రిక్షా దగ్గరకు తెమ్మన్నారు శాస్త్రిగారు. వాడు పీలుస్తున్న బీడీని చప్పున అవతలకు గిరాటేసి రిక్షా తిప్పుకుని వచ్చి దగ్గరగా నిలబెట్టాడు.

రిక్షా ఎక్కి కూర్చున్న శాస్త్రిగారు ''స్టేషనుకి పోనీ త్వరగా'' అన్నారు.

మరో ఐదు నిమిషాల్లో రిక్షా వర్షాన్నీ, రివ్వున వీస్తున్న గాలిని దూసు కుంటూ వచ్చి స్టేషను ముందాగింది.

శాస్త్రిగారి పరిస్థితి చూచిన రిక్షావాడు దయతలచి తానే ఆయన దగ్గఱ డబ్బు తీసుకుని ఆయన కోరిన ప్రకారం రాజమండ్రీ దాకా టిక్కెట్టు కొని తెచ్చి తన బాడుగ తీసుకొని వెళ్లిపోయాడు. తాను వచ్చిన రైల్లోనే శాస్త్రిగారు తిరిగి వచ్చి ఎక్కి కూర్చున్నారు. బయల్దేరడానికి సిద్ధంగా ఉన్న రైలు బరువుగా నిట్టూర్చి అతి కష్టం మీద కదిలింది.

అంత చలిలోనూ శాస్త్రిగారి బుఱ్ఱ వేడెక్కింది. పెద్దకొడుకుని, కూతుర్ని చూడటం జరిగింది. ఇక మిగిలింది చిన్న కొడుకు. వాడు సినిమాల్లో చేరాలని ఇంట్లోంచి పారిపోయి మద్రాసులో నానా పాట్లు పడి అక్కడ తన భవిష్యత్తుకు బ్రాహ్మణ్యం అడ్డు రాగా జంధ్యం త్రెంచుకుని ఎటో పోయాడని ఆ మధ్య ఎవరో అనుకుంటుండగా విన్నారాయన. తాడూ బొంగరం లేని వాడు ఎ -డున్నాడని వెళ్లడం? అసలు ఎందుకు వెళ్లడం? ఇక నా అన్నవారు ఈ ప్రపంచంలో మరెవ్వరూ లేరు. ఏమిటి కర్తవ్యం.. అని రిక్షాలో కూర్చుని ఉన్నపుడే ఆయన ఆలోచించి చివరకు తన చిన్ననాటి స్నేహితుడు, ప్రాణమి కుడు శంకరం గారు గుర్తుకు రాగా రాజమండ్రికి టిక్కెట్టు కొనిపించారు. ఆయ చూసి కూడ చాల కాలమైంది. కాని మొన్నమొన్నటి వరకూ తమ స్నేహాన్ని గు చేస్తూ శంకరంగారు తనకు ఉత్తరాలు వ్రా-- ఉన్నారు.

వానలో తడవటం వల్ల శాస్త్రిగారికి కాస్త జ్వరం తగిలిం . రాజమండ్రిలో ఆయన రైలు దిగేసరికీ ఆ జ్వరం తీవ్రరూపం దాల్చింది. శారీరకంగా రగుల్కున్న ఉష్ణానికి మానసికంగా ఆయన పడే క్షోభ,

ఆయనను పిచ్చివాడిలా, అశక్తుడ్నిగా చేశాయి. అతికష్టం మీద అడుగులో అడుగు వేసుకుంటూ ఆయన శంకరం గారింటికి దారితీశారు.

అయోమయ స్థితిలో శంకరం గారింటికి జేరుకున్న శాస్త్రిగారు అక్కడి దృశ్యం చూసి అప్రతిభులై నోటమాట రాక కుప్పలా కూలిపోయారు. ఆయన ప్రాణస్నేహితులు శంకరం గారి భౌతిక కాయం అంతిమ యాత్రకు అప్పుడే ఆయత్తమై బయల్దేరింది.

శాస్త్రిగారి చేతిలోని సంచీని దూరంగా గిరాటేసి వారిననుసరించారు. ''శంకరం. ప్రాణ స్నేహితుడివి. నువ్వు కూడా నన్ను వదలి నీ స్వార్థమే చూసుకున్నావా'' అని విలపించారాయన.

శంకరం గారి భౌతికకాయం అనంతంలో లీనమైపోయేవరకూ చూస్తూ నిల్చుండిపోయిన శాస్త్రిగారు, అందరూ తిరిగి వెళ్లిపోయిందాకా అక్కడే కదలకుండా కూర్చుని ఆ తర్వాత నిశ్చలంగా ప్రవహిస్తున్న పవిత్ర గోదావరి తీరం సమీపించి, చేతులు జోడించి

''అమ్మా. గౌతమీ. చూస్తున్నావా తల్లీ. ఏమిటీ అన్యాయం? జాతి, ధర్మం భ్రష్టమైపోయింది. అగ్నిహోత్రం లాంటి వంశం అవశిష్టంగా మిగిలింది. సత్యం, న్యాయం, అభిమానం, అంతఃకరణలు అంతరించిపోయాయి. మానవత్వానికీ, మమతా బంధానికీ అర్థం లేకుండా పోయింది. ఇంకా నన్నెందుకు చూస్తూ నిలబడతావు. ఏనాటికైనా ఈ జాతిని, ఈ దేశాన్ని నీవే తిరిగి పునీతం చెయ్యాలి. ఇదే నా అంతిమ కోరిక. కుక్కుటేశ్వరా శరణు. శరణు. పాహిమాం. హర హర మహాదేవ్'' అంటూ శాస్త్రిగారు అనంత గౌతమిలో కలసిపోయారు.

హోరుమని శబ్దం చేస్తూ గలగలా ప్రవహిస్తోంది గౌతమి.

***

# పే- ళ్కొ - మానవుడు

రచన :

గుడిసేవ వెంకటేశ్వరరావు

భళ న తెల్లవారింది. రేపు, మరొకరోజు ముందుకు జరిగింది. అనంతకాలంలో, అణుమాత్రం వర్తమానాన్నుంచి వీడిపోయి భూత కాలంతో నేస్తం కలిపింది.

కళ్ళునులుముకు లేచి నిలబడ్డాడు. ఆవలించి చిటిక వేశాడు. వీడిపోనిమత్తు వేధించసాగింది. చల్లటి గాలి శరీరానికి సోకింది. సంపంగి మొగ్గల సౌరభం గుబాళించింది. పాలమ్మి అరుపు నిశ్శబ్దాన్ని భగ్నంచేసింది. మేల్కొన్న కళ్ళు మంటలు పుడుతున్నాయి, అద్దంలో చూసుకొని కొంచెం ఆశ్చర్య పోయాడు. నిద్రపోని నేత్రాలు ఎర్రకలువల రూపును ఎరువు తెచ్చుకున్నాయి.

ఆరుగంటల బండి అలిగిన్న ప్రకృతిలా గర్జించి స్టేషనునుంచి బయలుదేరింది. సుందరం హృదయంలో మొదటిసారిగా భయం మెదిలింది. క్షణకాలం ఆశ్చర్యం కిలగింది. తాను భయమన్న పదార్థాన్ని బయటకునెట్టి చాలాకాలమైంది. భయా కీ, బాధలకూ అన్నింటికీ అతీతమైన స్థితిలో వున్నాడు తానీనాడు. కా సుందరం మానవుడు!

బీదతనం భయంతో తన్నేనాడో వదిలిపోయింది. అనురాగంతో ముంచెత్తే అందాల రాశి భార్యవుంది. 'కో' అంటే కోటిమంది తన నే నికి అర్రుచాస్తున్నారు. అలాంటి తనకు భయమెందుకు కలగాలసలు! ఇతరుల భయా న్నూ, బాధల  పోగొట్టవలసిన వ్యక్తి తాను. తాను పేరుమోసిన

డాక్టరు, డాక్టరు సుందరం పేరుచెబితే ఎవరూ చేయెత్తి దణ్ణం పెట్టకపోయినా 'అబ్బో' అని ఆశ్చర్యాన్ని ప్రకటిస్తారు. తన గొప్పతనానికి ఒక్కొక్కప్పుడు తానే మురిసిపోతాడు డాక్టరు సుందరం.

డాక్టరు సుందరం ఆగర్భదరిద్రుల కడుపున పుట్టినా అతడెన్నడూ ఆస్థితి ననుభవించింది లేదు. అసలుకిటుకంతా అక్కడే వుంది. ధనాన్నివ్వకపోయినా అద్భుతమైన తెలివి తేటల్ని మాత్రమిచ్చాడు దేవుడు, అందుకే అందరిచేత "శభాష్" అనిపించుకున్నాడు. పాఠాలు నేర్పిన ఉపాధ్యాయుల ఆదరాభిమానాలకు పాత్రుడయ్యాడు. తోటి విద్యార్థులు అతన్నిచూచి అసూయపడేవాళ్ళు. అన్నింటనూ మిన్నగావస్తూ అన్ని బహుమతులనూ తానే అందుకుంటూ, స్కాలర్‌షిప్ సాయంతో ఇంటర్‌మీడియెట్ పరీక్షలో యూనివర్శిటీ మొత్తంమీద మూడవవాడుగా వచ్చాడు సుందరం.

మెడికల్ కాలేజీలో తన్నుకుంటూ సీటుతో పాటు స్కాలర్‌షిప్పుకూడా వచ్చి వళ్ళో వాలింది. తన ప్రతిభకు తానే మురిసిపోయాడు సుందరం.

మెడిసన్ చదువుతుండగానే పరిచయమయ్యాడు తోటివిద్యార్థి పండరీనాథ్. పండరీనాథ్ లక్షాధికారుల బిడ్డేకాకుండా అతడొక ప్రత్యేకమైన వ్యక్తి. అతడేనాడూ చదువు సంధ్యల్లో అశ్రద్ధ చూపేవాడుకాదు.

సర్వసాధారణంగా ధనమున్న వ్యక్తులు తనని గురించిగానీ తన పరిసరాలను గురించిగాని అట్టే ఆలోచించరనే చెడ్డపేరొకటుంది. ధనంతో సాధిం రానిదంటూ వాళ్ళకేమీ మిగులదు. కాసుతీసి చూపెడితే కొండమీది కోతికూడా దిగొచ్చి సలాము కొడుతుంది. అలాంటి వ్యక్తెప్పుడూ ఆనందంతో నవ్యత కొరకు ఆరాటపడతాడేగాని జీవిత సమస్యల వైపు అతని దృష్టి పోదు. నల్లమందు భాయిలా కొని తెచ్చుకున్న ఆనందంతో త్రుళ్ళుతూ, ప్రేలుతూ రోజులు క్షణాలుగా దొర్లించేస్తాడేగాని, మరోమెట్టు పైకెక్కి అక్కడినుంచి ప్రపంచాన్ని చూసి అక్కరపడే శక్తిని అతను కోల్పోతాడు.

కాని పండరీనాథ్ విషయంలో ఈ సూత్రం పూర్తిగా ఫెయిలయ్యింది. అతనెప్పుడూ దేన్నిగురించో యోచిస్తున్నట్లుగానే కన్పిస్తాడు. మితభాషి.

ఏకాంతన్నెక్కువగా ప్రేమిస్తాడు.

వేషభాషల్లో ఆడంబరమనేది అసలుకన్పించదు. అతనితో చెలిమి చేయాలనీ పూసుకుతిరగాలనీ ఎందరెందరో విఫలప్రయత్నాలు చేస్తూండేవారు. అందర్నీ చిరున తో పలకరించే వాడేగాని, హృదయ పీఠంపైన ఆసీనులు కమ్మని ఎవర్నోగా ఆహ్వానించేవాడుకాదు.

పండరీనాథ్ ద్వారానే అతనిచెల్లెలు అనూరాధతో పరిచయమైంది సుందరానికి. ఆ పరిచయకుసుమమే ప్రేమగా వికసించి, ఆపైన వారిరువురకూ పెండ్లి జరిగిపోయింది.

పెండ్లి జరగటం, మెడికల్ డిగ్రీ చేతికి రావటం దాదాపు ఒకేసారి జరిగాయి. వెంటనే భార్యతో సహా ఫారెన్ ప్రయాణం కట్టాడు. మామగారు మారుమాట్లాడకుండా కావలసిన పైకం సర్ది వెళ్ళిరమ్మని దీవించాడు. సుందరం తల్లిదండ్రులు మాత్రం తమబిడ్డ మరోదేశం పోయేందుకు ముందు అంగీకరించలేదు. అయినా సుందరం వాళ్ళ మాటను ఖాతరు చేయలేదు. వెళ్ళక తప్పదన్నాడు వారు మారుమాట్లాడకుండా సరేబాబూ - నీ యిష్టం అని వూరుకున్నారు.

సుందరానికి తల్లిదండ్రులమీద ఏనాడూ సదభిప్రాయం లేదు. వాళ్ళమాటంట్లే గడ్డిపరకతో సమానంగా తీసేస్తాడు. తానీనాడింత పెద్దవాడయ్యాడంటె, అందుక్కారణం తన స్వశక్తేగాని, తలిదండ్రులు ఎంతమాత్రమూ కారకులు కారనేది సుందరం చూచాయగా బహిర్గతంచేసిన అభిప్రాయం.

రెండేళ్ళు అమెరికాలో గడిపి, మరో మెడికల్ డిగ్రీ చేతబ , సతీసమేతంగా స్వదేశానికి తిరిగి వచ్చాడు సుందరం. రైలు స్టేషనులో బంధుమిత్రులంతా వాళ్ళను పుష్పమాలలతో ముంచెత్తారు. సుందరం తండ్రి ఉత్తరీయంతో ఆనంబాష్పాలు అద్దుకున్నాడు. తల్లిబిడ్డను ఆలింగనం చేసుకొని, తన కన్నీటితో అతణ్ణి పునీతుణ్ణి చేసింది. పండరీనాథ్ ఆదృశ్యం చూస్తూ, తనూ కళ్ళద్దుకున్నాడు. కాని ఫారెన్ వెళ్ళొచ్చిన సుందరం మనస్సు మాత్రం ఇంగ

సిగ్గుతో కుంచించుకుపోయింది. మెల్లగా తల్లి కౌగిలినుంచి విడిపించుకుని మిగతా మి ·లందరితోనూ కరచాలనం చేసాడు.

★ ★ ★

పండరీనాథ్ చెల్లెల్ని, బావమరిదినీ కూర్చుండబెట్టి అన్ని విషయాలూ వివరంగా చెప్పాడు.

వాళ్ళు అమెరికా వెళ్ళిన ఆరునెల్లకే, అనూరాధ వాళ్ళ నాన్నగారు గుండె ఆగిపోయి కీర్తిశేషులయ్యారు. ఆవిషయం తంతి ద్వారా పండరీనాథ్ ఆనాడే బావమరదికి తెలియజేసాడు.

చనిపోయేనాటికి ఆయన బాంకులో తన పేర ఒక లక్షాడెబ్బైవేల రూపాయలు జమ కట్టి అట్టేపెట్టాడు. ఆ మొత్తంగాక వాళ్ళప్పుడుంటున్న ఇల్లుగూడా ఆయన స్వార్జితం, తనయావదా నీ కొడుకు పండరీనాథ్ పేరనే వ్రాసి కన్నుమూశారాయన. కాని పండరీనాథ్ కది సబబుగా కన్పించలేదు. బ్యాంకులోని మొత్తంలో లక్షరూపాయలు చెల్లెలిపేర వ్రాసేశాడు. ఇల్లు, మిగతా డెబ్బైవేలు మాత్రం తనభాగంగా స్వీకరించాడు. ఆ మొత్తంలో అతను తన ఇంటి పరిసరాల్లోనే మరికొన్ని ఇళ్ళుకట్టించి, అందులో వైద్యశాల నెలకొల్పాడు.

మానవ ప్రవృత్తి చాలా విచిత్రమైనది. స్వతహాగా మానవుడు మంచివాడు. అతని హృదయం విశాలం. అతనిమనస్సు నవనీతం. మనిషంత మంచి ప్రాణి ప్రపంచంలో మరేదీ లేదు, కానీ...

పరిస్థితులనే మూసలోంచి ఈ జీవితాలు ఆకారాలు దాలుస్తున్నాయి. ఆ వూబిలోంచి బయటపడి వ్యక్తిత్వాలు పూరించుకోలేకుండా వున్నాయి. ఫలితంగా పతనమవుతున్నాయి.

తనపొట్ట నింపుకునేందుకు, నలుగురి పొట్టల్ని కొడుతున్నాడు. అది కొన్ని పరిస్థితుల్లో తప్పనిసరి అవుతుంది. నైతిక విలువలు నానాటికీ దిగజారుతున్నాయి. తెల్లగా స్ఫటికంలా వుండాల్సిన న్యాయం, నల్లగా నిగలాడతోందీనాడు.

పండరీనాథ్ నాలుగుడబ్బులు గడించుకోవాలన్న వుద్దేశ్యంతోగాక,

నలుగురికి శాయశక్తులా సాయంచేద్దామన్న సత్సంకల్పంతో వైద్యశాల ప్రారంభించాడు. అతనే వ్యక్తినీ ఇంత డబ్బిమని అడిగిందిలేదు. డబ్బివ్వకుంటే వైద్యం చెయ్యననే ప్రసక్తేలేదు. కాని చిత్రం!

ఏ ఒక్క వ్యక్తీ చికిత్సపొందిన తదుపరి తులమో, ఫలమో శక్తికొలదీ ముట్టజెప్పకుండా పోయిందిలేదు. 'ఆరునెల్లక్రితం జ్వరానికి మందిచ్చారు బాబూ! ' అని ఆరోజే రెండు రూపాయలు తెచ్చిచ్చి ఒకదణ్ణం పెట్టి అతన్ని వేనోళ్ళ దీవిస్తూ పోయేపెద్దలు అనేకమంది. అలాంటివాళ్ళ కతను పెన్నిధి, అతని మాటంటే అక్షరాలా ఆదరించదగిన అమృతవాక్కు వాళ్ళకు.

అందుకే మూడునెలల్లో దివాళాతీస్తాడనుకొన్న పండరీనాథ్ సంవత్సరం తిరక్కుండానే వైద్యశాలను మరికాస్త పెంచి మరొక డ్డాక్టర్ని తనకు అసిస్టెంటుగా నియమించుకోవడం చూచిన నాగరక ప్రపంచం విస్తుబోయింది.

★ ★ ★

మరినాలుగు రోజుల్లో సుందరం సతీసమేతంగా బెజవాడ చేరుకున్నాడు. బావమరది తన భార్య పేర వ్రాసిన లక్షరూపాయల్లో చాలా భాగం ఖర్చుపెట్టి అట్టహాసంతో పెద్ద డిస్పెన్సరీ పెట్టాడు. చక్కటి కారు కొన్నాడు. అనురాగవతి అయిన భార్య అండదండల్లో హాయిగా జీవిస్తున్నాడు.

సుందరానికి పెద్దపెద్ద ఆశయాలంటూ ఏమీలేవు. ప్రజాసేవంటే అతనికి పరమ అసహ ం. ఎవరిసేవ వారు చేసుకోవాలిగాని ఒకరికి వేరొకరు సాయంచెయ్యటమేమిటని వాదిస్తాడు. అంతటి విజ్ఞాని డ్డాక్టరు సుందరం.

సుందరం పెద్ద పెద్ద ఆఫీసర్లకూ, లక్షాధికారులకూ మాత్రమే వైద్యంచేస్తాడు. ఎంతటి అర్జంటు కేసయినా ముందు చేతికి డబ్బురాందే ముట్టడు. రోగికోసం కాకుండా రోగిచ్చే డబ్బుకొరకు వైద్యంచేస్తాడు సుందరం. అతనికెలాంటి చీకు చింతలూ లేవు. సమస్యలు వేధించవు. సర్వసాధారణంగా ఏ విషయాన్ని అతను మనసుకు పట్టించుకోడు.

తెల్లారి లేచింది లగాయతు, మళ్ళా పడుకునేంతవరకూ, ప్రతిదినమూ వ్యక్తి ఎన్నో సంఘటనలు కళ్ళజూస్తాడు. ఎన్నో విశేషాలు వింటాడు. కాని వాటి

మనస్సుకెక్కి ఆలోచనలు రేకెత్తించేవి ఒకటో రెండో వుంటాయి. అసలు లేకపోనూవచ్చును. విన్నవీ, కన్నవీ మనస్సు కెక్కించుకుని మథనపడే వ్యక్తి మనుగడ దుర్భరం.

మనస్సు మానవసరస్సు లాంటిది. అందులో రాజహంసలెగాని, నీటి కాకులకు తావుండకూడదు. కాని వాటిలో నీటికాకులేవో రాయంచలెవ్వో తెలుసుకొని ప్రవేశమివ్వటంలోనే వుంది ప్రజ్ఞంతా.

కొన్ని సంఘటనలను బలవంతాన బయటకు నెట్టినా, తిరిగి ప్రవేశించి కుమ్మరి పురుగులా మనస్సును తొలుస్తూనే ఉంటాయి. అందుక్కారణం స్వతహాగా దేవుడు ప్రసాదించిన మానవత. దేవుడు మానవునికి ప్రసాదించిన పంచప్రాణాల్లోనూ, ఊహాశక్తి కూడా ఒక ప్రాణం. పశుపక్ష్యాదుల మీద ఆధిక్యాన్ని ఈ గుణమే సంపాదించి పెట్టింది మనిషికి.

సుందరం అర్ధరాత్రినుంచి నిద్రపోవాలని వ్యర్థ ప్రయత్నం చేస్తున్నాడు. కళ్ళు మూతలు పడనంటున్నాయి. కోపమొచ్చి గట్టిగా మూసేశాడు. కాని మనస్సును మాయచేసి హృదయాన్ని జోకొట్టడం అతనిశక్తికి మించిన పనయింది.

అంతులేని ఆలోచనాతరంగిణి. ఇన్ని రోజులుగా కట్టిన ఆనకట్ట పునాదులతో సహా పగిలిపోయింది. ఇంక ఆ ప్రవాహాన్ని అడ్డగలిగే శక్తి మానవ మాత్రునికి లేదు. దాసోహమవటం మినహాయించి వేరొక దారిలేదు.

ఈ మనస్సెంత విచిత్రమైంది! సర్వప్రకృతిని బానిసను చేసుకోగలుగు తున్నానని విర్రవీగే మానవుడు; స్వంత మనస్సుకు దాసోహమవటం విచిత్రం కదూ!

తన్నుతాను సంపూర్ణంగా తెలుసుకోగలిగిన మానవుడు, సర్వప్రపంచాన్ని ఆమూలాగ్రంగా అర్థం చేసుకోగలడని మహామహులైన మన మహర్షులు ఏనాడో చాటిచెప్పారు. కాని నేటి మానవుడందుకు విరుద్ధంగా ప్రవర్తిస్తున్నాడు. అందుకే శాంతికోసమంటూ మారణాయుధాలు నిర్మిస్తున్నాడు. చెట్టుపైనుంచి క్రిందికి ఎగబ్రాకుతూ అభివృద్ధిని ఆర్భాటం చేస్తున్నారు.

డాక్టరు సుందరానికి తన గతజీవితమంతా ఒక్కసారి కళ్ళకు కట్టినట్లయింది. హృదయం మంచుకొండను కావలించుకున్నట్లు గజగజ వణికింది. తానెంతటి నిర్భాగ్యుడు!

కొండంత కొడుకు తానుండి కూడా వృద్ధాప్యంలో తన తల్లిదండ్రులు శాంతికి నోచుకోని జీవితాలతో సతమత మవుతున్నారు. మూడవ పెండ్లివాని కంటగట్టిన, తన రక్తం పంచుకుపుట్టిన ఏకైక సోదరి, మూడునెలలు తిరక్కుండానే మాంగల్యాన్ని మట్టిగలుపుకొని మాతాపితల అండన జేరింది. ఈ నాటికి అరవైసంవత్సరాల తనతండ్రి రెక్కాడితేగాని, ఆమూడు ప్రాణులడొక్కా ఆడదు...''

వేలు ఆ స్తున్న తనకు తల్లిదండ్రులు బరువయ్యారు. నయ లు సంపాయించే నా..్న విధవకూతుర్ని ఎలాంటి అభ్యంతరమూ లేకుండా చేరదీసి ఆదరిస్తున్నారు. ఎంతటి వ్యత్యాసం!

అస అభివృద్ధికి అర్థమేమిటి! ఈ నాగరికత నలుగురికీ ప్రసాదించిన పరమార్థమేమిటి!!

డాక్టరు సుందరం తట్టుకోలేకుండా వున్నాడు, ఆలోచిస్తున్న కొలదీ అంతా అయోమయంగా వుంది. మెల్లగాలేచి టేబుల్ ముందు కూర్చొని బెడ్‌లైట్ స్విచ్ నొక్కాడు. ఎప్పుడో టేబుల్ సొరుగులో పారేసిన డైరీ పుటలువిప్పి బరబరా రాశాడు. ఆలోచనా ప్రవాహం కాస్త వెనుతిరిగి చూసింది. కాస్తంత భారం త నట్లయింది. రెండు స్లీపిఙ్ పిల్స్ మింగి, దుప్పటి ముసుగుతన్ని గట్టిగా కళ్ళుమూశాడు డాక్టరు సుందరం.

కలతనిద్రతో తెల్లవారింది. ముసుగులోని మానవుడు మేల్కొ . మనస్సు యథా ప్రకారం ఆలోచించడం ప్రారంభించింది. మనస్సుమీద మండిపడ్డాడు సుందరం. మారు మాట్లాడకుండా దానిపనది చేసుకుపోతోం . మహాచికాకు కలిగింది. మందపవనం మెల్లగా వీచింది.

హడావుడిగా స్సు వేసుకొని, మందుల పెట్టెతోసహా కారులో కూర్. ఇంజన్ స్టార్టుచేశాడు సుందరం. అప్పుడే కాఫీకప్పుతో వచ్చిన అనూ

తెల్లబోయింది. కాంపౌండ్ దాటిపోతున్న కారు చేసిన దుమ్ములా ఆమె మనస్సులో మేఘాలు ముసురుకున్నాయి.

★ ★ ★

క్రుళ్లి కంపుకొడుతున్న ఆ మురికివాడలో కారాపి, మందులపెట్టె తీసుకని క్రిందకు దిగాడు సుందరం. ద్వారాన్ని మూసివుంచిన జీర్ణించిన తడికె మెల్లగా ప్రక్కకు తప్పుకొంది. గుడిసెలో తొంగిచూచాడు సుందరం. మృతకళేబరం మీద పడి, వెక్కివెక్కి ఏడుస్తున్న పదేళ్ళ కుర్రాణ్ణి చూచిన అతనికళ్ళు గిర్రున తిరిగాయి. కాళ్ళు తడబడ్డాయి. కారు లోకి చేరటమే కష్టమైపోయింది. వణుకుతున్న చేతుల్తో స్టీరింగు త్రిప్పాడు. కారు కదుల్తోంది. ఎక్కడకు పోతోందో అతనికే తెలియదు. ఏ వ్యక్తీలేని మహారణ్యంలోకి పోయి తల దాచుకోవాలనిపించిందాక్షణంలో? ఎక్సిలరేటర్ బలంగా నొక్కాడు. భూమి నిజంగా గిర్రున తిరుగుతోంది. రెక్కలు తెగిన పక్షి ఆకాశం నుంచి నేలపై కొరిగింది.

'అమ్మో!' అన్న కేక, భూమి బ్రద్దలైనంత ఆర్భాటం, పగిలిన ఫర్లాంగురాయి, కూలిపోయినకారు, మూల్గిన మానవ హృదయాలు - కళ్ళు చెదిరే దృశ్యం, కలవరించిన దారుణస్వప్నం, కల్లగాని యదార్థం.

★ ★ ★

భర్త ప్రవర్తనకు ఆశ్చర్యపోయిన అనూరాధ, కాఫీకప్పుతో అలానే బెడ్‌రూమ్‌లోకి పోయి, కప్పు టేబిల్‌మీదుంచి తానుకుర్చీలో కూర్చొని పరధ్యానంగా ఆలోచించసాగింది. ఎంతటి అర్జంటుకేసైనా తొణకని తన భర్త, ఎందుకీనాడంత అకస్మాత్తుగా వెళ్ళిపోయారు? బూట్‌వేసుకోకుండా బయటకు వెళ్ళని వ్యక్తి కాలికందిన స్లిప్పర్స్ తొడుక్కుని ఎందుకంత హడావుడిగా వెళ్ళిపోయారు.

అనుకోకుండా ఆమెదృష్టి టేబుల్‌మీదున్న డైరీమీద పడింది మెల్లగా ఒక్కోపేజీ త్రిప్పసాగింది. ఏవో మందులు- పేషెంట్ల పేర్లు - అటెండు కావ ల్సిన ఫంక్షన్లు- ఏమిటేమిటో అంతా ఇంగ్లీషులోరాయబడి గందరగోళంగా వుంది.

ఆమె చూచిచూడనట్లు ఎక్కడో ఆలోచిస్తూ నిర్లిప్తంగా పేజీలు త్రిప్పుతూనే వుంది. అకస్మాత్తుగా ఆగిపోయింది. ఆరాట మధికం కాగా హడావుడిగా చదువసాగింది.

''అందరు మానవులకు, నాకూవున్న తేడా ఏమిటి? అందరిలా కాకుండా నేను ఫారెన్ వెళ్ళొచ్చాను. ఎంతటి ఆపరేషన్ కేసైనా అతిసునా యాసంగా చేయగలను. సామాన్య డాక్టర్ల కెవరకూ లేని ప్రజ్ఞ నా కీవిషయంలో వుంది.

అవును! అదేకదూ నా ఆధిక్యత!!

అయితే నాకన్న అధికులీ ప్రపంచంలో ఎందరులేరు! పాకీవాడుకూడా తనవృత్తిలో నాకన్నా అధికుడు కాడూ! వాడు తన బాధ్యతను విస్మ ఎన్నికుటుంబాలు కుళ్ళి చావవు? అలా చేసిన రోజున వాడిని లోకం క్షమిస్తుందా! క్షమించదు. ముమ్మాటికీ క్షమించదు.

ఈ సాంఘిక జీవనం మహాయంత్రం లాంటిది. ఆ మహాయం ంలో సిలిండరుకెంత ప్రాధాన్యముందో చిన్నసీలకు కూడా అంతే ప్రాధాన్యముంది. సీల వొదులైతే యంత్రం సరిగ్గ పనిచేయదు. అలాగే ఏ వ్యక్తీ బాధ్యతను ఆ వ్యక్తి సవ్యంగా నిర్వహించని రోజున సాంఘిక జీవనం కుంటుబడుతుంది.

కాని... కాని - తాను చేసిందేమిటి! తన బాధ్యతను సవ్యంగా నిర్వహిస్తున్నాడా! అబ్బ! ఏమిటా ఆలోచనా ప్రవాహం. ఎన్నడూ లేంది. ఈనాడింత సంకుల సమరం ఎందుకు జరుగుతోంది.

నిజంగా జీవితమొక పంచరంగుల చిత్రం! కాదు - కాదు- ఇంద్రధనుస్సు! ఏరంగు కావలిస్తే ఆరంగే ప్రస్ఫుటంగా కన్పిస్తుంది. కళ్ళుమూసుకుంటే ఏమీ కన్పించదు. అంతా అగమ్యం. కాని తెరుచుకోవటమే స్వాభావికంగాగల కళ్ళు ఎంతకాలం మూసుకుంటాయి! ఏ వ్యక్తయినా ఎంతకాలం ఆత్మవంచన చేసుకోగలుగుతాడు!

ఈనాడు నాజీవితంలో ఒక కాళరాత్రి, నిజంగా కాళరాత్రే. మరో చూస్తే వెలుగు రాత్రికూడా ఇదేనేమో!

వరండాలో 'బ్యూటీ' మొరుగుతోంటే మెలకువ వచ్చింది. లేచి లైటేశాను. చిన్న ముల్లూ, పెద్దముల్లూ రెండూ ఒకదాని మీదొకటి ఒకటంకె మీదున్నాయి. తలుపు తెరచుకొని వరండాలోకెళ్ళాను. 'బ్యూటీ' నన్ను చూచి ఆనందంగా తోకాడించింది. గేటువైపు చూచి చిన్నగా మొరిగింది. ఆ ఆమవస నిశిలో కలిసి అస్పష్టంగా కన్పిస్తోంది.

రెండడుగులు ముందుకువేసి ''ఎవరక్కడ -?'' అన్నాను. విరజిమ్మిన రత్నాల్లా తారకలు మెరుస్తున్నాయి. దూరంగా వూరకుక్క ఏడుస్తోంది. చల్లటిగాలి మెల్లగా వీస్తోంది, కొన్ని క్షణాలు ముందుకు జరిగాయి. ఆ మానవాకారం అక్కడనుంచి కదల్లేదు. సమాధానమూ రాలేదు. నాకు కోపమూ, ఆశ్చర్యమూ పెనవేసుకురాగా కాస్త గద్దించాను....

''ఎవరక్కడ-?''

ఈసారికూడా సమాధానం రాలేదు. వెక్కి వెక్కి ఏడుస్తున్న ధ్వనిమాత్రం వచ్చింది. నాకు చిరాకు ముంచుకొచ్చింది. ఈ మనుషుల కసలు బుద్ధుందా అనిపించింది. వరండాలో వున్న స్విచ్ ఆన్‌చేశాను. గేటు దగ్గరకు నడచాను. 'బ్యూటీ' బాడీగార్డులా నావెంట నడిచింది.

ఎవరో కుర్రాడు, పదేళ్ళుంటయ్యేమో! తైల సంస్కారంలేని జుట్టుతో చినిగిన గుడ్డలతో అర్ధనగ్నంగా వున్నాడు. వెక్కివెక్కి ఏడుస్తున్నాడు.

''ఎందుకేడుస్తున్నావ్...''

''మరే.. మరే ... మాతాత...''

''ఊ... మీతాత..''

''మూలుగుతున్నాడు - పెద్ద జబ్బు చేసింది...''

''చేస్తే-''

''మరే... మరే... మీరు మందిత్తారుగా! అందుకని...''

''డబ్బులిస్తే మందిస్తా - మీలాంటివాళ్ళు నేనడిగినంత డబ్బివ్వాలేరు; నేను మందూ ఇవ్వను.''

''డాక్టరుబాబూ! మాతాతను బ్రతికించరూ! మీకు డబ్బిత్తానూగా..'' మీకు డబ్బిత్తానుగా-''

''నువ్వేనా డబ్బులిచ్చేవాడివి? అందులోనూ రాత్రిపూటరావాలంటే ఎంతవుతుందో తెలుసా?''

''ఎంతవుతుందేమిటి! ఇవిగో తీసుకోండి. ఇంకా చాలపోతే మా ఇంట్లో చిల్లరడబ్బులు బోలెడున్నాయి. అవన్నీ మీకే ఇచ్చేత్తానుగా-! మరి మాతాతకు మంచి సూదిమందివ్వరూ.!''

నాకళ్ళు చెదిరిపోయాయి. పట్టలేనంత ఆశ్చర్యం కలిగింది. ఐదు కాసులు ఖరీదు చెయ్యని ఆ నిర్భాగ్యుడి మాసిన గుడ్డల్లోంచి ఐదు పదిరూపాయల నోట్లు బయటికొస్తాయని ఎవరైనా ఎలా వూహించగలరు!

మారు మాట్లాడ కపోయ్యాను. ఆ సమయంలో కారు బయటకు తియ్యటం ఇష్టంలేక, రిషా తీసుకురమ్మని వాడికి పురమాయించి ఐదునిమిషాల్లో గుడ్డలు మార్చుకొని మందుల పెట్టెతోసహా రడీ అయ్యాను.

ఆకుర్రాడు రిషాతొట్టిలో నాకాళ్ళవద్ద కూర్చుని ఎటుపోవలసిందీ చెబుతున్నాడు. వీధి దీపాల కాంతిలో వాడికళ్ళు వింత సోయగాన్ని పులుముకొని మెరుస్తున్నాయి. రిషా ఒక మారుమూల మురికివాడకు పోయి ఒక గుడిసెదగ్గ ఆగింది. చివికిన మృతకళేబరాల్లా అసహ్యంగా వున్నాయి గుడిసెలు, ఇంతవర ఇలాంటి ప్రదేశంలో నేను కాలెట్టలేదు. ఇలాంటి వాళ్ళకు వైద్యం చెయ్యటమంటే నాకిష్టముండదు.

కొడిగట్టిన దీపం మిణుకుమిణుకు మంటోంది. ఉండుండి హృదయం పగిలిన బాధ మూలుగురూపంలో బయటికొస్తోంది.

చింకి చాపమీద కృశించిన మానవదేహం చొప్పకట్టలా పడుంది. ముసలాడు భ రంగా శ్వాస లుస్తున్నాడు. మనవడు తాతను తట్టి లేపాగ. భారంగా కళ్ళు ప్పి అయోమయంగా చూచాడు వృద్ధుడు.

మందులపెట్టె నుంచి థ- మీటరు బయటకు తీశాను. తనకేమ వద్దన్నట్లు సైగచేశాడు ద్ధుడు. నా కేమనాలో పాలుపోలేదు.

''గాంధీ - డబ్బెక్కడిదిరా! అన్నాడు- అతి మెల్లగా మనమణ్ణిచూచి.

కుర్రాడు తెల్లమొగమేశాడు. సన్నగా ఏడుపు ప్రారంభించాడు. నాకంతా అయోమయంగా వుంది. వృద్ధుడు చేతులు జోడించాడు. అతని పెదవులు వణికాయి.

''క్షమించండి డాకటరు బాబూ! వాడికి బొత్తిగా లోకజ్ఞానంలేదు. ఏదోవిధంగా ఈ ముసలితాతను బ్రతికించుకోవాలన్నదే వాడి తాపత్రయం గాని, నా ప్రాణంకంటె కూడా వాడు మీకిచ్చిన యాభైరూపాయలు విలువైనవని వాడికేం తెలుసు!

నా కవసానదశ వచ్చింది బాబూ! మందులతో ప్రాణం నిలిపేకాలం దాటిపోయింది. అందులో ఎలాంటి సందేహమూలేదు. ప్రాణంమీది తీపికూడా నాకేనాడో పోయింది. కాకుంటే వాడిని దిక్కుమాలినవాడ్నిగా చేసి పోతున్నందుకే బాధగావుంది. ఐనాతప్పదు.

నేను ఒకప్పుడు కాస్తో కూస్తో బాగానే బ్రతికాను బాబూ? కాని శనిదేవత నెత్తిమీద కూర్చొని చిందులు త్రొక్కించింది. త్రాగుడుతో కొంపా, గోడూ అన్నీ వూడ్చుకుపోయాయి. క్షయరోగంతో తీసుకొని నా ఆడది చచ్చిపోయింది. బికారిని దేశాలు పట్టుకుతిరిగాను. ఎన్నో అన్యాయాలు అక్రమాలూ కళ్ళజూచాను. విసిగి వేసారిపుట్టి ఈ ఊరు చేరుకున్నాను. అక్కడకూడా నాకేమీ లేదని నాకు తెలియక్కాదు. అయినా ఆబంధం అలాంటిది.

వూరుచేరుకొని అక్కడ విషయాలు వినేసరికి నా హృదయం వ ్రలవుతుందేమో ననిపించింది.

బాబూ! నాకడుపున కాచిందే ఒక్కకాయ, అదికూడా ఆడపిల్ల. నేను వూళ్ళు పట్టిపోయిన కొన్నాళ్లకు అదినన్నెదుక్కుంటూ వచ్చిందట. దాని భర్త దాన్ని అన్యాయం చేసిపోయాడు. అప్పుడు దానికి ఆరోమాసం గర్భమట. ఎవరో రుణాత్ముడు పంచన పడుండేందుకు ఆశ్రయమిచ్చాడు. అక్కడే కందట. నేను మళ్ళా వూరు తిరిగొచ్చేసరికి, వుపవాసాలతో చిక్కి సగమైంది. నన్నుచూచి ంతో ఆనందపడింది.

కాని నేను చేసిందేమిటి! దాని ప్రాణాలు తీశాను. నేను అబద్ధం చెప్పటంలేదు బాబూ! నాకూతుర్ని నేనే హత్య చేసాను...

అప్పటికి వాడికి ఐదేళ్ళుంటాయి. నావంట్లో సత్తువకూడా సన్నగిల్లుతూ వచ్చింది. బుద్ధి పుడితే అలాగే ఏ కూలిపనికైనా పోయి రూపాయి డబ్బులు తెచ్చేవాడిని. అందులోసగం నా త్రాగుడుకు పోయేది. దానికితోడు నా కూతురేదేనా పనీపాటా చేసి పావలా అర్ధాతెచ్చేది. వాటితో కాలం ఎలాగో వెళ్ళబుచ్చుకొస్తున్నాము.

ఆరోజు నేను గుడిసెకు చేరేసరికి చాలా పొద్దుపోయింది. తాగినమైకంలో వూగుతూ వచ్చాను నా గుడిసెలోంచి చిన్నగా నవ్వుతూ మాటలూ విని ..స్తున్నాయి. నా యిల్లు కాదేమో ననుకొని చుట్టూపారజూచాను. నేను పొరబడలేదు. అది నాయిల్లే! కాని ఈ నవ్వులేమిటి? చప్పుడుచేయకుండా వంగి తలుపుసందులోంచి లోపలికిచూచాను. నా కళ్ళను నేనే నమ్మకలేకపోయాను. నిలువెల్లా దహించుకుపోయాను. తలుపుగావున్న తడికెను గట్టిగా తన్నాను. వొక్క వురుకులో ముందుకురికాను. గొంతుక పట్టుకొని గట్టిగా నులిమాను. నా కళ్ళు బైర్లు కమ్మాయి. కోపానికి తాగుడు మైకం తోడుకాగా నాశరీరాన్ని నేనే మరచాను.

అంతేబాబూ! నాకూతురు చచ్చిపోయింది. నామనుమణ్ణి తీసుకొని ఊరురూ తిరిగి భిక్షమెత్తుకున్నాను. ఐదేళ్ళుగా మీలాంటి బాబుల వద్ద సా వసూలుచేసిన పైకం కూడా నాపొట్టనపెట్టుకొని వాడి బ్రతుకు గం ఎలు చేసేదాబాబు! నేను పస్తులు పడుకొని వాడి కోసం మిగిల్చాను బాబూ! ఎంతో కష్టమనుకొన్న తాగుడుకూడా వాడికోసం మానేశాను. నన్ను క్షమించండి డ రు బాబూ! అతని కళ్ళు చెమర్చాయి. అతిభారంగా శ్వాసపీలుస్తున్నాడు. ఆయాసంతో అల్లాడిపోతున్నాడు. ఇదంతా చూస్తుంటే నాకు అయోమయంతో పాటు అసహ్యం ముంచుకొచ్చింది. నాలాంటి పెద్దడ్డాక్టరు ఇలాంటివాళ్ళకు వైద్యం చేసేందుకు రావటమే గొప్ప విషయం. అలాంటిది పోనీలెమ్మని వద్దు పొమ్మంటాడా ఈ ముసలాడు! వీడికి ప్రాణం కంటే కూడా డబ్బు విలువైందట!

నాకు మండిపోయింది. నోట్లు తీసి వాడిముఖాన కొట్టి చకచకా బయటకు నడచాను.

కాని... కాని... నేను చేసింది మంచిపనేనా! ఆ ముసలాడు చెప్పిన విషయాలు ఎంత బాధాకరంగా వున్నాయి. అతను చచ్చిపోతే అందుకు నేనెంత వరకు కారకుణ్ణి!''

'గణ, గణ' మ్రోగింది టెలిఫోన్. డైరీ మూసి హడావుడిగా అటువెళ్ళింది అనూరాధ.

★ ★ ★

ఈ అనంతకాలంలో ఎన్నివేల క్షణాలు ముందుకు జరిగాయో అతనికి తెలియదు. అతని కోసరం ఎన్ని మానవ ప్రాణాలు ఆతురతతో ఎదురు చూస్తున్నాయో కూడా అతనెరుగడు. గాఢనిద్రనుంచి మేల్కొన్నట్లు అతను కళ్ళు విప్పాడు.

ఎవరో సిస్టర్ తనమీద దుప్పటి సరిగా సర్దుతోంది. అతనాశ్చర్య పోయాడు! తనేదో క్లినిక్‌లో వున్నాడన్న మాట. వొళ్ళంతా చాలా భారంగా వుంది.

'సిస్టర్...' అన్నాడు మెల్లగా.

ఆమె అటుతిరిగి చూచింది. అతను మరీ ఆశ్చర్యపోయాడు. ఇదంతా కలగాదు కదా - అనిపించింది. లేకుంటే తనసోదరి స్వరాజ్యం నర్సువేషంలో తనకు సేవచెయ్యటమేమిటి!

అన్నగారు కళ్ళు విప్పటంతో ఆనందంతో మారుమాట్లాడకుండా ప్రక్కగదిలోకి పరుగెత్తింది. క్షణాల్లో అతని ఆప్తులంతా రెక్కలు గట్టుకువాలారు. అందరిముఖాల్లోనూ ఆనందం వెల్లివిరిసింది.

తల్లిదండ్రులకూ, బావమరిదికీ చేయె నమస్కరించాడు సుందరం. వాళ్ళు మనస్సు లోనే దీవించారు. ఆనందభాష్పాలు రాల్చారు.

అనూరాధను హృదయానికి హత్తుకున్నాడు. చెల్లెల్ని దగ్గరకు తీసుకుని

తల నిమిరాడు.

''ఏమమ్మా! నాకు సేవచేసుందుకేనా ఈ వేషం...!'' సన్నగా నవ్వాడు సుందరం.

తండ్రిమెల్లగా విషయాన్ని సంగ్రహంగా చెప్పాడు...

''నాలుగునెలల క్రితం మీ బావమరిది అకస్మాత్తుగా మన గ్రామమొచ్చాడు. మూడు రాత్రుళ్ళూ మూడు బగళ్ళూకూడా మమ్మల్నిక్కడకు రావలసిందిగా వేధించుకుతిన్నాడు. ంత చెప్పినా వినిపించుకోలేదు. చివరికాయన మాట కాదనలేక వచ్చేశాం. వుండేందుకు మాకు ప్రత్యేకంగా ఒక ఇల్లిచ్చాడు, రాజ్యానికీ వుద్యోగమిచ్చాడు. నేనుకూడా హాస్పిటల్లోనే నాకు చేతనైన పనులేవో చేస్తూవుంటాను. మొత్తంమీద ఇద్దరికీ నూటయాభై ఇస్తున్నాడు. అప్పటినుంచీ కడుపులో నీళ్ళు కదలకుండా రోజులు బాగానే దొర్లిపోతున్నాయి. మొదట్లో ఇలా ఒకరి పంచనపడుండటం కష్టమనిపించినా, అట్టే ఆలోచించగా నేను చేస్తున్న దాంట్లో నాకేమీ తప్పు కనిపించలేదు -

ఈ మధ్య రాజ్యాన్ని పెళ్ళిచేసుకుంటానని నన్నడిగాడు. నాకు మొదట్లో కాస్తబాధా, ఆశ్చర్యమూ అన్నీ కలిగాయి''నాలో నేనే అన్ని విషయాలూ తర్కించుకున్నాను. పండరీనాథ్ చేస్తున్న త్యాగానికి నేనర్హుణ్ణా అనిపించింది. అమ్మాయికి కూడా ఇష్టమేనని తెలిసింది.

వెంటనే లగ్నం నిశ్చయించి మీకు టెలిగ్రామిచ్చాం. కాని దురదృష్టం, జవాబుగా నీకు జరిగిన ప్రమాదాన్ని గురించిన టెలిగ్రామొచ్చింది. మా ప్రాణాలు నీరయిపోయాయి. పండరిబాబు వెంటనే కారులో బయలుదేరి నన్నూ అమ్మాయినీ ఇక్కడికే తీసుకొచ్చాడు. రేత్రనక పగలనక నానా అగచాట్లూపడి ఎలాగైతేనేం న్ను బ్రతి ంచాడు. జంగా అతను దేవుడు బాబూ!...''

సుందరం హృదయం ద్రవించుకుపోయింది. బావ మరదిని దగ్గరకు పిలిచి - ''నన్ను క్షమించగలవా బావా!'' అన్నాడు కళ్ళనిండా నీళ్ళు నిలిచాయి.

''నీవు చేసిన తప్పేముంది సుందరం అయినా అందరి తప్పులూ క్షమించవలసింది భగవంతుడు. నేనుగాదు.''

''అలాగనకు బావా, నీవు భగవంతుడికన్నా గొప్పవాడివి. మానవసేవ ద్వారా మాధవసేవా భాగ్యం పొందగలుగుతున్నావు. నాకూ్కడా ఇక్కడే నీ అసిస్టెంటుగా వుండనియ్యి బావా! భగవంతుడు నాకళ్ళు తెరచాడు. ఆలనా పాలనా లేని ఈ అమాయక ప్రజల్లో నేనూ ఒకడినై వారి కష్టసుఖాల్లో పాలుపంచుకోవాలని వుంది. మానవుడిగా బ్రతకాలని వుంది...''

''నేనెంత అదృష్టవంతుణ్ణో సుందరం! అంతకన్నా నేను కోరదగింది మాత్రం ఏముంటుంది గనుక! ఇక మీదట ఈ వైద్యశాలకు ప్రధాన వైద్యుడివి నీవే! నే నీ అసిస్టెంటును.

''... సార్ -! మీకోసం ఎవరో వచ్చారండీ!'' అప్పుడే అక్కడికొచ్చిన ఒక కుర్రాడు.

సుందరం వాణ్ణిచూచి తెల్లబోయాడు... వెళ్ళిపోయేందుకు లేచిన పండరీనాథ్ అందుకున్నాడు. ..

''ఈ అబ్బాయిని ఈమధ్యే వార్డుబాయ్‌గా వేశాను సుందరం. అతనిపేరు గాంధీ - నువ్వింక కాస్తంత విశ్రాంతి తీసుకుంటావు కదూ...''

మేల్కొన్న మానవుడు మెల్లిగా ఆనందాశ్రువులు తుడుచుకున్నాడు.

***

# లా ప్-పే

రచన :

శ్రీమతి వేదుల మీనాక్షీ దేవి

భాస్కరంతన తల్లిదండ్రుల కొక్కడే సంతానం. ఉండడానికి ఇల్లుంది; తిండికి సరిపడే ధాన్యం వచ్చే కొద్దిపాటి పొలం వుంది.

భాస్కరం చిన్నప్పుడు సుద్దముక్కలతోనూ, పలక పుల్లలతోనూ ఏవేవో గీతలు గీసి ''ఇదిగో కుక్క'', ''ఇదిగోకాకి'' అంటూ చెబుతూ వుండేవాడు. ''అబ్బో! అబ్బో!'' అని తల్లిదండ్రులు ఆనందించేవారు-ఈ అనుభవం పిల్లలున్న ప్రతివారికీ వుంటుంది. పిల్లలానందిస్తారని తల్లిదండ్రుల వుద్దేశ్యం. నిజంగా తమ బొమ్మలెంతో బాగున్నాయి కాబోలునని ఆ పిల్ల అభిప్రాయం. అందువల్ల మురిసిపోతారు పిల్లలు.

సుమారు పది, పదిహేనేళ్ళు వచ్చేటప్పటికి బొమ్మను చూసి బొమ్మ వేసేవాడు భాస్కరం. ఏదేశ నాయకుల బొమ్మల్ని, ఎడ్వర్టైజ్‌మెంట్ల కోసం వేసే బొమ్మల్ని, కాలెండర్ల మీది బొమ్మల్ని చూసి వేసేవాడు. అచ్చంగా పోలిక రాకపోయినా దగ్గరదగ్గర పోలిక కానవచ్చేది.

భాస్కరం సాయం కాలం యెప్పుడూ ఇంట్లో వుండేవాడు కాడు. ఏ చెరువుగట్టుకో, రైలు పట్టాల వైపో వెళ్ళి ఏవేవో బొమ్మలు గీస్తుండేవాడు. చెరువులోని తామరాకుల మధ్య ముకుళించుతున్న తామరపూలను, అప్ప

వికసించబోతున్న కలువపూలను, మధ్య మధ్య గల నీటి కొంగలను, వీటన్నిటితో ఆ చెరువులో ప్రతిబింబిస్తున్న సంధ్యారాగాన్ని ఎంతో బాగా చిత్రించేవాడు. ఇంట్లో వున్నంతసేపూ పెరట్లోని పూలమొక్కల మధ్య తిరుగుతూ ఆ రకరకాల రంగు రంగుల పూలను, వాటి మధువు కోసం వాలే సీతాకోక చిలుకలను తుమ్మెదలను పరిశీలిస్తూండేవాడు. అక్కడికక్కడే బొమ్మ గీసేవాడు. అవేకాదు; ఎగిరే పక్షుల్ని, పాకే పురుగుల్ని, తిరిగే జంతువుల్ని, ఒకటేమిటి కంటికి కనపడ్డ ప్రతిదానిని ఓ డ్రాయింగ్ బుక్కు, పెన్సిలు వుండేవి.

క్లాసులో తెలివైన కుర్రాళ్ళలో లెక్కకాదు. ఏదో బొటాబొటీగా ఆత్తెసరు మార్కులు వచ్చేవి. ఎప్పుడూ చదువు ధ్యాసే లేదాయె. అందువల్ల చ.వా.ణ ఒక సంవత్సరం తప్పాడు. ఈ పిల్లవాని తత్వం తెలియక తల్లీ, తండ్రీ బాధపడేవారు. తండ్రి యెప్పుడైనా కేకలు వేస్తే యెదురు జవాబు చెప్పేవాడు కాడు. తలవంచుకుని వూరుకునేవాడు. ఆయనకే జాలివేసేది ఎదుకన్నానా అని.

**S.S.L.C** రెండవ సంవత్సరం చదువుతున్నా ఇదే వరుస. ఒక్క క్లాసులోనూ శ్రద్ధగా పాఠాలు వినేవాడు కాడు. ఒకనాడు లెక్కల క్లాసులో కొత్తగా వచ్చిన మేష్టారు పాఠం చెబుతూ భాస్కరం కేసి యధాలాపంగా చూశాడు. భాస్కరం తలవంచుకుని ఏదో వ్రాస్తూండడం చూసి ''ఏదీ నువ్వు వ్రాస్తున్నదేమిటో చూపించు'' అన్నాడు. భాస్కరం తన పుస్తకం తీసుకువెళ్ళి ఆయనకిచ్చాడు. ఆ పేజీలో ఆ మేష్టారి బొమ్మ స్కెచ్ వుంది. పేజీలు వరసగా తిరగవేసి చూశాడు. ఆ పుస్తకంలో అందరు మేష్టర్ల బొమ్మలూ వున్నై. నాలుగువైపుల నుండి స్కూలు దృశ్యం, క్లాసురూం, బొమ్మలు మొదలైనవి వున్నాయి. అతని పుస్తకాన్ని తి గి ఇచ్చేస్తూ ఆయన ''బొమ్మలు వేస్తూంటావన్నమాట పాఠాలు వినకుండా'' **S.S.L.C** అంటే మాటలు కాదు. అన్ని సబ్జక్టులూ ఒక్కమారుగా ప్యాసు కావాలి. అంత సరదాగా వుంటే ఏ సాయంత్రం అప్పుడో కొంచెం సేపు వేసుకో. పెద్దవాళ్ళు ఎంతో సొమ్ము ఖర్చు చేసి పిల్లల్ని చదివిస్తారు. నువ్వేదో చదివి వుద్ధరిస్తావని మీవాళ్లనుకుంటూంటారు.

వా బుద్ధిగా కూర్చుని బొమ్మలు గీస్తూ కాలక్షేపం చేస్తున్నావు. ఈ మాటుకి వూరుకున్నాను. మరొక సారి ఇలా చేశావంటే హెడ్మాష్టరుగారికి

రిపోర్టు చేస్తాను'' అని హెచ్చరించాడు.

ఇంటికి వచ్చాక 'ఇక బడికిపో'నన్నాడు భాస్కరం. తల్లీ, తండ్రీ బ్రతిమాలారు.

'చదువుకోకపోతే మనకి గడవదా'? అని ప్రశ్నించాడు భాస్కరం.

''అబ్బాయీ, గడవడం, గడవకపోడవం అన్నది కాదు ప్రశ్న. 'ఉద్యోగం పురుష లక్షణం' అన్నారు పెద్దలు. ఈ రోజులలో ఇంతింత ఆడపిల్లలు ఇట్టే ఎం.ఏ, బి.యే ప్యాసవుతున్నారు. ఉద్యోగాలు చేస్తున్నారు. మగపిల్లవాడివి, అందులోను ఒక్కగా నొక్క బిడ్డవి. మా ఆశలన్నీ నీమీద పెట్టుకున్నాం. ఎంత సొమ్ము ఖర్చైనా సరే నిన్ను విద్యాధికుణ్ణి చెయ్యాలని అనుకుంటున్నాం. సరస్వతీ ప్రసన్నం లేని బ్రతుకూ ఒక బ్రతుకేనా? అలాటివాళ్ళు నేటి ప్రపంచం దృష్టిలో ఎంత తేలికగా కనబడతారో ఆలోచించావా? పాఠాలు తెలియకపోతే ట్యూషన్ చెప్పిస్తాము'' అంటూ బ్రతిమాలి, నచ్చ చెప్పారు అతని జననీ జనకులు.

భాస్కరం మాట్లాడలేదు.

మానకుండా స్కూలుకి వెడుతున్నాడు కదా అని ఆనందించారు అతని తల్లీ తండ్రీ. వారం రోజులు గడిచాయి.

ఒకనాడు ''భాస్కరం ఉన్నాడా?'' అంటూ అతని క్లాసు కుర్రాళ్ళు వచ్చారు. 'స్కూలు నుండి ఇంకా రాలే'దన్నారు భాస్కరం తం . ''అదేమిటండీ మీ పిల్లాడు స్కూలుకి రాలేదు. మేము అక్కడి నుండే వస్తున్నాం. అసలు వారం రోజుల నుండి భాస్కరం స్కూలుకి రావడం లేదు. ఒంటి బాగాలేదేమోననుకుని చూడ్డానికి వచ్చాం'' అన్నారు పిల్లలు.

ఆయన నిర్ఘాంతపోయాడు. రోజూ స్కూలు వేళకి ఇంటి వెడుతున్నాడు. సాయంత్రం స్కూలు విడిచేవేళకు ఇంటికి వస్తున్నా స్కూలుకే అనుకుంటున్నాడాయన. మరెక్కడికి వెడుతున్నట్లు? దుష్టసహవాసాలకూ లోనుగావడం లేదుగదా? అని ఎంతో బాధపడ్డాడాయన

భాస్కరం ఇంటికి రాగానే తల్లీ, తండ్రీ అతన్ని నిగ్గదీసి అడి భాస్కరం తొణకలేదు, బెణకలేదు. ''నాకు చదువుకోవాలని లేదు.

వృధాకాలక్షేపం చెయ్యడం లేదు. నెమ్మదిమీద మీకే తెలుస్తుంది నేనేం చేస్తున్నదీ'' అన్నాడు.

ఏం చెస్తారు పాపం వారు!

ఒక్కగాను ఒక్క బిడ్డగదా అనుకుంటే ఇలా తయారయాడేమిటా అని విచారించే వారు.

భాస్కరం చదివిన స్కూల్లో ఒక మేష్టరు వీరికి బంధువు. భాస్కరం తండ్రి ఆయన దగ్గరికి వెళ్ళి సంగతంతా చెప్పి పిల్లవాడికి బుద్ధి చెప్పమని కోరాడు. ఆయన కూడా ఎంతో బాధపడ్డాడు. చివరికి ''చూడండి, మీ అబ్బాయి చదవడం లేదని బాధపడకండి. అంటే అతను చదువు మానడం మంచిదని నేనను. కాని, మీ వాడికి చదువులో ఆసక్తి లేదు. క్లాసులో ఒక్క పాఠం వినడు. ఎప్పుడూ ఏదో బొమ్మవేస్తూ కూర్చుంటాడు. బలవంతాన ఒక వేళ మనం స్కూలుకి పంపగలిగినా చదివించగలమా చెప్పండి. అయితే ఒక్క సలహా మాత్రం చెబుతాను. విద్య అంటే కేవలం చదువే కాదు చిత్రలేఖనం కూడా విద్యే! చతుష్షష్టి కళలలోనూ చిత్రలేఖనం ఒకటి! అదీ గొప్ప కళే! ఇప్పటి పద్ధతుల ప్రకారం పిల్లలకు ఎందులో అభిరుచి వుంటే అది చెప్పించినట్లయితే వారికి ఉత్సాహంగానూ వుంటుంది. వారి మనస్సు దానియందు లగ్నంచేసి పట్టుదలతో ఆ విద్య సాధిస్తారు కూడా. ఈనాడు దేశంలో కళాభివృద్ధికి చాలా కృషి జరుగుతోంది. ఈ ఊళ్లో శేఖరం అనే గొప్ప చిత్రలేఖకుడున్నాడు. వారి శిష్యరికం వల్ల మీవాడూ మంచి ప్రవీణుడు కాగలడు. కళలు నశిచిపోతున్న ఈనాడు మీలాంటి కళాకారులు బయలుదేరవలసిన అవసరం ఎంతో వుంది. మీరు బెంగ పెట్టుకోవద్దు'' అంటూ ఆయన నూరడించి, సలహా ఇచ్చి పంపాడామేష్టారు.

తండ్రి చెప్పిన విషయమంతా విన్నాడు భాస్కరం. ''స్కూలు మానేసి నేను వెడుతున్నది శేఖరంగారి దగ్గరకే నాన్నా. ఎంత చదువుకుందామనుకున్నా ఆ చదువు నా మనస్సుకి ఎక్కడం లేదు. ఏది చూసినా, ఎటు చూసినా 'ఇది బొమ్మ వేస్తేనో' అని లోపల ఎవరో అంటున్నట్లుంది. బొమ్మవేసే వరకూ తోచదు. ఏం చెయ్యను. మీ కోరిక తీర్చలేకపోతున్నాను. ఇలాంటివాడిని మీ కడుపున

పుట్టాను'' అంటూ కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు. తల్లిదండ్రులు భాస్కరాన్ని దగ్గరగా తీసుకున్నారు. విచారించకు నాయనా. ఏది ఎవరికి ప్రాప్తముందో ఏం తెలుస్తుంది చెప్పు. మరేం ఫరవాలేదు. మాకేమీ బాధలేదు. నువ్వు దుర్మార్గుడివేమీ కావు. నువ్వు అలా కన్నీళ్ళు పెట్టుకుంటే మేం చూడగలమా?'' అని బుజ్జగించారు.

భాస్కరం వాళ్ళ మాటలు విని కళ్ళు తుడుచుకుని ఇద్దరికీ నమస్కరించాడు. ''నేను గొప్ప కళాకారుడనౌతానమ్మా, ఎంతో ధనం సంపాదిస్తాను, మిమ్మల్నిద్దర్నీ పువ్వులలో పెట్టి పూజించుకుంటాను'' అన్నాడు ఆనందంతో. ఆ తల్లిదండ్రులు బ్రహ్మానందం పొందారు. మనస్సులో ఎన్నో దీవనలిచ్చారు.

★ ★ ★

భాస్కరం మేనమామ కూతురు సరళ. చిన్నపిల్లగా వున్నప్పటి నుండి మేనత్త అయిన భాస్కరం తల్లిదగ్గర అలవాటుగా వుంటూండేది. ఆమె దగ్గర చేరిక ఎక్కువ. భాస్కరంతో కబుర్లు చెబుతూ, కథలు చెప్పుకుంటూ షికారుకి తీసుకుని వెళ్ళమంటూ కూడా తిరుగుతూ వుండేది. ''బావా'' ''బావా'' అంటూ తిరుగుతున్న సరళను కూర్చోబెట్టి, నిలబెట్టి రకరకాల పోజులలో బొమ్మలు వేసేవాడు. ''ఎంత సేపూ 'నోరు మూసుకుని కూర్చో బొమ్మలు వేస్తాను' అంటావేగాని మాట్లాడవేమి బావా'' అనేది అ అమ్మాయి. ''బొమ్మలు వేస్తూంటేనే నాకు ఆనందంగా వుంటుంది మాట్లాడ్డకంటె'' అనేవాడు భాస్కరం. సరళ ముఖం ముడుచుకునేది. అయినా బావ అంటే అమిత ప్రేమ. భాస్కరానికి అంటే ఎంతో ఇష్టం.

సరళ సార్థక నామధేయురాలు. ఆమెను తన కోడలిగా చేసుకోవాలని భాస్కరం తల్లి కోరిక. భాస్కరం చదువు సంధ్యలు లేనివాడని సరళ తల్లిదండ్రులకు ఇష్టం లేదు అయితే సరళ మనఃప్రవృత్తి తెలిసిన తండ్రి భాస్కరాని అల్లుడుగా అంగీకరించక తప్పలేదు. భార్యను ఒప్పించాడు.

వివాహమయేటప్పటికి భాస్కరానికి పాతిక సంవత్సరాలు. సరళకు ప నిమిది వయస్సు. ఆ బాంధవ్యానికి బంధుమిత్రులంతా చాలా సంతోషించా .

రాత్రి అనక, పగలనక గురువుగారి సాన్నిధ్యంలో విద్య నేర్చుకుంటున్నాడు భాస్కరం. భాస్కరం తన సహాధ్యాయి అయిన కేశవరావనే అతనితో కలిసిమెలిసి తిరుగుతూండేవాడు. ఇద్దరూ చాలా స్నేహంగా వుండేవారు. వారు అజంతా, ఎల్లోరా, అమరావతి గుహల్లోని అపురూప శిల్పాలను చూసివచ్చారు. శిల్పానికి సంబంధించినది, అది ఎంత స్వల్పమైనదైనా సరే రెక్కలు గట్టుకుని వ్రాలేవాడు భాస్కరం. అక్కడికక్కడే బొమ్మలు చిత్రించేవాడు.

తాను వ్రాసిన 'అజంతా సుందరి' తైల వర్ణచిత్రాన్ని పటం కట్టించి తన ఇంటి ముందు హాల్లో గోడకు తగిలించాడు. చిత్రం చాలా బాగుంది. భాస్కరం వ్రాసిన ఆ బొమ్మ తీరు, ఆ సోగకళ్ళు అచ్చంగా అజంతా శిల్పం పోలికగానే వున్నాయి. కాని ఇతని 'అజంతా సుందరి' ముఖం మాత్రం సరళ ముఖం పోలికగా వుంది. అతని బొమ్మల్ని చూస్తుంటే భాస్కరం తన ప్రణయాధిదేవతను కళ ద్వారా ఉపాసిస్తున్నాడా అనిపించక మానదు. 'లగ్నం సమయంలో', 'గృహప్రవేశం వేళ అత్తవారింట్లో కుడిపాదం పెడుతున్న సరళ 'సరళ సీమంతం', 'అబ్బాయి డోలికామహోత్సవం' ఈవిధంగా ఇంట్లో వున్న కాస్త సేపూ బొమ్మలు వేసేవాడు. పటాలు కట్టించి ఇంటి నిండా అలంకరించాడు గోడలకు. 'బాలులు, వృద్ధులు' అంటూ మనుమలతో ఆడుకుంటున్న తల్లిదండ్రుల బొమ్మలెన్నో వ్రాశాడు.

భాస్కరానికి ముప్పై అయిదేళ్ళు వచ్చేసరికి తల్లి చనిపోయింది. ముగ్గురు మనమల్ని చూసుకుంది ఆ ఇల్లాలు. ఎంతసేపూ బొమ్మలు వేసుకోవడమేగాని కొడుకు ఒక ఎర్రని ఏగానీ సంపాదించడం కనబడ్డం లేదు. కుటుంబీకుడు కూడా అయ్యాడే! తమ చాటున వుండబట్టికాని, లేకపోతే భార్యాబిడ్డల గతి ఏంగాను? సంసారం ఇంత పట్టకపోతే యెల్లాగ? అని ఆమె చివర రోజులలో లోలోన బాధపడేది. ఆ బెంగతోనే పోయిందంటాడు భాస్కరం తండ్రి వెంకట్రామయ్యగారు.

అత్తగారు వున్నన్నాళ్ళూ సరళకు ఇంటి పూచీ అవసరం లేకపోయేది.

పుట్టింట్లో కన్నా సుఖంగా వుండేది మేనత్తదగ్గర. సరళకు ఇప్పుడు సంసారభారం మీద పడింది, అంతవరకు ఏం వుందో, ఏం లేదో తెలియదు. ఇప్పుడు ఒక్కొక్కటే అవగతమౌతున్నాయి.

తన భర్తకి సంసారం గొడవ అక్కర్లేదు. మామగారు ఓ మూల భార్య పోయిన విచారంతో బాటు కొడుకు సంసార భాద్యత వహించడే అన్న బెంగతో భిన్నుడైనాడు. అటు భర్త తప్పుందేమో అంటే అతడు దేవుడు ఎవరినీ ఏమీ అనడు. ఏ దుర్గుణాలూ లేవు. వేళకు ఏది పండిపెడితే అది తిని చక్కాపోతాడు. ఏమిటి చెయ్యడం? ఎవరిని నిందించడం ? వీటన్నిటికీ తోడు మేనత్త పోయిన బెంగ కూడా ఆమెను క్రుంగదీస్తోంది. 'ఆ పరిస్థితులలో ఆదైవమే వున్నాడు అన్నిటికీ' అని తనకు తానే ధైర్యం చెప్పుకుంది సరళ. ఇరుగుపొరుగు వారితో 'ఔ'ననిపించుకుంటూ కాలక్షేపం చేస్తోంది.

కాలచక్రం గిర్రున తిరిగింది. పదేళ్ళు గడిచాయి. భాస్కరం తండ్రి ఎవరో కాశీ వెడుతూంటే వెళ్ళి, పడవ మునిగి గంగానదిలో మునిగిపోయాడు. ఎంత వెతికించినా దొరకలేదు. ఇది జరిగి మూడేళ్ళయింది. వున్న ఎనిమిది ఎకరాలలోను నాలుగెకరాలు విక్రయించబడ్డాయి. ఆ సంవత్సరం వానలు సరిగా పడక ఆ వున్న పొలంలోనైనా తిండి గింజలు రాలలేదు. ఇంట్లో నలుగురు పిల్లలు, భారా , భర్తా జీవించాలి! ఇల్లు మరమత్తులకి వచ్చింది. తినడానికే కటాకటీ అవుతూంటే ఇంటికి బాగులేమిటి చేయించడం? ఇల్లు క్రమంగా శిథిలమైంది. భాస్కరం ఆ ఇల్లు అమ్మేశాడు. అద్దె ఇంట్లోకి మారారు ఆ కుటుంబం.

ఒకనాడు భాస్కరం ఇంటికి వస్తూనే సరళను పిలిచి 'అజంతా సుందరి' చిత్రాన్ని చూపించి ఆ చి ం తనది కాదన్నాడు. ఏదో తేడాగా వుంది. నా అజంతా సుందరి ముఖం ఇలా వెలవెల పోలేదు'' అన్నాడు. ''ఎన్నాళ్లో కష్టపడి వేసిన ఆ బొమ్మ మీరు గుర్తుపట్టకపోవడమేమిటి! బొమ్మలపిచ్చిలో పడి వుండడం వల్ల ఏది సరియైనదో, ఏది కాదో తెలుసుకోలేకపోతున్నారుగాని, అ మీరు వ్రాసిన చిత్రమే'' అంది సరళ. ''అది నా బొమ్మకాదని నాలోని ఏదో ఒక శక్తి చెబుతోంది'' అన్నాడు భాస్కరం. అతని మనస్సు వికలమైపోయింది.

భాస్కరం ఎంతెంత బొమ్మలో వేస్తాడు. ప్రతి స్వల్ప విషయాన్నీ కూడా మరచిపోకుండా జాగ్రత్త తీసుకుంటాడు. దేనికదే లక్షణంగా వున్నట్లే కనబడుతుంది. కాని, మొత్తం మీద ఏదో లోటుగా అనిపిస్తుంది. తన బొమ్మలలో వున్న అస్వల్పమైన లోపం అతనికి తెలియదు. ఇంకొకళ్ళు చెప్పాలి. కావలసినవాళ్ళు, మిత్రులు చెప్పరు మొగమాటం చేత, అతనిమీద వుండే గౌరవం చేత! మిగిలిన వాళ్ళకి ఇతన్ని గురించి ఆసక్తి ఏమిటి? అతని బొమ్మల్ని గురించి ఆలోచించడానికి కాలం వృధాచేసుకోరు. అందువల్ల భాస్కరానికి తన బొమ్మలలోని లోపాన్ని తెలుసుకునే అవకాశం లేదు.

సరళ భర్తనేమీ అనేదికాదు. అతను నమ్మిన కళయం దతనికి గల ఏకాగ్రతకు నిర్విణ్ణురాలయేది. ''దైవం దయదలిస్తే ఏనాటికైనా తన భర్త గొప్ప కళాకారుడు కాగలడు. అతని కోరిక కృషి ఫలిస్తే తనకదే పదివేలు. ఇబ్బందులు కలకాలం కాపురం వుండిపోవు'' అని అనుకునేది.

దేశంలో జరిగే ప్రతి ప్రదర్శనకూ తన చిత్రాలను పంపేవాడు భాస్కరం. కాని, ఒక్కటీ బహుమతిని పొందలేదు. పోనీ తన బొమ్మలు పత్రికలలో ప్రకటింపబడితే చూద్దామని ఆశతో ఎదురుచూసేవాడు. అదేమి గ్రహచార మోగాని అదీ కరువే అయిపోయింది!

ఎంతసేపూ చేతిసొమ్ము ఖర్చు చేయడమేగాని ఒక్క నయాపైస కూడా చిత్రాల మీద వచ్చిన పాపాన పోలేదు. చిత్రాలే రాణించనప్పుడు అర్జన ఎలాగ వుంటుంది.

ఒకానొకనాడు చిత్రలేఖనంలో తానొక గొప్ప కళాకారుడు కాగలడనీ, తద్వారా ఆర్థిక సౌష్ఠవం పెంపొందగలదనీ ఎంతో అనుకున్నాడు. కొంతకాలం అయేసరికి ఆర్థిక సౌష్ఠవం మాట దేవుడెరుగును; తన చిత్రాలు పదిమంది మెప్పు పొందితే చాలుననుకున్నాడు. శేఖరంగారి శిష్యుడన్నపేరు తప్ప, తన చిత్రాల వల్ల పేరు గడించలేకపోయాడు. పోనీ అంతటితో విరక్తి కలుగుతుందేమో అంటే అదీ లేదు. అంతకంతకు ఇంకా పట్టుదల ఎక్కువైంది.

కొంపలో పరిస్థితి నానాటికి తీసికట్టుగా వుంది. పిల్లలు పెద్దవాళ్ళ

వుతున్నారు. చదువుసంధ్యలు చూడాలి. పురుషుడు కలుగజేసుకోని ఆ సంసారంలో అన్నీ సక్రమంగా ఎలా జరుగుతాయి? ధీరచిత్త అయిన సరళ దీనచిత్త అయింది.

చిన్నబోయిన ముఖంతో వున్న సరళను చూసి, గృహ పరిస్థితులను గమనించి ఆమె తండ్రి పిల్లల భవిష్యత్తు పాడు చెయ్యకు, మన వూళ్ళో స్కూల్లో చేర్పిస్తాను. చదువు లేకుండా తిరిగితే వీళ్ళూ వాళ్ళ నాన్నలాగ ఎందుకూ పనికిరాకుండా తయారవుతారు'' అంటూ ఆమెనూ, పిల్లల్ని తీసుకు చక్కాపోయాడు. ఆమెకు ఇష్టం లేదేమాత్రం. కాని అంతకన్న గత్యంతరం లేకపోయింది పాపం!

చిన్నప్పటి నుండి ఎంతో అన్యోన్యంగా వుండే మేనత్త ముచ్చటపడి చేసిన పెళ్ళివారిది. వారు ఆదర్శదంపతులనీ, వారి సంసారం స్వర్గతుల్యంగా వుంటుందనీ అటు పెళ్ళికి వచ్చిన బంధువర్గం, ఇటు చూడవచ్చిన పరజనులు ఎంతో ఆశించారు. సకల శుభాలూ కలగాలని దీవించారు. అలాంటి వీరి సంసారం ఈ విధంగా తయారవుతుందని కలలో కూడా ఎవ్వరూ వూహించనైనాలేదు.

కాలుమీద కాలువేసుకుని ఇంట్లో కూర్చున్నా హాయిగా జరిగిపోయే సంసారం. సౌశీల్యవతి అయిన భార్య, ముచ్చటైన బిడ్డలతో ఎంతో సకలకలలాడుతూ వుండవలసిన భాస్కరం సంసారం చివరకి ఈ విధంగా అయింది. నుదిటి వ్రాత తప్పించడం ఎవరి తరం?

భాస్కరం రకరకాల భావాలతో బొ·· లు వేసివేసి, ప్రజల మన్ననల కోసం ఎదురు చూసి చూసి చివరకు పొందలేక విసిగి వేసారిపోయాడు. అతని ఆశ అడుగంటింది. ఉత్సాహం వుడిగింది. భావాలు సన్నగిల్లాయి. నిండా యాభై ఏళ్ళు నిండకుండానే వృద్ధాప్యం సింది. జుట్టు నెరిసింది. పళ్ళు కొన్ని వూడి పోయాయి. దృష్టి మందగించింది. శరీరం కృశించింది. ఛాయ తరిగింది. చి కారునిలోని చైతన్యమే మాయమౌతున్నప్పుడు చిత్రాలలో మాత్రం చైతన్యం ఎలాగ కనపడుతుంది.

చేతిలో సంచితో ఎక్కే గుమ్మం, దిగే గుమ్మంగా తిరుగుతుంటాడు. తన చిత్రాలను చూపించి వాటి గురించి చెబుతూంటాడు. ఆయన ప్రాణ ప్రదంగా గీసిన బొమ్మలను నిర్మోహమాటస్తులు పురుగుని చూసినట్లు చూసి, బిచ్చగాణ్ణి కసిరినట్లు అతణ్ణి కసిరేవారు. తల్లిదండ్రులవల్ల కూడా మాటపడలేని ఆ కోమల హృదయుడెలాగ భరించేవాడో పాపం!

భాస్కరం నిజంగా కళాతపస్వి. ఆ తపస్సులో అటు తల్లిదండ్రులను, భార్యా బిడ్డలను ఆనందపరచలేకపోయాడు. తానూ సుఖపడలేకపోయాడు. ఇటు తన ఘోర తపస్సులో పరమావధిని పొందలేకపోయాడు. ఏ మునీశ్వరుడో తపోభంగమై ఇలాగ పుట్టి వుంఢాలి. కాకపోతే సంసార మందు విరక్తి. తాను సాధించ దలచిన విషయమందు ఏకాగ్రత ఎలా సంపాదించ గలుగుతున్నాడు!

★ ★ ★

హైదరాబాదులో చిత్రలేఖనం పోటీలు జరుగుతన్నాయని విన్నాడు భాస్కరం. అతనిలో నిరాశ, నిస్పృహ తాండవించాయి. పోటీ చేయడమా? మానడమా అతని మనస్సులో తీవ్ర సంక్షోభం చెలరేగింది. ఏమైతేనేం, చివరకు పోటీ చేయడానికే అతని మనస్సు అంగీకరించింది.

ఇదే తాను చేసే ఆఖరుపోటీ, జయాపజయాలు దీనితో తేలిపోవాలి. గెలిస్తే సరే.కాని యధాప్రకారం ఓటమే సంభవిస్తే ఆనాటితో తన చిత్రకళకు స్వస్తి చెప్పడానికి ప్రతిజ్ఞ పూనాడు.

తన 'అజంతా సుందరి' ని పోటీకి పంపితే తప్పక బహుమానం వస్తుందని అతని విశ్వాసం. అయితే ఆ చిత్రం తనది కాదని ఒక గాఢమైన నమ్మిక. అందువల్ల ఆ చిత్రాన్ని పంపదలుచుకోలేదు. కొత్త చిత్రాలేవైనా వేసి పంపడానికి నిర్ణయించుకున్నాడు భాస్కరం.

తన కళకే కాదు. తన జీవితానికే ఇది అగ్ని పరీక్ష అనుకున్నాడు భాస్కరం. తన శక్తినంతా కూడదీసుకున్నాడు. లేని ఉత్సాహాన్ని తెచ్చుకున్నాడు. చిత్రలేఖనానికి పూనుకున్నాడు. అహోరాత్రులు పనిచేసి బొమ్మలు వేశాడు. పంపవలసిన నాటికి పంపాడు.

★ ★ ★

ఆనాడు ఆదివారం. చిత్రలేఖనం పోటీ ఫలితాలు ఆ సాయంత్రం రేడియోలో చెబుతారు.

పార్కులో రేడియో దగ్గర వినడానికి బయలుదేరాడు భాస్కరం. పార్కు రెండు ఫర్లాంగుల దూరం వుంది. అతని ఇంటికి పార్కుకి వచ్చే జనంతో, వచ్చేపోయే రిక్షాలతో, కార్లతో రోడ్డు చాలా రద్దీగా వుంది. కార్లనీ, రిక్షాలనీ చూసుకుని తప్పుకుంటూ వెళ్ళడమే ఎంతో కష్టమైపోతోంది జనానికి.

లేనిశక్తి తెచ్చుకుని బిగబట్టుకుని పని చేయడం వల్ల ఆ పని పూర్తికాగానే ఆ బడలిక అంతా ఒక్కమారు కనబడుతోంది భాస్కరానికి. విపరీతంగా నీరసపడ్డాడు. కళ్ళు చేవ్రాతగా లేక నడవలేకపోతున్నాడు. నడక వల్ల కొంత ఆయాసంగా వుంది. దానికి తోడు ఫలితాలను గురించి ఆందోళన. అతని గుండె గొంతుకలో కొట్టుకుంటోంది.

అక్కడ చేరి వున్న జనాన్ని కూడా చూడకుండా కళ్ళుమూసుకుని, చెవులు దోరపెట్టుకుని కూర్చున్నాడు విగ్రహం లాగ.

''హైదరాబాదులో జరిగిన చిత్రలేఖనం పోటీలలో భీమడోలు నుండి పంపిన కేశవరావుగారి 'అజంతా సుందరి' చిత్రాన్ని ఉత్తమ చిత్రంగా నిర్ణయించడం జరిగింది. ఇందుకుగాని వీరికి అయిదు వందల రూపాయలు బహుమానం ఇస్తారు'' అంటూ రేడియోలో వార్తలు వినవస్తున్నాయి.

భాస్కరం గుండె ఆగినంత పనైంది. అజంతా సుందరి చిత్రం ఎక్కడ వేశాడు?.... ''పోటీకి చిత్రం పంపుతున్నావోయ్?'' అని తను అడిగితే....''అబ్బే... పంపటం లేదోయ్'' అని నీళ్ళు నమిలిన కేశవరావు పోటీకి చిత్రం ఎప్పుడు పంపాడు?

రొప్పుకుంటూ ఇల్లు చేరుకున్నాడు భాస్కరం. సరళా, విన్నావా? నేను చెబుతూనే వున్నాను ఈ అజంతా సుందరి నాది కాదని. ను... నమ్మలేదు చిత్రం కేశవరావు దొంగిలించాడు. పోటీకి పంపాడు తన పే . ఆ చిత్రాని అతనికి బహుమతి కూడా వచ్చింది'' అన్నాడు

సరళ తెల్లబోయింది.

''ఆ అజంతా సుందరి నాదే. అజంతా సుందరి నా సర్వం చిత్రకళకి అంకితం చేశాను. ఎన్నో అవమానాలకి గురి అయా . నా తపస్సు పండింది. నా కళ ఫలించింది''

సరళ అడిగింది ''ఇంతకీ బహుమతి వచ్చింది మీకా? కేశవరావుగారికా'' అని.

''ఎవరికైతేనేం సరళా? గెలిచింది నా చిత్రం. నాలో నాకు నమ్మకం పోయి, చివరికి చిత్రకారుడనవునా, కాదా అనే ఆది మీమాంసలో పడి, ఆత్మవిశ్వాసం గోల్పోయాను. జీవితాన్నే రోసిన సమయానికి నా అజంతా సుందరి గెలిచి నాకు తిరిగి జీవితం మీద ఆశ కలుగ జేస్తోంది. మళ్ళీ బొమ్మలు వేస్తాను'' అన్నాడు వుద్రేకంతో భాస్కరం, అతనిలోని ఆనందం అర్ణవమై కట్టలు త్రెంచుకుని ప్రవహిస్తోంది.

''కేశవరావు మీకు చాలా ద్రోహం తలపెట్టాడు. చెలిమి చేసి, నమ్మించి, మిమ్మల్ని చాలా దగా చేశాడు. ఇంతకీ ఆ బొమ్మ మీదే అంటే ఎవరైనా నమ్ముతారా? ఆ అయిదువందలూ అతడే పుచ్చుకుంటాడు. ఇంతకన్న నమ్మక ద్రోహం వుందా ఎక్కడైనా?'' అని బాధపడింది.

అయినా తనతో అంత చనువుగా వుంటూ ప్రాణస్నేహితుడై వుంటున్న కేశవరావు ఇలా ఎందుకు చేశాడో? అనుకుంటూ ఏవో ఆలోచిస్తున్నాడు.

★ ★ ★

''టెలిగ్రాం సార్''

భాస్కరం టెలిగ్రాం విప్పాడు.

''అజంతా సుందరి చిత్రం మీదేననీ, కేవలం పోటీకి పంపించింది మాత్రం కేశవరావుగారనీ మాకిప్పుడే కేశవరావుగారు తెలియజేశారు. నిన్నటి ఫలితాల ప్రకటనలోని పొరపాటుకి చింతిస్తున్నాం. చిత్రకళా పోటీలో విజేతలు మీరేనని తెలియజేస్తున్నాం.

''సమితి కార్యదర్శి''

ఇంతలో ''పోస్టు'' అంటూ వుత్తరాల బంట్రోతు ఒక కవరు భాస్కరాని కిచ్చాడు. కేశవరావు వ్రాశాడావుత్తరం.

''భాస్కరం,

నీకు తెలియకుండా నీ తరపున అజంతా సుందరి చిత్రం పంపాను. బహుమానం రాకపోతే నీకు ఆశాభంగం కలగకుండా వుండాలని నీతో చెప్పకుండా నకలు నేను వ్రాసి పటం కట్టించి, పటాలను మార్పు చేశాను. అజంతా సుందరి మొదటి బహుమతి నందించింది. శుభాకాంక్షలు. నీ స్నేహితుని ఈ చౌరవకు మన్నించు.

కేశవరావు.

తా....క...భాస్కరం.

నువ్వు కళాతపస్వివి సుమా!''

***

# ముసురు

రచన :

జి. శ్రీరామమూర్తి

రైలు ఎక్కే ముందు నిర్మలంగా, హాయిగా ఉన్న వాతావరణం క్రమేపీ మందంగానూ, ' ఈసురో'మంటూ తయారయింది. ఎండ మూగ ఎండగా మారింది. మూగెండ కూడా మాసిపోయింది. ఆకాశం మేఘావృ తమయి అసూయాపరుని ముఖంలా తయారయింది.

సన్నగా ప్రారంభించి జోరు చేసింది ఈదురుగాలి, చినుకులు కూడా ఒక్కొక్కటే మొదలెట్టాయి. చిలికి చిలికి గాలివాన కాలేదు కాని ఒక్కటే ముసురు! రైల్లో వెడుతుంటే ఊళ్ళూ, నాళ్ళూ కూడా ముసురు తెర వెనుక మరుగు పడిపొయ్యాయి. బయట ప్రపంచమంతా తెల్లగా వెల్లవేసినట్లు ఉంది.

పవలు దాటుతున్నా కాలపరిజ్ఞానం లేకుండా పోయింది, ముసురు ముసురుగానే ఉంది. 'ప్రొద్దున్నే పట్టిన ముసురూ, ప్రొద్దెక్కి వచ్చిన చుట్టం పోరు' అన్న సామెత జ్ఞాపకం రాగానే మనస్సు కొంచెంగా వికలమయింది.

అప్పటికే దాదాపు 2 గంటలు లేటయినా తనకేం పట్టనట్టు నిర్లి ంగా, మంద్ర స్థాయిలో నడుస్తోంది రైలు. మూలుగుతున్న చక్రాల ధ్వని వినేకొద్దీ, రైలు ఏ క్షణంలో అయినా ఆగిపోవచ్చేమోనన్న భయం కలుగుతోంది. యాదృచ్ఛికంగా నేను చదువుతోన్న పుస్తకంలో కూడా 'నీవెక్కిన రైలుబండి ఓ జీవితకాలం లేటు' అంటూ కవి హెచ్చరిస్తున్నాడు.

ఎదురుగా ఉన్న ప్రయాణీకుని టైమడిగాను. పది దాటుతోందన్నాడు, పెట్టెలో అప్పుడే నిద్రావివశులయిపొయ్యారు జనం కిక్కిరిసి ఉండటం మూలాన ఏమూల కాస్త చోటు దొరికితే ఆ మూలగా పడిపొయ్యారు. ఎదురుగా ఉన్న ఓ సుందరి ఓ చీకు గడ్డపాయనపై ఒరిగా పోతోంది. గడ్డపాయన ఓ 'రింగుల' అమ్మాయిపై ఒరిగి పోతున్నాడు, ఏ మూల చూసినా సర్వాంగాలసనాలూ, శవాసనాలూను!

నాకు మహా చిరాకు వేసింది. ' ఈరోజు వాతావరణం పొడిగానే ఉంటుం' దన్న రేడియో ప్రకటన చూసుకునే బయల్దేరాను, అసలు ఆలోచనా, లెక్కా మదింపూ లేనిదే, ఏ పనీ చెయ్యడం నాకిష్టం లేదు, కానీ వాతావరణం ఇలా తగలడ్డది, రాత్రి ఎనిమిదింటికి స్టేషన్‌లో దిగి పోతాననుకునే బయల్దేరాను ఎనిమిదింటికి స్టేషన్: తరువాత ఓ అరగంట కమలాపురానికి జట్కా ప్రయాణం: అక్కణ్ణుంచి మూడు మైళ్ళదూరంలో ఉన్న కంకటి వరానికి ఓ గంట కాలి నడక. ఎ ట్లా లేదన్నా రాత్రి పదింటికన్నా గమ్యస్థానం చేరుకుంటాననుకున్నాను. కానీ ఆ సణుగుడు ఈదురు గాలిలో కలిసిపోయింది.

పైగా అంతవరకూ ఎంగిలి పడలేదని స్మృతికి వచ్చేప్పటికి బాధ తీవ్రమయింది. నీరసంతో కళ్ళు మూతలు పడుతున్నాయి. కానీ, నిద్రపట్టడం లేదు. '-' స్టేషన్ కాంటీన్‌లో దోసెలో, ఈగను చూసినప్పటినుంచీ ఏది తినాలన్నా వాంతి పుట్టుకొస్తోంది.

కాస్త వీలు చూసుకొని నడుం వాలిస్తే నయినా నిద్రపడుతుందేమోనని చూశాను. లోయర్ 'బెర్త్స్' మధ్య కాస్త జాగా ఉన్నట్టు తోచింది. బెడ్డింగు తీసి కొంచెంగా పరిచాను. నడుం వాల్చాను నిద్ర పడుతూన్నట్లనిపించింది.

కానీ ఉన్నట్లుండి, ఏదో చీపురు ముళ్ళు లాంటివి తగలడంతో ఉలిక్కిపడి లేచాను. బెర్త్ కింద ఓ నల్లకుక్క పడుకుని ఉంది. కుక్క!... ఒ గగుర్పొడిచింది. అసలు కుక్కలంటేనే నాకు ప్రత్యేకించి అసహ్యమేస్తుంది. వంశంలో ఏదో తరంలో ఒకాయన పిచ్చి కుక్క కరవడం వల్ల చనిపోయ ... అనుశ్రుతంగా వస్తోంది. చిన్నప్పుడు నాకు 'గజ్జిరాముడు' అన్న ...

అంటుకోవడం ఓ గజ్జి కుక్కకు నేను దగ్గరగా పోయి గజ్జి అంటించుకోవడం మూలానేనట! ఇంకా ఏవో కారణాలు ఉన్నాయి. కొన్ని వ్యక్తమయినవి మరికొన్ని వ్యక్తావ్యక్తమయినవి.

' అయినా నడుస్తున్న రైలులో' 'కంపార్ట్‌మెంటులో కుక్క ఏమిటి? ఈ రైల్వేలు... చివరకు పందులతో కూడా ప్రయాణం చెయ్యవలసిన రోజు రావచ్చు!' అంటూ కుక్కను వెళ్ళగొట్ట ప్రయత్నించాను. అది కుయ్యో కుయ్యో అంటూ కదిలింది కాదు వెంటనే...

'దాని మానాన దాన్ని ఉండనియ్యండి బాబూ! పాపం 'పిచ్చి కుక్క'!'' అన్నాడు ఓ ప్రయాణీకుడు.

'మనవాళ్ళు!....' పళ్ళు పటపటా కొరుక్కున్నాను వ్యర్థంగా, బెడ్డింగు చుట్టేశాను, మళ్ళా ఓ వికృతాసనం వేసి బెర్తు మీద కూర్చున్నాను. పట్టే నిద్ర కాస్తా తుడుచుకుపోయింది. నాలాగే నిద్ర పట్టక కాబోలు దూరాన పెట్టెలో ఓ ప్రయాణీకుడు సన్నగా 'హరి హరీ నారాయణో.. కరుణతో మమ్మేలు కమల లోచనుడా...' అంటూ కూని రాగం తీస్తున్నాడు.

రేయి మించుతోంది. స్టేషన్ యింకా రాలేదు. ఆ రాత్రి తప్పకండాతనకు ఎదురుగా ఉంటానని జానకికి మాట ఇస్తూ రాశాను. కాని అలా జరక్కండా పోతోంది. 'జానకీ! ఏమీ అనుకోవుకదూ ?' అంటూ పర్సులో ఉన్న జానకి ఫోటో కేసి మాట్లాడుకున్నాను. జానకి అదోలా ముఖం పెట్టినట్టయింది. వెంటనే పర్సులో ఉన్న జానకి వ్రాసిన జాబు జ్ఞప్తికి వచ్చింది. తీసి మళ్ళా చదువుకున్నాను.

'బావా,

పండక్కు నీవు వస్తానని వేయి కండ్లతో ఎదురుచూస్తున్నాను. పైగా నా పుట్టినరోజు కూడా మర్నాడే కాబట్టి మీరు వస్తే నా హృదయం ఎంత ఉప్పొంగిపోతుందో, అప్పుడే ఆనంధభాష్పాలతో నిండిపోతూన్న నా కండ్లే సాక్షి! పాతవైషమ్యాలు పూర్తిగా మరచిపొయ్యారని భావిస్తున్నాను. అందులో నా తప్పు లవలేశమూ లేదని మీకు తెలియకపోదు. నా పుట్టినరోజు పండుగని మీరేమీ

తీసుకురావద్దు. మీరే నా సర్వస్వం. మీ రాకే నాకు వెలలేని నగ...

(చివరగా ఓ చిన్న కోరిక; నవ్వకండి. ఇక్కడ మన పడకటింటినిండా ఒకటే ఎలుకలు మీరుండే నాలుగురాత్రుల్లో ఒక్క రాత్రయినా కలసి సుఖిద్దాం. వచ్చేప్పుడు - నవ్వకండేం? - కాస్త ఎలుకలమందు పట్టుకురండి...!) అంటూ బ్రాకెట్స్‌లో వ్రాసుకున్న కోరికకు నవ్వాపుకోలేకపొయ్యాను.

'జానకి!...

గతంలోకి ఆలోచనలు వెళ్ళాయి.

జానకి కుటుంబము, మేమూ బంధుకోటిలోని వారమే. ఎక్కడో తాత ముత్తాతలనాటినుండి ఏదో మూల కలుస్తూనే ఉందట. ఆ సంబంధం నిలబెట్టాలనే జానకి కడుపున పడగానే నాకు నిశ్చయమయిపోయిందట. ఈడు వచ్చింతరువాత, మా కుటుంబంవాళ్ళం దూరదేశం వెళ్ళవలసి వచ్చినా, అన్నమాట మేరకు మా ఇరువురికి సంబంధం నిశ్చయించి తాంబూలాలుకూడా తీసుకున్నారు. వచ్చే మాఘమాసంనాటికి పెండ్లి స్థిరపరచుకోగా, ఈలోగా నేను కాలేజీలో చేరగానే నాకూ అనేకమయిన సంబంధాలు రావడం, వేలు కట్నం ఇస్తామని నాన్నగారి చుట్టూ తిరగడంతో నాన్నకు ఏమూలో వున్న లోభం ప్రకోపించింది. 'ఏరా నాలుగయిదువేలు కట్నం ఇస్తామని ఇంటిచుట్టూ తిరిగి పోతున్నారు. పైగా పెద్ద అంతస్థువాళ్ళం! జానకిని చేసుకుని నీవేం సుఖపడ్తావ్?' అన్నాడు నాన్న. కాని నాన్నలోని ఈ మార్పు నాకు అత్యాశ్చర్యం కలిగించింది. ససేమిరా పరాయి సంబంధానికి ఒప్పుకోనన్నాను. చివరకు ఘట్టి మాటలవరకు వెళ్ళింది విషయం. ఎందుకో నాన్న మెత్తబడ్డాడు కొన్నాళ్ళకు.

తరువాత తెలిసింది అసలు విషయం కనీసం ఒక్క ఎకరమయినా పెండ్లప్పుడు జానకి పేర పెట్టనిది తన కొడుక్కి జానకిని చేసుకోవడం లేదని మామకు నాన్న జవాబు వ్రాశాడని!

చివరకు ఎలాగో ఒప్పుకున్నారు మామగారు పెండ్లప్పుడు ఎకరం భూమి చదివించామన్నాడు. కాని, నాన్నకు లిఖితపూర్వకంగా ఏమీ లేకపోవడ చిర్రెత్తిపోయి, అది సమయం కాదని మాత్రం ఊరుకున్నాడు.

కాని తరువాత ఎకరం భూమి వ్రాసివ్వలేదని సాధించడం మొదలు పెట్టాడు. దీనికితోడు మామగారి సంసారం బావమరదుల చదువులతో చితికిపోవడంవల్ల, జానకికి ఇస్తామన్న భూమికూడా అమ్ముకోవలసి వచ్చింది. దీంతో నాన్న రెచ్చిపోయాడు. కంకటివరం వెళ్ళి నానా గోలచేసి అనరాని మాటలన్నాట్ట! దాంతో బావమరదులకు కోపం రావడం, ఇంట్లోంచి వెళ్ళమనడం వరకు వెళ్లింది.

ఈ గొడవలమధ్య నలిగినవాళ్ళం నేనూ, జానకి! ఎకరం పొలం ఇవ్వందే జానకిని ఇంట్లోకి తీసుకురావడానికిససేమిరా వీల్లేదని నాన్న కూర్చున్నాడు. ఇందుకు భిన్నంగా నడిచానంటే, తన ఆస్తిలో చిల్లిగవ్వరాదని బెదిరించారు. నేను అసహాయుణ్ణయిపొయ్యాను.

కాని... కాలం కలసివచ్చింది. బావమరుదులు ఉద్యోగాలకు వచ్చి నిలదొక్కుకున్నారు. రెండేండ్లలో ఎకరం పొలం కొని జానకిపేర కాక, నా పేరనే పెట్టారు.

నాన్న కోపం తీరింది!

కాని ఎంత మధురమయిన కాలం వ్యర్థమయిందో వెనుదిరిగి చూస్తే భయమేస్తుంది. జానకి మళ్ళా నాదయింది. నా దగ్గరకు తెచ్చుకోవడానికై వెళుతున్నాను. జానకిని చూసి రెండేండ్లు పైబడింది. ఎలా ఉంటుందో ఇప్పుడు! తన పుట్టినరోజు పండుగకు నేనే 'వెలలేని నగ'ట! తనకు... నగ!... అలతిగా నవ్వుకుని రాళ్ళ నెక్‌లేస్‌లో మెరిసిపొయ్యే జానకిని ఊహించుకుని గుటకలు మింగుకుంటున్నాను...

ఇంతలో ఏదో స్టేషన్ వచ్చిన జాడ తెలియడంతో మనలోకంలో పడ్డాను చీకటిని చీల్చుకుంటూ...

''ఆc, కమలాపురం రోడ్.. మలా పు..రం..రో...డ్..!'' అంటూ 'చే దివిటీ'ని పట్టుకుని పోర్టర్ కాబోలు హెచ్చరిస్తునా డు. హడావిడిగా సామాన్లు సర్దుకుని బండి దిగాను.

బండికి గంట కొట్టారు! బయలుదేరింది. వెనకాల ఉండే 'రెడ్‌లైట్

కనిపించేంతవరకూ అలా ఉండిపొయ్యాను అనాలోచితంగా.

వానజల్లులు 'ఫెడేల్'మని మొహానికి కొట్టేంతరువాతగాని లోనికి బయలుదేరాను కాను. స్టేషన్‌లోనికి వెళ్ళాను. అంతా దాదాపు నిర్మానుష్యంగా ఉంది. నాకోసం ఎవరూ వచ్చిన జాడ కనిపించకపోవడంతో మనస్సులో ఎక్కడో కలుక్కుమంది. జీవచ్ఛవాల్లా ఒకరిద్దరు బెంచీలకింద ముడుచుకుని పడుక్కుని ఉన్నారు. నా కోసం ఎవరూ వచ్చి ఉండరని, 'నా జాబు అందిఉండదని' నిశ్చయం చేసుకున్నాను.

ముసురు కొంచెం జోరు చేసింది. ఈదురుగాలి హోరుమంటూ కొడుతోంది. ఎముకలు కొరికే చలి. ఎక్కడో కీచురాయి 'గురుగురు' మన్న శబ్దం వినా అంతటా నిశ్శబ్దం.

''హరి భగవంతుడా!'' అనుకుని స్టేషన్ మేష్టారు గదివేపు నడిచాను. మేష్టారు చుట్టముట్టించుకుని తాపీగా ధూమపానం చేస్తున్నాడు. చుట్ట అన్ని వేపులా కాలడానికి వలయాలుగా త్రిప్పుతున్నాడు.

''మేష్టారూ!'' జాలిగా పిలిచాను.

...........

''ఆఁ.... ఎవరూ?'' అంటూ బద్ధకంగా నావేపు చూశాడు.

''నేనో ప్రయాణీకుణ్ణి! కంకటివరం వెళ్ళాలని బయలుదేరాను. ఎనిమిదింటికి రావలసిన బండి పదిన్నరదాటడం వల్ల ఇబ్బందిలో పడ్డాను. మా వాళ్ళు ఎవరూ రాలేదు.. కాస్త ఈ రాత్రికి స్టేషన్‌లోకా , లేక మీ కభ్యంతరం లేకపోతే...'' అంటూ అర్థోక్తిలో అర్థించాను.

''ఏమిటీ... ఈ రాత్రికి ఇక్కడే ఉంటానంటారా''

''ఔనండి, దయచేసి...'' ఆదుర్దాగా అన్నాను, రెండు క్షణాలు గడిచాయి.

''ఏమండీ.... మిమ్మల్నే.... నాకు నిద్ర పట్టడం లేదు. బండి వెళ్ళిపోయిందిగా...'' అంటూ ఓ యువతి గదిలోకి వస్తూ, ఛట్టున నన్ను చూసి

ఆగిపోయింది. నల్లని చీర, తెల్లని వర్ణం.. నిశి కాంతలా ఉంది!

''ఆс! ఏమన్నారు! అబ్బే, మీరిక్కడ ఉండడం ఏ మాత్రం క్షేమకరం కాదండి, దొంగలు రాక్షసుల్లా తిరుగుతున్నారు. ఈ స్టేషన్ చూడండి. విసిరిపారేసినట్లు ఎలా ఉందో! మేమంటే విధిలేక ఉంటున్నాం, ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకుని...'' అంటూ లేచాడు.

''దొంగలా మేష్టారూ?'' కడుపులో ఏ ప్రేవో కలుక్కుమంది

ఔను మిష్టర్, కమలాపురానికి ఎంతలో చేర్తావ్? నీలాంటి వాడికి ఓ అరగంట ప్రయాణం. వెళ్ళు'' ఏదో హుకుం జారీ చేస్తున్నట్లుగా కూడా మాట్లాడాడు.

మేష్టారికి ఈ యువతి ద్వితీయం అయిఉంటుందని, ఆయన వణుకుతున్న 'కంఠం' చెప్పలేకపోలేదు.

హతాశుణ్ణయ్యాను. కనీసం ఓ కూలివాడు కూడా దొరికాడు కాదు. బెడ్డింగు చంకన వేసుకుని రోడ్డు వెంట పడ్డాను. అసలే 'కచ్చా' రోడ్డు. ఎడతెరిపిలేకుండా పట్టిన ముసురుకు గుంటలూ, గతుకులూ పడ్డాయి. నాలుగు గజాలు నడిచేటప్పటికి చెయ్యిలాగడం మొదలెట్టింది. విధిలేక బెడ్డింగు నెత్తిన పెట్టుకుని చేతి సంచీ చంకకు తగిలించుకోవలసి వచ్చింది.

ఓ మైలు దూరం నడిచి ఉంటాను. బెడ్డింగుతో సహా పూర్తిగా తడిచి ముద్దయి పొయ్యాను. లోపల నుంచి వణుకు పుట్టుకు వచ్చింది. గడగడలాడిపోతున్నాను. వళ్ళు వేడెక్కింది. జ్వరం వచ్చినట్లయింది.

మరి... కాలు కదపలేక పొయ్యాను. ''ఏవిటి, ఈ రాత్రి ఇక్కడే ఆ..ఖ..రై..'' బెంబేలు పడిపొయ్యాను. ఇంతలో కాస్త దూరంలో ఏదో ఆశాజ్యోతి కనిపించింది.. మంట.. ఏమిటి చెప్మా అది? ఏదో వెర్రి ఆశతో ఆవేపు నడిచాను. ఎత్తైన రెండు గోరీలు! గోరీల మధ్యగా మంట!

ఉత్సాహంతో ఆ వేపుకు వెళ్ళాను. కాని.. దిగ్భ్రాంతి పడిపొయ్యాను. అక్కడక్కడా ఏవో పుర్రెలు, బొమికలూ కనిపించాయి.

ఎదురుగా ఓ గోరీ కనిపించింది.

''అక్షయ నామ సం॥ర మాఘ శుద్ధ విదియా ఆదివారం అనాధ మరణం చెందిన పేద బ్రాహ్మణుని జ్ఞాపకార్థం కమలాపురం గ్రామస్థులు కట్టించినది. ఈ యేడు అతివృష్టి, శీతుబాధలవల్ల కమలాపురంలో మరణించినవారు డెబ్బదిమంది.'' అంటూ అస్పష్టమయిన వ్రాత కనిపించింది.

ఉలిక్కిపడ్డాను. వణుకు జాస్తయింది. మంటకు దగ్గరగా జరిగాను. చలిగాచుకున్నాను.

ఒకరి దేహం మంటలో బుగ్గయి, బూదయిపోతూ ఉంటే, మరొకరు ఆ దేహ బాధోపశమనానికే మంట ముందు కూర్చున్నారు. వికలమయిన నవ్వు పుట్టుకవచ్చింది.

కాని మరో రెండు నిమిషాల్లో ఆ మంట హోరుగాలికి ఒక్కసారి విజృంభించి, వానజల్లుకు తడిసి, ఆరిపోయింది.

అంతా చీకటిమయమయి పోయింది. ఏవో క్షుద్రభూతాలు అరుస్తూన్నట్లున్నాయి. ఇంక అక్కడ క్షణం ఉండలేకపోయాను. కమలాపురం దగ్గరలో ఉన్నట్లు గమనించగలిగాను. బెడ్డింగు నెత్తిన వేసుకుని బయలుదేరాను.

కమలాపురం చేరుకునేటప్పటికి సగం రాత్రి గడిచిపోయినట్లు, ఎక్కడో 'గజలక్ష్మి' ఉన్నమేడలో, గడియారం కొడుతూంటే తెలుసుకున్నాను. ఆ రాత్రి అక్కడే గడపాలనుకున్నాను. కాని ఎక్కడగడిపేటట్లు? ఈ అర్ధరాత్రి. ఈ అవతారంలో ఎవరింటికి వెళ్ళేట్లు?

ఊరిచివరిదాకా వెళ్ళాను. ఎక్కడ నిలిచేట్టు? పంచాయితీ వాళ్ళ గ్రుడ్డిదీపపుకాంతిలో, నిశితంగా చూశాను. దూరాన ఏదో పాడుపఇల్లుకాబోలు కనపడుతోంది. అటుకేసి వెళ్ళాను.

కాళ్ళు కుప్పలు పడుతున్నాయి. వళ్ళు స్మారకం తప్పేట్టు ఉన్నది. గోడమూలాగా చేరాను. కాని ఎక్కడ స్పృశించినా చల్లగా తగుల్తోంది. నా వంటిలోని వేడిమికి అది నరక బాధగా ఉంది. బెడ్డింగు తీసి అవతల గిరవాటు వేశాను.

నిస్త్రాణతో వంట్లోని వణుకు మరీ జాస్తయింది. ఓ ప్రక్క కండ్లు మూతలు పడుతున్నాయి. కాని నిద్రపట్టదు. అలాగే ఓ మూల ముడుచుకుని పడుకుని ఉన్నాను. 'ఏదయినా వెచ్చగా నావంటికి తగిలితే ఎంత బావుణ్ణు!' అన్న కోరిక పుట్టుకొచ్చింది. కాని ఏముంది కనక? ఇంతలో ఓ ఆకారం నా వేపు వస్తున్నట్లు గమనించగలిగాను. చీకటిలో ఏమయిందీ తెలియలేదు. కాని భయంపుట్టుకవచ్చింది. దొంగకాదుకదా? చేతిసంచీ దగ్గరగా లాక్కున్నాను - అప్రయత్నంగా. కాని ఆ ఆకారం నాకు దగ్గరగా వచ్చి పడుకుంది. ఏమిటా అని పరికించి చూశాను. వెంటనే పూచికముండ్లులాగా ముక్కుకు తగిలింది. నిద్రలో! గ్రుడ్లు మిటుకరించి చూశాను.

కుక్క!...

నల్లకుక్క!....

వ  గగుర్పొడిచింది. కాని... ఏమిటి చెప్మా?... వణుకు తగ్గింది. నా ప్రక్కన ఓ వెచ్చని కుంపటి పెట్టినట్లయింది. నన్ను ఓ వెచ్చని మందనంలో పెట్టినట్లయింది. కుక్కను వెళ్లగొడదామనుకున్నాను. కాని నోరు పెగలలేదు. చేయి రాలేదు.

కుక్క మరీ దగ్గరగా జరిగింది.

నేనూ దగ్గరగా జరిగాను.

దూరాన 'తళుక్' అని ఒక్క మెరుపు మెరిసింది.

అప్రయత్నంగా కుక్క ప్రక్కలోకి జరిగాను. కుక్కపిల్లలా!

నా వ్యక్తిత్వం, అంతస్తూ, రాగద్వేషాలు ఛిన్నాభిన్నమయ్యాయి. ప్రకృతి శక్తిపట్ల ఓ చిన్న కీలుబొమ్మ నయ్యాను. మనస్సు క్షోభించి ఆలోచించడం మొదలెట్టింది. కాని ఆలోచించలేకపొయ్యాను. ఎప్పుడు నిద్రపట్టిందో తెలియదు.

నేను కంకటివరం చేరుకున్నాను. ఊళ్లోకి వెళ్ళీ వెళ్లకమునుపే 'సుబ్బయ్యగారి అల్లుడొస్తున్నాడు. సుబ్బయ్యగారి అల్లుడొస్తున్నాడు' అని

ఊళ్లోవాళ్ళంతా గుసగుసలు పొయ్యారు. బాగా పరిచయం ఉన్నవాళ్ళు ఒకరిద్దరు పలుకరించి 'యోగక్షేమాలు' అడిగారు.

అత్తమామల ఆనందానికి మేరలేదు! 'బావ, బావొచ్చాడు' అంటూ మరదలు రత్నం వొళ్ళో వాలిపోయింది. కాళ్ళు కడుక్కోను నీళ్ళు ఇస్తూ మధురంగా చూసింది జానకి. ఆ కండ్లలో కృతజ్ఞతా భావం ప్లావితమయి ఉంది.

''ఏవఁబ్బాయి, ఒక్క ఉత్తరం ముక్క రాసి మరీ రాకూడదూ? స్టేషన్‌కు పోలాయినీ, బండినీ పంపించేవాళ్ళం'' అన్నారు మామగారు. నాకు కించిత్తు ఆశ్చర్యం కలిగింది.

''మీకు జాబు వ్రాశానండి ఇవ్వాళ వస్తున్నానని? దాదాపు అయిదు రోజులయింది. చేరలేదా ఏం?'' అన్నాను.

''లేదే! అయినా ఈ పోస్టువాళ్ళసంగతి అడుగుతా! ఎక్కడికయినా జాబు చేరాలంటే కనీసం ఓ మండలం ముందుగానయినా వ్రాసి పోస్టుచేసుకోవాలి. అందులో ఈ ఊరి పోస్టాఫీసు సంగతి అడుగుతా! పోస్టుమేష్టరుకూడా రామానాయుడి పార్టీలో చేరిపొయ్యాడు'' అని మామగారు అంటూ ఉంటే నాకు నవ్వాగిందికాదు.

'ఇవన్నీ ఎప్పుడుండేవేగా! తీరిగ్గా చెబుదురుగాని. అల్లుణ్ణి వెళ్ళి బడలిక తీర్చుకోనివ్వండి. అమ్మాయ్ జానకీ, మీ ఆయనకు తలంటి అవీచూడా నీవువెళ్ళి'' అంటూ పురమాయించింది అత్తగారు.

పవలంతా, 'దసరా' సరదాగా, గడిచి పోయింది. మహర్నవమి పద్యాలు పిల్లలు చదువుతూ ఉంటే చిన్నప్పటి రోజులు స్మృతికి వచ్చాయి...

''అయ్యో, గోలకొండ పిచ్చాయీ,

ఆ నగరికి బిర బిర పోయీ,

ఆ పెట్టెకు తాళం తీసి...

ఆ పెట్టెలో గంధంతీసి

అయ్యవార్లకూ పూసి...''

ఏమిటో తెలిసీ తెలియని భాషలో ఆనందంగా వర్ణించుక వెళ్ళేరోజులు!...

రాత్రి, మస్తుగా ముస్తాబై వచ్చింది జానకి. ఎన్నాళ్ళకు, తిరిగి ఈ కలయిక! హృదయం ఉప్పొంగింది. ఇన్నాళ్ళుదాచుకున్న ప్రేమకాన్క ఎలా ఇవ్వాలి? అన్న ఆలోచనలు పట్టుకున్నాయి నన్ను.

'జానకీ'!.... గోముగా అన్నాను దగ్గరకు తీసుకుంటూ.

''ఆఁ!'' అంది ఆప్యాయంగా.

'రేపేగా నీ పుట్టినరోజు పండుగ! నీకు బహుమానంగా ఏంతెచ్చానో తెలుసా?''

''ఏమీ తీసుకరారు. నిజంగా నా మాటమీద విలువ ఉన్నవారయితే!''

''నేను తీసుకరాలేదు. ఎవరో ఇచ్చారు షాపులోకి వెడితే!...''

''ఊఁ...'' అంది చిలిపిగా.

''ఇలా చూడు'' అంటూ జానకి ముఖాన్ని నా రెండు చేతుల్లోకి తీసుకున్నాను.

''ఏమండీ...!'' అంటూ నా హృదయంపై వాలిపోయింది జానకి.

జేబులోంచి 'బాక్స్ తీశాను. జానకి భావోద్వేగంలోంచి తేరుకునేలోగానే ఆమె మెడకు నెక్‌లేస్ తగిలించాను.

''జానకీ! ఇప్పుడు నీవెంత అందంగా ఉన్నావో?''

''ఏమిటో, ఇవాళ అంత ఇదిగా ఉన్నానా'' అంది జానకి.

''ఉన్నావో లేవో అద్దంలోవెళ్ళి చూసుకో'' అన్నాను.

జానకి వెళ్ళి అద్దంలో చూసుకుంది. ఆమె మెడ తళతళ లాడిపోతుంది.

'ఏవండి'.... మీరెంత మంచివారండీ? అంటూ నన్ను కౌగలించుకుంది.

నేను నిరుత్తరుణ్ణయ్యాను జానకివేపు చూస్తూ.

''ఇన్నాళ్ళుబట్టీ ఈ ప్రేమంతా ఎక్కడ దాచుకున్నారండీ!'' అంది.

''ఏమో!....''

''తెలియదా?''

''ఊహూఁ!''

''ఎక్కడో చెప్పనా?'' నాజుట్టులోకి చేయి పోనిస్తూ అంది.

''ఊ!...''

''ఇక్కడా!''

''అబ్బా!'' అంటూ అప్రయత్నంగా బాధనభినయించాను. నాక్రింది పెదవి కందిపోయింది.

దూరంగా వెళ్ళి చిలిపిగా చూస్తోంది జానకి. దగ్గరగా వెళ్ళి ఆమెను రెండు బాహువుల్లోకి తీసుకున్నాను.

రేయి మించింది. వళ్ళు శ్రమించింది. నిద్రా వివశులం కాబోతున్నాం. ఇంతలోనే ఏదో దగ్గరగా వస్తోంది.

భయకంపితుణ్ణయ్యాను. అది మానవ కళేబరం! మీద మీదకు వస్తోంది. వచ్చింది, గట్టిగా జానకిని కౌగలించుకున్నాను. ఆ కళేబరానికి ప్రక్కగా ఓ ఎలుక వస్తోంది. ఇంతింతై పెద్దదై పోతోంది. మరీ పెద్దదయి పోతోంది!

ఉన్నట్టుండి జానకి మెడలోని 'నెక్‌లేస్' నోటకరచుకుని ఎలుక ఉడాయించింది. మానవ కళేబరం మాపైని పడబోతోంది.

''జానకీ!'' అంటూ జానకిని ఒడిసి పట్టుకున్నాను.

జానకి బావురుమంది. ఆశబ్దంతో అత్యాశ్చర్యకరంగా మానవ కళేబరం వెనక్కు తిరిగి అంతర్థానమయింది. నేను ఉలి పడ్డాను. వీపున ఎవరో చరచినట్లయింది.

దభీమని మెలకువ వచ్చింది. మెలకువ వచ్చి చూసుకునేప్పటికి నేను గట్టిగా కౌగిలించుకుంది నల్లకుక్కను.

నేను ఈ విపరీత పరిస్థితినుంచి తేరుకునేలోగానే భౌవ్వుమంటూకుక్క దూసుకుని ఎవరిమీదనో పడింది. ఆ ఆకారం పరుగుచ్చుకుంది. కుక్కకూడా

వెంటపడ్డది. కొన్ని క్షణాలు గడిచాయి.

''బాబో!...'' అంటూ పొలికేక వినవచ్చింది.

అంతే! కుక్క మళ్ళీ తిరుగుముఖం పట్టింది. నేను వణికిపోతూ, శబ్దం వచ్చిన వేపే వెళ్ళాను. అల్లంత దూరంలో తళతళా మెరుస్తోంది ఓ వస్తువు!

దగ్గరగా వెళ్ళి చూశాను.

''నెక్లేస్!...''

కండ్లు జిగేల్మన్నాయ్! ఏమిటి? జానకి మెడలో పెట్టిన 'నెక్లేస్' ఇక్కడి కెలా వచ్చింది? కండ్లు నలుముకున్నాను. తల తడుముకున్నాను. పీడకల నుంచి బయటపడ్డాను.

ఇంకా చీకటి మిగిలి ఉంది!

'కంకటివరం' మూడుమైళ్ళ దూరానే ఉంది.

'నెక్లేస్' తీసుకుని గోడమూలకు వెళ్ళాను. నల్లకుక్క గోముగా నావద్దకు వచ్చింది రోజుతూ, రొప్పుతూ. అప్రయత్నంగా దాన్ని దగ్గరకు తీసుకున్నాను.

అది నావొళ్ళో వాలిపోయింది. దాన్ని నిమిరాను. లాలనగా. కాని అది అటూ ఇటూ పొర్లుతూ, రొప్పుతూ, రోజుతూన్నది.

తెలతెలవారుతోంది, నీళ్ళకావిళ్ళు ఒకటి రెండూ. చెరువువేపు వెడుతూన్నాయి. నా వొళ్ళో పడుకున్న కుక్కను అవతలకు తీద్దామని ప్రయత్నించాను.

కుక్కను అదిల్చాను.

లేవలేదు!

మళ్ళా అదిల్చాను.

మళ్ళా లేవలేదు.

బలవంతంగా ఎత్తాను. అంతే! శవంలా కుప్పకూలిపోయింది. పరికించి చూశాను గ్రుడ్లు తేలబడి ఉన్నాయి! నోట ఏదో నురుగుకారుతోంది!

ఏమిటో అర్థం కాలేదు, నా వస్తువులు అన్నీ సర్దుకున్నాను, అన్నీ

ఉన్నాయి. విలవైన 'నెక్‌లేస్' ఉంది. కాని, ఎంతవెతికినా అగుపడంది ఒక్కటే!...

''ఎలుకలమందు!...''

గుండె గతుక్కుమన్నది. గొంతుకలో ఏదో అడ్డం పడ్డట్లయింది. మసక చీకట్లో నల్లకుక్క కళేబరం అగుపించింది. నీరసంగా లేచాను. దగ్గరకు వెళ్ళాను. మోకరిల్లాను. అప్రయత్నంగా, దైవప్రేరణలా, నా అశ్రుబిందువులు ఆ విగత ప్రాణికి తర్పణం విడిచాను.

''ఎదమెత్త నౌటకై సొదకుందరా!'' అని కవివాక్యాలు స్మృతికి వచ్చిన న్ను పునీతుని చేశాయి.

తెల్లవారింది; ముసురు వెలిసింది; బయలుదేరాను. కాని... .

నా మనసులోని ముసురు అలాగే ఉండిపోయింది.

***

# కాత్యాయని

రచన :

కోడూరి కౌసల్యాదేవి

''నిన్ను కోరి కోడల్ని చేసుకొన్న వాళ్ళకు చెయ్యి సేవలన్నీ. నా గదిలోకి రావద్దనెన్నిసార్లు చెప్పాను? ఎందుకు నా పుస్తకాలన్నీ అలా కెలుకుతావు?'' బాణాల వంటి ఆ మాటలకు వులిక్కిపడి వెనుదిరిగి చూచింది కాత్యాయని.

తీక్షణంగా మింగేసేట్టు చూస్తూన్న శ్రీనివాసరావు ముఖంలోకి చూడలేక తలవాల్చి మెల్లగా సమాధానమిచ్చింది - ''మీకు టైమవుతూంది. పుస్తకాలు తీద్దామని''.

''అఁ...అఁ ఉద్ధరిస్తావు, అల్మరాలో వున్నవన్నీ నెత్తినెట్టుకెళ్ళ మంటావా? పల్లెటూరి మొహం- టైం టేబుల్ తియ్యడం కూడానూ నీ బ్రతుక్కీ''. ఆ చీకాకులో పుస్తకాలన్నీ అటూ ఇటూ గిరవాటెయ్యడం మొదలెట్టాడు. ఏం చేయాలో, ఏం మాట్లాడాలో తెలియక వస్తూన్న దుఃఖం ఆపుకుంటూ నిల్చుంది కాత్యాయని.

''ఏం జేస్తున్నావే కాత్యాయనీ?'' అత్తగారి కేక విని కళ్ళు తుడుచు కుంటూ గబగబ బయట కెళ్ళింది.

''పిల్చారా అత్తయ్యా?'' అత్తగారి దగ్గర నిల్చుని మెల్లగా అడిగింది.

''అబ్బే, ఎందుకు పిలుస్తాను? హాయిగా రాత్రనక, పగలనక గదిలోదూరి కూర్చోమంటాను. సిగ్గులేక ఇంకా నిల్చుని అడుగుతున్నావా? వాడికి కాలేజీ టైమైంది; వెళ్ళనివ్వకూడదూ? ఇలా అయితే వాడి చదువు సాగినట్టే, పల్లెటూరి

మోహినివి, నీకు చదువు సంగంతేం తెల్సులే. వాడు చదివేది ఎమ్మే, విన్నావా? సరేగాని ఆ పద్మకీ, రవణకీ స్కూలు టైమైంది. అన్నాలు పెట్టు.''

''కాలేజీకి వెళ్తున్నారు. ఏం కావాలో కనుక్కొందామనే వెళ్లాను. ఇంతవరకూ ఇక్కడ పని చేస్తూనే వున్నానుగా అత్తయ్యా?'' చాలా మెల్లగా అంది కాత్యాయని. దానితో రుక్మిణమ్మ కోపం రెచ్చిపోయింది.

''ఓయమ్మ.... ఎదురు సమాధానాలు కూడా వచ్చునటే నీకు చిలక తల్లీ...! ఇంకా యేమో పల్లెటూరి దానవనుకున్నాను. చూడు, నువ్వు గొప్పింటి పిల్లవే కావచ్చు. నీ అమ్మకు ఒక్కగానొక్క కూతురివై గారాబంగా పెరిగితే పెరగొచ్చు. నాకు మాత్రం కోడలివే. ఇక్కడేం పదిమంది నౌఖర్లు లేరు. వచ్చినట్టు అన్ని పనులూ చేయాల్సిందే. ఈనాటికీ భర్తేమిటి? పిల్లలేమిటి? ఒక్కళ్లు నన్నెదిరించి ఎరుగరు. ఇన్నాళ్ళకు నువ్వు బయల్దేరావన్న మాట! నీ ఆటలేం ఇక్కడ సాగవు. దాసీ దాని కెంత విలువో, నీకు అంతే విలువ తెల్సా''

అవి మాటలో, తూటాలో; ఎదుటనున్నది మనిషో, రాక్షసో, అసలంతంత మాటలనడానికి కారణమేమిటో తెలియక ఆశ్చర్యంతో అవమానంతో కృంగిపోయింది కాత్యాయని.

''అమ్మతో వాదులాడ్తూ కూర్చోవడమేనా, నాకేమైనా కాస్త అన్నం పెట్టే దుందా వదినా?, వెళ్ళిపొమ్మంటావా?'' అధికారంగా అడిగింది ఆడబిడ్డ పద్మ.

''కూర్చోమ్మా పెడ్తాను'' కన్నీళ్ళు తుడుచుకుని వడ్డన కుపక్రమించింది.

''దరిద్రపుగొట్టు ముఖమా, ఏమంత ఆపదవచ్చిందని ఆ యేడుపు? ఏడుస్తూ నా పిల్లల కన్నం పెట్టక్కర్లేదు. వెళ్ళి దొడ్లో చెంబులున్నాయి తోమి తీసుకురా''. అని ఆజ్ఞాపించింది రుక్మిణమ్మ.

కుళాయి దగ్గర చెంబులు తోముతున్న కాత్యాయని - మామగారు అటు ప్రక్కగా రావడంతో లేచి నిల్చుంది.

''నిన్న సాయంకాలం వచ్చావో లేదో, అప్పుడే ఎందుకమ్మా నీ పనులన్నీ? అయినా పనిమనిషేమైంది?'' ప్రేమగా అడిగాడు ఉమాపతి.

ఇంతలో ఎటునుంచి వచ్చిందో రుక్మిణమ్మ అందుకుంది - ''పనిమనిషి మానేసిందిగానీ, మీ ముద్దులకోడలేమీ అలసిపోవటం లేదు. వెళ్ళి భోజనం చెయ్యండి, వడ్డించాను. అయినా మీకెందుకు ఇంట్లో ఆడవాళ్ళ గొడవలు?''.

మారు మాట్లాడకుంటా వెళ్ళిపోయాడు ఉమాపతి అక్కడి నుండి.

''అయితేను మామగారి ఎదుట అలా గెడకఱ్ఱలా నిల్చుంటావేమే? మామగార్లకూ, బావగార్లకూ కన్పించటం మా ఇంటా వంటా లేదు''.

''వారి రాకను నేను గమనించలేదండీ. అయినా తండ్రిగారెంతో, మామగారంత కాదా?'' అమాయకంగా ప్రశ్నించింది కాత్యాయని.

''ఆ ఎదురు సమాధానాలే వద్దన్నాను. చెప్పినట్టు విని చచ్చినట్టుండు..... ఎంత సేపు తోముతావు ఆ నాలుగు చెంబులు? త్వరగారా, వంటింట్లో ఎంగిళ్ళెత్తి కంచాలు కడగాలి''. రుసరుసలాడ్తూ వెళ్ళిపోయింది. రుక్మిణి, మౌనంగా ఆమెననుసరించింది కాత్యాయని.

అందరి భోజనాలు అయిన తర్వాత, పనంతా చేయించుకుని అప్పుడు ముక్కుబడిగ కాత్యాయానికి భోజనం వడ్డించింది అత్తగారు, ఆ క్రితం దినమే అయింటికి క్రొత్తగా రావడం, భర్త అనాదరణ, అత్తగారి అదలింపులు. క్రొత్తగా చవిచూస్తూన్న కాత్యాయని - మింగేసేట్టు చూస్తూ నిల్చున్న అత్తగారి ఎదుటసరిగా భోజనం చేయలేకపోయింది. తినీ తినకుండా లేచిపోయింది. అందుకై రుక్మిణమ్మ కేమీ జాలి, దయ కలుగలేదు, ముఖ్యమైన గదులు తాళం వేసుకుని కోడలికి 'ఇల్లు జాగ్రత్త' అని చెప్పి పొరుగిళ్ళకు పెత్తనాలకు వెళ్ళిపోయింది.

తన ముఖమైనా చూడని భర్త; బండెడు చాకిరీ నెత్తినెట్టి, నిష్కారణంగా దూషించే అత్తగారు; అధికారం చెలాయించే ఆడపడుచులు - వచ్చిన మర్నాడే ఈ విధంగా వుంటే ఇహ ముందు ముందెలా వుంటుందో తన మనుగడ ఈ ఇంట్లో? సినిమాలో గయ్యాళి అత్తగార్లను చూచి హాయిగా నవ్వేది. మళ్ళీ మళ్ళీ చూచి వినోదించేది- కాని అత్తగారు, కాపురం అంటే తెలియని రోజులవి. సినిమాను మించి పోయింది. ఆలోచించుతూన్న కాత్యాయని సైకిల్ బెల్ విని

తలెత్తి చూచింది. శ్రీనివాసరావు కాలేజీ నుంచి వచ్చాడు. సగం సంతోషంతో, సగం బెదురుతో లేచి వెళ్ళి, కాఫీ ఫలహారాలు ఇచ్చింది అతడు వాటిని కన్నెత్తైనా చూడకుండా ఇల్లు, దొడ్డి కలియ వెతికాడు. బాధతో, అవమానంతో తలవాల్చి నిల్చుంది కాత్యాయని. అప్పుడే స్కూలు నుంచి చూసి వచ్చిన రమణను ''అమ్మ స్కూలు ఎక్కడుందో చూసి తీరుకురావే,'' అని ఫర్మాయించాడు శ్రీనివాసరావు.

రుక్మిణమ్మ వచ్చి కొడుకునూ కోడల్నీ పరిశీలనగా చూచింది భార్యాభర్తలిరువురి మధ్యా సఖ్యత, అన్యోన్యత లోపించాయని క్షణంలో గ్రహించేసింది. ఇంకేం, తన అధికారానికి అసలే తిరుగులేదన్నమాట.

''అయితే మొగుడికి కాస్త కాఫీ ఇచ్చుకోవడం, అన్నం పెట్టుకోవడం కూడా చేతకాదన్నమాట. ఇంకెందుకే, నా మీద సవారీ చేయడానికా?'' బుగ్గలు నొక్కుకుంటూ అడిగింది రుక్మిణమ్మ కోడల్ని. ఆమె మౌనంగా ఆ గది నుంచి ని ్క్రమించింది.

''నాకొద్దు మొర్రో అన్నాడమ్మా బిడ్డ. నేనే కట్టబెట్టాను ఈ మొద్దుని'' దీర్ఘం తీసింది.

ఆ మర్నాడుదయం ఏదో పనుండి దొడ్లోకి వస్తూన్న కాత్యాయని ఏవో గుసగుసలు విని ఆగిపోయింది.

''అయితేను ఇంకా లేవలేదటో రుక్మిణీ క్రొత్త కోడలు?'' గుసగుస లాడ్తూ అడుగుతూంది ప్రక్కింటి వెంకాయమ్మ.

''హుం ఏం చెప్పనమ్మా? వాడు చదువుకున్నది కావాలో అని గోలెట్టినా వినకుండా దీన్ని కట్టబెట్టాను. చదువుకున్నదైతే ఏ పనీ చేతకాదు; తొమ్మిది గంటలకు నిద్ర లేస్తుంది ; దానికెదురు మనమే చెయ్యాలి. ఇలాటి పల్లెటూరి మొద్దైతే నోరు మూసుకుపడుంటుంది ; తిట్టినా కొట్టినా అనుకున్నాను ఖర్మ. ఒక్కపని చేతకాదు....! దున్నపోతులాగా పెరిగిందేమోమరి. చూశావా ఇంకా నిద్ర లేవలేదు'' అది రుక్మిణమ్మ సమాధానం.

''పనెందుకులేవమ్మా.... చక్కగా యాభైనేలు కట్నం తెచ్చిపోసింది.

మాకొడలూ వుండెందుకు?- బోడి బొమ్మలా వచ్చి నుంచుంటుంది. అయినా బాగా అదుపులో పెట్టు. ఇంకా నిద్ర లేవకపోతే ఎలాగ?.... అది సరేకాని ఇంట్లో బియ్యం నిండుకున్నాయి, ఒక్క రెండుశేర్లు ఇస్తావేమిటి? ఓ అర్ధరూపా యిస్తాను''.

''దానికేం పట్టుకెళ్ళు. త్వరగా కానియ్యి. ఎవరైనా చూస్తారేమో''.

''ఏమిటా మూట వెంకాయమ్మగారూ?'' కంచుగంటవంటి కాత్యాయని కంఠం వింటూనే ఒడిలో మూటకడ్తూన్న బియ్యం జారవిడిచింది వెంకాయమ్మ. రుక్మిణమ్మ కొంగు నుంచి అర్ధ రూపాయి నేలజారి ఖంగుమంది.

''ఏమిటండీ వెంకాయమ్మగారూ మీరు చేసే పని. అత్తగారికీ కోడలికీ మధ్య తంపులెట్టి మీ బాగు మీరు చూచుకొంటున్నారన్న మాట? వెళ్లండి. ఇంకెప్పుడైనా ఈ గడప ద్రొక్కారా - మర్యాద దక్కదు. మీ డబ్బులు మీరు పట్టుకుపోండి. ఊఁ, కదలరేం?'' ఉరిమింది కాత్యాయని.

అర్ధరూపాయి తీసికొని పిల్లిలా వెళ్ళిపోయింది వెంకాయమ్మ. అత్తగారివైపు తిరిగి తేరిపార చూచింది కాత్యాయని.

''నీకెన్ని గుండెలే, ఈ ఇంట్లో కాపురంచేసే ఆశ లేదా నీకు? నా ఇంట్లో నన్నే అధికారం చేస్తావా?'' అరిచింది రుక్మిణమ్మ.

''అందరికీ భగవంతుడెన్ని గుండెలిచ్చాడో నాకూ అంతే. కాని అత్తగారూ, మీరు చేస్తూన్న పనేమిటో ఒక్కసారి తెలివిగా ఆలోచించి చూడండి. నేను తెల్లవారక ముందే నాల్గు గంటలకు లేచి స్నానం, పూజ ముగించుకున్నాను. కాఫీ టిఫెన్ చేసి వుంచాను; వంట ప్రయత్నంలో వున్నాను. మీరి ఇప్పుడు లేచి, పైగా కోడలింకా నిద్ర లేవలేదని పొరుగావిడతో చెప్తున్నారు. ఆవిడ స్వలాభం కోసం మరో నాల్గుపుల్లలు వేస్తోంది. ఇంటి గుట్టు పరులకు చెప్పుకోవడం మనకే హాని. అపకీర్తి రెండు మూడు రూపాయలు చేసే విలువైన బియ్యం ఒక అర్ధ రూపాయకు ఆవిడకు పోసేస్తున్నారు. ఇల్లు గుల్ల చేసే ఇటువంటి పనులెవరికి నష్టం? ఇంటికి దీపమైన ఇల్లాలే ఇల్లు గుల్ల చేయడమా?'' నిగ్గదీసి ధైర్యంగా అడిగింది కాత్యాయని అత్తగార్ని.

నిన్నగాక మొన్నవచ్చిన కోడలు తన దొంగతనం పట్టేయడం, పైగా సన్నసన్నగా చీవాట్లు తిన్పించడం చూస్తే రుక్మిణమ్మకు కోపం, వుడుకు పెత్తనం మిళితమైపోయి, నిప్పుత్రొక్కిన కోతిలాగైపోయింది. కడచిన రెండు రోజులూ నోరూ వాయి లేక బండచాకిరీ అంతా చేసి, తిట్టిన తిట్లన్నీ మూగగా సహించిన పిల్ల ఈ రోజు ఇంత ఖరోడా అయిపోయిందేమా అని ఒక ప్రక్క విపరీతమైన ఆశ్చర్యం కల్గుతోంది. దానితో అతి రహస్యం బట్ట బయలైపోతుందనే జ్ఞానం కూడా లేకుండా తోక త్రొక్కిన త్రాచులా లేచింది కోడలి పైకి.

''ఔరా! ఈనాటికి భర్త, పిల్లలు ఒకళ్లైనా నామాటెదిరించి ఎరగరే. నువ్వెంత దానవే నాకు నీతులు నేర్పడానికి? ఆరిపోయే ముందు దీపం నీలాగే ఎగిరెగిరి పడ్తుందట, నడు బయటకి నీ దిక్కున్న చోట చెప్పుకో. నా ఇంట్లో ఒక్క క్షణం వుండద్దు నడు.'' బయటకు దారి చూపిస్తూ కేకలు పెట్టింది రుక్మిణి.

తేలికగా, నిర్లక్ష్యంగా ఒక్క నవ్వు నవ్వింది కాత్యాయని. ''మీ తెలివి తక్కువను జాలివేస్తోందత్తయ్యా! రమ్మనే వరకే మీ ఇష్టం కాని, పొమ్మనడానికి మీరెవరు? ఒకనాడు మీరేవిధంగా కోడలై ఈ ఇంటికి వచ్చారో, నేనూ ఈనాడు అలాగే వచ్చాను. మీ తర్వాత ఈ ఇంటికి అధికారిణిని. కోడల్ని కూతురిలాగే చూచుకొని గౌరవమిచ్చి గౌరవం నిల్పుకోవాలి కాని ఇటువంటి పరిస్థితులు రానీయకూడదు. ఇంట్లో ఒకరు తప్పు త్రోవను నడుస్తుంటే దిద్దే అధికారం ఎవరికైనా వుంటుంది. పెద్దా చిన్నా బేధం, అధికారాలు మరచి మంచిని గ్రహించి, చెడు వదలి పెట్టడంలోనే వ్యక్తి గౌరవం. కుటుంబ గౌరవం నిలుస్తాయి. ఆ న మీ ఇష్టం. నాకు వంటింట్లో పనుంది'' అంటూ వెనుదిరిగి ఇంట్లోకి పోబోయిన కాత్యాయని చటుక్కున రెండడుగులు వెనక్కు వేసింది.

పెద్ద నోటితో ఏదో అరవబోయిన రుక్మిణమ్మ కూడా నోరు మూసేసి ప్రతిమాలా నిల్చుంది కారణం - భర్త ఉమాపతి గుమ్మం నిలువునా నిల్చుని చూస్తున్నాడు- ఎంతసేపై వచ్చాడో మరి! మామగారి ఎదుట గౌరవంగా తలవంచి ప్రక్కకు ఒదిగి నిల్చుంది కాత్యాయని.

''ఏమిటీ? ఇంకా తెల్లవారకుండానే ఈ గొడవంతా?'' భార్యను ప్రశ్నించాడు ఉమాపతి.

''ఏముంది? చిన్న చెంబులు తోముతుంటే కోడలు అలసిపోతోందని వగలు పోయారు మీరు. ఆ అలుసు చూచుకొని అది అప్పుడే నన్నే ధిక్కరిస్తోంది. నేను తిట్టినా మాట్లాడని మీరు కూడా ఈనాటికి నన్ను నిలదీసి అడుగుతున్నారా? అయ్యో భగవంతుడా, నా కొంపలో నాకె ఎన్ని తెచ్చిపెట్టావురా!'' ఆమె రౌద్రం, అహంకారం రూపాంతరం పొంది కన్నీళ్ళలో దర్శనమిచ్చాయి.

ఇటువంటి విపరీత ప్రవర్తనలు, శోకాలు ఎరుగని ఉన్నత సంస్కార కుటుంబం నుంచి వచ్చిన కాత్యాయని విస్తుపోతూ చూస్తోంది అత్తగార్ని.

''నోర్ముయ్, సిగ్గు చేటు'', అని భార్యను మందలించి, ''ఏం జరిగిందమ్మా కాత్యాయనీ? ఆ బియ్యం నువ్వు ఒలకపోశావా?'' అనడిగాడు ఉమాపతి.

ఒక్కసారి కళ్ళెత్తి మామగార్ని చూచి తిరిగి వాల్చేసింది కాత్యాయని. నిన్న మామగారి ఎదుట నిల్చున్నందుకే కోప్పడింది అత్తగారు. ఇప్పుడు మాట్లాడితే ఇంకేమంటుందో! సందేహిస్తూ, బెదుర్తూ, రుక్మిణమ్మను చూస్తూ నిల్చుంది.

''ఫర్వాలేదమ్మా, చెప్పు'' రెట్టించాడు ఉమాపతి.

ఈసారి కాత్యాయని ధైర్యంగా కళ్ళెత్తి చూచింది మామగార్ని.

''మీ అంతవారికి చెప్పేపాటిదానను కాను; కాని పరిస్థితి అటువంటిది - క్షమించండి-స్త్రీల చేతికి డబ్బు దొరకని నిరంకుశ సంసారాలన్నీ ఇలాగే అధోమార్గాన పడ్తాయి. కుటుంబ ఔన్నత్యం, హీనత నిమిత్తం లేదు దీనికి. మగవారు ఈ విషయాలు తెలిసి తెలివిగా ప్రవర్తించాలి. అంటూనే కాత్యాయని చకచకా అక్కడి నుంచి వెళ్ళిపోయింది.

నిర్ఘాంతపోయాడు ఉమాపతి.

''ఏమిటి? యాభైయేళ్ళు నెత్తికొచ్చిన తనను - ముప్పై యేళ్ళుగా

కాపు(రం చేస్తూన్న తనను - ఇరవై యేళ్లైనా నిండని కోడలు పిల్ల తెలివిగా సంసారం చెయ్యమని సలహా ఇవ్వడమా?'' కాత్యాయని వెళ్ళే దిక్కే చూస్తూండిపోయాడు ఉమాపతి.

రుక్మిణమ్మకు సందు దొరికింది- ''చూశారా ఎంత పొగరెక్కిపోయిందో. మిమ్మల్నే వెక్కిరిస్తోంది'' అంది రొప్పుతూ.

కోడల్ని కోప్పడదామని వెళ్తూన్న ఉమాపతి యేదో ఆలోచన రావడంతో ఠక్కున ఆగిపోయాడు. ''కోడలు చిన్నపిల్ల - నేను పెద్దవాణ్ణి, ఎందులో? బుద్ధిలోనా, వయస్సులోనా? ఇన్నాళ్ళుగా అనేకమంది నన్నూ, నా కుటుంబాన్ని నవ్వి హేళన చేస్తున్నారు. కారణం నాకు తెల్సు, కాని నివారణ? అది తేలియకే గదాయింతవరకూ వచ్చింది? కుటుం పరిస్థితి, కారణం, నివారణోపాయం- అన్నీ కలిసి ముక్తసరిగా, సౌమ్యంగా చెప్పింది. అదైనా నా బలవంతం పైన. తెలివైనదీ, కుటుంబ క్షేమంకోరినదీ గనుక ధైర్యంచేసి చెప్పింది. ఎవరిపైనా నిందారోపణలు లేకుండా యేవరిని పేరెత్తకుండా జనాంతికంగా మాట్లాడింది. ఆమెపై ఆగ్రహించడం అపరాధం.

పిన్నలనుండైనా సరే, మంచిని పెద్దలు సిగ్గుపడకుండా కరించిననాడే భూతలం స్వర్గతుల్యమౌతుంది. లాభనష్టాలు, పరు మర్యాదలు ఆలోచించకుండా ఇంట్లోని సరకులు భార్య ఆ విధంగా చాటుమాటున అమ్ముతోందంటే కారణం తానామె చేతికి డబ్బు దొరకనీయక పోవడమేగా? కుటుంబం అన్న తర్వాత అనేక ఖర్చులుంటాయి. పైకి కన్పించవు, ప్రతీదీ చెప్పాలంటే చెప్పేవారికీ కష్టమే. వినేవారికీ బాగుండదు. అంతటి గృహాన్ని దిద్దే బాధ్యత గల వ్యక్తికి, అందు నిమిత్తమయ్యే డబ్బుమీద కూడా కొంత స్వతంత్రం వుండాలి'' అనుకొంటూ వంట గదివైపు నడిచాడు ఉమాపతి.

వంటింట్లో పద్మా, రమణా కాత్యాయనిపై అధికారం చెలాయిస్తున్నారు.

''ఏం వదినా, మేం లేచి అరగంట పైగా అయింది. ఇంతవరకు కాఫీ నీళ్ళు లేవు మా ముఖాన'' అది రమణగొంతు.

''నేను కాఫీ, టిఫెన్‌లు తయారు చేసి పెట్టి మూడుగంటలు పైగా

అయింది. రావడం మీదే ఆలస్యం. కూర్చోండి ఇస్తాను'' మృదువుగా సమాధానం చెప్పి రెండు పీటలు వాల్చింది కాత్యాయని.

''ఓహో! అయితే వదినేది? వంటిల్లేది? అని వెతుక్కుంటూ రావలన్నమాట. మేం ఎంత దర్జా వచ్చింది నీకు? మా గద్దుల్లోకి తెచ్చివ్వాలి, తెల్సిందా?'' అధికారంగా పల్కింది రమణగొంతు.

చేస్తూన్న పని ఆపి లేచి నిల్చుంది కాత్యాయని వస్తూన్న కోపం ఆపుకొంటూ వీలైనంత సౌమ్యంగా మాట్లాడటానికి ప్రయత్నించింది.

''చూడండమ్మా, మీరు చిన్నపిల్లలు, మీకేం తెలియదు. మీరు పెరిగిన పరిస్థితులూ అలాటివే. ఇవాళ నేను ఈ ఇంటికి వచ్చినట్టే మరో రెండేళ్ళు పోయాక మీరు - పెళ్ళై భర్త ఇంటికి వెళ్తారు. అక్కడందరూ ఇలా మిమ్మల్ని అగౌరవం చేస్తే మీ కెట్లావుంటుంది? కూతుళ్ళూ, కోడళ్ళూ సఖ్యంగా, ప్రేమగా వుంటేనే కుటుంబం శాంతంగా నిలుస్తుంది. నన్ను మీరు గౌరవిస్తే, మీపై నాకు ప్రేమ పుడ్తుంది. అంతేకాని ఎందుకీ అక్కరమాలిన అధికారాలు? చదువుకుంటున్నారు- ఆ మాత్రం గౌరవంగా ప్రవర్తించడమే తెలియదా?''

వదిన చెప్పిన మంచి మాటలు చెవికెక్కక పోగా, వదిన తమ కెదురు తిరుగుతోందనే అక్కసు ఎక్కువైపోయింది వాళ్ళకి. దానితో పద్మ తారాజువ్వలా లేచింది.

''యేవఁమ్మోయ్, నువ్వు పెద్ద ఈనాందారు పాపారాయ్డుగారి యేకైక గారాబు పుత్రిక వైతే కావచ్చు కాని, మాకేం లెక్ఖలేదు. నువ్వు, అద్దాల మేడల్లో పుట్టి పెరిగావని విర్రవీగడానికి వీలు లేదు. అత్తారింట్లో చచ్చినట్టు పడుండాల్సిందే. ఇదేమన్నా సినీమా అనుకుంటున్నావేమిటి? అందంగా, నాజుగ్గా లెక్చరివ్వడానికి? నువ్వుకాదు, నీ తాత దిగిరావాలి. మమ్మల్ని మార్చడానికి''.

'పద్మా''.... కాత్యాయని రంకెకి పద్మా, రమణా కూడా వులిక్కి పడ్డారు.

''ఊరుకొన్న కొలదీ హద్దుమీరి మాట్లాడ్తున్నావ్, జాగ్రత్త, కేవలం నాపై అధికారం చెలాయించడం, నన్ను కించపర్చడమే నీ వుద్దేశ్యమైతే, అది ఎంత మాత్రం సాగదని నిష్కర్షగా చెప్తున్నాను. అదిగో - కాఫీ టిఫీన్. కిక్కురు

మనకుండాతిని బయటకు పోయి మీ పనులు చూచుకోండి. ఇంతకంటె మీతో అధికంగా మాట్లాడవలసిన అవసరం నాకు లేదు'' అంటూ తన పనిలో మునిగిపోయింది కాత్యాయని.

''చూడే అమ్మా, ఈ వదిననీ'' కళ్ళు నులుముకుంటూ గారాబంగా ఏడ్పు మొదలెట్టింది పద్మ.

''అమ్మ చూడక్కర్లేదు. అన్నీ నేనే చూస్తున్నాను'' గంభీరంగా విన్పించింది. ఉమాపతి కంఠం. విస్తుపోయి ఏడ్పు మానేసి బిక్కముఖంతో నుంచుంది పద్మ. అక్కచాటున నక్కింది రమణ, చేస్తూన్న పని మానేసి కాత్యాయని ఖంగారుగా లేచి నిల్చుంది.

''వదినెలా మాట్లాడ్తోంది? నువ్వెలా మాట్లాడ్తున్నావ్?'' తీక్షణంగా ప్రశ్నించాడు ఉమాపతి పద్మను, పద్మ వంటిన తలెత్త లేదు.

''పెద్దవాళ్ళతో మాట్లాడే తీరు అదేనా? మాట్లాడవేం పద్మా? ఏం రమణా?'' గర్జించాడు ఉమాపతి.

కోడల్ని తిడ్తాడేమో చూచి ఆనందిద్దామని భర్త వెనకాలే వచ్చిన రుక్మిణమ్మకు ఆశాభంగమై కోపం తారాపథాన్నందుకొంది - ''అవ్వ...వ్వ...లాంటి మనిషెలా మారిపోయారు? కోడల్ని మందలించడమట్టే పోయి కూతుళ్ళను హడలు కొట్టేస్తున్నారా? అప్రతిష్ట'' బుగ్గలు నొక్కుకుంది రుక్మిణమ్మ.

తల్లిని చూడగానే బావురుమంటూ మీద పడిపోయారు పద్మ, రమణాను.

''ఊరుకోండమ్మా, ఊరుకోండి. మహా తల్లి అడుగెట్టిందో లేదో అప్పుడే సంసారానికెన్ని తిప్పలొచ్చాయిరా భగవంతుడా?'' శోకాలెడ్తూ ముక్కు చీదిపోస్తోంది రుక్మిణమ్మ. అవమానంతో, అసహ్యంతో, బాధతో భారంగా భూమిలోకి వాలిపోయింది కాత్యాయని తల, నోరు మెదపనంత సేపు చేయించే ఊడిగాలకూ, ఆడిపోసే మాటలకూ అంతం లేదు. సరైన జవాబు చెప్తే జరుగుతూన్న రాద్ధాంత మిది, ఇక ఏది దారి?

ఆలోచనా మగ్నమైన కోడలి ముఖాన్ని పరిశీలనగా చూస్తూ నిల్చున్నాడు ఉమాపతి.

''ఏమిటి ప్రొద్దున్నే ఈ గోల?'' అంటూ ప్రవేశించాడు శ్రీనివాసరావు. కాని అక్కడ తండ్రిని చూడగానే వెనుకకు జంకి మాట్లాడకుండా అందర్నీ పరిశీలిస్తూ నిల్చున్నాడు. రుక్మిణమ్మకు కొడుకును చూడగానే వెయ్యి ఏనుగుల బలం వచ్చింది.

''చూడు నాయనా, నువ్వే చెప్పు. ఈ పసిపిల్లలిద్దరూ కాఫీ అడగడం తప్పా? మామా కోడలూ కలసి ఇలా ఏడిపించేస్తున్నారు. ఈనాటికీ మీరెవరైనా నన్నెదిరించి యెరుగుదురా? ఇదింక వొక్క క్షణం ఈ ఇంట్లో వుండడానికి వీలు లేదు.

''నీ ఇష్టం వచ్చినట్లు కాని . ప్రతిదీ నా ఇష్ట ప్రకారం చేస్తున్నావా? నా ఇష్టమే వుంటే ఇలాంటి మొద్దుని కట్టుకొంటానా?'' అంటూ వెనుదిరిగాడు శ్రీనివాసరావు తనకా గొడవే అనవసరమైనట్టు.

''భూదేవి బ్రద్దలు కావేం తల్లీ! నిష్కారణంగా ఇందరి ముందు అపరాధినిగా నిల్చోబెట్టావా?'' మౌనంగా వాపోతోంది కాత్యాయని, ఏమిటో ఈ సంసారం, ఈ మనుషులు, ప్రపంచం అంతా మాయగా, అయోమయంగా గిరగిరా తిరుగుతూన్నట్టు కన్పిస్తున్నాయి కాత్యాయని కళ్ళకు.

మౌనంగా పరిశీలిస్తూన్న ఉమాపతి ఇహ సహించలేకపోయాడు. అదివరకెవరూ కనివీని ఎరుగనంత ఉగ్రరూపం దాల్చాడు.

''ఒరేయ్ దౌర్భాగ్యుడా ఆగు'' వెళ్ళిపోతూన్న శ్రీనివాసరావు ఆ కేకకు మఱబొమ్మ లాగ ఠక్కున ఆగిపోయాడు.

''ఇలారా!'' ఆజ్ఞకు బద్ధుడై పిల్లిలా వచ్చి నిల్చున్నాడు. శ్రీనివాసరావుకు ఊహలు, ఉద్దేశ్యాలైతే చాలా వుంటాయి కాని, అసమర్థుడు, తల్లిదండ్రుల ముందు పిల్లైపోతాడు.

''ఏదీ, తలెత్తి ఇటు చూడు''. మరో ఆజ్ఞ జారీ చేశాడు ఉమాపతి.

బలవంతంగా, భయపడ్తూ తలెత్తి తండ్రి వంక చూచాడు శ్రీనివాస రావు.

''ఏదీ, ఇంతకుముందు వాగిన వాగుడు మళ్ళీవాగు. ఆ పిల్ల మొద్దా?'' గద్దించాడు.

''....'' మాట లేదు శ్రీనివాసరావుకు.

''మాట్లాడవేం? రూపంలోనా, గుణంలోనా, విద్యలోనా, ఐశ్వర్యంలోనా? ఎందులో మొద్దనిపించిందిరా నీకు?'' ఉరిమాడు ఉమాపతి.

''చదువులో'' భయంగానే గొణిగాడు శ్రీనివాసరావు.

''మూర్ఖుడా!'' చెంప చెళ్ళుమనిపించాడు ఉమాపతి. ఆ సమయంలో కొడుకు ఎమ్.ఏ చదువుతున్నాడనికాని, పాతికేళ్ళవాడని గాని ఆయనకు గుర్తులేకపోయింది.

''వద్దు మామయ్యా, వద్దు నా కారణంగా ఎవర్నీ బాధ పెట్టవద్దు.'' పరుగునవచ్చి తండ్రీ కొడుకు లిద్దరి మధ్యా నిల్చుంది కాత్యాయని.

మరొకప్పుడైతే రుక్మిణి చాలా రభస చేసి వుండేదికాని కది .. చంపేసేట్టున్న భర్త రౌద్రాకారం చూచి కిమ్మనకుండా కళ్లు వదిలేసి చూస్తోం .

''ఈయింటి గొడవ నీకు తెలియదమ్మా కాత్యాయనీ, నువ్వు అడ్డులే. ఈవాళ నీమూలంగా నాకు జ్ఞానోదయమైంది'' అంటూ ఉమాపతి కొడుకును చూచి, ''కాత్యాయని ఈ ఇంటికే జ్యోతిరా సన్యాసీ. సాక్షాత్తూ కాత్యాయనీ దేవి! నీకు విద్యావతి కావాలి. నాకు గుణవతి కావాలి. నీ తల్లికి ఇంత డబ్బు తెచ్చిపోసి చాకిరీ చేసేది కావాలి. ఈ అన్నిటితో బాటు మనమెవ్వరం కోరని సౌందర్య కూడా ఆమెలో వుంది. సాక్షాత్తూ లక్ష్మీదేవి వంటి పిల్ల - అవతారమెత్తినా ఈ ప్రపంచంలో నీకు దొరకదు. తర్వాతా నీవే తెల్సుకు సంతోషిస్తావు- ముందూ చెప్తే ఈ గయ్యాళి, మీ అమ్మ జరగనివ్వదని గుట్టుగా చేశానీ పెళ్ళి. కాని నువ్వు నీ తల్లికంటే మూర్ఖుడవని అనుకోలేదు....చెప్తున్నాను. ఒరేయ్, వాజమ విను.... గుండె చేత్తో గట్టిగా పట్టుకొని మరీ విను, ఈ కాత్యాయని- నీ భా- బి.ఎ.పాసైంది. సంగీతంలో సరస్వతి, ఇప్పుడేమంటావు? ఏమంటావురా ' పళ్ళు పటపట లాడించేస్తున్నాడు ఉమాపతి.

ఆశ్చర్యంగా కళ్ళు పెద్దవి చేసి నోటమాట లేకుండా చూస్తు.. డు

శ్రీనివాసరావు. రుక్మిణి అవస్థ సరే సరి - వర్ణనాతీతం.

మెల్లగా తేరుకొని తలఒంచి జవాబిచ్చాడు శ్రీనివాసరావు. ''నన్ను క్షమించండి నాన్నా. నిజంగా మూర్ఖుణ్ణే, ఇక నుండి బుద్ధిగా ప్రవర్తిస్తాను'' తండ్రి కాళ్ళమీద వాలిపోయాడు.

''లేవరా. నాకు మాత్రం నీ మీద కోపమా? నీ సుఖం కాదూ నాక్కావల్సింది?'' అంటూ కొడుకుని లేవనెత్తి ''ఇటు చూడమ్మా కాత్యాయనీ.'' అని కోడల్ని పల్కరించాడు.

అయోమయావస్థలో శిలాప్రతిమలా నిల్చున్న కాత్యాయని మెల్లగా తలెత్తి మామగార్ని చూచింది న- ఆమె నేత్రాల నిండా అశ్రువులు- దుఃఖభాష్పాలో, ఆనంద భాష్పాలో మరి!

''నీవంటి కోడలు ఊరికి ఒక్కరున్నా ఈ ప్రపంచం స్వర్గతుల్యమౌతుంది కాత్యానయీ! నాకు నీ మీద సంపూర్ణ విశ్వాసం, అపారమైన గౌరవం ఉన్నాయి. ఇవిగో సర్వాధికారాలు నీకిస్తున్నాను. కుటుంబాన్ని అన్ని విధాలా బాగు చేయడానికి ప్రయత్నించు.'' జేబులోని తాళాల గుత్తి కాత్యాయని కందివ్వబోయాడు.

కలో, నిజమో తెలియక కాత్యాయని సందేహిస్తూ నిల్చుంది.

''తీసుకో కాత్యాయనీ, '' చాలా మృదువుగా చెప్పాడు శ్రీనివాసరావు.

వివాహమైన ఇన్నాళ్ళకు భార్యను సాదరంగా సంబోధించాడు. తాళాలు తీసుకుని, మామగారి పాదాలకు నమస్కరించింది కాత్యాయని.

''చూడు రుక్మిణి నిన్ను నీవు హీనపర్చుకోకు, గౌరవించి గౌరవం పొందు. నీకు నీ పిల్లలు పసివాళ్ళైతే - కోడలు మరొక తల్లికి పసిబిడ్డ గుర్తుంచుకో. రా బయటికి'' అంటూ నిష్క్రమించాడు ఉమాపతి.

ఇహ తన ఆటలు సాగవని తెల్సుకొన్న రుక్మిణి మౌనంగా భర్తను అనుసరించింది.

''కాత్యాయనీ'' మెల్లగా, మృదువుగా పిల్చాడు శ్రీనివాసరావు.

కాత్యాయని పలుకలేదు.

''కోపమా కాత్యాయనీ? ఈ మూర్ఖుణ్ణి క్షమించలేవా?'' దీనంగా అడిగాడు.

''క్షమ, యెంతటి దారుణాలైనా ఈ ఒక్క రెండక్షరాల మాటతో సమసిపోతాయి. మీరు క్షమార్హులైనా కాకపోయినా స్త్రీలెప్పుడూ క్షమా హృదయులె'', శాంతంగా భర్త కళ్ళలోకి చూస్తూ పల్కింది కాత్యాయని.

''నాన్నగారన్నట్లు నీవు నిజంగా నా జీవితానికి ఆశాజ్యోతివి. ఏ పొరుపులూ, పొరపాట్లూ లేకుండా ఆదర్శ దాంపత్యం గడుపుదాం'' అంటూ ఆమె మృదుహస్తాన్ని తన చేతిలోకి తీసుకున్నాడు శ్రీనివాసరావు.

''అధోగతిలో నున్న ఈ సంసారం నీవు అడుగెట్టిన వెంటనే ఇంతగా మారిపోవడమెంత శుభసూచకం!'' అన్నాడు.

సమాధానంగా, మృదువుగా నవ్వింది కాత్యాయని.

కిటికీ చువ్వలగుండా లోనికి ప్రవేశించిన ఉదయ భాస్కరుని బంగారు కాంతులు వారిపై పడి 'శుభమస్తు' అని దీవించినట్లున్నాయి'

# ఆ రాత్రి

రచన :

మురిగొండ శివప్రసాద్

మామూలుగానే ఆరోజు సాయంకాలమైంది. లోకంపై కోపంతోనూ బాధతోనూ ఎఱ్ఱబడి కుతకుత ఉడికిపోతున్న సూర్యగోళం వీరి దోషాలకు తానిక 'సాక్షి'ని కాలేనన్నట్లు క్రమంగా అస్తమిస్తున్నాడు. చల్లగా మలయ మారుత ప్రసారంతో పల్లెటూరు, బస్తీకాని ఆ ఊరు ఒక్కసారిగా చెమటకక్కే వేడి నుంచి ఇవతలపడి విశ్రాంతి తీసుకుంటున్నది, గాలితోపాటే బయలుదేరి పిచ్చన్న రచ్చబండదగ్గరికి మునసబు ముఠా మనుష్యులవద్దకు వచ్చేసరికి 'సా ములవారు వొచ్చారట' అన్న చౌదరి మాటలు విన్పించాయి. వెటకారంగా తనని స్వాములవారని పిలుస్తున్నారేమోనని అనుకున్నాడు పిచ్చన్న. ఐనా అతనిలో ప్రతీకారతత్త్వం లేదు. మెల్లగా వారివద్దకు చేరాడు.

''ఔను, స్వాములవారు వచ్చారట'' వంత పాట పాడాడు రాజరత్నం - చుట్టూ చేరిన మిగతా జనం చుట్టలు ముట్టించి వింటున్నారు.

''అసలు ఈ స్వాములవారి రాకకూ రాబోయే ఎన్నికలకూ ఏమన్నా సంబంధం ఉందా అని నా అనుమానం'' చౌదరి అందరివైపూ చూస్తూ అన్నాడు.

''ఔను నా అనుమానమూ అదే'' రాజరత్నం అందుకున్నాడు.

''కూడులేక ప్రజలు మలమల మాడి పోతుంటే భిక్షపేరున ఆ ఆదాయం లేని గుడ్డి గుఱ్ఱాల కెందుకింత దాణా మన ఊరి వాళ్ళు వెయ్యడం?''

''ఔను, ఆ ధనం, ఒక రోడ్డుమీద పెడితే మనం నడుస్తాము'' రాజరత్నం చౌదరిభావాన్ని గుర్తించి పూర్తిచేశాడు.

''కడుపు కాలే వ్యక్తులకు ఆ ధనంతో గంజిపోయాలి. అదే అసలు మా పార్టీ సిద్ధాంతం'' పొడుగు ముక్కాయన సమయం కోసం ఎదురుచూస్తున్నట్లు వెంటనే ఈ మాటను విసిరాడు.

''ఆ ధనంతో - నేను ఆకలి మంటల కవిత్వం రసవత్తరంగా వ్రాశాను. ఆ పుస్తకం అచ్చువేయాలి'' లాల్చీవ్యక్తి చౌదరిముఖంలోకి చూస్తూ మాట్లాడాడు. మరి నాలుగు కంఠాలు అందుకున్నాయి.

''ఆ డబ్బు పెడితే ఇంటింటికీ పాడి ఆవు వస్తుంది.''

''నిజమే! ఇట్లా ఖర్చుచేసేడబ్బు మిగిలిస్తే ప్రతివారికీ అయిదెకరాల భూమి లభిస్తుంది.''

ఓర్పుతో వింటున్నాడు పిచ్చన్న. అతడు లోకంలో చెయ్యగలిగిన పనులు రెండే. ఒకటి వినడం; రెండు చూడటం. మాట్లాడటం అనేది చాలా క్వాచిత్కం.

'' ఆడబ్బు పెడితే ఇంటింటికీ కొళాయి.''

''ప్రతి గదికీ విద్యుద్దీపం.''

''నీ కూతురి పెళ్ళి.''

''నా కొడుకు చదువు''

భరించలేనంత కోపం వచ్చింది పిచ్చన్నకు.

''ఒక సన్యాసికి ఇచ్చే భిక్ష మానితేనే ఇన్ని పనులెట్లా జరుగుతాయి? - ఐనా మీరేమి, మీ భోగాలు మానుకొని ఇస్తున్నారా? ఎవరో భక్తులు పోగుచేసి ఇచ్చేడబ్బు. మీకేం రోగం?'' ఉండబట్టలేక అన్నాడు.

''అక్కడున్న అన్ని జతల కండ్లూ పిచ్చన్న మీద ప్రసరించినై.

''పిచ్చోడు వచ్చాడురోయ్! పిచ్చోడు.''

''ఔను! పిచ్చోడు! వెళ్లగొట్టండివాణ్ణి! పానకంలో పుడకలాగా....''

రాజరత్నం చౌదరిపాటకు దరువు వేశాడు.

''ఒరేయ్! అరిచావంటే తన్ని తరిమేస్తాము. నోరుమూసుకుని కూర్చో'' పొడుగు ముక్కాయన అన్నాడు.

''అసలిలాంటి కుళ్ళు వెధవల్ని చూస్తే నాకు మంటండీ'' ఆకలి మంటల కవి శృతి కలిపాడు.

మనవూళ్ళో ఇట్లాంటి వాళ్ళు తయారుకావడానికి మూలకారణం ఎవరు? సోదరులారా! ఆ కరణం పార్టీయే'' తలగుడ్డను సవరించుకుంటూ ఉద్రేకంగా అన్నాడొక పెద్దమనిషి.

''అతడు చేసే ప్రతిపనినీ మనం వ్యతిరేకించాలి.'' చుట్టపొడిని రాల్పుతూ అన్నాడు చౌదరి.

''ఔను, సహకరించకూడదు. లేకుంటే మన నెత్తినెక్కి కూర్చుంటాడు.'' రాజరత్నం పక్కతాళం మ్రోగించాడు.

''లేనిపోని మూఢవిశ్వాసాలతో మనలను అతడు పాడుచేస్తున్నాడు. మనలను ఇంకా పాతరాతియుగంలోకి నడిపిస్తున్నాడు. మనకు కావలసింది స్వేచ్ఛ - స్వాతంత్ర్యం - శాంతి. అది ఛాందసత్వం తొలిగితేగాని లభించదు.''

ఇక ఓపికతో కూర్చోదలచుకో లేదు పిచ్చన్న. ఎగిరి ఒక్కదూకులో వాళ్ళమధ్యకు చేరాడు.

''ఛాందసత్వం సంగతికేంగాని మీరు తొలిగితే కాని ఈ ఊరికి శాంతి లభించదు'' గట్టిగా అరిచాడు-

రాజరత్నం తెల్లబోయాడు.

పిచ్చన్నకంత కోపం రావడం అతడు సామాన్యంగా చూడలేదు.

''ఏయ్ - పిచ్చన్నా! ఇక్కడినుంచి వెళ్ళిపోతావా? పోవా?''

''నేను పోను''

''ఏం?''

''నా ప్రశ్నకు జవాబు చెప్పండి''

చౌదరిచూచాడు. వాతావరణం మంచి రసవంతంగా ఉండగా వాడొకడు. వచ్చిపడ్డాడు. వెధవ! చక్కనితన ప్రచారాన్ని చెడగొడుతున్నాడు. ఇంకా కాసేపు ఇలాగే సాగితే ప్రమాదం. ఎలాగైనా దీన్ని గమ్మత్తుగా తేల్చాలి.

''పిచ్చన్నా! కూర్చో!'' ఆదరంగా మాట్లాడాడు చౌదరి.

''అక్కర్లేదు. నిలబడే వుంటా'' మొండిగా సమాధానం చెప్పాడు పిచ్చన్న.

''సరేపోనీ, నీ యిష్టంలే. నీ అనుమానాలేమిటి?''

''ఒకటేమిటి? చాలా ఉన్నాయి-''

అన్నింటికీ జవాబుచెప్పే తీరికలేదు - నీ ముఖ్యమైన సందేహం తీర్చుకో చిట్టిబాబూ''

వ్యంగ్యాన్ని ధ్వనింపజేయాలని ప్రయత్నించాడు పొడుగు ముక్కాయన.

''సరే! మీరంతా ఎందుకిట్లా మాట్లాడుతున్నారు?''

అంతా ఫక్కున నవ్వారు.

''నిజమేనోయ్ - అసలు మనం ఎందుకు మాట్లాడుతున్నాము? మంచి సందేహమే'' చౌదరి మళ్ళీ నవ్వాడు. మిగిలినవాళ్ళు కూడా నవ్వురాకపోయినా గొంతు కలిపారు.

''అదికాదు నేనడిగింది. ఎందుకు మీరిట్లా ఒకరిని విమర్శిస్తున్నారు - ఒకళ్ళ నమ్మకాలు మిమ్మల్ని ఏం చేశాయి'' జాలిగా అడిగాడు పిచ్చన్న.

ఏ నమ్మకాలు? మీ లాంటి పిచ్చివాళ్ళ మూఢత్వాలన్నీ నమ్మకం పేర ఎట్లా వొదలుతాం. రష్యా త్నిక్కో సైన్సు పురోగమనానికి చిహ్నంగా లోకం అంగీకరిస్తే మాకూ ఉంది. శ్వామిత్రుడు త్రిశంకుకోసం వదిలిన స్పుత్నిక్ - అనడం ఏమంటారు? నీకన్నా కూడా ఇంకా ముదిరిన ఉన్మాదం కాదటోయ్-''

''ఔనౌను. అంతే. అంతా మాకు ఇదివరకే ఉన్నై, అనుకోవడం ఒక జబ్బు, ఈ రేడియోలు, ఈ టెలిఫోన్లూ మన కిదివరకే ఉన్నాయట. ఎందుకీ బూటకం?

రాజరత్నం మాట ముగియకముందే ఆకలిమంటల కవి, ''అంతటితో సరా? కాలం గడిచేకొద్దీ భవిష్యత్ పురాణం పెరుగుతూనే ఉంటుంది. నిన్న జరిగిన సంఘటన కూడా స్కాంద పురాణాంతర్గతం ఔతుంది. ఎలా నమ్మతాం వీటన్నిటినీ'' అన్నాడు ఇతరుల సమాధానం కోసం ఎదురుచూస్తూ.

''ఏం? ఎందుకు నమ్మవు? అలాగైతే ఇప్పటి అభివృద్ధి అంతా దీనిని చూడనివాళ్ళు కాదంటున్నంత మాత్రాన పోతుందా?'' సూటిగా ప్రశ్నించాడు పిచ్చన్న.

దానితో అంతా తికమక పడ్డారు.

ఇక వాణ్ణి అక్కడ ఎక్కువసేపు ఉండనివ్వదలచుకోలేదు చౌదరి.

''పిచ్చినాయనా, ఇకపోయిరా తండ్రీ, ఇక్కడినుంచీ'' అనగానే రాజరత్నం ''ఔను, ఇంక వాణ్ణి అవతలకు పంపేయండి.'' అని మిగిలిన వాళ్ళతో అన్నాడు.

పిచ్చన్న పైకి లేచాడు. తనకిక ఈ అసభ్యకరమైన వాతావరణంలో కూర్చో బుద్ధిపుట్టలేదు. తన కళ్ళకు ప్రతి ఒక్కడూ ఒక రాక్షసుని లాగా ఒక పిచ్చివాడులాగా, ఒక స్వార్థ స్వరూపం లాగా కనపడుతున్నాడు. వాళ్ళతో తనకు మాటలేమిటి? అసలు తాను ఇంతసేపు వాళ్ళతో మాట్లాడటం ఇదివరకెన్నడూ లేదు. మెల్లగా లేచి తన దోవన తాను బయలుదేరాడు వెనుకగుండా.

''అసలిలాంటి పిచ్చివాళ్ళ కందరికీ హాస్పటల్ కట్టించాలంటే మన మునసబుగార్ని అన్ని విధాలా ఎన్నికలలో బలపరచాలి'' అన్న మాటలు వినిపించాయి.

''అంతేకాదు. సన్నాసులను ఆదరించే ఆ కరణం పార్టీ ఇక పైకి రాకూడదు.''

''మన భావాలన్నీ నాచేత జట్కావాడికి అర్థమయ్యే భాషలో ఒక కరపత్ర సంపుటి వ్రాయించి ముద్రించాలి'' కవి సిగరెట్టు వెలిగించి, అగ్గిపుల్ల ఆర్పుతూ చౌదరి కళ్ళలోకి చూస్తూ అన్నాడు. పిచ్చన్న దూరంగా వెళ్ళిపోయాడు. అస్పష్టంగా వాళ్ళమాటలు వినిపిస్తున్నాయి.

''సీతన్నగారికి సన్మానం చేయాలి.''

''అప్పన్నగారికి శిలావిగ్రహం...''

''అందుకుగాను చందాలు పోగుచేయాలి.''

''అదే ముఖ్యం - ఈ సాధువులకూ... సన్యాసులకూ...''

చాలా దూరంవెళ్ళి పోయాడు పిచ్చన్న. కనుచూపుమేరలో మనుష్య సంచారం లేదు. చెరువు ఒడ్డున గంగరావిచెట్టు క్రింద కూర్చున్నాడు. చెరువులో బాతులు కిచకిచ మంటూ హంసలలాగే మానస సరోవరంలో తిరిగాయేమో ననిస్తూన్నట్లు సంచరిస్తున్నాయి. మువ్వల గలగలలతో రెండెడ్లబండి ఒకటి పరుగెత్తుకుంటూ తన పక్క రోడ్డుమీదిగుండా పోయింది. ఆ ధ్వని, అర్ధచంద్రాకృతిలో తెల్లగా వెన్నముద్దల్లా, ఎగురుతూ పోతున్న కొంగల అరుపులతో కలిసి వింతగా పిచ్చన్నను పరవశపరచాయి.

పచ్చుడాబావారి అమ్మాయి నీళ్ళుముంచుకోడానికి బిందె తీసుకొని రావడంతో ఆమె తలలోని మల్లెపూల వాసనతో కలిసి, గాలి కమ్మగా పిచ్చన్నను ఊపించింది. బిందె కడిగి రెండుసార్లు నీళ్ళపైన అటూ ఇటూ ఊపింది ఆమె.

వలయాలు వలయాలుగా నీళ్ళు సుడులు తిరగసాగాయి. పిచ్చన్న మనస్సుకూడా సుడులు తిరగడం ప్రారంభించింది. భౌతిక లోకానికి దూరమై, అతనిమేధ మామూలు, మానవపరిధులకన్నా కొంచెం వక్రంగా ఆలోచించడం ప్రారంభించింది.

... ఏమిటీ, చౌదరీవాళ్ళు ఇందాక అట్లామాట్లాడుతున్నారు? ఇందాకేమిటి? ఎప్పుడూ ఇంతే! తమ స్వార్థం కోసం ఒకదాన్ని నిందిస్తారు, ఒకదానికి లేని గొప్పతనం ఆపాదిస్తారు. ఎన్ని రాజకీయాలు? ఎన్ని మతాలు- ఎన్ని కక్షలు? ఎంత కుళ్ళు? ఎంత అహంకారం? ఆ అవగుణాల నుండి ఒక్కసారి ప్రపంచానికి విముక్తి కలిగితే...

పిచ్చన్న ఊహలకిక పగ్గాలు లేకుండా పోయాయి. లోకంలో ఒక్కసారి గుట్టం పేర్చిన హైడ్రోజన్ బాంబులు పేలినట్లు ఊహించుకున్నాడు.

... ఢాం... ఢాం... ఢాం... ఢాం...

ఒకదాని వెంట ఒకటి, ఒక రాజ్యం వెంట మరొక రాజ్యం. అణ్వాయుధాలు పేల్చింది. దుష్టత్వంతో కుళ్ళి మురిగిపోతున్న మానవజాతికి విమోచనం కలిగింది -

ఇక భూలోకంలో జీవమంటూ లేదు.

అంతా ప్రశాంతి - స్మశాన ప్రశాంతి.

ఆ నశించిన ప్రపంచంలో ఒక్క పిచ్చన్న మాత్రమే నిలబడి ఉన్నాడు...

తిరిగి పునః సృష్టిప్రారంభమైంది.

వెనుకటి మానవులను ఆకారంలో పోలిన ప్రాణులు కొందరు ఉద్భవించారు.

వారు తిరుగుతున్నారు - ఏవో తింటున్నారు. ఒకరితో ఒకరు మాట్లాడుకుంటున్నారు. ఏవో జీవన విధానాలు ఏర్పరచుకుంటున్నాడు.

కొందరు నగ్నంగా ఉన్నారు. కొందరు రాళ్ళతో ఏదో గొడ్డలిలాంటిది తయారుచేసుకుంటున్నారు - కొందరు చెట్టుమీద కాకిగూడు పెట్టుకోవడం వింతగా చూస్తున్నారు.

తాను వాళ్ళ దగ్గరకు వెళ్లాడు.

''ఎవరండీ మీరంతా?'' పిలిచాడు.

ఒకళ్ళిద్దరు త్రుళ్ళిపడి తనవైపు చూచారు. అందులో ఒకడు వింతగా అరిచాడు. ఇంకా కొందరు అతన్ని చూచారు.

పరుగెత్తుకుంటూ వచ్చి అతన్ని చుట్టుముట్టారు. వాళ్ళల్లో వాళ్ళు ఏదో భాషలో ఏమిటో మాట్లాడుకున్నారు-

వాళ్ళమధ్య నుండీ అరిటాకులాంటి విశాలమైన పత్రాలను చుట్టుకున్న వ్యక్తి వచ్చాడు.

''ఎవరు నువ్వు'' తనను ప్రశ్నించాడు.

''నేనూ మీలాంటి మానవుణ్ణే''

''అంటే''

''అంటే ఇంకేమి చెప్పను? మనిషిని?''

''ఎక్కడినుండి వస్తున్నావు?''

''శాలివాహన శకం 19వ శతాబ్దినుంచి -

''శాలివాహన శకం అంటే - పందొమ్మిది ... అంటే..... అదొక సంఖ్యా?.... ఎందుకట్లా సంఖ్య ఏర్పాటు చేసుకోవడం?

పిచ్చన్న మాట్లాడలేకపోయాడు.

''ఏమిటి నువ్వు కట్టుకున్నది? ఇట్లాంటి ఆకులు మాకీ అడవిలో ఎక్కడా కన్పడలేదే?''

''ఇవి ఆకులు కాదు, బట్టలు-''

''బట్టలా? అంటే?''

''అంటే నామొహం - ఏం చెప్పేది! పత్తితో యంత్రాల మీద తయారు చేస్తారు.''

''యంత్రం - అంటే?''

''మర-''

''అంటే?''

''దానికిక వివరణలేదు - చూడాల్సిందే''

''సరే చూపు''

''నాదగ్గరలేదుగా''

''అడిగితే చూపలేవు. మరి ఉన్నదని అంటావేమిటి?''

''నేనేమి అబద్ధమాడుతున్నా ననుకున్నారా?''

''అబద్ధమంటే?''

అబద్ధమంటే ఏమిటో తెలియని ఈజాతి మధ్య తానిక ఉండదలచుకో లేదు. యంత్రాల గురించి వీళ్ళకు తెలియదు. అందుకని ఉన్నవని చెప్పినా

నమ్మలేకుండా ఉన్నారు. తమకు తెలియనంత మాత్రాన నమ్మలేకపోవడమేనా? చౌదరి ముతాలాగా.....

పిచ్చున్న మనస్సులో తిరిగి వలయాలు తిరిగాయి.... ఆ ఆటవికుల దృశ్యం అయిపోయింది. తిరిగి.... మరొక దృశ్యం కండ్ల ఎదుట కన్పడుతోంది.

అది ఒక నాగరిక సమాజం - గృహాలు ఉన్నాయి. చెఱువులు ఉన్నాయి. బావులు త్రవ్వుతున్నారు. మనుష్యులు. తాను వాళ్ళ మధ్యకు వెళ్ళాడు.

''ఎవరయ్యా నీవు-?''

''పిచ్చున్నను''

''ఓహో! ఎక్కడనుంచి వస్తున్నావ్?''

''శాలి శకం 19వ శతాబ్దినుండి''

''ఆఁ- ఏమిటీ, ఈ సంఖ్యా గణనం, శతాబ్ది విభజనను పట్టి నీవు చాలా నాగరికుడిలాగ తోస్తున్నదే''

''అయ్యో! ఖర్మ అంకెలు తెలిస్తేనే వాడు నాగరికుడా? ఇదేమి సమాజమయ్యా మీది! మా వాళ్ళు విమానాల్లో ఎగిరి వీలైనన్ని తక్కువ సెకన్లలో ఎక్కువ లక్షల సైనికుల్ని హతమార్చే లెక్కలు సైతం కనిపెట్టాము.''

''అబద్ధం- మేము నమ్మము- మనిషి ఎక్కడన్నా ఆకాశంలో ఎగురుతాడా? పైగా మానవులను చంపడమా? అందులోనూ అంత త్వరగానా? అసంభవం - పచ్చి అసత్యం.''

''మా చౌదరి ముతాలాగా మీరు నమ్మకపోయినంతమాత్రాన మాకేమీ నష్టంలేదు. కాని జరిగిన సత్యం ఇది. నమ్మితీరాలి. అది - అంతే.''

''ఇంతేనా, మీ వాళ్ళు ఇంకా ఏమ.. కనిపెట్టారా?''

''ఒకటేమిటి? చాలా కనిపెట్టారు వీళ్ళమీదా, ళ్ళ ందా; నేలమీదా, నేలక్రిందా ప్రయాణం చేస్తున్నారు. నేల అట్టడుగున ఒక పెద్ద ఊరుకట్టారు. ఆకాశం కొట్ట కొనకు స్పుత్నిక్ అనబడే యంత్రం వదిలారు. అది పోయి చంద్రుణ్ణి కొట్టుకుంది.''

''మోసం- దగా - వీడెవడో మన అభివృద్ధిని చూచి ఓర్వలేక అంతాకూడా ఇంతకుముందే ఉన్నదని అసత్యం పలుకుతున్నాడు నమ్మకూడదు. తన్ని వెళ్ళగొట్టండి - వాణ్ణి''.... పిచ్చన్న పరుగెత్తుకుంటూ అక్కడినుంచి వెళ్ళిపోయాడు.... అతని కళ్ళముందున్న దృశ్యం మాయమైంది. మేధలో తిరిగి సుడిగుండాలు తిరిగాయి. కొత్తకొత్త మార్పులు - దృశ్యాలు తిరిగి కొన్ని కన్పడ్డాయి....

అది ఒక ధర్మసమాజం. ప్రజలు చాలా న్యాయంగా ఉన్నారు. పిచ్చన్న వాళ్ళనగరంలో ప్రవేశించాడు. రోడ్డుమీద నడుస్తున్నాడు. ఇంతలో ఒకచోట కళ్ళు జిగేల్‌మనే, రత్నాల హారం పడేసివుంది, పరీక్షగా దానివైపు చూచాడు. వెంటనే అటూ ఇటూ చూచి, ఎవరూ తన విషయం పట్టించుకోవడం లేదనుకొని, దాన్ని చేతుల్లోకి తీసుకున్నాడు. దానికొక తాటాకు కట్టబడి ఉంది. అందులో ఏదో లిపిలో ఏదో వ్రాయబడివుంది. మెల్లగా దాన్ని జేబులో వేసుకొని చుట్టూచూచాడు. ఎవ్వరూ అతన్ని అదేమని ప్రశ్నించినవారు కాని ఏమిటాహారం?' 'ఎప్పుడు పారేసుకున్నావ్' అన్నవారుకాని కన్పడలేదు- తన అదృష్టానికి తానే మురిసిపోయాడు. మెల్లగా నడుస్తూ కొంచెం ముందుకు వెళ్ళాడు. దప్పిక ఐంది. పక్కన దగ్గరవేసివున్న ఒక ఇంటికి చేరాడు. 'అమ్మా, కాసిని మంచి ళ్ళు పొయ్యండి' ఎవ్వరూ పలకలేదు. మళ్ళీ పిలిచాడు. జవాబు రాలేదు. తలుపులు త్రోసి లోపలకుచూచాడు. ఎవ్వరూ మానవులున్న అలికిడే కన్పించలేదు. వింతగా లోనికి నాలుగడుగులు వేశాడు. ఒక గూడులో రత్నాలు కుప్ప పోసివున్నాయి. పక్కన ఒక అరలో బంగారపుముద్దలు, కణికలు కొన్ని కన్పడ్డాయి. మిటి ? తాను కళ్ళారా చూస్తున్నది నిజమేనా? ''ఎవరండీ లోపల?'' మళ్ళీ గట్టిగా పిలిచాడు. ఎవ్వరూ పలకలేదు. అతనికి భయంవేసింది. ఖర్మకాలి ళ్ళు ఆత్మహత్య చేసుకోలేదుకదా. గట్టిగా కేకలేశాడు. బయపోతున్న వారొకరిద్దరు పరుగెత్తుకుంటూ వచ్చారు.

''ఏం? నాయనా-''

''ఈ ఇంట్లో వాళ్లేరీ?''

''ఊరికి పోయినారులే - ఏం?''

''ఏం ఏమిటి! - అన్యాయం - ఎవళ్ళో దొంగలు పడ్డట్టున్నారు - తలుపులు తెరిచి ఉన్నాయి''-

అక్కడున్న వాళ్ళంతా వింతగా పిచ్చున్ననొక మృగాన్ని చూచినట్లు చూడసాగారు. పాపం అతనికి ఏడుపొచ్చింది. ఇక్కడకూడా అందరూ తననిట్లా అవమానిస్తారేం? -

''ఏం? ఎందుకట్లా చూస్తారు?'' తాను అన్నాడు.

''దొంగలా? ఎందుకొస్తారు?''

''డబ్బు దొంగిలించుకొని పోవడంకోసం''

''ఏ లోకం నుండి వస్తున్నావు బాబూ నువ్వు?''

''శాలిశకం 19 నుండి లే - ఏం?''

'దొంగతనం ఎందుకు చేస్తారు?'' వాళ్ళు ఎదురు ప్రశ్నవేశారు.

''ఏమిటండీ మీ ప్రశ్న! గాలి ఎందుకు లుస్తారన్నట్లు ది - దొంగిలించడమే తెలియనట్లు మాట్లాడుతున్నారే? దొంగతనమేమిటి? - హత్యలు, శిశుహత్యలూ, స్త్రీ హత్యలూ చేస్తారు మావాళ్ళు డబ్బుకోసం''

''శివశివా! ఎందుకిలాంటి అధర్మ వార్తలు చెప్పుతావు? నువ్వు పిశాచివి. కాకపోతే ఇలాంటి మాటలు అసలు ఉచ్చరించడానికి నీకు నోరెలా వచ్చింది?''

''అయ్యో నేను చెప్పేది నిజమండీ''

''అసత్యం - మానవుడు చెయ్యడానికి వీలుల విషయ - ను చెప్పి మమ్మల్ని నమ్మిద్దామని ప్రయత్నిస్తున్నావా? మూఢుడా! పో - ఇక్కడి నుంచి -''

''పోతాను. దానికేం - కాని నా మాట మీరు నమ్మకతప్పదు. మా వాళ్ళు గోవును చంపుతారు. వ్యభిచరిస్తారు. హాయిగా సురాపానం చేస్తారు - ఎంత ధనవంతులైతే అంత ఖరీదు సారా తెప్పించుకుంటారు - అంతేకాదు...''

ఇక మాట్లాడనీయకుండా ఆ వచ్చిన వాళ్ళల్లో ఒకడు ''మి లారా, నాలుకతో పలుకదగని శబ్దాలను ఉచ్చరించిన ఈ ఉ. - ని మొన్న మంత్రిగారిని శిక్షించారే, ఆ ప్రదేశానికి లాక్కొని వెళ్ళండి'' అన్నాడు.

''ఏమండోయ్ - మీరాజ్యంలో మంత్రులను కూడా శిక్షించడం ఉందా? ఎంత వింత..... అందులోనూ మంత్రిని విచారించిన న్యాయస్థానంలోనే నన్నూ విచారిస్తారా? మాదేశంలో ఇలా లేదు - డబ్బున్న అధికారులకొక ధర్మం, లేనివాళ్ళ కొక ధర్మం. డబ్బుగలవాడు చేస్తే ఆ తప్పుకు 'లైసెన్సు' వంటి పదాలెన్నో మేలిముసుగుగా ఉంటాయి. లేనివాడు చేస్తే నాగార్జున సాగర్‌కు కఠినశిక్ష క్రింద తోలుతారు. మీ వారసులమైన ఈ మానవజాతి, మా కాలంలో బ్రాహ్మణులనవమానించింది. వేదాలను అన్ని భాషలలోకీ అనువదించింది - ఆవు మాంసంతో గల్లాపెట్టెలను నింపుకున్నది. ఆడదాన్ని అర్థనగ్నంగా పర పురుషుడి కౌగిలిలో మంచి పోజులో నిలబెట్టి ఫోటోలు తీసి తెరమీద చూపించింది. దాన్ని చూచేందుకు జనానికి టిక్కెట్టు అందదు - అలా నిలబడి నటించినందుకు ఆమె లక్షలు పుచ్చుకుంది-''

''లాక్కెళ్ళండి ఈ పిచ్చి కుక్కను - వాగావంటే ఇక నీ నాలుక కోస్తాము'' హుంకరించాడా వ్యక్తి.... మళ్ళీ దృశ్యం చెదిరి పోయింది...

పిచ్చన్న తల వేడెక్కి పోయింది. అతడు ఇక ఆలోచించలేని స్థితిలో కొచ్చాడు. ఐనా భావనా పరంపర ఆగలేదు.

ఒకరాయి తీసుకొని చెఱువులోకి విసిరాడు- 'బుడుంగు - దిబ్బు' మంటూ ధ్వనిచేస్తూ నీళ్లల్లో పడిపోయింది. మసక చంద్రుడి వెల్తురులో కొద్దిగా కన్పడీ కన్పడకుండా వలయాలు తిరుగసాగాయి - పిచ్చన్న తలలో ఇంకో వలయం ప్రారంభమైంది... ఏదో ఘోష విన్పడుతోంది శ్రుతి సుభగంగా. దగ్గరికి వెళ్ళాడు.

అధి వేదఘోష. 'ఏమిటా?' అని పరిశీలించి చూచాడు. ఒక రాజుగారు ఏదో రథం 'లాంటిది' ఎక్కుతున్నారు. జనం ఆనందంతో వీక్షిస్తున్నారు. ఒకణ్ణి పిలిచి 'ఏమిటని' ప్రశ్నించాడు.

'ఏమిటంటావేమిటయామయ్యా.... ఏలోకం నుంచి వస్తున్నావు? మహారాజుగారు, స్వర్గంనుండి ఇంద్రుడు కబురుపెడితేను వెళ్తున్నారు?'

''అదేమిటో రథం ఎక్కుతున్నారు?''

''ఔను. అంతరిక్షంలో ప్రయాణంచేసే రథం''

''అంటే చంద్రమండలాన్ని తాకే మా స్పుత్నిక్కు లాంటిదేనా?''

''స్పుత్నిక్కా? ఆ పేరు మేము వినలేదు. కాని రథం వెళ్ళి చంద్రమండలాన్ని తాకడమేమిటి? అసలు అలా ఒక గోళాన్ని ఒక రథం వెళ్ళి కొంటే ఆ రథసారధి చాలా అసమర్థుడన్న మాట. గోళాన్ని చేరే సమయానికి రథపరిభ్రమణ వేగం తగ్గుతుంది. చాలా ఎత్తైన గోళమైతే అంచెల పద్ధతిలో వెళ్ళుతాము - ఆ గ్రహవాసులు మాకు ఆతిధ్యమిస్తారు. వారితో మేము విశ్వభాష, సంస్కృతంలో మాట్లాడుతాము సరేలే - ఆ గొడవకేం? అది మామూలు విషయమేగా - నాకేమిటి కొత్తగా ఉందా?''

పిచ్చన్నకు పిచ్చెక్కింది - ఈనాటి మేధావులు అపూ  మని భా ంచి కనుగొన్న సత్యాలన్నీ ఈ బజారు మనిషి మామూలని త్రోసి వేస్తున్నాడే. తనకుతూహలం ఎక్కువైంది. 'ఏమండీ, మీరు రేడియో కనిపెట్టారా? అదే... ఒక కేంద్రంలో మాట్లాడితే ఆ స్టేషను పెట్టుకోగానే వి స్తుంది.''

''ఓహో! అదా - నీ 'రేడియో' అన్న పేరు వినలేదుగాని అలాంటిది మాకుందిగదా! కాని నీవేదో కేంద్రము, స్టేషన్ అంటున్నావు. అలాంటిది మాకవసరంలేదు, ఏమానవుడు ఏమానవుడితో ఎప్పుడు ఏమి మాట్లాడదలచుకుంటాడో దానిని భావప్రసార కేంద్ర విధానంద్వారా ఆకాశం లోకి వదులుతాడు. ఇక్కడ ఒక సంకల్పం జరుగగానే అవతలివ్యక్తి మేధలో అది స్ఫురిస్తుంది వెంటనే. అలాగే ఒక వ్యక్తి మాట్లాడే ఏ మాటలు వినదలచినా మా యోగ ప్రక్రియ ద్వారా భ్రుకుటి మధ్యచూపునిలిపి మానసిక యంత్ర ప్రసారం చేస్తాము. వెంటనే మా బుద్ధిమీద, ఆ మాటల ప్రసారం జరుగుతుంది - ఇదీ సాధారణ విషయమే కదా! ఏమిటలా ఆశ్చర్యపోతావు?''

పిచ్చన్నకు గుండె పగిలిపోయినంత పని జరిగింది. మానవ సాధ్యమేనా ఈ విషయాలు?

''ఏమండీ నాగుండె నిజంగా పగిలిపోతున్నదండీ మీ మాటలు వింటుంటే- ఆగిపోతుందేమోనని భయంగా ఉంది''

''ఏమీ ఫరవాలేదులే నాయనా? మళ్ళీ సంచలన ప్రక్రియద్వారా ఆడించవచ్చులే- ఆమాటల కేమి, రాజుగారి ప్రయాణం చూడు...''

అనర్థుడైన తాను ఇక అక్కడ నిలబడలేకపోయాడు.... పిచ్చన్న భావనాపరంపర ఆగిపోయింది - వలయాలు తిరుగుతున్న అతని బుద్ధి ఆలోచించడం మానివేసింది -

కళ్ళ ఎదుట కన్పడుతున్న దృశ్యాలన్నీ నీటిబుడగల్లాగా పొగమంచులాగా విచ్చి పోయాయి.

వాస్తవ జగత్తులోకి వచ్చాడు పిచ్చన్న. చుట్టూ చూచాడు. తాను సాయంత్రం ఈ చెరువు వద్ద వచ్చి కూర్చున్నట్లు జ్ఞాపకం వచ్చింది. తలపైకెత్తి చూచాడు. ఎంత పొద్దు పోయిందో తెలియడంలేదు. కాని చంద్రాస్తమయం అప్పుడే జరిగిపోయింది. లేచి నిలబడ్డాడు -

తిమ్మిరిపట్టిన కాళ్ళను విదిలించుకుంటూ మెల్లగా నడక సాగించాడు.

అమ్మవారి గుడివైపు అతనికి తెలియకుండానే నడిచాడు. గుడివెనుక వైపు గుండా వెళ్ళాడు. ఏవో మాటలు విన్పిస్తున్నాయి లోపల. పాము చెవులతో విన్నాడు.

'ఇదేమిటి!- శాక్తేయులెవరన్నా గుళ్ళోకి రాలేదు కదా! ఇవాళ దుర్గకు ప్రీతికరమైన దినం కదూ, ఎవరైనా తమ అభీష్టార్థం మొక్కుకోవచ్చు.

మెల్లగా ఆగుడి వెనుకన పడిపోయిన ప్రహరీగోడ గుండా లోనికి వచ్చాడు. బయట తన చుట్టూ చీకటి. ఎవ్వరూ లేరు. లోపల కాళీమాత ఎదుట ఒక పోతేలు నరకబడి ఉంది. ప్రక్కనే చౌదరి మొక్కుతున్నాడు ఆశ్చర్యం!

''కాళీమాతా! ఎన్నికలలో విజయం చేకూర్చుతల్లీ! ఎవ్వరికీ తెలియకుండా ఏకాంతంగా నీ వద్దకు వచ్చాను. మా ముఠా మనుషులకు తెలసిందంటే వాళ్ళముందు నా పరువు పోతుంది. అందుకని నీపై నాకు నమ్మకమున్నా ఈ రహస్య దర్శనం తప్ప గతిలేక పోయింది. నాపాపమిందులో ఏమైనా ఉంటే ప్రాయశ్చిత్తం చెప్పుతల్లీ....''

చౌదరి నల్లని ముసుగుతో వెళ్ళిపోయాడు. పిచ్చన్న మేధలో రక్తనాళాలు తెగినంత సంచలనం కలిగింది. తాను చూచింది నిజమేనా...? తిరిగి లోపల ఏదో అలికిడి విన్పించింది.

లోనికిచూచాడు పిచ్చన్న -

పూజామందిరంలో కాళిఎదుట ఆకలి మంటల కవి పడివున్నాడు.

''తల్లీ కాళీదేవీ! స్వాములవారు మంత్రపూతమైన తాంత్రిక శక్తితో స్థాపించిన నీ విగ్రహానికి ఏకాంతంగానన్నా నమస్కరించే అవకాశం నాకు లభించినందుకు ధన్యుణ్ణి. నాకు వాణిపలకడంలేదు. ఎంతో కష్టపడ్డాను. కాని ఇంగ్లీషు మాటలతోనూ, అపశబ్దాలతోనూ, ఒక్క తేటగీతి వ్రాసే సరికల్లా తల ప్రాణం తోకకొచ్చింది. అందుకని ఛందస్సు మానేశాను. మానేయమన్నాను. మాండలికాలలో, గ్రామ్యంతో వ్రాయవచ్చునని అందరికీ చెపా ను. ఇంగ్లీషు సమాసాలు చెయ్యమని లోకాన్ని కోరాను. ఐనా వాణి పలకడంలేదు. ఒక్క సినిమా పాటలాంటిది వ్రాయాలంటే, నాలుగు కాయల సారా ఖర్చుపెట్టడమే కాని నాలుగు మాటలతోనన్నా తెల్లకాగితం నల్లగా చేయలేక పోతున్నాను- కరుణించు తల్లీ...''

పిచ్చన్నగాంభ్రడించి ఉమ్మేసి లేచాడు. దుమ్ము దులుపుకొని బజారు వెంట బయలుదేరాడు. ఎక్కడికి కన్నా వెళ్ళి పడుకోవాలి. ఛీ! ఇప్పుడు తాను చూ ంది నిజం చెప్పినా నమ్మగల వాళ్ళున్నారా? ఈ లోకంలో ... చీ ట్లో నడుస్తున్నాడు... 'ఆగు' అన్నమాట విన్పించింది, ల చూచాడు. తననుకాదు.

పక్కసందులో ఒక వ్యక్తి మరొక వ్యక్తిని ఆపుతు‌_ డు.

''ఏమిటిరా ాది? మందేనా? ఊ- నడు ఐతే పో సు స్టేషనుకు''

''అదేమిటి బాబూ, నిన్ననే దండీ మా డ్డపోడి ద్వారా మామూలు పంపించాను.''

''ఓహో! నాకు చేరలేదులే...''

పిచ్చన్న మళ్ళీ ముందుకు సాగాడు. కచకా వెళ్ళిపోతున్నాడు. ఇంతలో

ఏదో గుసగుస విన్పించింది.

''వెధవా, నాకడుపున చెడపుట్టావురా. చీకట్లో ఈవేళ ఈ బజార్లో తిరగడానికి సిగ్గులేదూ''

''మరి నీవో?''

''ఏడిశావు - పెద్దవాళ్ళను ఎదిరించేవరకూ వచ్చిందీ - సరేలే - ఏంచేస్తాం.... ఇంట్లో మీ అమ్మతో ఈ విషయం ఏమీ అనబోకేం....''

పిచ్చన్న నిలబడటంలేదు. నడిచి వెళ్ళిపోతూనే ఉన్నాడు. పక్క సందుగుండా వెళ్ళుతున్నాడు. ఏదో మంట కన్పించింది. ఇరువురు వ్యక్తులు ఎదుటిపార్టీవాడి గడ్డివాముకు నిప్పు అంటిస్తున్నారు. పాపం! గొడ్లనోటి ముందు గడ్డి ఏమిచేసింది వాళ్ళని? పిచ్చన్న అక్కడికి పోలేదు. ఐతే దాని ఫలితం తనకు తెలుసు. అడ్డంవస్తే తననూ ఆవాములో వడేస్తారు. లేదా తనే అంటించినట్లు వాళ్ళే ముందుగా గలభా చేస్తారు. అసలు అక్కడ నిలబడకుండా ఉండడమే శ్రేయస్కరం. వెళ్ళిపోయి సత్రం చేరి లోపల పడుకున్నాడు. ఎక్కడో గుడ్లగూబ అరిచింది. రెండు కుక్కలు మొరుగుతూ ఒకదానిని నొకటి కరుచు కుంటున్నాయి. అందులో ఏ ఒక్కటీ గెలవదనీ, విడిపోవడమే ఉత్తమమనీ వాటికీ తెలిసే ఉండవచ్చు. ఐనా అట్లా కాట్లాడుకోవడం, గట్టిగా మొరగడం వాటి ధర్మమై పోయింది పిచ్చన్నకు మెల్లగా నిద్రపట్టింది.

తెల్లవారింది. రచ్చబండదగ్గర పెద్దలుచేరారు. చౌదరి అంటున్నాడు ''మిత్రులారా! అది ఆ కరణంగాడిపనే! అది పనికిరాని తుంగ. అందుకని తన గడ్డివాముకు తానే నిప్పంటించుకున్నాడు, నేరం మనమీదికి రావాలని. పైగా ఈ దొంగ భక్తుడు సన్యాసులను ఆదరిస్తాడట, సన్యాసులను!''

''ఔను! మానవులను పోషించడు; గ్రామాలను బాగుపరచడు కాని సన్యాసులకు చందా పోగుచేస్తాడట! ఈ ఛాందసత్వమూ మూఢనమ్మకాలు పోయి పురోగమనం చెందాలంటే ఈసారి మనమంతా మన ఊళ్లోని వాళ్ళంతా మునసబుపార్టీకే.....''

కవి అందుకున్నాడు ''ఔను! అందుకని వెంటనే చేయవలసింది నా

ప్రచార గ్రంథం అచ్చువేయించడం - దానికి బహుళ ప్రచారం రావాలి. నాకు సన్మానాలు జరగాలి. అలా అయితే ఆవచ్చే పేరు నాకు కాదు; మన మునసబుగారిపార్టీకి. ఆందోళన మన ఊపరి. ఆవేశం మన ప్రాణం. ఆక్రోశం మన లక్ష్మం. ప్రపంచ ప్రభుత్వం మన లక్ష్యం. ప్రపంచ మిత్రులారా! ఒక్కటిగా కూడండి''....

పిచ్చన్న ఆ బండ ప్రక్కగుండానే ఊరిపొలిమేరలు దాటి ఎక్కడికో వెళ్ళిపోతున్నాడు. ఊరికి ఇంకా దూరంగా పోయిన కొద్దీ అస్పష్టంగా వాళ్ళ కేకలుకూడా దూరం కాసాగినాయి.

***

# ప్రపంచాన్ని చదవ  వాడు

రచన :

భీసెట్టి లక్ష్మణరావు

ఎంప్లాయిమెంట్ ఎక్స్ఛేంజీలో పేరు రిన్యూవల్ చేయించుకోవడం అది మూర్తికి ముప్ఫై మూడోసారి. అంటే దాదాపు రెండు సంవత్సరాల తొమ్మిది మాసాలనుండి 'నిరుద్యోగ' డిపార్టుమెంటులో ఉద్యోగం వెలగబెడుతున్నాడన్న మాట.

ఆలోచిస్తోన్నమూర్తి కెందుకో నవ్వొచ్చింది. అవును తను నిరుద్యోగి. అంటే ''అలుసు'' జీవి అన్నమాట.

''ఎందుకయ్యా! మమ్మల్నిలా చంపుకుతింటావ్? కాళీలుంటే మేమే పిలుస్తాంగా - '' ఉద్యోగం చూపించమని ప్రాధేయపడి అడిగినప్పుడు ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్ఛేంజిలో ఆఫీసరు కసరుకోవడం - పద్దం తనకలవాటు.

''ఊరుమీద తిరిగే పిల్లజమిందార్లకు ఇంటి బాధ్యత లేం మోస్తాయిలే - '' నిట్టూరుస్తూ తల్లి ఈసడించుకోవడం, తను తలదించుకోవడం అంతకంటె బాగా అలవాటు.

నడుస్తూ ఆలోచిస్తోన్న మూర్తికి 'బహుశా ఖర్మంటే ఇదే గాబోలు'' అనుకున్నాడు. పాతికేళ్ళు కూడా పూర్తిగా నిండని మూర్తికి, జీవితం అంటే ఏదో అనిపించిందా సమయంలో.

ఫస్టు, సెకండు క్లాసులో గాకపోయినా థర్డుక్లాసులో మొదటి సంవత్సరంలో ప్యాసైన బియ్యే గ్రాడ్యుయేట్ మూర్తి. పనికోసం అప్లికేషను వె  ని

'ఫరం' అంటూ లేదు. ఒకవేళ ఉన్నా అది ఏ కిళ్ళీ షాపులాంటిదో అయ్యుండాలి. కంపెనీ అయితే మాత్రం మూర్తి దృష్టి నుంచి తప్పించుకోడానికి వీల్లేదు. అదేంపాపమోకాని, మూర్తివేసిన అప్లికేషను ఒక్కదానికీ జవాబొచ్చేది కాదు. ఇక తిరగని రోడ్లకూ, తొక్కని ఆఫీసు గుమ్మాలకూ, లెక్కేలేదు.

''పాడు చదువు చదవకపోయినా బావుణ్ణు''

కాలికి తగిలిన రాయిని బలంగా బూటుకాలితో తన్నుతూ, అనుకున్నాడు మనసులో కసిగా, నిరుద్యోగి అంటే ? ఇంట్లో బయటా.

ఒకటేమిటీ! మొత్తం ప్రపంచానికే అలుసు! కాక, ఒకటా, రెండా?

దాదాపు మూడేండ్లనుంచీ, ప పాటా లేకుండా తిరుగుతూంటే లోకం దృష్టిలో అలుసుకాక మరేమవుతుంది? కుటుంబాన్నంతా సాకవలసిన తను బట్టలకొట్టులో నిచేస్తూ తెస్తున్న తమ్ముని యాభై రూపాయల జీతం మీద ఆధారపడ్డాం ; నలుగురికీ అలుసుకాక మరేంటి?

''ఛ! వెధవ బ్రతుకు! '' తనను తానే నిందించుకున్నాడు మూ .

తనకెలాగూ ఆఫీసు ఉద్యోగం దొరకదు. పోనీ ైనా కూ నాలీ చేద్దామా అంటే మనసొప్పడంలేదు. అనుక్షణం అ మానం అడ్డొచ్చి దెబ్బతీసేస్తోంది. ఎలా చావడం?

ఎదురుగాపోతోన్న రిక్షా గంట గణగణ లాండించింది.

ఆలోచిస్తోన్న మూర్తికి ''రిక్షా తొక్కితే బావుంటుందేమో!'' మెరుపులాంటాలోచన. బుర్రలో తళుక్కుమంది.

ప్రపంచం మీద విసిగిపోయిన మూర్తికా సమయంలో రిక్షా ఉద్యోగమే నయమనిపించింది.

ఉద్యోగం దొరికే యోగ్యత ఎలాగూ లేదు. రిక్షా తొక్కితే తప్పా? తప్పులేదు. అనుకున్నాడు మనసులో ధైర్యం చెప్పుకుంటూ, అదీగాక తనంటేనే అందరికీ అదోరకమైన అవహేళన. అందుకే అమ్మ మాటిమాటికీ అంటుంది. ''నీకు కొంచెం కూడా ప్రపంచ జ్ఞానం లేదురా'' అని.

అది నిజమేనేమో! లేకపోతే అమ్మేందుకంటుంది?

నడుస్తోన్న మూర్తి గాంధీనగర్ వెల్‌కమ్ హోటల్ దగ్గర కొచ్చి ఠక్కున ఆగిపోయాడు. పన్నెండయిపోయిందేమో. ఎండ మహోద్రేకంతో పేట్రేగిపోతోంది. కారుతున్న చెమటకు ముఖం, శరీరం స్నానం చేసినట్టు ముద్దయిపోయింది. బట్టలు పూర్తిగా తడిసిపోయాయి.

గబగబా నడిచి పక్కనున్న కిళ్ళీషాపు దగ్గరకెళ్ళాడు. గుప్పున కాఫీ వాసన ముక్కుకు సోకింది. ప్రాణం లేచి వచ్చినట్టయింది మూర్తికి.

''ఓ గుక్కెడు కాఫీనీళ్ళు త్రాగితేకాని జీవుడు తామనసించేటట్టు లేడు'' అనుకుంటూ కుడిచేతిని షర్టు జేబులోనికి పోనిచ్చాడు. రెండ్రూపాయల నోటు దొరికింది. బయటకు లాగాడు. అమ్మమాట లొక్కమారు స్ఫురణ కొచ్చాయి. ఆనోటు బియ్యం కోసం ఇచ్చింది. అమ్మ రెండుకిలోలు కొనమంది. 'ఫరవాలేదు. రెండు కిలోల బియ్యానికి పోను ఒక కాఫీ త్రాగొచ్చు' - అనుకుంటూ హోటల్‌లోకి జొరబడిపోయాడు. కర్చీఫ్‌తో ముఖానికి పట్టిన చెమటను తుడుచుకుంటో, చివరగా ఓ మూలను కాళీగా వున్న కుర్చీలో కొచ్చి చతికిలబడ్డాడు. షర్టు బొత్తాలు వూడబెరికి, గుండెలకుపట్టిన చెమటను నోటితో ఊదుకోవడం మొదలెట్టాడు. పైన ఫాను ఫుల్ స్పీడుతో తిరుగుతోన్నా అదంత బాగా మూర్తికి ఉపయోగపడినట్టు లేదు.

అది మధ్యాహ్న సమయమేమో హోటల్‌లో జనం అట్టే లేరు. రుమాలుని ఎడం పాకెట్‌లోనికి తోసి, కుడిపాకెట్ లోంచి కాగితాల కట్టని బయటకు లాగాడు ఒక్కొక్కటి తిరగెయ్యసాగాడు.

అవి తన బియ్యే పాస్ సర్టిఫికేట్లు. కొన్ని వేల సార్లన్నా చూసుంటాడు. చూస్తోంటే మూర్తికి దుఃఖం ఆగలేదు.

''విలువలేని సర్టిఫికెట్లు. కృష్ణలో పారేసి రిక్షా తొక్కుకుంటే మెరుగు''

రెండు చేతులతో వాటిని చుట్టబెట్టి నుదుటి కాన్చి, అలాగే కళ్ళుమూసుకున్నాడు బాధగా.

ఓ నిముషం గడిచిపోయింది.

సర్వర్ ఎందుకో రాలేదు.

ఇంతలో ఎవరో 'అతను' హుటాహుటీని పెద్ద పెద్ద అంగలేసుకుంటూ వచ్చి, మూర్తి కెదురుగా, కాళీగా వున్న కుర్చీలో దబ్బున కూర్చున్నాడు ఆ శబ్దానికి మూర్తి చప్పున కళ్లు తెరచాడు.

ఏభై ఏళ్ళుంటాయ్ అతనికి; రిమ్‌లేస్ కళ్ళజోడు పెట్టుకున్నాడు. బక్కపల్చగా, పంచె కట్టుమీద లాల్చీ వేసుకొని వున్నాడు. చేతిలో ఓ చిన్న లెదర్ బాగ్ ఉంది. దాన్ని టేబుల్ మీద పెట్టాడు. నుదుటికి పట్టిన చెమటను చేత్తోనే వూర్చిపారెయ్యసాగాడు.

మూర్తి రెప్పవాల్చకుండా అతన్నే చూడసాగాడు. అతనమాంతంగా దృష్టిని ముందుకు సారించాడు. ''అరే! నువ్వా?'' అన్నాడు ఆశ్చర్యంగా కాస్త ముందుకు వొంగొని.

అర్థంకాలేదు మూర్తికి. అలాగే చూస్తూండిపోయాడు: మీరెవరో నాకు తెలీనట్లు. 'పెద్దమనిషి' ఫక్కున నవ్వాడు. అతని పళ్ళవరస పై భాగంలోని బంగారపు పన్ను తళుక్కుమంది.

''ఆశ్చర్యపోతున్నావ్ గదూ! నేన్నీకు తెలీకపోయినా, నువ్వు నాకు బాగా తెల్సు'' అన్నాడు. పెద్దమనిషి ఏకవచన ప్రయోగం వింటుంటే మూర్తి కదోలా అనిపించింది.

''అంటే మీరు?''

''నేనే'' అంటూ, వచ్చి పక్కగా నిలబడ్డ సర్వర్‌తో, ''వేడి వేడి రెండు పెసరట్లు పట్రా?'' అంటూ తనే ఆర్డరిచ్చేశాడు.

సంభ్రమాశ్చర్యాలతో చూస్తూండిపోయాడు మూర్తి. ''ఎక్కడి పరిచయం చెప్మా' అంటూ అలాగే ఆలోచనల్లో మునిగిపోయాడు. ఇంతకుముందెప్పుడూ ఎక్కడా చూసినట్టు గుర్తులేదు. మరీ 'పెద్దమనిషి' లుసున్నట్టు ఏకవచన ప్రయేగమేమిటి?

'అతను' ఠక్కున బల్లమీదకొట్టి 'ఇంతకీ పని దొరికిందా?' అన్నాడు,

మూర్తి కళ్ళల్లోకి సూటిగా చూస్తూ.

''పని'' అనగానే మూర్తి కళ్ళల్లో ఏదో ఆశాకిరణం తళుక్కుమంది. ''ఆవిషయం ఇతనికెలా తెల్సింది చెప్మా'' అనుకుంటూనే ''లేదండి'' అన్నాడు మరికాస్త ముందుకు వొంగొని.

''అలా చెప్పు'' అంటూ సర్వర్ పెట్టిన ప్లేటు పెసరట్టును గబగబా కడుపులో నెట్టేశాడు. గ్లాసుడు మంచినీళ్ళు త్రాగి నీ పేరు మూర్తి కదూ!'' అన్నాడు. నీళ్ళలో ముంచిన చేతుల్ని పెదాలకు తుడుపుకుంటూ.

మూర్తికి నిజంగా మతిపోయినట్టుంది. బేలగా చూస్తూ, అలాగే వుండిపోయాడు నోటమాటరాక.

సర్వరొచ్చాడు. ''కాఫీ తెమ్మంటారాసార్'' అంటూ. మూర్తి ప్లేటు కాళీకాక పోవడం చూచి''ఓ ప్లేటు రసగుల్లాలు మాత్రం పట్రా! చాలు'' అంటూ ఆర్డరిచ్చేసి 'ఇంతకీ నువ్వెవరి తాలూకూ?' అన్నాడు సూటిగా మూర్తి కళ్ళలోకి చూస్తూ.

అమాంతంగా సుత్తితో నెత్తిమీద కొట్టినట్లయింది మూర్తికి. నములుతున్న పెసరట్టు ముక్క నోట్లోంచి జారి కిందపడిపోయింది. అదిరిపడ్డాడు. మస్తిష్కంలో పేరుకపోయిన బూజంతా ఒక్కసారి దులిపివేసినట్లయింది.

''ఏంటన్నారూ....?'' నూతిలోంచి మాట్లాడుతోన్నట్టు నెమ్మదిగా అడిగాడు మూ .

''అబ్బే! ఏంలేదు. ఎవరితాలూకూ అని''

ఎవరి తాలూకూ?

మూ మనస్సెందుకో ఒక్కసారి గతంలోకి జారిపోయింది. ఆ ప్రశ్న వినడం తనకు కొత్తగాదు. ఎన్నోసార్లు విన్నాడు. ఏ కంపెనీ గుమ్మం తొక్కినా, ఎవర్ని కలుసుకున్నా మొట్టమొదట ఎదురయ్యే ప్రశ్నే ''ఎవరి తాలూకు?'' అన్నది.

చాలాసార్లు ప్రయత్నించావాడు. అసలు ఆపదంలో వున్న అర్థంకాని,

లోగుట్టుగాని మూర్తికి అర్థ అయితేగదూ!

అదేప్రశ్న తిరిగి , మళ్ళీ ఎదురైంది.

ఏమని జవాబు చెప్పడం?

ఆలోచిస్తోన్న మూర్తి ''మాట్లాడవేంటబ్బాయ్'' అన్న పిలుపుతో చప్పున ఈలోకంలో కొచ్చిపడ్డాడు.

''అంటే ఏంటండీ?'' అన్నాడు బిత్తరపోయి 'అతని' కేసి చూస్తూ.

'ఓరి పిచ్చి......' అంటూ అతను బిగ్గరగా నవ్వబోయి, అది హోటలని గ్రహించాడో ఏమో తక్షున నవ్వుకు స్వస్తి చెప్పి 'అలా చెప్పు. అందుకే నీకిన్నాళ్ళూ ఉద్యోగం దొరకలేదు అన్నాడు. సర్వర్ తెచ్చిన రసగుల్లాల్ని అమాంతంగా నోట్లోకి పెట్టేస్తూ.

నీరసించుకపోయిన మూర్తికి వెయ్యేనుగుల బలమొచ్చినట్టయింది. ఏదో నగ్నసత్యం తెలుసుకోబోతున్న వాడిలా కుతూహలంగా కాస్త ముందుకు జరిగి మరీ కూర్చున్నాడు.

''సార్! మీ మేలు జన్మ జన్మలకీ మర్చిపోను. ఏదైనా ఉద్యోగం దొరికేమార్గం...'' చేతులు నలుపుకుంటూ, ఆశగా చూస్తూ అడిగాడు మూర్తి.

'చెప్తాను. తొందరపడతావేం....' అంటూ పక్క నిలబడ్డ సర్వర్‌తో 'ఓ రెండు డబల్ స్ట్రాంగ్ కాఫీలు పట్రా.....' అంటూ ఆర్డర్ పడేసి, ''చూడబ్బాయ్! చదువైతే చదువుకున్నట్టున్నావ్ గాని ప్రపంచజ్ఞాన బొత్తిగా లేనట్టుందే.....అలా అంటున్నాని కోపగించుకోకు. ఎందుచేత ంటే, దాదాపు మూడేళ్ళునుంచీ ఉద్యోగం సంపాయించుకోలేపోయావు కదూ - అందుకని అంటున్నాను.' అని ఓ క్షణం దీర్ఘంగా ఆలోచనలో ము గిపోయాడు. 'పెద్దమనిషి'.

మూర్తి. కృష్ణుని గీతబోధ వింటున్న అర్జునిలా, అలాగేచూస్తూ వుండిపోయాడు.

ఓ రెండు నిముషాలు భారంగా గడిచిపోయాయి.

'ఆఁ ఇదిగో!' అంటూ గబగబా కాగితం కలం తీసి, ఏదో పేరు, ఎడ్రసు రాసి, 'ఈ అడ్రసులోవున్న ఆసామీ దగ్గరకు వెళ్ళి నీ కష్టాల్ని చెప్పుకో. చాలు. నీకు నిమిషాలమీద పని దొరికిపోతుంది. నేను పంపించానని చెప్పు. తెల్సిందా?'' అంటూ చప్పున పైకిలేచాడు. నిలబడే టేబిల్ మీదున్న కాఫీని గడగడ త్రాగేశాడు. బేగ్‌ను సవరించుకొని , 'వస్తా'నంటూ, సర్వర్ బిల్లివ్వకముందే గబగబా బయటికి నడిచి వెళ్ళిపోయాడు.

మూర్తి సంతోషానికి పట్టపగ్గాలు లేక పోయాయి. ఆనందంతో ఉక్కిరిబిక్కిరై పోయాడు. తన కష్టాలిన్నాళ్ళకు గట్టెక్కుతున్నందుకు మనసు పరవసించిపోయింది. ఈనాడు తనొక మనిషి కాబోతున్నాడు.

గబగబ కాఫీ త్రాగడం పూర్తిచేసి, సర్వరిచ్చిన బిల్లు తీసుకొని కౌంటర్ దగ్గరకు వచ్చాడు. రెండ్రూపాయలనోటు, బిల్లు టేబిల్ మీదపెట్టాడు. తిరిగొచ్చింది అర్థరూపాయి కాసు, నిర్ఘాంతపోయాడు మూర్తి. బిల్లువంక చూశాడు. పెద్దమనిషిదీ తనదీ కలిపి రాసుంది. మూర్తి పరిస్థితి కళ్ళనీళ్ళ పర్యంతమైంది.

సుందరమ్మ రూపం ఒక్కసారి కళ్ళముందు ప్రత్యక్షమైంది.

''భగవాన్! బియ్యంమాటేమిటి? అమ్మకేం సమాధానం చెప్పను?'' దుఃఖం పొంగుకొచ్చింది మూర్తికి. నెమ్మదిగా కాళ్ళీడ్చుకుంటూ బయటికొచ్చేసాడు.

ఎండ మరింత నిప్పులు చెరుగుతోంది.

ఆకాశంకేసి తీక్షణంగా చూశాడు మూర్తి ఏది దారి అన్నట్లు'

చప్పున పెద్దమనిషి ఇచ్చిన అడ్రసు కాగితం జేబులోంచి బయటకి తీశాడు. ''శ్రీపతి'' నోట్లోనే గొణుక్కున్నాడు. 'అతణ్ణే కల్సుకుంటే పని నిముషాలమీద దొరికిపోతుంది' పెద్దమనిషి మాటలు కొట్టొచ్చినట్లు విన్పించాయి చెవుల్లో.

'భగవంతుడా! నీదే భారం' మనసులోనే అనుకుని గబగబా బీసెంటు రోడ్డుగుండా నడక సాగించాడు. సూర్యారావు పేట సెంటర్ కొచ్చాడు,

మలుపుతిరిగాడు. అడ్రసు తెలుసుకున్నాడు. తక్షణ ఆగిపోయాడు.

శ్రీపతిగారి బంగళా కొట్టొచ్చినట్టు కన్పడుతోంది. చుట్టూ ప్రహరీ గోడ సింహద్వారం గుండా హాలు వరకు అందమైన పూల వనం చాలా చక్కగా అమర్చబడి వుంది. గేటు దగ్గర వున్న గూర్ఖా యమునిలా పహరా ఇస్తునా డు.

''కౌన్‌హా!'' మూర్తి, దగ్గరకొచ్చిన తర్వాత అడిగాడు గూర్ఖా.

జవాబిచ్చాడు మూర్తి.

''సాబ్ షామ్‌కో ఆయేంగే!'' అన్నాడు గూర్ఖా.

మూర్తి శ్రీ పతిగార్ని కల్సుకోందే ఇంటికి వెళ్ళగూడదనుకున్నాడు. ప్రక్కనున్న బల్లమీద అలాగే చతికిలబడిపోయాడు. ఆ క్షణంలో భవిష్యత్తంతా అగమ్య గోచరంగా అగుపించింది మూర్తికి.

సాయంత్రం అయిదయిపోయింది.

శ్రీపతిగారు కారు దిగారు,

ఆజానుబాహుడు, నిండైన విగ్రహం, దాదాపు ఆరడుగుల ఎత్తు, ఎత్తుకు తగ్గ లావు చూసి, చప్పున పైకి లేచాడు మూర్తి. లోప కి వె న్న శ్రీపతిగారికి నమస్కరించాడు. పెద్ద పెద్ద అంగలేసుకుంటూ వెళ్తున్న శ్రీపతి గారు మూ ని చూసీ చూడనట్టు తలాడిస్తూ గబగబా లోనికి వెళ్ళిపోయారు. ఆయిన నడుస్తోంటే ఓ చిన్న సైజు పర్వతం కదులుతున్నట్టనిపించింది మూర్తికి.

శ్రీపతిగారు లోనికడుగెట్టారో లేదో గుర్ఖా గేటు మూసేశాడు. రాత్రి ఏడు గంటలు దాటినా, మూర్తికి శ్రీపతిగారితో ఇంట దొరకలేదు. అనేకమంది రావడం, శ్రీపతి గారిని కలుసుకోవడం, పోవడంజరుగుతుంది గానీ మూర్తికి మాత్రం శ్రీ పతిగారి దర్శనం దొరకలేదు.

బ్రతిమిలాడుకోగా, బ్రతిమిలాడుకోగా ఏడు ఏభై నిముషాల ప్రాంతంలో, గుర్ఖా మూర్తిని లోపలికి పోనిచ్చాడు. తుకుబితుకులాడుతోన్న గుండెలతో, లోపలికడుగెట్టాడు మూర్తి. ప్రతిగా నౌకరు కాబోలు మూర్తిని లోపలిహాల్లోకి తీసుకవెళ్ళాడు. ఒక ప్రక్క శ్రీపతిగారికి తన. కష్టాలు ఎలా

చెప్పుకోవాలో రిహార్సలు వేసుకుంటూ, మరో ప్రక్క ఇష్టదేవతలందర్నీ మ్రొక్కుకో సాగాడు మూర్తి. తనకెలాగైనా ఉద్యోగం దొరికేలా చేయమని.

ఆలోచిస్తూ, నౌకరు వెంట హాల్లోకి వచ్చిన మూర్తి ఎదురుగా, సోఫామీద, దర్జాగా హుందాగా కూర్చొన్న శ్రీపతిగార్ని చూసి ''నమస్కార మండి'' అన్నాడు చేతులు జోడించి వినమ్రతగా.

'ఊ!( ఎవరితాలూకూ?' శ్రీపతిగారి కంఠం కంచులా మ్రోగింది.

మళ్ళీ అదే ప్రశ్న!

అర్థంకాని ప్రశ్న!!

''హరి భగవంతుడా! చచ్చాను''

నీరుగారి పోయాడు మూర్తి. చేతులూ కాళ్ళూ గజగజలాడిపోయాయి. ముఖమంతా చెమట పట్టేసింది. అలాగే శ్రీపతిగారి కళ్ళల్లోకి చూస్తూవుండి పోయాడు చేతులు కట్టుకొని.

''ఊ''!! మాట్లడవేం'' ఘర్జించింది శ్రీపతిగారి కంఠం.

హోటల్లో కనిపించిన పెద్దమనిషి పంపించినట్టు చెప్దామనుకున్నాడు మూర్తి. గాని పేరుతెలిస్తేగా! అడగటం మర్చిపోయిన సంగతి అప్పటిగ్గాని గుర్తుకురాలేదు.

'అలానాన్చుతావేం! ఎవరి తాలూకూ అంటే?''

మళ్ళీ హెచ్చరిస్తూ అడిగింది శ్రీపతిగారి కంఠం కాస్త హెచ్చుస్థాయితో.

ఏం చెప్తాడు తను.

ప్రశ్న అర్థం అయిచస్తే గదూ!

తనొక చదువుకొన్న మూర్ఖుడు.

అంత కంపరంలోనూ, మూర్తికెందుకో నవ్వుకోవాలనిపించింది.

''ఏంటి మాట్లాడవ్'' అంటూ శ్రీపతిగారు చఱ్ఱున పైకి లేచారు.

కుంచించుకుపోయాడు మూర్తి, ఏనుగును చూసి, ఎలకపిల్ల భయపడిపోయినట్లు.

శ్రీపతిగా రొక్కమారు మూర్తి కేసి, ఎగాదిగా చూసి, చకచకా నడుచుకుంటూ మేడమీదికి వెళ్ళిపోయారు. మరో రెండు నిముషాలవకమందే తిరిగి దిగివచ్చారు. హుటాహుటిని వచ్చి కారెక్కారు. 'ర్‌య్' మంటూ కారు పెద్ద శబ్దం చేసుకుంటూ ముందుకు దూసుకుపోయింది.

కారు వెళ్ళిపోయాక తెలివితెచ్చుకున్న మూ కి, జరిగిందంతా ఏదో లీలగా అగుపించింది. ఎందుకో కళ్ళల్లో కన్నీరు పేరుకుపోయింది. కాళ్ళీడ్చుకుంటూ, బయటి కొచ్చాడు. శ్రీపతిగారి కారు వెళ్ళినవేపు, చూస్తుండిపోయాడు. నిరోమయంగా చూస్తోన్న మూర్తి దగ్గరకు , శ్రీపతిగారి నౌకరొచ్చి, ''నా మామూలిప్పించండి బాబూ'' అన్నాడు మెల్లగా చెవిగోక్కుంటూ.

''ఇదేంటి?'' అని అడిగితే.

''అదంతే బాబూ!'' అన్నాడు నౌకరు,

జేబులో వున్న అర్ధరూపాయి కూడా క్షౌరమై పోయింది మూ కి.

''పాపం అయ్యగారిసేత . ఏదో సిఫార్సు చేయించుు వాలని వచ్చినట్టున్నారు. ఒక్కడివే వొత్తే అవుతుందాబాబూ నీ చాదస్తంకాని''

వింటోన్న మూర్తికేదో నగ్నసత్యం గోచరించినట్టయింది.

అంటే -

తనగురించి శ్రీపతిగారికి చెప్పడానికి ఇంకొకరి సిఫార్సు కావాలన్నమాట.

వెన్నుమీద ఛళ్ళున చరిచినట్టయింది మూర్తికి.

ఇన్నాళ్ళూ తనను ''ఎవరి తాలూకా?'' అని అడిగిన ష్నకు జవాబు ఎవరి రికమండేషననా?

మూర్తి మనస్సులో గూడుకట్టుకపోయిన మబ్బు లొక్కమారు విచ్చుకపోసాగాయి. ఠక్కున నౌకరుకేసి తిరిగాడు.

''పిచ్చివాడా! ఇంతమాత్రం తెలీదూ!'' అన్నట్లున్నాయ్ తననే చూస్తోన్న అతని చూపులు.

తను పూర్తిగా ఓడిపోయాడు.

అవును.

ఓడిపోయాడు.

తనలాంటి అసమర్థుడు నిరుద్యోగి ఓడిపోక ఏం చేస్తాడు?

దేశంలో వున్న లక్షోపలక్షల నిరుద్యోగులకు బహుశా తనలాగే "ఎవరి తాలూకూ?" అన్న ఉద్యోగ పరిభాషలోని అంతరార్థం అర్థమయివుండదు.

ముమ్మాటికీ నిజం!

అర్థమయివుండదు.

ఉన్నా -

తనలాగే చేసేదేముంది?

బీటలు బారిన భవిష్యత్తులోకి నిరామయంగా పరుగులు తీస్తోన్న మూర్తి రేడియోలో విన్పిస్తోన్న ఘంటసా కంఠానికి ఉలిక్కిపడి తెలివితెచ్చుకున్నాడు.

అవినీతి బంధుప్రీతి చీకటి బజారు

అలుముకొన్న నీ దేశం ఎటు దిగజారు?

కాంచవోయి నేటి దుస్థితీ...

ఎదురించవోయి యీ పరిస్థితీ...

పాడవోయి భారతీయుడా....

తారాస్థాయిలో పాట సాగిపోతోంది. వింటున్న మూర్తికి లోకం పోకడ లీలగా అర్థమవసాగింది.

***

# ఎం ,మం

రచన :

సి.డి.ఎస్. రామయ్య

నేను నవ్వలేకుండా ఉండలేకపోయాను...

సంవత్సరం నిండిన అల్లరి పిల్లవాడు - మా మల్లిబాబు చేస్తున్న అల్లరి అలాంటిది!

'మీ అమ్మ ముఖం ఎలా వుంది నాన్నా?' అని ప్రశ్నిస్తే - బుంగముఖం పెట్టి కళ్ళు మూసుకుని - అలా వుందని జవాబిచ్చాడు...

నా శ్రీమతి శారద కూడా వాడి అల్లరికి మనస్సు విప్పి నవ్వసాగింది... పిల్లలు చేసే అల్లరి తనానికి కోపం రావడం కంటే, ఆనందమే అమితంగా అనుభవించదగిన అనుభూతులు గాబోలు!

'మీ నాన్న ముఖం ఎలా వుంది బాబూ?' అని శారద వేసిన ప్రశ్నకు - మా మల్లిబాబు ఒక్కసారి నా ముఖం కేసి చూసి పళ్ళికిలించి వాలు చూపులు చూశాడు...

నాడికి ఒక్కటి అంటించాలన్న ఆవేశం నాకు కలిగినా, ఆ అల్లరిలోని ఆనందం నన్ను సంతృప్తుణ్ణి చేసింది. కాని పైకి ఆవేశం చెందిన వాడిలా చేయి ఎత్తి వాణ్ణి కొట్టబోయాను.. అంతలో - శార బిగ్గరగా నవ్వుతూ వాణ్ణి చేతుల కెత్తుకుని వెళ్ళబోయింది...

పిల్లల వల్ల కలిగే ఆనందం అలాంటిదే కాబోలు అని నాలో నేనే నవ్వుకుంటున్న సమయంలో-

శారద నవ్వు హఠాత్తుగా ఆగిపోయింది... అది గుర్తించి - ఆమె వైపు విచిత్రంగా చూశాను... పిల్లవాడ్ని చేతుల కెత్తుకున్న శారద - వీధి వైపు చూస్తూ వుంది... 'రా! అన్నయ్యా! ... అక్కడే నిలబడ్డారేం?' అని పలకరించింది...

కూర్చున్న చోటి నుండి ఆతురతగా లేచి, వీధిలో ముంగిటి వరండాలోకి చూశాను. రంగరాజు గోడకి వారిగిలగా నిలబడి, చిరునవ్వు నవ్వుతున్నాడు.

'రా, రాజూ! వచ్చి చాలా సేపయిందా? నువ్వు వచ్చిన సంగతి...' అంటూన్న నా మాటలు పూర్తిగాక ముందే, రంగరాజు నవ్వి -

'... ఎలా తెలుస్తుంది చెప్పు? ..... పిల్లవాడి అల్లరితనానికి బానిసలై, మరో లోకంలోకి దిగజారిపోయిన మీరు - నేను వచ్చి పావుగంటైనా నన్ను గుర్తించడానికి తగిన ఆస్కారం లేదు. .. ఆ ఆనందం అలాంటిది!... ఏమంటావ్?' అన్నాడు... వాస్తవానికి సన్నిహితంగా వున్న అతని మాటల్ని నేను కాదనలేకపోయాను..

రంగరాజు లోపలికి వచ్చి, మరో కుర్చీలో కూర్చున్నాడు... మా మల్లిబాబును కిందికి దింపి శారద వారగిలగా నిలబడింది... తప్పటడుగులు వేస్తూ తనను సమీపించిన మా అబ్బాయిని - రంగరాజు అందుకున్నాడు...

'శూరుడివిరా, బాబూ!... జీవితంలో అనుభవించదగిన మధురానుభూతులు - ఒక్క వెళ్ళివల్లే కలిగేవి కాదని నిరూపించావు...! నీ తల్లిదండ్రులు అదృష్టవంతులు!' అన్నాడు రంగరాజు.

అతనా మాటలు అంటున్నప్పుడు, నేనతని ముఖంకేసి చూశాను. ఆ ముఖ కవళికలను బట్టి, మనస్సులోని బాధలు, అతన్ని అలా మాట్లాడించి వుంటాయని చెప్పడం తప్ప, మరో విధంగా అనుకోలేను.. అవును మరి!

వేళకి ఇంత అన్నంలేక, ఆకలిని తీర్చుకోలేని వారు కొందరుంటారు. అది వాళ్ళ దురదృష్టం! అనుభవించడానికి అన్ని వసతులున్నా, వాటిని అనుభవించలేని రీతిలో కొందరుంటారు; అది ఆ తీరువాళ్ళ దురదృష్టం! కాని, అన్ని వసతులుండీ, వాటిని అనుభవించగల దార్ఢ్యముండీ - వాటికి దూరమై పోయిన అదృష్టహీనులు కొందరుంటారు! వాళ్ళని గురించి ఏమనుకోవాలి? ... ఈ కోవకు చెందిన వాడే మా రంగరాజు !

★ ★ ★

పెట్టి పుట్టిన కుటుంబంలో జన్మించిన వాడు రంగరాజు.. వాళ్ళ నాన్న గారు స్థితిమంతుడు; తల్లిగారు శాంతమ్మ - లక్ష్మీదేవికి ప్రతి స్వరూపం. ఆమె ఆ ఇంటికి వచ్చిన వేళా విశేషం వల్లనే, వాళ్ళకా ఐశ్వర్యప్రాప్తి కలిగిందని లోకప్రచారం. ఆ దంపతులకు ఒక్కగానొక్క కొడుకై పుట్టి, గారాబంగా పెరిగి, ఆ గారాబం వల్ల మందమతి అయి, చదువుల్లో మొద్దయి - ఎలాగో బి.ఎ తరగతి సగంలో చదువు చాలించుకున్న ఘనుడు - రంగరాజు. అతను ఇంటర్ తరగతిలో ఉండగానే వాళ్ళ నాన్న గారు గుండె పోటువల్ల శాశ్వతంగా మానవలోకం విడిచిపోయారు.. అప్పటి నుండీ తల్లి చనువువల్ల, మితిమీరిన గారాబం వల్ల పెరిగాడు పెళ్ళీడు వరకూ.

పిల్లవాడు ఎంత మొద్దయినా వాడికి ఆయా కాలాలలో, ఆయా ముచ్చటలు తీర్చడం, అందువల్ల కలిగే ముచ్చటలను తాము అనుభవించ తలచుకోవడం తల్లిదండ్రుల బాధ్యత గాదా?

శాంతమ్మ తన కొడుక్కి సరిపోయే సంబంధం కోసం ప్రయత్నించసాగింది. గౌరవంలో, అంతస్తులో తమకు సరితూగే అందమైన అమ్మాయిని కోరుకుంది ఆ తల్లి... ఆ ప్రయత్నంగా ఉషారాణి ఆమె అంతరాత్మకు నచ్చింది.

ఉషారాణి బి.ఎ పట్టభద్రురాలు. డాక్టర్ జగన్నాధం గారి ఏకైక పుత్రిక.. ఏ విషయంలోనూ తన మాటకు ఎదురు వుండకూడదన్న వాత్సల్యంతో పెరిగిన యువతి. మహిళా మండలి సభ్యురాలు.. సాహిత్య, లలిత కళల సేవలలో ఆమెకు ఎక్కువ మక్కువ.. తను ఓ గొప్ప కుటుంబంలో కోడలిగా ప్రవేశించడంలో ఎంతో ప్రయోజనం వుంటుందని అపోహపడి, రంగరాజును వివాహమాడ్డంలో సంపూర్ణ సమ్మతాన్ని తెలియపరిచింది... పెళ్ళి చూపులూ, 'మిగతా' విషయాలూ ఉభయులనూ అంగీకరింపచేశాయి...

ఓ సుముహూర్తాన - శాస్త్రబద్ధమైన ళ్ళి టల మీద రంగరాజూ, ఉషారాణీ దంపతులయ్యారు. ఆ వివాహం వైభవంగా జరిగింది... ఉభయుల పెళ్ళి వారికీ సంబంధించిన గొప్ప గొప్ప వారు ఆ పెళ్ళికి హాజరయ్యారు. ౮

జాతికి చుక్కలుగా, మెరిసే మహిళామణులు కూడా విచ్చేసి, సంఘంలో స్త్రీకి వున్న విలువను గుర్తించి, ప్రవర్తించి, ఆదర్శ మహిళ కావలసిందని - ఉషారాణిని ఆశీర్వదించారు...

ఆ దంపతుల నవజీవనం పువ్వుల బాటలో ప్రారంభమైంది... రంగరాజుకు ఉద్యోగం లేదు; డబ్బున్న వాళ్ళు ఉద్యోగం చేయడం గౌరవ రహితం అని ఆ జాతివాళ్ళ భావన... ఆ కోవకు చెందిన వాడవడం వల్ల రంగరాజు కూడా - ఉద్యోగ ప్రయత్నం చేయలేక పోయాడు.. ఖర్చుకు మించిన రాబడి వుండడం వల్లా, తన ముద్దుల కొడుకు ఉద్యోగమంటూ చేసి - ఏ విధంగానూ మనస్సును కష్టపెట్టుకోకూడదు - అనే ఆశాభావం వున్నందువల్ల, శాంతమ్మ తన కొడుకూ కోడలి సుఖజీవనంలో ఎలాంటి అడ్డూ రాకుండా నడిపించసాగింది... అనుకున్నంతలో వెళ్ళడానికి ఓ కారూ, పిలిస్తే పలకడానికి నౌకర్లూ, ఇష్టమొచ్చిన రీతిని ఖర్చు చేయడానికి కావలసిన డబ్బూ - వాళ్ళ సుఖాలకుప్రతిబింబాలుగా అనుసరించాయి... అలా జీవితం - సుఖవంతంగా కొంతకాలం గడిచింది...

రంగరాజును చేపట్టిన మూడో నెలలో ఉషారాణి తన మహిళా మండలికి ఉపాధ్యక్ష పదవి అలంకరించింది. ఆ పదవి పొందడంలో ఓ ముఖ్యమైన కారణం వుంది.... ఆర్థిక సహాయం, ఆమెవల్ల తరుచూ లభించడం వల్ల - మహిళా మండలి సభ్యురాండ్రు ఆమెను ఒక ఉన్నత స్త్రీరత్నంగా గౌరవించారు.. కథ అలా గడిచింది.

దంపతుల జీవనంలోకి మధురమైన పొంగులు చిరకాలం వరకూ స్థాయిగా ఉండాలంటే వాని మనోభావాలు ఒకరికొకరికి సన్నిహితమైన తీరులో సాగాలన్నది శాసనం... ఆ భావాలకు విరుద్ధ జీవులు హాయిగా బ్రతకలేరు; మనశ్శాంతి అనుభవించలేరు...

మంచిని కోరే ఏ సంస్థనైనా మానవజాతి సంపూర్ణంగా వాంఛిస్తుంది... కాని, ఆ మంచికోసం ముళ్ళ పొదలను విదిలించాలన్న విషయం మానవ జాతికి తెలిసినా, ప్రయత్నానికి ముందంజ వేయడం సందేహమే!

★ ★ ★

ఉషారాణి ప్రవర్తనలో - ఓ కొత్త మార్గం కనిపించడం రంగరాజూ, శాంతమ్మ గారలు గుర్తించారు కొన్నాళ్ళ తరువాత. ఉపాధ్యక్ష పదవి కరించిన తరువాత, ఉషారాణి ఎప్పుడూ - తన మహిళా మండలికి తను చేయదగిన ఆదర్శాలను గురించి తలపోయడం, చేతనలకి ప్రయత్నించడంలో మునిగిపోయింది. రోజులు గడిచే కొద్దీ, తన కుటుంబంలో ఓ కపెద్ద దిక్కు వున్న మాట కొంత కొంతగా మరిచిపోయింది... ఉదయం లేవడం, కావలసినవన్నీ ముగించుకోవడం పదయ్యే సరికి మహిళా మండలికి చేరుకోవడం, వీలయితే మధ్యాహ్నం భోజనానికి రావడం, లేకపోతే ఒక్కసారిగా రాత్రి ఎనిమిదింటికి ఇల్లు చేరి ఉస్సురుమని నిద్రకుపక్రమించడంతో ఆమె కార్యక్రమం ముగిసిపోసాగింది..

తన కోడలి ప్రవర్తనలో కలిగిన పరివర్తనను చూసి, కొన్నాళ్ళ వరకూ శాంతమ్మ ఓర్చుకుంది. తరువాత మెల్లగా సముదాయించ ప్రయత్నించింది. కాని ఉషారాణిలోని నిర్లక్ష్యాన్ని గుర్తించి, మందలించడం కూడా చేసింది. సంసార స్వర్గసీమలో ఎన్నో మధురానుభూతులు అనుభవించవలసిన తన కొడుకు జీవితంలో ఉషారాణి కార్యక్రమం వల్ల - ఎలాంటి పరిణామాలు చెలరేగుతాయో అని ఆ మాతృహృదయం పరితపించింది...

అందమైన అమ్మాయిని చేసుకున్నందుకు, మొదట గర్వ డ్డ రంగరాజు క్రమేణా ఆమె ప్రవర్తనలోని సరిహద్దులను గు ంచి మనః నొచ్చుకున్నాడు.. పెళ్ళయిన మొదటి రోజులలోలాగా - ఉషా తనతో పట్టున గంట నిలబడి మాట్లాడలేకపోతోంది... తన మహిళా ఆదర్శమూ, తన బాధ్యతలతోనే ఆమె కాలం గడపడం అతను పూర్తిగా నిరాకరించలేకపోయాడు.. కాని, మాంగల్యం కట్టిన అనుబంధం కోసమైనా ఆ అనుబంధంలోని ర్మం కోసమైనా ఉషా - తనతో, తనను అనుసరించి జీవితం గడపలేకపోతున్నదని బాధపడ్డాడు...

ఆ విషయం గుర్తుకు తెచ్చి, తన అర్ధాంగిని మొదట అనురాగంతో మందలించాడు... పిదప పిచ్చి ఆవేశంతో మందలించాడు... కా ...

'ఉషారాణి ఆదర్శం' అన్న భ్రమ ో మునిగిపోయిన ఉషారాణి -

అందులోని నిజమైన సత్యాన్ని గ్రహించలేక అందరి మాటలనూ ధిక్కరించింది. తను చదువుకున్నది; లోకజ్ఞానం, గ్రహించినది: సమాజంలో స్త్రీలకున్న హక్కును, బాధ్యతనూ, ధర్మాన్నీ ఎరిగినది! ఏ విషయంలోనూ మంచీ - చెడులను గుర్తించి ప్రవర్తించగలిగినది... ఎవరి సలహాలనూ పాటించి, బ్రతకాలన్న నియమం తనకు లేదని తన అభిప్రాయం వెల్లడించింది...

మాతృమూర్తి కాబోతున్న తన కోడలిని ఏ కాస్త విధంగానూ నొప్పించకూడదనే వాత్సల్యంతో ఆమెనేమీ అనవసరంగా నొప్పించకూడదని తన కొడుకును ఆదేశించింది శాంతమ్మ తండ్రిని కాబోతున్నానన్న పూరింపుతో రంగరాజు మౌనం వహించి వీలు చిక్కినప్పుడల్లా భార్య ఆనందాలకు అనుగుణంగా ప్రవర్తించాడు...

'గారాబం గర్వానికి హేతువు;

ముద్దు పెంపకం - మొద్దుతనాలకు మూల కారణం'

ఈ జంట బిడ్డలు సమాజానికి చీడ పురుగులు -

★ ★ ★

కాలచక్రం తిరిగింది...

ఉషారాణి ఆడ పిల్లకి తల్లి అయింది. 'పిల్ల తల్లిపోలికే...!' అన్నారు. అందరూ మనుమరాలి పుట్టుకకు శాంతమ్మ ఉప్పొంగిపోయింది... రంగరాజు ఆనందానికి అందులేదు.. అతనికి తండ్రి నయ్యానన్న సంతృప్తి...

పుట్టిన పిల్లకు బారసాల ప్రశాంతంగా జరిగిపోయింది... జయంతి అని పేరు పెట్టారు.

పాపాయి 'జయంతి' తన తల్లిపాలు త్రాగడానికి నోచుకోలేదు.. బాలింతరాలు మూడు నెలల వరకూ ఇంట్లో వుండిపోయేసరికి మహిళా మండలి కార్యక్రమాలు (తన వల్ల నెరవేరగలిగినవి) ఎన్నో ఆగిపోయినట్టు ఊహిం చింది... 'ఆయా' పేరిట ఒక అమ్మను నియమించి, ఉషారాణి తన బాధ్యతలకు పూనుకుంది.

శాంతమ్మ చింతిల్లింది. నవ హైందవ సమాజంలో ఇంతటి పరిణా

మమా? తల్లి పొత్తిళ్ళలో ఎదగవలసిన బిడ్డకు, ఆయా ఆశ్రయమా? రక్తపు మధు నిండిన తల్లి పాలను త్రాగి, చిరునవ్వు చిలికించవలసిన ప్రతిబింబానికి పాలు రకాలలో పలు విధాలా?.. శాంతమ్మ తమ కుటుంబంలో ఏర్పడిన పరిస్థితిని తలుచుకుని, కొన్నిసార్లు కన్నీరు కూడా కార్చింది. కాని, ఇవన్నీ బయటి ప్రపంచానికి పొక్కడం మూలంగా - తమ కుటుంబ ప్రతిష్టలకు భంగం కలుగుతుందని కూడా సందేహించింది.

పాపాయి జయంతి కోసమైనా - ఇక మీదట మండలి అనుబంధాన్ని మానుకోమని తన భార్యను ఆదేశించాడు రంగరాజు. ఉషారాణి ఉడుకు మోత్తనం పడగవిప్పి ఆడింది. 'పిల్లల్ని కనుక్కోడంతో స్త్రీలు తమ ఆశల్నీ, బాధ్యతలన్నీ కూడా చంపుకోడానికి ప్రయత్నించరు. స్త్రీలకున్న బాధ్యతలు - సుఖదుఃఖాలలో సమానార్హులైన పురుషులకు కూడా వుండాలి. అన్నిటిలోనూ అలాగే అనుసరించాలి' అని ఎత్తిపొడుపుగా జవాబిచ్చింది...

భార్య మాటలలోని గూఢార్థం ఏమిటో రంగరాజుకు అర్థమైంది. పిల్లల పెంపకం విషయంలో స్త్రీలకెంత బాధ్యత వుందో, అంత బాధ్యతా పురుషులకుందని, ఆ బాధ్యతను తను పుచ్చుకోవాలని ఉషారాణి చెప్పక చెప్పిందని ఊహించాడు... ఆ విషయం వాస్తవానికి దూరం కాదు; అలాగని హిందూ సంప్రదాయానికి నైజం కాదు..

పాపాయి జయంతి సంవత్సరం పెరిగింది శాంతమ్మ చేతుల మీదుగా...

ఒక రోజు పాపాయికి అమితమైన జ్వరం తగిలింది. తల్లిపాలు మినహా, మరొకటి త్రాగించకూడదని డాక్టరు చెప్పి వెళ్ళారు... ఆ రోజు ఉదయం వెళ్ళిన ఉష - ఆ సాయంత్రం నాలుగింటి వరకూ ఇంటికి తిరిగి రా దు.. ఆపైన రంగరాజు వెళ్ళి బిడ్డకోసమైనా ఇంటికి రమ్మని ఆహ్వానించాడు... అప్పటి మహిళా మండలి వార్షికోత్సవ సంస్కరణ మూలంగా - రావడానికి కొంత సేపవుతుందని చెప్పి, రావడానికి నిరాకరించింది... రంగరాజు హృదయంలో ఆవేశం రగుల్కొంది... 'నవమాసాలూ మోసి కన్న ఏ తల్లీ - తన బిడ్డ అపాయ స్థితిలో వుండగా అలా అనదు... అసలు ఉషారాణిది ఒక మాతృమూర్తి

జన్మమేనా?' అనుకున్నాడు... ఆమె ఒంటరితనంగా వుంటే, నాలుగు చీవాట్లు పెట్టి వచ్చేవాడే!... కాని, నలుగురి ఎదుట, ఆమెను అగౌరవపరచడం అతనిష్టపడలేదు..

ఆ రాత్రి ఒంటి గంటవేళ మహిళా మండలి నుంచి ఉషారాణి ఇల్లు చేరింది... పాపాయికి ఎలా వుందన్న విషయం కూడా పట్టించుకోలేదు.. సరాసరి తన గది చేరి పడుకుంది... అన్నీ గమనిస్తూ వుండిపోయిన రంగరాజు - ఓ పురుష హృదయుడు... ఇల్లాలు అల్లరి చేయగలదని అంతవరకూ ఓర్చాడు... అతని మనోభావాలు ఇప్పటికి మారాయి... ఆవేశానికి బానిసై ఆమె గది చేరాడు... మానవ హృదయాల విలువలను ఎత్తి చూపించి - కసితీరా తన భార్యను చీవాట్లు పెట్టాడు... తన విలువను గుర్తించని భర్తను ఎదిరించింది ఆదర్శ మహిళ! ఆ ఫలితంగా భర్తచేత దెబ్బలు తిని, అవమానం పొందింది ఉష.

ఆ ఘటన జరిగిన తరువాత పావు గంటలో తన బట్టలు అవీ సర్దుకుని, పాపాయిని తీసుకుని టాక్సీలో తన తండ్రి దగ్గరకు వెళ్ళిపోయింది ఉష.. ఒక ఆడజన్మ చేయదగిన ఉత్తమ కార్యమదేనా? అని ప్రశ్నించుకున్నాను నేను. నిజంగా - ఉష తన విలువను గుర్తించుకోలేని విచిత్ర ఆదర్శ మహిళ.

ఉష వెళ్ళిపోయినందుకు విచారపడలేదు రంగరాజు... కాని, తన ప్రతిబింబంగా మెరిసిన పాపాయి జయంతికోసం బెంగపడ్డాడు... తన కోడలి ప్రవర్తన వల్ల తమ కుటుంబ ప్రతిష్ఠలు తారుమారయినట్టు కుమిలిపోయింది శాంతమ్మ.

కన్నీరు మున్నీరుగా వచ్చిన ఉషారాణిని చూసి, ఆమె చెప్పిన మాటల్ని విని డాక్టరు జగన్నాథం రెచ్చిపోయాడు... తన కూతురి వల్ల దోషం లేదని నిశ్చయించుకుని ప్రతీకారం కోసం ఎదురు చూశారు...

విడిపోయిన దంపతుల హృదయాలలోని మలినాన్ని కడిగేయడానికి ఎన్నో మధ్యవర్తిత్వాలు జరిగాయి... ఎక్కడైనా తనిష్ట ప్రకారం ప్రవర్తించే హక్కు తనకు వుందని శాసించింది ఉషారాణి... ఆ హక్కు ఆమెకు ఇవ్వడం వల్ల తనకున్న 'భర్త' అనే గౌరవాన్ని విదిల్చుకోవలసి వస్తుందని హెచ్చరించాడు

రంగరాజు... వారి వాదనల్లో ఎక్కడా పొత్తు కుదరలేదు... అలా కాలం గడిచింది.

పాపాయి జయంతి నాలుగేళ్ళ వయస్సు అందుకుంది. ఆ పెంపకం తాతగారింట్లోనే జరిగింది. రంగరాజు తరచూ అక్కడికి వచ్చి అమ్మాయిని చూసి వెళ్ళేవాడు... అతన్ని చూసినప్పుడల్లా అతనే తన నాన్నగారు అన్న అభిప్రాయం మాత్రం ఆ పిల్లకు కలిగేది. కాని, కుమార్తె అన్న రీతిలో ఒక అమ్మాయి తనకున్నా పెంపకంలోని ఆ ముద్దు ముచ్చటలను రంగరాజు ఎప్పుడూ అనుభవించి ఎరుగడు... అది అతనికి తీరని వాంఛ.

★ ★ ★

'నరసింహం! ఓ ముఖ్య విషయం చెప్పి పోదామనే నేనిక్కడికి వచ్చాను!...' అని రంగరాజు నన్ను కదిలించాడు... నేను ఊ కొట్టాను...

'ఆయన లోకంలో ఆయనుంటారు గానీ...' అని హేళనగా మందలించిన నా శ్రీమతిని-

'భార్యగారూ!... మీరు దయచేసి ఊరుకోండి!... సమాజం చెడిపోయింది' అని హాస్యంగా మందలించాను.

శారద, తన కొడుకుని దగ్గరకు తీసుకుంది..

'నా భార్య విషయమై ఒక నిర్ణయానికి వచ్చాను...' అన్నాడు రంగరాజు అదో రకంగా.

'సుఖాంతమే అనుకుంటాను...' అన్నాను చిరునవ్వు న ్తూ. నా కోరిక అదే!

'అవును!... నా మటుకు సుఖాంతమే! నా జీవితా సుఖ ంతమే!... ఉషా, నేను విడాకులు ఇచ్చుకోవాలనుకోవడం కంటే, మరో మా ం కనిపించడం లేదు...' అంటూ ముఖం దించుకున్నాడు రంగరాజు...

'రాజూ!...' అని ఆశ్చర్యంగా అన్నాను నేను. 'అది సబ యిందని నాకు తోచదు. లోకంలో విడాకులను ప్రయోజనకరంగా ప్రయోగి ్తునా రు... కాని ఆ అనుబంధాన్ని విదిల్చిపారేయడం లేదు. జీవితంలో కూడా అలాగే జరగాలని...

'... ఈ రోజుల్లో అనుకోకూడదు నరసింహం!... కాలం అలాంటిది!... ఉషా కూడా ఒప్పుకుంది. రేపటికి ఆ అనుబంధం సమాప్తంగా విడిపోతుంది... మరేం చెప్పలేను...' అంటూ లేచి వెళ్ళిపోయాడు రంగరాజు. మేం దంపతులం అచేతనంగా వుండిపోయాం...

★ ★ ★

మరో ప్రశ్న వెలిసింది!

పాపాయి జయంతి జీవితం ఎలా గడవాలన్నది ఆ ప్రశ్న...

'శాసనము, చట్టము అన్నది అనాది నుంచీ తరతరాలుగా వెంబడించి వచ్చిన ఓ క్రీ డ! ఆ వెలుగును బట్టి నీడ మారుతుందని చెప్పక తప్పదు! కాని, అవసరమైన నీడను బట్టి వెలుగును మార్చుకోవాలన్నది ఈనాటి సంస్కరణా? అదీ ఒక శాసనమా?'

మానవ నిర్మితమైన శాసనాన్ని ధిక్కరించిన మానవులను మరో శాసనం రీత్యా శిక్షించగల అర్హత వుంది!..

శాస్త్ర బద్ధంగా జీవితాలను పెనవేసుకున్న ఉషా, రంగరాజులు - మరో శాసనం రీత్యా జీవితాలను వేరు చేసుకున్నారు... ఈ అణుయుగ లోకంలో అలాంటి చట్టంఅవసరం అని గుర్తించిన కొందరు మరో విషయాన్ని గుర్తించలేకపోయారు.. విడిపోయిన జీవితాల సంగమం కోసం శాసించవలసిన చట్టం గురించి మరిచిపోయారు..

విడాకుల నిర్ణయం అంగీకరించబడిన తరువాత పాపాయి జయంతి ఆమె ఎవరి ^ ర పెరగాలన్న విషయం ప్రస్తావనకు వచ్చాయి!...

శాసనం రీత్యా ఆవు వెనక దూడ వెళ్ళాలన్న సామెత వుంది!.. ఉష ఆ విషయం న్యాయ నిర్ణయమైందని వాదించింది కాని, రంగరాజు అభిప్రాయం ప్రకారం పాపాయికి జన్మ నిచ్చిన వారిలో - తను ప్రథముడు, ముఖ్యుడు అని నిశ్చయించుకున్నాడు..

ఈ విషయం న్యాయస్థానంలో విచారణగా ప్రారంభమయింది... ఆ

రోజు వచ్చింది..

ఉభయ పక్షాల వారూ పేరు మోసిన న్యాయవాదుల్ని, నియమించు కున్నారు... న్యాయ మూర్తి సమక్షంలో విచారణ సాగింది. ఉభయ పక్షాల న్యాయవాదులూ న్యాయ శాస్త్రంలోని పంక్తులను ఆధారం చేసుకుని వాదించారు... కాని వాదనవల్ల జీవితంలోని అనుభవ పంక్తులు కనిపించలేదు.. విచారణ ఒకటి రెండు రోజులు సాగింది...

మూడోరోజు - న్యాయమూర్తి తీర్పు కోసం ఉభయ పక్షాల వారూ ఎదురు చూశారు...

ఉభయ పక్షాల వాదనలనూ విన్న న్యాయమూర్తి ఆలోచించాడు... ఆలోచించాడు:

ఎవరికోసం ఈ విచారణ? ఎవరి బాగు కోసం తను న్యాయ నిర్ణయం జరపాలి? వారి అభిప్రాయం కనుక్కోవాలని అభిప్రాయపడ్డ న్యాయమూర్తి -

పాపాయి జయంతిని తన దగ్గరికి పిలిపించాడు...

తనన తాతయ్య ఒడి నుండి న్యాయమూర్తి దగ్గరికి వెళుతూ - జయంతి

విచారణ వేదికను - ఒకసారి చుట్టూరా కలయచూసింది..

న్యాయం కోసం నిరీక్షించే మట్టి బొమ్మలు!

మెల్లగా అడుగులు వేస్తూ బిక్కుబిక్కున కలియచూ న్యాయమూ దగ్గరకు చేరింది జయంతి. ఆ అమ్మాయిని తన చెంత కూర్చొబెట్టుకున్నాడు న్యాయమూర్తి...

'అమ్మాయ్! నీ పేరేమిటి? అని ప్రశ్నించాడు బుజ్జగింపుగా.

'జయంతి!' అని ముద్దుగా జవాబిచ్చింది...

'మిఠాయి అంటే, నీకు తినడానికి చాలా ఇష్టం కదూ!'

'ఊహు! మిఠాయేం బాగుండదు: చాక్‌లెట్ మరీ బాగుంటుంది!'

'వెరీగడు!... అవును గానీ, మీ నాన్న గారెవరో నీకు తెలుసా?'

'ఓ - అదిగో, అక్కడ!' అంటూ వేలెత్తి రంగరాజును చూపించింది జయంతి.

'మరి, అమ్మ?'

'అదిగో?' అంది జయంతి.

'అయితే, నీకు మీ అమ్మ కావాలా? నాన్న కావాలా? చెప్పమ్మా?' అని ఆప్యాయంగా ప్రశ్నించాడు న్యాయమూర్తి..

ఇదేం, విచిత్ర ప్రశ్న?... జయంతి జవాబు మీద ఆ విచారణ తీర్పు ఆధారపడుతుందనుకోవడం అంత ఉత్తమం కాదని నేననుకొన్నాను..

జయంతి ఒక్కసారి అందరి వేపు చూస్తూ ఆలోచిస్తూ వుండి పోయింది...

అమ్మ! - తనను నవమాసాలు మోసిన కన్నతల్లి!

తాత: - తన తల్లికి తండ్రి... చాలా మంచివాడు.., చాకెలెట్‌లూ, అవీ కొనిచ్చేవాడు...

నాన్న! - తనను అప్పుడప్పుడూ చూసి వెళ్ళడానికీ వచ్చేప్పుడల్లా బొమ్మలు తెచ్చిచ్చేవాడు.. తరచూ తన ముద్దుకోసం ప్రాకులాడేవాడు.

అవ్వ! - తన నాన్నకు అమ్మ... తనతోనే ఎప్పుడూ వుండమని, అలా వుంటే తనకు కావలసినవన్నీ ఇస్తానని - తనకు తెలిసినప్పటి నుండీ ఆశించి, అదరించే వ్యక్తి. తనను చూసినప్పుడల్లా కళ్ళనీళ్ళు పెట్టుకుంటూండేది..

మళ్ళీ నిమిషం పాటు ఆలోచించింది జయంతి..,

'చెప్పు జయంతీ!... నువ్వు మీ అమ్మ దగ్గరుంటావా, నాన్న దగ్గరుంటావా?...' న్యాయమూర్తి మళ్ళీ బుజ్జగింపుగా ప్రశ్నించాడు..

విచారణ సభలోని అందరి కళ్ళూ ఆ అయిదేళ్ళ అమ్మాయి మీద వున్నాయి; ఆ పిల్ల చెప్పగలిగిన జవాబుకోసం ఎదురు చూస్తున్నారందరూ..

'నాకు... నాకు...' అని తటపటాయించింది జయంతి.

'చెప్పమ్మా?.. నీకు...?' అని ప్రశ్నించాడు న్యాయమూర్తి..,

'నేను ఎవరి దగ్గరా వుండను.. అమ్మా, నాన్నలు ఎప్పుడూ కొట్లాడుకుంటారు.. వాళ్ళు మంచివారు కాదు. నేను ఎవరిదగ్గరా వుండను... నన్ను ముద్దుపెట్టుకునే మా అవ్వదగ్గరే వుంటాను...' అని జవాబిచ్చి - నవ్వింది జయంతి...

విచారణా వేదికలో - గుసగుసలు కురిశాయి..

'ఆర్డర్! ఆర్డర్!' అన్న మందలింపు తరువాత న్యాయమూర్తి ఇలా అన్నాడు:

'శాసనంలోని నిబంధనలు మానవ ధర్మాన్ని రక్షించడానికే సృష్టింపబడ్డాయి కాని, శిక్షించడానికి కాదు.. ఆ నిబంధనలను నవ సమాజంలో వింత పరిణామాలు చెలామణి కావడం ఉచితం కాదు.. విడాకులన్న పంథాలో తమచే సృష్టింపబడ్డ ఒక వస్తువు ఈ అమ్మాయి - కోసం పెనుగులాటలోకి దిగిన రంగరాజు దంపతులకు ఒక వింత గుణ పాఠాన్ని నేర్పబడింది. నవనాగరికత పేరిట హైందవ సమాజంలో విడ్డూరాలు జరగడం వింతకాదు కాని, ఆ వింతలను సృష్టించుకోకుండా జీవితాన్ని గడపడమే హైందవ సమాజంలోని ఉత్తమ గుణం.., సంగమంలో కలియబడ్డ నదులు - ఆఖరికి ఎలా సముద్ర గర్భంలోకి చొచ్చుకు పోతాయో - అలా నడుచుకోవడమే మానవ ధర్మం... ఈ పరిస్థితిని అనుసరించి - నేటి విచారణ సారాంశాన్ని పరిశీలించి - న్యాయ నిర్ణయం రేపటికి తెలియజేయబడుతుంది!'-

న్యాయమూర్తి లేచి వెళ్ళిపోయాడు...

మూఢత్వానికి మూలకారణం ఎక్కడుందన్న తర్కం నాలో బయలుదేరింది...

★ ★ ★

కోర్టుకు వేళ సమీపించగానే నా శ్రీమతిని కూడా తీసుకుని, ఇంటి నుండి బయలుదేరబోయాను.. అప్పుడు-

వీధిలో ఆగిన కారునుండి రంగరాజూ, ఉషారాణి దిగి ఇంటిలోపలకి

ప్రవేశిస్తున్నారు.. వారితోపాటు పాపాయి జయంతి కూడా వుంది.

'ఆశ్చర్యపోకు.. నరసింహా!... కోర్టుకు వెళ్ళాల్సిన అవసరం ఇంకేమీ వుండదు...' అన్నాడు రంగరాజు నవ్వుతూ. అతని పక్కనే వున్న ఉషారాణి - పెదిమలతో నవ్వుతూ మాకు నమస్కరించింది...

'ఏమిటయ్యా!.. మీ నాటకం!... అంటూ ఆశ్చర్యపోయి, ప్రశ్నించాను ఇంటిలోకి దారితీస్తూ.

'మరేం లేదోయ్!... జయంతి తీర్చిన నిర్ణయం మా ఇద్దరిలోనూ ఏకంగా పరివర్తన కలిగించింది. వగ చెందిన మేము వగచెంది - మాకేర్పడిన పరీక్ష వల్ల మా పాపాయి మా నుండి దూరమవడం సహించలేక ఒకరికొకరు క్షమాపణ చెప్పుకుని పాపాయిని మాకే దక్కించుకున్నాం. ఈ 'రాజీ' విషయాన్ని నీకు చెప్పి పోదామనే వచ్చాము' అన్నాడు రంగరాజు.

జయంతి మా మల్లిబాబుతో ముచ్చటిస్తోంది...

నిజమా అన్నట్లు, ఉషారాణి ముఖంకేసి చూశాను! ఆమె వికసిత వదనంతో-

'అవును అన్నగారూ! మా ఇద్దరి మధ్య ఒక అమాయక హృదయం నలిగిపోవడాని నా మనస్సు అంగీకరించలేదు... అందుకే నా నిశ్చయాన్ని మార్చుకున్నాను... సంసార జీవితంలో వుంటూ తన ఆదర్శాన్ని నిరూపించుకోవడమే ఒక మహిళ ఉత్తమ ధర్మమని గుర్తించాను. కాబట్టి ఇప్పటికీ, ఆయన్నుండి గానీ, కుటుంబం నుండి గానీ విడిపోవడానికి ప్రయత్నించకూడదని నిశ్చయించుకున్నాను...'

'అంతేగాదు, వదినా!... భర్తతో జీవితం నడుపుతూ, భర్తను గౌరవిస్తూనే వెనుకటి మహిళారత్నాలందరూ తమ ఆదర్శాలను చాటించారని మనం గుర్తుంచుకోవడం ముఖ్యం...' అంది నా శ్రీమతి నెమ్మదిగా...

'సత్యం!...' అంధి ఉషారాణి.

'ఈ శుభమైన సందర్భాన్ని మేము అనుభవించినందుకు గాను, మీ రిద్దరూ ఈ రోజు విందుకు రావలసిందిగా మిమ్మల్ని ఆహ్వానిస్తు- ము...' అన్నాడు రంగరాజు.

'ఇద్దరం కాదు; ముగ్గరం...' అన్నాను నవ్వుతూ.

'మేమూ ముగ్గురమేగా!' అంది ఉష

అందరం నవ్వుకున్నాం..,

జీవన సంగమంలో వెలుగు నీడలు తళతళలాడాయి...

***

# లసివచ్చిన [illegible] జాయి

రచన :
పులుసు గోపిరెడ్డి

అదొక పెద్ద భవంతి. మూడంతస్థుల రంగురంగుల మేడ పోర్టికోలో కారు సిద్ధంగా పెట్టబడి వుంది. గేటు వద్ద ఘూర్ఖా కాపలా కాస్తున్నాడు. బయటి నుండి చూచే వారికి ఆ భవంతి ఒక పెద్ద లక్షాధికారిదని, నవీన యుగంలో నాగరికులకు కావలసిన సకల సౌకర్యాలు అమర్చబడి వున్న దివ్య భవనమని ఇట్టే తెలిసిపోతుంది. సీతారామయ్య మాస్టారు తన ఇరవై ఏండ్ల పుత్రుడ్ని వెంటబెట్టుకుని రెండు రోజులుగా వస్తున్నా 'సాబ్ నైహై' అనే ఘూర్ఖావాడి జవాబు ఆయనను వచ్చిన దారిని బట్టించాయి. ఈ నాడైనా రాంబాబు గారిని కలుసుకొని తీరాలి. లేకపోతే తనతోపాటు తెచ్చుకొన్న పది రూపాయలు ఖాళీ అయిపోయేట్లున్నాయి. ఈ వేళతో కాబట్టి గేటు ముందు పడికాపులు కాసుకొని తీరాలి. కారు కూడా పోర్టికోలో ఉంది కాబట్టి యజమాని ఇంటిలో వున్న సూచనలే కనిపిస్తున్నాయి. తన ఒక్కగానొక్క కొడుకు బియ్యేలో ఫస్టు క్లాసులో ప్యాసయినాడు. ఉద్యోగం లేక దిక్కుతోచక తిరుగుతూ ఉంటే తనకెంతో బాధగావుంది. తాను రిటైరై కూడా, రెండు మాసాలైంది. బడిపంతులుగా తనకొచ్చే ఆదాయం ఈ రెండు నెలలుగా ఆగిపోవడంతో ఇంట్లో గడవటం ఎలా అనే ప్రశ్న తలఎత్తింది. బడిపంతులుగా చేసినన్నాళ్ళు ఒక్కి లౌకికం తెలియని ఛాందసుడనిపించుకున్నాడే గాని నలుగురి కాళ్ళు పట్టుకొని నాలుగురాళ్ళు వెనకేసుకుందామనుకున్న వ్యక్తి గాదు. కొడుకు తెలివితేటలతో ప్రతి క్లాస్ ఫస్టుగా

ప్యాసవుతున్నాడు కాబట్టి జీతాలకూ వాటికీ స్కాలర్‌షిప్ మీద వచ్చే పైకం సరిపోయింది. బియ్యే పాసయి చేతికంది వచ్చినాడు కదా అని సంతోషించిన తనకు నిరాశే ఎదురైంది. ఏడాదిగా కొడుకు చేస్తున్న ప్రయత్నాలు ఫలించకపోవడంతో వాడిలో ఒక రకమైన నిరాశ తలెత్తి మనిషి అదో రకంగా తయారైనాడు. ఇటువంటి సమయంలో జీతం ఎంతైనా మనిషికి ఏదో ఒక వ్యాపకం అవసరం. ఇంగ్లీషులో ఒక సామెత వుంది. 'పని లేని వాడి బుర్ర దెయ్యాల కొంప' అని వీడి పరిస్థితి అట్లాగే తయారైంది. ఎన్నడూ లేనిది ఏవేవో పిచ్చి పిచ్చి ఆలోచనలు బయలుదేరుతున్నాయి వీడి బుర్రలో. కాబట్టి చిన్నపాటి ఉద్యోగం ఏదైనా జతపరిస్తే గాని వీడు దారి— ట్లు లేడు. చుట్టుపట్ల గ్రామాల్లో కొత్తగా సిమెంటు ఫ్యాక్టరీ పెట్టిన రాంబాబు గారు చాలా మంచి వాడని, తనను కలుసుకున్న వారికి తప్పక కొద్దో గొప్పో సహాయం చేసే మనిషని విన్నాడు మాష్టారు. అందుకే తన పరిస్థితిని వారికి తెలియజేసుకుని కొడుకుకు ఛైనా చిన్న ఉద్యోగం వేయించుకోవాలని సీతారామయ్య గారి ఆశ. తన్నడ్డగించిన నౌకర్లందరికీ ఏదో రకంగా సమాధానం చెప్పుకొని రాంబాబుగారున్న గది దగ్గరకు చేరాడు.

ఆఫీసు గదిలో పేపరు చదువుకుంటూ కూ౯ న్న రాంబాబుగార్ని గమనించి నమస్కారం బాబూ అని ప్రారంభించారు సీతారామయ్య మాష్టారు. నమస్కారమందుకొని కొంచెం సేపు పరకాయించి చూస్తూ 'రండి మాష్టారూ, మీరా! కూర్చోండి కూర్చోండి' అన్న రాంబాబు గారి మాటలకు అప్రతిభుడై పోయాడు మాష్టారు. రాంబాబు అంటే రామ చంద్రమూర్తి ఎంఎల్‌ఏ గారి అబ్బాయేనా? ఆలోచనలు గతాన్ని వెతుక్కుంటూ 18 వత్సరాలు వెనక్కు నడిచాయి.

★ ★ ★

ఎంఎల్‌ఏ మధుసూదనరావు గారి మాటకు తిరుగులేదు జిల్లాలో. సాక్షాత్తూ ఆ మధు సూదనరావుగారే తన వద్దకు, కొఱగాని తన కొంపకు, కూర్చోవడానికి చాప తప్ప కుర్చీ అయినా చూపించలేని తన ఇంటికి వచ్చి

'మాస్టారూ! మీరు చాలా ఖచ్చితమైన మనుషులని విన్నా. ఏమైనా హరిహరాదులు దిగి వచ్చినా మీకు అన్యాయమని తోచిన పని చేయరని కూడా విన్నా. అందుకే మిమ్మల్ని అర్థించడానికి స్వయంగా వచ్చాను' అన్నారు.

'పెద్దలు నా మీద దయకొద్దీ అట్లా అంటున్నారే గాని తమరు మాత్రం కావాలని నాచేత అన్యాయపు పనులు చేయిస్తారా బాబు?!' అన్నాడు మాస్టారు.

'కాదు మాస్టారూ! నేను అడగదలచుకున్న విషయం మీకు ఇంకా కోపాన్నే తెప్పించవచ్చు. ఏ చంద్రయ్య మాస్టారుతోనో, లేక హెడ్మాష్టరు గారితోనో పనిబడితే మా గుమాస్తా శంకరయ్యకు చెప్పి నాలుగు బస్తాలు ధాన్యం పట్టించి వారింటికి చేర్చి నేను అడిగేదేదో ఒక కాగితం ముక్కపైన వ్రాయించి ఇస్తే వారు కాదనే వారు కాదు' అన్న మధుసూదనరావు గారితో.

'అయ్యా! తమ దయవల్ల నా జీతం డబ్బులు నాకు ముడుతున్నప్పుడు మీరు అదనంగా శ్రమ తీసుకుని ఏదైనా పంపించడం లంచంగానే భావించవలసి వుంటుంది. ఇట్లా అంటున్నందుకు మన్నించండి' అన్నారు మాస్టారు.

'అదేనండి మీతో చిక్కు. అందుకే నేను రావలసి వచ్చింది. అందులో మా రాముడు ఉన్నాడు చూశారూ! వాడి జాతకం చూశాక నేను ఊరుకుండ లేకపోతున్నాను మాస్టారూ! వాడికి మాంచి భవిష్యత్తుంది. ఈ ఎస్.ఎల్.సి ఎట్లాగైనా దాటేస్తే వాడికిక జీవితంలో తిరుగులేదు. దేవుడు మేలుచేసి ఆ తెలుగు పేపర్లు మీ వద్దకే రావడం మా వాడి అదృష్టం. అందులో కాస్త పాసయ్యేట్లు చూశారా మా వాడు గట్టెక్కినట్టే. వాడు ఎస్.ఎల్.సిలోనే తప్పితే ఉత్సాహం నశించి అసలు కృషి చేయడేమో అనిపిస్తున్నది. కాని వాడి జాతకం ఉంది చూశారూ, బ్రహ్మాండమైన జాతకమండీ! లక్షలు, లక్షలు తిరుగుతాయి వాడి చేతిలో. ఇది కేవలం నమ్మకమే కాదు, వాడి జాతకమలాంటిది' అన్నాడు మధుసూదనరావు గారు.

కాని మాస్టారు ససేమిరా ఒప్పుకోలేదు. అందరికి చెప్పినట్టే మధుసూదనరావు గారికీ చెప్పాడు.

'తమకు చెప్పేటంత వాణ్ణి గాదు. తమరు గొప్ప వారు. డబ్బు,

పలుకుబడి ఉన్న వారు కాబట్టి తమ పిల్ల వాడికి మార్కులు వేస్తే అంతకంటే కొద్దో గొప్పో బాగా వ్రాసి వుండి కూడా నా వద్దకు రావడానికి అర్థ బలమూ, అంగ బలమూలేని బీదవాడి మాటేమిటి చెప్పండి? మీరు నా వద్దకు వచ్చి నా చేతులు తడిపారు కాబట్టి మీ వాడు పాస్‌కావడం, బీదవాడు అట్లా రాలేదు కాబట్టి తెలివితేటలు మీ వాడికంటే ఎక్కువే వున్నా పరీక్ష తప్పటం అన్యాయం కాదంటారా! ఇట్లాంటి పాపం నా చేతుల మీదుగా జరిపించడం మీకు మాత్రం న్యాయమా చెప్పండి?' అన్నాడు మాస్టారు.

'మాస్టారూ! ఈ రోజుల్లో ఎవరి అవస్థ వాడు పడవలసిందేగాని ప్రపంచాన్నంతా ఉద్ధరిస్తామనుకోవడం కేవలం ఒక భ్రమ. ఎవడిబాగు వాడు చూచుకొంటే ప్రపంచమంతా బాగుపడినట్టే గదండీ! అయినా మీ మ చి కోరి చెపుతున్నాను. మా వాడి విషయంలో కొంచెం శ్రద్ధ తీసుకోమ . లేదా అనుభవించేది మీరే అన్నారు ఎంఎల్‌ఏ గారు. కాని దానికి తాను చెప్పిన సమాధానమొక్కటే. 'ఇంతకాలం నాకు ఆస్తి లేదన్న కొరతే ఉండే . దయచేసి నిజాయితీని కూడా పోగొట్టుకునే స్థితిని కల్పించకండి' అని.

అంతే, ఇక మధుసూదనరావు గారు అక్కడి నుండి తోకతొక్కి-పాములా లేచి బయటపడ్డారు. ఆ తరువాత జరిగిందేమిటో మాస్టారుకి బాగా గుర్తుంది. పరీక్షా ఫలితాలు ప్రకటించిన రోజున రామచంద్రమూర్తి తన ఇంటికి వచ్చి తెలియజేశాడు. 'మాస్టారూ! మా నాన్న గారి పుణ్యమా అని నేను పరీక్ష పాసయ్యాను' అని. తనకు మతిపోయినంత పని అయింది. పేపరు దిగిన తాను మార్కులు వేయలేకపోతే చీఫ్ ఎగ్జామినర్ దగ్గిరకు పోయి మార్కులు వేయించుకొనగలిగాడు మధుసూదనరావు. నిజమే బోడి తన లెక్కేమిటి ఆయనకు. మరి న్యాయం, ధర్మం, నిజాయితీ అని తాను ప్రాకులాడటంలో అర్థమేముంది? అందరి మాదిరిగా సంపాదించుకోనూ లేక, తన నిజాయితీ సత్ఫలితాలనూ ఇవ్వలేనప్పుడు తాను చేస్తున్న పని ఎవరికి లాభిస్తున్నట్టు? అని ఆ రాత్రంతా ఆలోచిస్తూ తీవ్రమైన వేదనకు గురయ డు. అ ~ పరితాపం అనుభవించిన తరువాత కూడా ఆయన నిర్ణయం మారలేదు. తన పని తాను సక్రమంగా భగవంతుని సాక్షిగా నిర్వహించాడు. పైఅధికారుల దుండగాలకు తాను

బాధ్యుడు గాడు. ప్రతి జీవి ఆ పరమేశ్వరునకు తాను చేసిన తప్పులకు సంజాయిషీ చెప్పుకోవలసిన రోజు వస్తుంది. తన విధి నిర్వహణలో ఏ లోపం రాకూడదు. ఎవడు చేసిన పాపం వాడే అనుభవిస్తాడు. తాను మాత్రం అంతరాత్మను చంపుకొని అధర్మంగా ప్రవర్తించరాదు. ఆ తరువాత సీతా రామయ్యగారి మనస్సు తేలికపడింది. కాని రామచంద్రమూర్తి ఫలితాలు బయట పడిన మర్నాడు తన బదిలీ విషయం కూడా బయటపడింది. రెండెడ్లబండి కూడా సరిగ్గా చేరలేని గంటాయపాలెంలో పారేశారు మాస్టార్ని. తన కొడుకు చదువు నిష్కారణంగా దెబ్బతిని పోతుందని వాపోయాడు మాస్టారు. పైచదువులు చదువుకొనే యోగం తన కొడుక్కు కరువైనట్టేనని మూగబాధ అనుభవించాడు. ఆ గ్రామానికి ప్రయాణ సన్నాహాలు పూర్తి చేసుకోవడంలో నిమగ్నమై పోయాడు బరువైన గుండెతో. కాని తన అదృష్టం బాగుండి మాస్టారుకి ట్రాన్స్‌ఫర్ ఆగిపోయినట్టు తెలిసింది ఆ మర్నాడు. అన్నిటికీ ఆ పరమేశ్వరుడే ఉన్నాడని భారమంతా ఆ పరాత్పరునిపైనే మోపి నిశ్చింతగా ఉన్నాడు. మాస్టారు ఉద్యోగరీత్యా అనేక ఊళ్ళకు మార్చబడటం, జవసత్వాలు ఉడుగకపోయినా వయఃపరిమితి దాటిన నేరానికి ఉద్యోగం నుండిరిటైరు గావడం క్రమంగా జరిగిపోయాయి. ఆ తరువాత రామచంద్రమూర్తిని తిరిగి చూడటం ఇదే.

★ ★ ★

'ఏం మాస్టారూ! ఏదో పనిమీద వచ్చినట్టున్నారు? మాట్లాడకుండా ఆలోచనలో మునిగిపోయారేమిటి? అన్న' రాంబాబు గారి ప్రశ్నతో తిరిగి ఈ లోకంలోపడ్డాడు.

'ఆ ఏమీ లేదు బాబు గారూ! ఎందుకూ కొఱగాని వాడినని. ఏ ఒక్కడికీ నా జీవితంలో ఉపయోగపడని వాడిని, నాకు మాత్రం ఎవరు సహాయం చేస్తారు ఇప్పుడూ? లోకపు తీరు గ్రహించలేని మూర్ఖుడిగా బ్రతికాను. అందుకు ఈనాడు అనుభవిస్తున్నాను. ఉద్యోగం చేసే వయస్సుండీ, ఫస్టుక్లాసు డిగ్రీ వుండీ, భగవంతుడిచ్చిన తెలివితేటలూ ఉండి ఎందుకు కొఱగాని వాడుగా తిరుగు తున్నాడు నా కొడుకు. ఉద్యోగం ఇచ్చే దాత కనిపించక అగచాట్లు పడుతూ ఉంటే

ఈ ఊళ్ళో సిమెంటు ఫ్యాక్టరీ నెలకొల్పిన రాంబాబు గారు ధర్మ గుణ సంపన్నులని విని యాచిస్తే సహాయం చేయకపోతారా అని మిమ్మల్ని దర్శించుకొన్నాను. తీరా మిమ్మల్ని పోల్చుకున్నాక నా ఆశ అడియాశయేనని తెల్సుకున్నాను. క్షమించండి. మీ కాలాన్ని వృధా చేశాను' అని వెనుదిరిగాడు మాష్టారు.

'మాష్టారూ మీరు నన్ను అపార్థం చేసుకున్నారు. మీ నిజాయితీని బాల్యం నుండి హృదయ పూర్వకంగా మెచ్చుకోవడం నాకు అలవాటైంది. మా నాన్నగారు మార్కులు వేయమన్న నాడు మీరు దిగజారిపోయి మార్కులు వేస్తారేమో, నాకు మీ పట్ల ఉన్న పూజ్యభావం తుడిచి పెట్టుకుని పోతుందేమోనని నిజంగా భయపడ్డాను. కాని ఏ హోదాకు, ఏ భోగాలకు లొంగనిది మీ నిజాతీ అని తెలసుకొని ఆనందించాను. మా నాన్న గారు మీ చేత తిరస్కరించబడిన తరువాత వెంటనే మీరు ఆ ఊరి నుండి ట్రాన్స్ఫరు అయ్యేందుకు ప్రయత్నం చేశారు. కాని ట్రాన్స్ఫర్ ఆర్డర్లు వచ్చిన తరువాత కూడా ఆ ఆర్డర్లు రద్దు కావడానికి కారణం నేనే. మా నాన్నతో పోట్లాడి ఏడ్చి విసిగించి ఆయనను ఒప్పించాను. నిజాయితీకి శిక్ష విధిస్తే భగవంతుడు కూడా క్షమించడని నాకు అనిపించింది. కడకు ఆ ఆర్డర్లు రద్దయ్యాయి. దేశంలో న్యాయం, ధర్మం, కర్తవ్య పరాయణత్వం దినదినం అడుగంటి పోతునా యంటే అందుకు సగం కారకులు ఉపాధ్యాయులేనంటే క్షమించండి. ప బాలుర హృదయాలను తీర్చిదిద్దవలసిన ఉపాధ్యాయులు ఎంతటి కఠోర దీక్షాపరులు కావాలో ఆలోచించండి. అలాంటి వారు అత్యల్పమైన ప్రలోభాలకు లోనై పతనమైపోతుంటే వారిని చూచి భావిభారత పౌరులైన విద్యార్థులు నేర్చుకొనేదేమిటి? మీలాంటి వారు కొందరైనా ఉన్నారు కాబట్టే ఈ మా కామెనా న్యాయం వుంది దేశంలో. సుఖాలకు, కర్తవ్యానికి మధ్య జ గిన సంఘర్షణలో మీరు అనుభవించిన వేదనను అనేకసార్లు ప్రత్యక్షంగా చూసిన మీ కుమారునికి కొంతైనా సంస్కారం అబ్బినట్టయితే నేను స తో ను. ఆ ఆశతోనే నేమ మీ వాడిని మా ఫ్యాక్టరీలో నా అంతరంగిక కా దర్శిగా యమిసున్నాను' అన్నాడు.

ఈ నాటికి తన నిజాయితీ తనకు కలిసొచ్చింద సంతోషించాడు సీతారామయ్య మాష్టారు.

***

# ప్ర[illegible] యగం

రచన :

తిప్పావఝ్ఝుల కోదండరామయ్య

వడివడిగా ముందుకు నడుస్తున్నారు ముకుందరావుగారు. మహాభారత సంగ్రామారంభంలో పాదచారియై కౌరవసైన్యంలోకి చొచ్చుకుపోతున్న ధర్మరాజులా ముందుకు సాగుతున్నారు గంభీరంగా.

చేతిలోని బంగారపు పొన్నుకఱ్ఱ బలంగా నేలను తాకుతూ లయబద్ధంగా ముందుకు సాగుతూ అతని స్థిరసంకల్పాన్ని వ్యక్తం చేస్తున్నది.

'నాన్నా!' అని పిలుస్తోన్న కుమార్తె వంక కన్నెత్తిచూడలేదు.

'ఏమండీ!'' అన్న హెచ్చరిస్తోన్న పంచాయతీబోర్డు ప్రెసిడెంటు ప్రసాదరావుగు పలకరించనూలేదు.

తన కనుసన్నకోసం కాచుకొని ఉన్న స్వపక్షీయులు పరపక్షీయులు ఐన గ్రామస్థుల ఆతురతను గమనించనూలేదు. ఈయన మనోగతభావం ఎవరికీ అర్థమవడంలేదు.

ప్రారంభోత్సవానికి ఇంక ఓగంట వ్యవధి గూడలేదు. వచ్చిన అధికారులంతా పంచాయతీ ఆఫీసువద్ద కాచుకొని ఉన్నారు. మేళగాళ్ళు 'ఊఁ' అంటే అందుకోను సిద్ధంగా ఉన్నారు. ఐనా ఇవేవీ గమనించకుండా ముందుకు సాగుతున్నారు ముకుందరావుగారు. వారిని పలకరించను ఎవరికీ ధైర్యమానడం లేదు. గత్యంతరంలేక సరంజామాతో అందరూ వారిననుసరించి ముందుకు సాగుతున్నారు.

అసలేమి జరిగిందంటే....

ఆగ్రామస్థులు శతాబ్దాలుగా దరిద్రదేవతకు నిలయంగా ఉన్న ఆగ్రామాన్ని భవిష్యత్తులో లక్ష్మీప్రసన్నం చేయగల్గిన కాలువకు ప్రారంభోత్సవం చేసికోబోతున్నారు. అందుకు ముకుందరావుగార్ని ఆహ్వానించను వచ్చేరు, వారేమో ఎటూ చెప్పకుండా వెడుతున్నారు. ప్రభుత్వమువారు ప్రయోజనం లేనిదని మానివేశారు. ఇంజనీర్లంతా పరిశీలించి లక్షలకొలది రూపాయలౌతుందని పెదవి విరచారు. అట్టిబ్రహ్మాండమైనపని గ్రామస్థులే స్వయంగా నిర్మించుకొన్నారు. అసలాగ్రామం ఎ న ప్రదేశంలో ఉంది చెరువు, పొలము అంతా మిట్ట, పల్లంలో డెల్టా కొలువ పూర్తిగా ఎల్లవేళలా ప్రవహిస్తుంటుంది. ఐనా గ్రామస్థులకు నీటికరువు. దీన్ని తప్పించాలంటే చెరువుమట్టంలో ఓమైలుదూరం కాలువను దిమ్మెలమీద వంతెనలా నిర్మించాలి. కాలువలోకి మిషన్‌లతో నీటిని పంప్‌చేయాలి. అప్పుడు సమృద్ధిగా నీరు లభిస్తుంది. ఇం టి ఘనకార్యమూ ఆ గ్రామస్థులు స్వయంకృషితో నెరవేర్చుకు.. రు అంటే అది ప్రసాదరావు నాయకత్వ బలమేనని అందరూ ఒప్పుకుంటారు. ప్రసాదరావు పంచాయతీ ప్రెసిడెంటుగాకపోతే గ్రామం ఇంత అభివృద్ధి పొందకనేపోయేదని అంతా వారి చలవేనని దేవతలాగా చూచుకుంటారు. అట్టి ప్రసాదరావుకు ఓనాడు ఆ వూళ్ళో మంచి నీరు పుట్టలేదు. నిలువ నీడ దొరకలేదు.

అసలాయన పంచాయతీ ప్రెసిడెంటుగా ఎన్నికగావడం గూడ విచి( ంగా జరిగింది. ఆ సంవత్సరం బి.ఏ. పరీక్ష వ్రా ఇంటికి వ న ప్రసాదరావును 'పంచాయతీ ప్రెసిడెంటుగా నిన్ను ఎన్నుకుంటారు. ఈ నామినేషన్ ఫారంమీద సంతకం పెట్రా!' అని వారి మేనమామ అడిగాడు. సరేనని సంతకం పెట్టాడు. పంచాయతీ ప్రెసిడెంటుగా ఒక్కవోటు తేడాతో ఎన్నికయా డు. ప్రసాదరావు చిన్నతనంలోనే తండ్రిని గోల్పోయాడు తల్లి ఉన్న ఆ . అన ని అన్నగారైన సుబ్బరామయ్య ఇంటికి చేరింది. అప్పటి నుండి పిల్లలు ని మేనమామగారి ఇంటివద్దే పెరిగాడు ప్రసాదరావు ఆస్థిఅంతా అతనికే నుకు.. రు అందరూ. సుబ్బరామయ్య పెద్ద మోతుబరులలో ఒకడు; నాలుగువందలెకరాల మాగాణి ఐదారులక్షల క్యాషు పెద్ద పలుకు డి గల రైతు. వా పోటీ ముకుందరావు

జమీందారీ అంతరించినా రాజసం మాత్రం చెక్కుచెదరలేదు. పెద్ద భవంతి తోటలు, బీళ్ళు పొలాలు సుబ్బరామయ్యగారికి తీసిపోని రైతు. ఆ రెండు కుటుంబాలకు శతాబ్దాలుగా వైరం. ఈ యింటి కాకి ఆయింటిమీదకు వాలదు. ముకుందరావుగారికో కుమార్తె. ఆఖరు సంవత్సరం యమ్.బి.బి.యస్. పరీక్ష వ్రాసి వచ్చింది. ఆమె ఒక్కర్తే సంతానం వారికి.

ఆ గ్రామంలో సుబ్బరామయ్య, ముకుందరావుగార్ల కుటుంబాలు తప్ప మిగతావారంతా మధ్యరకం రైతులు బీదవారూను. అనాదిగా ఆ కుటుంబాల మధ్య రాజుకుంటోన్న కలహాగ్నిలో మాడుతోన్న దౌర్భాగ్యులు. గ్రామమా ఎత్తైన మిట్ట. పంటలు వర్షాధారాలు దరిద్రానికి స్థావరంగా ఉంది ఆ గ్రామం. పెద్ద రైతులిద్దరి పొలాలు పల్లంలో డెల్టాకాలువ క్రింద ఉన్న సుక్షేత్రాలు. గ్రామం చుట్టూ బీళ్ళంతా వారి అధీనాలు ఇతరులు కదలను మెదలనూ వీలుకాదు. ఆబోతుల పోట్లాటలో లేగలు కాళ్ళు విరుచుకున్నట్టు గ్రామస్థులు ఏదో ఒక పార్టీలో చేరి ఒకరిమీద ఒకరు కత్తులు దూసుకొంటుంటారు.

అట్టి పరిస్థితుల్లో పంచాయతీ బోర్డు ప్రెసిడెంటుగా ఎన్నికయ్యాడు ప్రసాదరావు. యువకుడు పట్టభద్రుడు అభ్యుదయభావాలు గలవాడు. ఐన ప్రసాదరావు ఆ అవకాశాన్ని సద్వినియోగం చేసికోవాలని అభివృద్ధి పథకాలన్నీ అమలుజరిపి ఆ గ్రామాన్ని ఆదర్శగ్రామంగా రూపొందించాలని కలలుగన్నాడు. కాని అవన్నీ అడియాసలని పంచాయతీ ప్రథమ సమావేశంలోనే తేలిపోయింది. తనతో పోటీచేసి ఒక్క ఓటు తేడాతో ఓడిపోయిన ముకుందరావుగారి కుమార్తె డాక్టర్ సరళ. యమ్.బి.బి.యస్‌ను వైస్ ప్రెసిడింటుగా ఏకగ్రీవంగా ఎన్నుకోవాలని ప్రతిపాదించాడు ప్రసాదరావు ఆ ప్రతిపాదనకు తన మేనమామ సుబ్బరామయ్యగారే ఎదురుతిరిగారు. అలా ఎన్నటికీ జరుగవీలులేదని వెంకటాచలం సెట్టిగారు ఆ పదవికి ఎన్నుకోబడాలని అన్నారు. 'హి హి! అలా మాట నిలబెట్టుకోవయ్యా' అంటూ గారపండ్లతో నవ్వుతూ రంగంలోకి వచ్చాడు వెంకటాచలం శ్రేష్ఠి. వాదోపవాదాలు జరిగాయి. పంచాయతీ ఆఫీసు నేలమట్టంచేసి పాతవూళ్ళో కట్టందే నిద్రపోనన్నాడు సుబ్బరామయ్య. మా గొంతులో ఊపిరుండగా అలా ఎలా జరుగుతుందో చూస్తానన్నాడు ముకుంద

రావు. ఇలా ముష్టియుద్ధం వరకు వచ్చింది. అసలు విషయం అడుగున పడిపోయింది. ఇంతకూ అసలు మెంబర్లంతా క్రిందకూర్చున్నారు. అనధికార పెద్దలంతా కుర్చీలమీద చేరారు. ప్రసాదరావు ఆవేశంగా లేచి ''మీరు మెంబర్ల నెన్నుకున్నారు. దయచేసి మీరంతా వెళ్ళిపోతే మేము విషయాలు చర్చించుకోవాలి! ఎన్నుకొనేవరకే మీ బాధ్యత'' అని చెప్పాడు.

''అలా ఐతే మీ మామగార్ని పొమ్మను. మేమూ పోతాం!'' అన్నారు ముకుందరావు. ''మెంబర్లుగానివారంతా వెళ్ళిపోవాల్సిందే'' అన్నాడు ప్రసాదరావు. సుబ్బరామయ్యగారు కోపంగాలేచి వెళ్ళిపోయాడు ఆ ల్లో ఎలాటి హెచ్చరిక ఉందో ఆయన పార్టీ మనుషులంతా తోటీ వెళ్లారు. ''మాకు వైస్ ప్రెసిడింటూవద్దు బండలూవద్దు'' అంటూ ముకుందరావూ వెళ్ళిపోయారు. ఆయనతోటి వెళ్ళారు ఆయనపార్టీ మెంబర్లు. ఏకాకిగా నిలబడి నవ్వులపాలయ్యాడు ప్రసాదరావు.

తన విలువ ఎంతో తెలిసివచ్చింది. ఇష్టమైతే కీలుబొమ్మలాగా మామగారు చెప్పినట్లు నడుస్తూ పదవిలో ఉండవచ్చు. లేకుంటే రాజీనామా యివ్వాలి. ఇలాంటి స్వారస్యపుత్రాడు పేరిగాడిలాంటి పదవి తనకెందుకు! ఇలా కాలువగట్టున కూర్చొని మధనపడుతోన్న ప్రసాదరావుకు ఆసాయం సమయంలో రామారావు కనిపించాడు.

రామారావు హాస్యచతురుడు. చమత్కార సంభాషణలతో అందరిని నవ్విస్తుంటాడు. అందరికీ మంచిగా ఉంటాడు. ఇరుపార్టీలవారు అతన్ని గౌరవిస్తారు. ఆవులిస్తే ప్రేవులు లెక్కించేరకం. ఇద్దరు పార్టీల గుట్టుమట్లన్నీ ఆయనకు ఎరికే!

'ఏమబ్బాయ్! విషయాలర్థమయ్యాయిగదా! ఒక్కరోజుకీ అలాదిగులు పడిపోతే ఎలాగోయ్! మీమామగారు ప్రెసిడెంటు ఎన్నికకోసం ఎంత ఖర్చుపెట్టారో నీకు తెలియదు ఒక్క ఓటుతో అంతా తలక్రిందులయ్యేట్టుంటే పదివేలుచేసే రెండు ఎకరాల నల్లపుపొలం ఒకరికి రాసిచ్చారు. సెట్టిగారికి వైస్‌ప్రెసిడెంటు ఆశ చూపేరు. ఎదటిపార్టీవాళ్ళు డాక్టరుకోర్సు ప్యాసైవున్న

అమ్మాయిని నిలబెట్టడంలో మంచి ఎత్తే వేశారు. దానికి పై ఎత్తుగా పట్టభద్రుడివైన నిన్ను మీ మామగారు నిలిపారు. ఈ రాజకీయాలున్నాయే అబ్బాయ్! అదంతా రొంపి దిగామా! గొంతువరకు పూడుకపోవాల్సిందే ఇంత ప్రయత్నమూ పంచాయతీ ఆఫీసు పడగొట్టేందుకు....'

'అదెందుకండీ! పంచాయతీ ఆఫీసు పదిహేనువేలు వెచ్చించి మొన్ననేకదా కట్టించారు దాన్ని పడగొట్టించడమెందుకు?' ప్రసాదరావు ప్రశ్నించాడు.

'అవేనోయ్ రాజకీయాలు, ఆఫీసేమో కొత్తవూళ్ళో ఉంది. ముకుందరావుగారి ఊరుగదా అది. ఎన్నికలకు సమావేశాలకు అక్కడికి పోవాల టే మీమామగారికి తలవొంపులు గదా! అంచేత దాన్ని పడగొట్టించి పాత వూళో కట్టించాలని మీ మామగారి ప్రయత్నం. ఇలా ఉంటూ వారి ఊహలు చేజేతులా వచ్చే ఆస్తి ఎందుకు పాడుచేసుకుంటావు మీ మామగారు చెప్పినట్లు నడువు. నీకొక వ్యక్తిత్వమంటూ ఏర్పడ్డాక చూచుకోవచ్చు' అని సలహాయిచ్చి వెళ్ళిపోయాడు రామారావు.

తనకేమీ పాలుపోలేదు. ఈ స్వారస్యపుత్రాడు పదవి తనకెందుకు! రాజీనామా ఇచ్చేస్తామా అని ఆలోచించాడు కాని ఇది తను కోరితే రాలేదు. ఒక అవకాశం లభించడమే కష్టం. అట్టి అవకాశం లభించినప్పుడు దాన్ని సద్వినియోగం చేసుకొనేదెలాగా అని ఆలోచించాలి. చేజేతులా వదలుకోవడం ఏంబాగు! పరిస్థితులు వ్యతిరేకించినప్పుడు చూడవచ్చు. ఈలోగా రామారావు గారి సలహా బాగుంది అనుకు- డు ప్రసాదరావు. పంచాయతీ వ్యవహారాలు మామూలుగా జరిగిపోతున్నాయి అప్పటినుండి.

ఈలోగా పంచాయతీ లైబ్రరీ ఒకటి ఏర్పాటుచేశాడు ప్రసాదరావు. పత్రికలు కొన్ని గ్రంథాలు తెప్పించాడు. కొంత గ్రాంటూ వచ్చింది. తీరికసమయాల్లో విద్యావంతులంతా వచ్చి చదువుకొనేవారు. ఆ అవకాశాన్ని తీసికొని రాజకీయాలు ఇతర గ్రామాల్లో సమాజాభ్యుదయ పథకాలు అమలు జరుగుతున్న తీరు వివరించేవాడు. అతని వాగ్ధోరణి మూడముచ్చటైన రూపం విజ్ఞానం వారినిట్టే ఆకర్షించి తెలివైనవాడేను అనే నిశ్చయానికి వచ్చేట్లు చేశాయి.

వేసవి సెలవుల్లో విద్యార్థులంతా ఇండ్లకు వచ్చి ఉన్నారు. వారంతా లైబ్రరీదగ్గర చేరినప్పుడు వారితో సమావేశాలు జరిపే వాడు. 'యువజనమండలి' స్థాపించి వారిలో జాతీయ భావం కలిగించాడు. నాటక సమాజం స్థాపించి అప్పుడప్పుడు నాటికలు నాటకాలు వేయించాడు. ఆగ్రామస్థులు ఎప్పుడూ ఇటువంటి వేడకలు ఎరుగరు. వారివారి పిల్లలంతా ఇలా ముచ్చటగా వేషాల్తో కనబడుతుంటే ఎంతో ఆనందించేవారు. అభినయ కౌశలానికి ముగ్ధులై ప్రోత్సహించేవారు. ప్రసాదరావుకు యువకుల్లో మంచి పలుకుబడి ఏర్పడింది. ఓరోజు వారినందర్నీ సమావేశపరిచాడు. 'అబ్బాయిలూ! పెద్దలంతా పార్టీ వ్యవహారాల్లో మునిగి గ్రామాభివృద్ధిని గమనించడంలేదు. మనమంతా నడుముకట్టి అందుకు పూనుకోవాలి. సెలవుల్లో మన వూరినుండి హైరోడ్డులోకి రోడ్డు నిర్మించుకొందాము. అందుకు మీరంతా శ్రమదానం చేయాలి' అని ఉద్బోధించాడు. అందరూ సంతోషంగా అంగీకరించారు.

మరునాడు అందరూ తట్టబుట్టలతో బయలుదేరారు. 'ఆ! ఏవో పిల్లవేషాలు' అని నవ్వుకుంటూ తమాషాచూచేందుకు కొందరు వచ్చారు. కొందరు హేళనచేశారు. పదిమందితో ప్రారంభమైన శ్రమదానం క్రమంగా వందల్లోకి దిగింది. చూస్తూండగానే మైలుపొడవు మట్టిరోడ్డు ఏర్పడింది. ఈలోగా బీదలకు బంజర్లు పంచిపెడతాము అనే ప్రభుత్వ ఉత్తరువు ప కల్లో పడింది. ప్రసాదరావు బీదలందరిచేత ‥ లు వ్రాయించి తీసికొనిపోయి ఆఫీసరుగారి చేతికిచ్చి వచ్చాడు. ఈ మొగమాటంతో మరికొంతమంది పనిలోపాల్గొన్నారు. ఇలా రోడ్డుపని జరుగుతూండగానే రోడ్డు నిర్మించుకొనేందుకు గ్రాంటుకోసం ఆర్జీపంపాడు ప్రసా రావు. మట్టిరోడ్డు పని పూర్తయేసరికి పదివేల రూపాయలు ఎస్టిమేటును మ జూరు చేస్తూ అందులో నాల్గవ వంతు శ్రమదానంక్రింద మినహాయించి ఏడువేల ఐదువందలు మంజూరు చేసింది ప్రభుత్వం. ఆ మొత్తంలో తూ లకు చప్టాలకు రెండున్నరవేలు మాత్రం ఖర్చయింది. ఆ విషయం గ్రామస్థుల సమావేశంలో వరించి . మం విద్యావిషయకంగా వెనుకబడి ఉన్నదని ఐదువేల రూపాయలు డిపాజిట్ చేసి మూడు ఎకరాల స్థలం తాత్కాలిక వసతి చూపి జిల్లా పరిషత్‌వారు తమ

గ్రామంలో మిడిల్‌స్కూలు పెడతారని గవర్నమెంటు పాలంకోసం ఆర్జీపెట్టి స్థలం సాధించవచ్చునని ఈ మిగిలిన ఐదువేలూ డిపాజిట్ చేసేందుకు అనుమతి ఇవ్వమనీ అర్థించారు. వారి చేతిదేమీ నష్టంలేకుండా స్కూలు వస్తోంటే కాదంటారా! అందరూ అంగీకరించారు. తాత్కాలిక వసతిలో మిడిల్‌స్కూలు ఏర్పడింది.

ఐనా అడకత్తెరలో పోకలా ఉంది ప్రసాదరావు పరిస్థితి. పంచాయతీలోనా ఫండ్సు లేవు. పార్టీ వ్యవహారాల్లో చిక్కుకుందా ఇక దానికి పుట్టగతులుండవు అభివృద్ధి కార్యక్రమాలు మాత్రం అమలు జరపాలని ఉబలాటం. అలాగే కొద్ది ఖర్చుతో అయేవీ, ఉపయోగకరమైన ప్రణాళికలు అమలుపరచడం ప్రారంభించాడు. హరిజనులు వాయిదాలలో సగం ఖర్చుభరించే షరతుమీద ఇండ్లుకట్టించే పథకం మంజూరైంది. బావులకు వాడుకొనే షరతుతోనూ కొన్ని యిండ్లకు దీపాలు వేయించుకొనే షరతుతోనూ రైతులచేత కొంత పైకమూ, పంచాయతీ కొంత పైకమూ వేసి విద్యుచ్ఛక్తి పథకం అమలుచేయించాడు. వీధులు బాగుచేయించి కంకరరోడ్లు వేయడం మంచినీటి బావులు గచ్చువేయడం మురికి గుంటలు పూడ్చడంలాటి చిన్న చిన్న కార్యక్రమాలు అమలుజరిగాయి.

ఈలోగా డా॥ సరళ హెడ్‌క్వార్టర్ హాస్పిటల్‌లో శిక్షణ పూర్తిచేసి తిరిగివచ్చింది. మొదటపార్టీతో పోటీచేసినవాడు అనే దృష్టితో చూసినా ఈ ఏడాదిలో గ్రామం పొందిన అభివృద్ధిచూసి ఆమెకు ప్రసాదరావుమీద గౌరవం ఏర్పడింది. చేదోడు వాదోడుగా ఉంటూ అతనికి సాయపడుతుండేది. సాయంకాలం ఇద్దరూ కలసి షికారు వెళ్ళేవారు. వివిధ విషయాలు చర్చించుకొనేవారు చనువు పెరిగింది. ఓరోజు చెరువుగట్టున సాయంవేళ మాటాడుతుండగా ప్రాక్టీసు పెట్టారంటే చాలా బాగుంటుందని ఇటు గ్రామానికి సేవచేసినట్టు అటు ఆదాయము పొందటం రెండు విధాల అనుకూలమని అభ్యర్థించాడు. సరళ అందుకు సుతరామూ అంగీకరించలేదు. గ్రామస్థులంతా పూల్సు అని ఇట్టి మృగాల్తో తను మెలగలేనని ఉద్యోగ నియామక ఉత్తర్వురాగానే వెడలిపోతానని చెప్పింది సరళ. అందుకు కారణముంది. ప్రసాదరావు సరళలు చనువుగా తిరగడంచూసి లేనిపోని పుకార్లు లేవదీశారు గ్రామస్థులు. ప్రకాశరావుకు

అర్థమైంది. కాని తన పట్టుదల సడలించుకోలేదు. మీరు పుట్టిపెరిగిన గ్రామంలోని వ్యక్తుల్ని గురించి ఇలాటి అభిప్రాయాలుండడం ఆశ్చర్యంగా ఉంది. ఎలాగైనా మీరు నాకోరిక మన్నించి ఇక్కడే ప్రాక్టీసు పెట్టాలి అని ప్రార్థించాడు. కాని వాళ్ళనాన్న అందుకు అంగీకరించడని తనకూ ఇష్టంలేదని స్పష్టంగా చెప్పేసింది సరళ. మనస్సు చిన్నబుచ్చుకొన్నా చేసేదేమీలేక ఊరకుండిపోయాడు ప్రసాదరావు.

పంచాయతీ ఆఫీసు పడగొట్టించే విషయమై కదిపాడు సుబ్బరామయ్య? మనుష్యులు ఎందుకంత సంకుచితంగా ఆలోచిస్తారో అర్థంకాలేదు ప్రసాదరావుకు ప్రజలకు పంచాయతీ ఆఫీసు ఎక్కడున్నా మునిగిపోయేది లేదని దాన్ని పడగొట్టినా మరల పంచాయతీలో వేరేచోట కట్టించేందుకు ఫండ్సు లేవని చెప్పేశాడు. తాను స్వయంగా ఖర్చుపెట్టి కట్టిస్తానని వ ం కురిసినరోజు డైనమెట్‌తో పేల్చివేసి భవనం వర్షానికి కూలిపోయిందని చెప్పవచ్చునని సలహా యిస్తూ ఆఫీసు కట్టించేందుకు తాను వేసిన అడ్డంకులు, వాట్ని ప్రతిఘటించి ముకుందరావు పదిరోజుల్లో ఆఫీసు కట్టెయ్యడం అంతా వివరించాడు సుబ్బరామయ్య; ఎంత చెప్పినా అలాటి పనికి తాను అంగీకరించనన్నాడు ప్రసాదరావు, పైగా అనుమానం తగిలి పంచాయతీ భవనానికి కాపలాగూడ పెట్టాడు.

ఈలోగా బంజర్ల పంపిణీ ఉ ర్వులు వచ్చాయి. కలెక్టరుగారు స్వయంగా బీదలకు పట్టాలు పంచిపెట్టారు. యువకుడైన ప్రసాదరావు కృషిని కొనియాడాడు.

కాని ఈ బంజర్లంతా వర్షాధారం చెరువు క్రింద ఉన్నవి. ఆ ఏడు చిత్తకార్తెవరకు వర్షాలు లేవు నార్లు ఎండిపోతుంటే చెరువులో ఉన్న కొద్దిపాటి నీటికోసం గ్రామస్తుల కొట్లాటలు చ ప్రసాదరావు హ దయం కరిగి పోయింది. గ్రామస్థుల సమావేశాన్ని ఏర్పాటుచేసి చర్చించారు. డెల్టా కాలువనుండి చెరువుకు నీరుతెచ్చే పథకాన్ని వివ ంచాడు. ఇంజనీరైన తన మిత్రుడు ప్లాను చెప్పాడని అందరూ ఫూనుకుంటే స్వయంకృషితో సాధించ

వచ్చునని చెప్పాడు. కొంతదూరం ఎత్తుగా మట్టిపోసి దిమ్మెన చేసి రాతితో అంచులు కట్టి కాలువ నడపాలి కొంతదూరం బొంతరాతి దిమ్మెలమీద అడవికొయ్యలు పరచి పైన మట్టిపోసి కాలువ తయారుచేయాలి. స్వయం కృషిపోను ఖర్చు అయిన మొత్తాన్ని ఎకరానికింత ఒఅని ఒడ్డుకోవచ్చునని వివరించాడు, ఆపైకంకూడ కో ఆపరేటివ్ సొసైటీ అప్పుల పథకం క్రింద మంజూరు చేయిస్తానని చెప్పాడు. బంజర్లు తీసికొన్న రైతులు ముందుగా అంగీకరించారు. పని ప్రారంభించారు. క్రమంగా ఇతర రైతులుగూడ ఒక్కొక్కరే పాల్గొనడం సాగించారు.

అనుకున్నంత పనీ ఐంది. ఓ వర్షపురాత్రి కావలివాడు ఓ వ్యక్తిని పట్టి కట్టివేశాడు. అతనితోటి వ్యక్తులు తుపాకిచూసి భయపడి పారిపోయారు. సుబ్బరామయ్యగారు పంచాయతీ ఆఫీసు భవనాన్ని పేల్చి వేసేందుకు పంపిన మనిషి అతను. పోలీసుకేసు పెట్టాడు ప్రసాదరావు. సుబ్బరామయ్య అగ్గిమీద గుగ్గిలం ఐపోయాడు. తక్షణం తన యింటి నుండి వెళ్ళిపొమ్మన్నాడు. అమ్మ ఒక్కటే గోలపెట్టింది వినలేదు. చలించలేదు. వేరే కాపురం పెట్టాడు ప్రసాదరావు. చెల్లెలు అమ్ముకొని తెచ్చిన కొద్దిపాటి ధనాన్నిగూడ ఇవ్వడానికి నిరాకరిండు సుబ్బరామయ్య. దానికి వేరేకారణమూ ఉంది. తన భార్య చెల్లెలి కుమార్తెను ప్రసాదరావుకిచ్చి చేసుకొని తన వద్ద ఉంచుకోవాలని సుబ్బరామయ్య భార్య ప్రోద్బలంతో ఉద్దేశపడ్డాడు. ప్రసాదరావు అంగీకరించలేదు. అంతేగాక కాలువపని ప్రారం ంచడంగూడ అతనికిష్టంలేదు. 'అలగా జనానికి భూములిప్పించావు వాటికి నీళ్ళు వచ్చి పంటలు పండితే మనమాట వింటారా! పనిపాటలకు వస్తారా? వాళ్ళలా చెప్పుక్రింద తేలులా అణచి ఉంచితే సరి లేకుంటే నెత్తికెక్కుతారు' అని చెప్పాడు. ప్రసాదరావు నవ్వి ఊరుకున్నాడు. అదీ ఒక కారణం గృహ బహిష్కారానికి.

ఎదట ముకుందరావు పరిస్థితీ అలాగేవుంది. అప్పుసొప్పులు కో-ఆపరేటివ్ సొసైటీలో తీసికోవడంతో తనవద్దకెవ్వరూ రావడంలేదు. పైగా కుమార్తెను గూర్చిన పుకార్లొకటి. తలెత్తుకొని తిరగలేకుండా ఉన్నాడు మ్రింగ రానికడిలా దాపురించాడు ప్రసాదరావు అని ఉక్రోషంగా ఉన్నాడు. కాలవపని

సాగడం ఆయనకూ ఇష్టంలేదు. త్రోవలో తన బీడుంది బీటి యం ఇస్తామని ప్రసాదరావు చెప్పాడు. అంగీకరించలేదు ముకుందరావు. దౌర్జన్యంగా మట్టిపోయించాడు ప్రసాదరావు. పోలీసుకేసు జరిగింది. ఈలోగా కలెక్టరుగారి ఉత్తర్వులు వచ్చాయి చేసేదిలేక ఊరుకున్నాడు ముకుందరావు.

ఇద్దరు పార్టీదార్ల ఇష్టా ఇష్టాలలో ప్రమేయం లేకుండా కాలవపని జరిగిపోతుంది.

ఓరోజు సాయంకాలం సరళా ప్రసాదరావులు మామూలుగా షికారువెళ్ళి వస్తున్నారు ఆరోజు వారు పరస్పరం హృదయాలువిప్పి మాట్లాడుకొన్నారు. హృదయాలు ఆనందంతో పరవ తొక్కుతుండగా గ్రామంలోకి వచ్చారు. ప్రసాదరావు సరళను వారియింటి వద్ద దిగవిడిచి ప్రక్కనే పాతవూళ్ళో ఉన్న తన ఇంటికి తాటితోపులోగుండా వెడుతున్నాడు ఆలోచనల్తో మునిగి ఉన్న ప్రసాదరావు రివ్వుమనిచప్పుడైతే తటాలున ప్రక్కకు తొలిగాడు భుజా చీల్చుకుంటూ ప్రక్కన పడింది పదునైన బరిశ. వెనుదిరిగి చూసేప్పటికి చీక ఓ వ్యక్తి పరుగెత్తాడు. చేతిని గట్టిగా అదిమిపట్టుకుని త్వరగా ఇంటికి వెళ్లాడు ప్రసాదరావు. దేవుడులాంటి వ్యక్తిని హత్యచేయబోయినవాణ్ణి పూడ్చి పెట్టేస్తామంటూ గ్రామం గ్రామం పార్టీ భేదాలు లేకుండా బరిశలతో తయారయ్యారు. ఈలోగా ఒకరువెళ్ళి డా. సరళకు విషయం చెప్పారు. చేతి సంచితో స్టైతస్కోపుతో పరుగున వచ్చింది సరళ. ప్రసాదరావు చేయంతా నెత్తురు వరదగా ఉంది. కట్టు కట్టబోయింది డా॥ సరళ. అంగీకరించలేదు ప్రసాదరావు. మీచేత నేను వైద్యం చేయించుకోను అన్నాడు. సరళ హృదయోద్వేగంతో ఊగిపోతోంది. ఇప్పటికే చాల రక్తం పోయింది. ప్రమాదం అంటూ ముందుకు వచ్చింది. సరళగారూ! ఈ గ్రామస్థులకు ఇలాటి ప్రమాదాలు జరిగితే పదిమైళ్ళ దూరంలో ఉన్న హాస్పెటలుకు వెళ్ళుతుంటారు. నేనూ అలాగే వెడతాను. అందరికీ ఎలాగైతే నాకూ అలాగే ఔతుంది అన్నాడు. ఎవరు బ్రతిమాలినా అంగీకరించలేదు. సరళకు అర్థమైంది కళ్ళనీళ్ళు కారిపోతూండగా మీ కోరిక అర్థమైంది ప్రసాదరావుగారూ! ఇక్కడే ప్రాక్టీసు పెడతాను. ఇకనైనా వైద్యం చేయించుకోండి

అంది. నవ్వుతూ చేయిచాపాడు ప్రసాద ్. డా. సరళ కుట్టువేసి కట్టుకట్టింది. ఇంజక్షను చేసింది. కేసు పెట్టేండ . అంగీకరించలేదు ప్రసాదరావు.

పంచాయతీవారు కట్టించిన పాకలలో డా॥ సరళ ప్రాక్టీసు ప్రారంభించింది. ఇప్పుడామెకు తీరికే ఉండటంలేదు.

ఓసారి మాలవాడలో కలరావస్తే దరావు సరళలు చాల సేవచేశారు. అధికార్లకు వ్రాసి ఇనాకులేషన్ చేయించారు. రౌడీ రంగడి భార్యకు కలరాతగిలితే ఎవ్వరూ దగ్గరికి పోకుంటే ప్రసాదరావు సరళలు స్వయంగా వెళ్ళి మందులువాడి ఆమెను బ్రతికించాడు. ఆరాత్రి రంగడువచ్చి రెండుకాళ్ళూ పట్టుకొని భోరున ఏడ్చాడు. ''నా భార్యను రచ్చించి నా బిడ్డలను కాపాడారు బాబూ! లేకుంటే అనాది పచ్చులై పోయేవారు'' అని విలపించాడు. ''అటువంటి ధర్మరాజును పొట్టను పెట్టుకోవాలనుకున్నాను ఆ పాపిష్టి ముకుందయ్య మాటలు విని. నా పాపానికే అంతంలేదు దొరా'' అని ఏడ్చాడు. ప్రసాదరావుకు ఆశ్చర్యం వేసింది. సరళగారికి ఈ విషయం తెలియనీయకు పొమ్మన్నాడు.

ఎన్ని అడ్డంకులు వచ్చినా కాలువపని జరిగిపోయింది. బ్రహ్మాండమైన ఆ పనినిచూచి అందరూ ముక్కున వేలేసుకున్నారు. విద్యుచ్ఛక్తి మిషన్‌లద్వారా నీటిని కాలువలోకి పంపిచేస్తే నీరు చెరువులోనికి ప్రవహిస్తుంది. ఆ లెవల్లో పదడుగుల ఎత్తున మైలు పొడుగుకాలువ నిర్మించడమంటే సామాన్యమైన విషయంకాదు. ప్రసాదరావు ప్రతిష్ట జిల్లా అంతా వ్యాపించింది. అధికార్లంతా శ్లాఘించారు. ఆ కాలువకు ఆనాడు ప్రారంభోత్సవం జరుపుకోబోతున్నారు గ్రామస్థులు. దాన్ని ముకుందరావుగారి చేతిమీదుగా జరిపించాలని ప్రసాదరావు ప్రతిపాదించాడు. అంగీకరిస్తాడో లేదోనని అందరూ పార్టీ వివక్షత లేకుండా ముకుందరావుగారి ఇంటిముందు చేరారు. ప్రసాదరావు లోనికివెళ్ళాడు.

ముకుందరావుగారు పడకుర్చీలో పడుకొని పత్రిక చదువుతున్నాడు. ఒక్కసారి తలెత్తిచూసి చూపు దించేశారు. ఆచుపులో ఆహ్వానమూలేదు, తిరస్కారమూ లేదు.

ప్రసాదరావు కుర్చీలో కూర్చుంటూ వచ్చినపని చెప్పాడు. 'కాలువకు

ప్రారంభోత్సవం చేయాలనుకున్నాము. ఆ కార్యం పెద్దలైన తమరిచేతిమీదుగా జరపాలని కోరడానికి వచ్చాము. మీరు తప్పక అంగీకరించాలి' అని చెప్పాడు.

ముకుందరావు హృదయాన్నెవరో మెలిపెట్టినట్టైంది. ఇది నిజమేనా? హేళనా? అనే ఉద్దేశంతో తలెత్తి చూశారు. ప్రశాంతంగా చూస్తున్నాడు ప్రసాదరావు. ఆకాలువ పని ఆపేందుకు తనెంత ప్రయత్నించిందీ గుర్తుకొచ్చింది. కడకు ఆయువకుని హత్య చేయించేందుకుకూడా ప్రయత్నించాడు. ఆ యువకుడే తన ఆధ్వర్యాన్ని కోరుతున్నాడు! ఎంత ఔదార్యం! ఈనాడు తన పరిస్థితి ఎంత హీనంగా ఉండాలో అంతగా ఉంది. తన పార్టీ మెంబర్లెవరూ తన మాట వినడంలేదు. గ్రామంలో పేరుప్రతిష్ఠలూ నశించాయి అనుకునేవాడే లేడు. కడకు తన కుమార్తెగూడ తన్ను తిరస్కరించి తాను వద్దన్నా గ్రామంలో ప్రాక్టీసు పెట్టింది. కాని సర్వశక్తి సంపన్నుడై అజేయుడై నిలిచిన ఈ యువకుడు తన పెద్దరికాన్ని కోరుతున్నాడు! హృదయం గుబులుగా పొంగి కండ్లు నిండుకొచ్చాయి. ముఖం తప్పించే ఉద్దేశంతో లేచి కిటికీ దగ్గరకు వెళ్ళారు. తనపార్టీ మెంబర్లంతా కనిపించారు. ఆశావేశమూ అంతరించిపోగా బంగారపు పొన్నికర్ర చేతికందుకుని బయలుదేరారు.

అదీ అసలు విషయం....

వడివడిగా ముందుకు నడుస్తున్నారు ముకుందరావుగారు. మహా భారత సంగ్రామారంభంలో కురువృద్ధుడైన భీష్మునివద్దకు నడుస్తున్న ధర్మరాజులా ముందుకు వెడుతున్నారు. వారు ఎక్కడికి వెడుతు..రో ఎవరికీ అంతుచిక్కడంలేదు. ప్రసాదరావు మాత్రం కొద్దిగా పసిగట్టి అ దరినీ రమ్మని కనుసన్నచేసి తనూ వెంబడించాడు.

అలా బయలుదేరిన ముకుందరావుగారు నేరుగా సుబ్బరామయ్యగారి ఇంటిలో ప్రవేశించారు. ఎన్ని వత్సరాలైందో! ఆశ్చర్యపోతూ ఆహ్వానించారు సుబ్బరామయ్యగారు.

'చూశావట్రా సుబ్బరామయ్యా! మీ ఘటికుడు చేసినపని! పనంతా తన ఆధ్వర్యంలో పూర్తిచేశాడు. ప్రారంభోత్సవం మాత్రం నాచేతిమీదుగా

జరిపించాలని పట్టుపట్టాడు అలాచూడు! నీ వాకిటిముందు జనసందోహం! అసలందుకు నాకు అర్హత ఉందా అని నా సందేహం. గ్రామం ఎంత అభివృద్ధి పొందిందో చూడు. నీ నా హయాముల్లో అన్నీ తగాదాలే తప్ప ఒక్క మంచి పనైనా జరిగిందా? అసలు మనమే బుద్ధితెచ్చుకొని పిల్లలకు అధికారం అప్పజెప్పి వైదొలగాల్సింది. కాని వారే మనకు రాజకీయ సన్యాసం ప్రసాదించారు. ఈనాడు మనిద్దరికీ గ్రామంలో దమ్మిడీ ఎత్తు విలువలేదు. కాని మన పెద్దరికాన్ని కోరుతున్నాడు మీ అల్లుడు. దాన్ని మనమెందుకు కాదనాలి పద! పోదాం!' అని చేయిపట్టుకున్నాడు.

సుబ్బరామయ్య హృదయోద్వేగాన్ని ఆపుకోలేకపోయాడు. అంత కంటేనా ముకుందం. పద. ఈ విధమైన పరిణామాన్ని నేనూహించలేదోయ్ అబ్బ ఈనాడు నా హృదయమెంత తేలికపడింది' అంటూ ముకుందరావును గాఢంగా కౌగలించుకొన్నాడు.

'అదీగాక! ఇంకోవిషయం. అమ్మాయి తెగేసిచెప్పింది. తాను మీ అల్లుణ్ణి ప్రేమించిందట. తనచేతిమీదుగా జరిపితే మంచిది లేకుంటే రిజిస్ట్రీ మేరేజి చేసుకుంటామని చెప్పింది. బీదవాడుగదమ్మా అన్నాను. నీతి నిజాయితీలే అతని ధనం నాన్నా! అవి లేనప్పుడు ఈ ధనం దేనికి?' అని మెత్తగా అంటించింది. ఆకార్యమూ మనచేతిమీదుగా ఈ మాఘమాసంలో జరిపేద్దాము. లేకుంటే ఆపాడు రిజిస్ట్రీ మేరేజో బండలో చేసికోగలరు. నీ కుమారుడిలాగా పెంచావు. నీకు మాత్రం వేరెవరున్నారోయ్. తాత్కాలికోద్రేకంలో అలా నెట్టేశావుగాని! వాడికి నీపై ఎంతగురని? మామగారి అనుమతితోనే చేసుకుంటానని అమ్మాయితో చెప్పాడట...' అని ఆగాడు.

'ఔనా! ముకుందం. ఈనాడు నాకెంత ఆనందంగా ఉందో చెప్పలేను. నీతో వియ్యం కంటేనా పద వాడేడీ! ఆప్రసాదుగాడింతకూ' అంటూ కలయచూశాడు. 'ఇక్కడే ఉన్నానండీ' అంటూ ఎదుటికివచ్చాడు ప్రసాదరావు.

'ఘటికుడివే పద! అందరూ కాచుకొని ఉన్నారేమో' అంటూ బయలు దేరాడు. చేతులు పట్టుకుని బయటికి వచ్చిన ముకుందరావు, సుబ్బరామయ్యల జంటను చూడగానే మంగళ వాద్యాలొక్కసారి బోరుకలగాయి. గ్రామస్థుల జయజయధ్వానాల్తో ఉత్సవం బయలుదేరింది. సరళా ప్రసాదరావులు వారికిరువైపులా అనుసరించారు.

***

# ప్రయోగం

రచన :

కొసనం మహేశ్వరరావు

పచ్చని పైరులు తలలూపుతూ సంగీత సాధన చేస్తున్నట్టున్నాయి. పవనుడు స్మృతి కలుపుతున్నాడు. బాలభానుడు లోక సంచారానికి బయలు దేరడానికి సన్నాహాలు చేస్తున్నట్టున్నాడు. చిన్న మబ్బులు పెద్ద మబ్బులు భేదభావం లేనట్టు వళ్ళు మరచి ఆడుకుంటున్నాయి. అత్యంత మనోహరమైన, అతి రమణీయమైన ఆ సందర సుప్రభాతానికి స్వాగత గీతాలు పాడుతున్న పక్షులు నృత్యం కూడా చేస్తున్నాయి. ఆడుకోవడాని స్వేచ్ఛ లభించినట్టు, తల్లి ఒడిలోంచి చెంగుచెంగున దూకి పోతున్నట్టు, మధుర మంజుల కమనీయ సుధాధారలు కదిలినట్టు, ఏ అపూర్వ రసజ్ఞుడో రూపొందించిన చిరు అందెల నుండి తేనె సొనలలలా జాలువారిన సంగీతం వినిపిస్తున్నట్టు పిల్ల కాలువలు ఏదో అనిర్వచనీయమైన ఆనందాన్ని కలిగిస్తున్నాయి.

వెలుగు క్రమంగా చిక్కనవుతున్నది. అప్పటికే ఊరు ఊరంతా మేల్కొన్నది. ఎవరి పనుల్లో వాళ్ళు మునిగిపోయారు. గ్రామ వైతాళికులైన కోళ్ళు ఇంకా మేలు కొలుపు ఆలపిస్తూనే వున్నాయి.

రామయ్య వేపపుల్ల బుగ్గను పెట్టుకొని ఆలోచిస్తున్నాడు. ఒకప్పుడయితే ప్రకృతి అందాలను చూసి ఆనందించేవాడే. ఆ అందాలకు వన్నె తెచ్చు వర్ణనలను కూడా ఆలోచించేవాడే. రాబోయే పంట గురించి అంచనా వేసేవాడు. ఇంకా మరింత పండించడానికి పథకాలు ఆలోచించేవాడు. గడ్డి మొలవని భూమిని

సేవించి బంగారం పండిస్తున్నాడు. 'రైతు బిడ్డంటే రామయ్యే' అని నలుగురూ చెప్పుకొనేట్టు చేశాడు, తనకంటే గొప్పవాడు కావాలి తన కొడుకు అనుకొన్న రామయ్య అంచనా తారుమారయింది. అందుకే అతనికి వేదన. వేదనకన్నా మించినదేదో అతని గుండెలను తొలిచేస్తున్నట్టు బాధపడుతున్నాడు. అనేకసార్లు పొలం గట్టున కూర్చుని కన్నీరు పెట్టుకున్నాడు. అంతటి తన మనో వేదనను కొడుకు సూర్యం అర్థం చేసుకోవడం లేదు. తన ఆశయం చెప్పాడు: అందుకే నిన్ను చదివించానురా బాబూ... అని వివరించాడు. కనీసం నేను బ్రతికి ఉన్నన్నాళ్ళయినా నే చెప్పినట్టు విను. తరువాత నీ ఇష్టం అని ప్రాధేయపడ్డాడు.

నీ కంటే గొప్ప చదువు చదివిన నేను నీ మాట వినడమేమిటి? నీ అంత ఎదిగిన నాకు భవిష్యత్తును గురించి ఆలోచించగల మేధస్సు లేదా? నన్ను వట్టి దద్దమ్మను చేస్తున్నావు... అన్న కొడొకు నిర్లక్ష్య భావం, అహంకారం రామయ్య గుండెలను దహించి వేస్తున్నాయి.

అర్ధాంగి సీతకే తన ఆలోచనలు నచ్చలేదు; తన కొడుకునే సమర్థిస్తూంటుంది. ఒక్కగానొక్క కొడుకు అనే వాత్సల్యమా; ఉండ వచ్చును. తనకు మాత్ర లేదా. ప్రాణంతో సమానంగా అభిమానిస్తాడు. అంత అభిమానంతోనూ ఈగను కూడా వాలనిచ్చే వాడు కాదు. అలా పెంచుకొచ్చాడు; అలా అన్ని సౌకర్యాలు కలుగజేస్తూ వచ్చాడు. చదివించకుండా ఉన్నట్టయితే అలా చేసేవాడా... ఛ అవేం ఆలోచనలు... అనుకునేవాడు అప్పుడప్పుడు.

బంగారు కలలతోనే కొడుకును ప్రత్యేకించి చదివించాడు. మొదట తన మాటలను అవుననే వాడు. రాను రాను పట్నవాసపు నాజూకుతనం, పైపై మెరుగులు, ఉద్యోగంపై మోజు ఇవన్నీ పెరుగుతూ రావడం గమ ంచి అప్పుడప్పుడూ హెచ్చరించాడు. కాళ్ళ మీద నీవు నిలబడి నలుగురికి బ్రతుకు తెరువు చూపించగలవు సూర్యం. నీకివేం ఆలోచనలురా బాబూ... ఉద్యోగం చేయాలిటరా నువ్వు అని రామయ్య అన్నప్పుడు కొడుకు 'అవును' అనాట్టు తలూపేవాడు. అదంతా తనకు భయపడి పైకి అలా కనిపించే డని తెలిసినప్పుడు రామయ్య హతాశుడే అయ్యాడు.

ఉద్యోగపు కాగితం, వళ్ళు తెలియని సంతోషంతో తల్లికి చూపించి ఏదో స్వర్గం దొరికినంత సంబరపడిపోతున్న కొడుకునీ, అంత ఆనందాన్ని వ్యక్త పరుస్తున్న భార్యనీ చూసిన రామయ్య వణికిపోయాడు. ఏదో దౌర్భాగ్యం దాపురించినట్టు, ఏదో శని గహ్వారంలోకి ఈడ్చుకు పోబోతున్నట్టు నరక యాతన అనుభవించాడు. కళ్ళలో నీరు తిరిగింది. తల్లీ కొడుకు అవి కన్నీరు కాదు. ఆనంద భాష్పాలని భ్రమించారు మొదట. కానీ అవి విషాద ధారలని తెలిసి ఆశ్చర్యపోయారు. 'శుభమా అని కొడుక్కి సర్కారీ పని వస్తే సంతోషించాలి గానీ... మీ దంతా చోద్యంగా ఉంది... మా బంగారు తండ్రి ఎంత గొప్ప వాడవుతాడు... సూర్యాన్ని దగ్గరకి తీసుకొని నుదుటి మీద ముద్దు పెట్టుకుని తల నిమిరింది.

'సుతరామూ వల్ల కాదంటే కాదు'... రామయ్య గర్జించాడు.

నాలుగు రోజుల పాటు ఎవరికీ తిండీ తిప్పలూ సరిగా లేవు. 'నా మాట వినకపోతే ఈ ఆస్థి అంతా పంచిపెట్టేస్తాను...' అన్న రామయ్య చివరికి 'ఏమైనా చావండి మీ ఇష్టం మధ్యలో నేనెవరిని. నా ఆశయాలు, నా అభిప్రాయాలు, నా ఆశలు నాతోనే చస్తాయి... మీకెందుకు అర్థం అవుతాయి... అయినా మీరెందుకు అర్థం చేసుకోవాలి... నాదంతా భ్రమ... ఎవరి ఇష్టం వాళ్ళది... వచ్చే దుఃఖాన్ని ఆపుకుంటూ ఎలాగో అనగలిగాడు. పులిలా ఉండే రామయ్య మానసికంగానూ, శారీరకంగానూ రోజు రోజుకూ దిగజారిపోతూ వస్తున్నాడు. గుర్తు పట్టలేనంతగామారిపోయాడు.

రామయ్య ముందు నాల్గైదు కాకులు జేరి పోట్లాడుకుంటూంటే జ్ఞాపకాల ఆశయాల తలపులకు అరితరాయం కలిగింది. చిన్న రాయి తీసుకొని వాటిపైకి విసిరాడు. భయంభయంగా ఎగిరిపోయాయి. ధైర్యం గల ఒక కాకి పడి వున్న మాంసపు ముక్కను నోటకరచుకొని తారాజువ్వలా దూసుకుపోయింది. మిగిలిన కాకులు దాని వెనుక పడ్డాయి. ఒక కాకి కాలి గోరు రామయ్య చెంపను గీరింది. రామయ్య చెంపను తడిమాడు, చేతికి రక్తం అంటింది. ఎంత చులకనయాను... అనుకున్నాడు. తన వారే తనను చులకన చేస్తున్నప్పుడు

ఎవరికో లెక్కేమిటి అనుకున్నాడు.

ఊరిలో రామయ్య పెద్దగా చెలామణీ అవుతున్నాడు. ఎంత పెద్ద తగాదానైనా సులువుగా తీర్చి పంపేవాడు. అందరూ ఎంతగానో గౌరవిస్తారు. ఈ మధ్య తీర్పుకోసం వచ్చే వాళ్ళకు అవకాశమే ఇవ్వడంలేదు. ఊపిరి సలపని పనులున్నట్టు ఏ పనీ లేకపోయినా తప్పించుకుంటూ వస్తున్నాడు. ఊర్లో చాలా మంది రామయ్యలో కనిపిస్తున్న మార్పును గమనించారు. కొందరు ఉండబట్టలేక అడిగితే నవ్వి ఊరుకొనేవాడు. ఏదో పరాజయం కలిగినట్టు, ఏదో పోగొట్టుకున్నట్టు, శూన్యంలో దేని కోసమో వెదుకుతున్నట్టు. ఎప్పుడూ పరధ్యానంగా ఉంటున్న రామయ్య ధోరణి భార్యకే సరిగా అర్థంకాక అమాయకంగా ఆమె అడిగితే ఏమీ చెప్పేవాడుకాదు. మరీ రెట్టించి అడిగితే 'చెప్పినా అర్థం చేసుకోలేవు... తెలుసుకొని ఏమి చేస్తావు... నా మాటలు చాదస్తాలుగా అనిపిస్తాయి... అనేవాడు.

వయసు పైబడుతున్న కొద్దీ... మరీ ఇదవుతున్నారు... ఏదన్నా మందు తీసుకోండి' అని భార్య అన్నప్పుడు నిశ్వాసం మాత్రం విడిచి ఊరుకొనే వాడు. తన తెలివితేటలకు ఊరిలో అందరికన్నా ఆశ్చర్యపడే భార్య కొడుకు విషయంలో తనకు ఎదురు నిలిచింది. కొడుకు ఆఫీసరు కావాలి... పెద్ద ఉద్యోగి కావాలి... అని ఆమె ఆరాటం.

'తన కొడుకు గొప్ప రైతు బిడ్డ కావాలి... స్వతంత్రంగా బ్రతకాలి' తన ఉద్దేశం. పోనీలే అని సరిపెట్టుకోలేక పోతున్నాడు. మనసును ఎంత సమాధాన పెట్టుకుందామనుకున్నా కుదరటం లేదు. స్వాతంత్ర్యోద్యమంలో అనేక కష్టనష్టాలకోర్చి, ఎంతో త్యాగం చేసిన రామయ్య మనసు స్వయం శక్తిపై ఎక్కువ నిశ్వాసాన్ని పుంజుకొంది. తన విశ్వాసం మీద, తన ఆదర్శం మీద, తన ఊహా సౌధం మీద పిడుగుపాటు అయింది. నిలువునా కుంగదీసింది. ఇక కోలుకోగలడో లేదోనన్నంత మార్పును అతనిలో చూచినప్పుడు నిజంగా బాధే కలుగుతుంది.

అప్పటికే సూర్యుడు చుర్రుమనిపిస్తున్నాడు. వేపపుల్ల ఇంకా రామయ్య నోట్లో నలుగుతూనే వుంది. 'తాతా మామ్మ రమ్మంటున్నది భోజనానికి...'

ఎవరో కుర్రవాడు పరుగెత్తుకుంటూ వచ్చి చెప్పి జవాబు కోసమైనా చూడకుండా తిరిగి వెళ్ళిపోయాడు.

లేచి నుంచుని ఒడలు విరుచుకున్నాడు. పిల్లకాలువలో మొహం కడుక్కున్నాడు. పొలాన్ని కలియజూశాడు. తెల్లకంకి తప్ప కంకి కనబడుతున్నది. పాలేరు ఇరుగు పొరుగు రైతులు కూడా ఆ మాటే అన్నారు. ఇంకొకప్పుడైతే తీరని అవమానంగా భావించేవాడు. తనలాగే నేలతల్లి నిరాశతో కుమిలిపోతున్నది కాబోలు అనని గొణుక్కున్నాడు.

అడుగులో అడుగు వేసుకుంటూ ఇంటికి వెళ్ళాడు. భార్య ఎదురు చూస్తున్నది. 'బారెడు పొద్దెక్కింది... ఏదైనా పని చేయిస్తున్నారా పొలంలో... అడిగింది. రామయ్య ఏమీ మాట్లాడలేదు. నవ్వనూ లేదు. అసలు వినపడనట్టే వెళ్ళి వాలుకుర్చీలో కూర్చున్నాడు.

'ఏమిటో ఇలా అయిపోతున్నాడు...' సీత బాధగా అనుకున్నది.

భోజనం చేస్తుండగా 'అబ్బాయిని చూడాలనిపిస్తున్నదండీ...' భార్య అన్నది.

'అయితే ఏమంటావు...' కొరకొరా చూశాడు రామయ్య.

'వాడి ఊసెత్తితేనే అంత ఇదయిపోతారేమండీ...' సీతకు కంటినీరు తిరిగినంత పనయింది.

'అవును పగ, కొడుకు కాదూ... అందుకని...' కస్సుమన్నాడు.

'ఒక్కగానొక్క బిడ్డ...' ఈసారి అతి ప్రయత్నం మీద గుడ్ల నీరు కుక్కుకుంది. 'ఏదో చిన్నతనం... నాలుగు రోజులుపోతే అన్నీ అవే సర్దుకుపోతాయి... 'హు అలాగే ... సరేలే..' రామమయ్య బుసకొట్టినట్టన్నాడు. భోజనం వదిలిపెట్టి ఎక్కడ లేచివెళ్తారోనని భోజనం పూర్తయ్యే వరకు ఊరుకుంది సీత. భోజనం అయినాక 'ఏమండీ...' దీనాతిదీనంగా ఉందా సంబోధన. 'కోపం తెచ్చుకోనంటే ఒక మాట...' అస్పష్టంగా అన్నది. భర్త దగ్గర నుంచి ఏమీ జవాబు రాకపోయేసరికి 'అబ్బాయి కూడా వ్రాశాడుగా... మనలను పట్నం రమ్మని...' భయం భయంగానే అన్నది.

'అయితే వెళ్ళు.. నేనొద్దన్నానా? ఖంగున మ్రోగింది కంఠం.

'అదేమిటండీ... మనమా పెద్దోళ్ళమయ్యామా...' భర్త మొహంలోకి చూస్తూ అన్నది.. పొలం పనీ అదీ ఎందాకా చూడగలరు...?

'అందుకని... ఏమిటి సూటిగా చెప్పు' త్రాచులా లేశాడు.

నీళ్ళు నమిలింది సీత, 'ఎన్నాళ్ళ నుండో చెప్పాలని ప్రయత్నం.. కానీ చెప్పలేక పోతున్నాది. కృష్ణా, రామా అనుకుంటూ కొడుకు దగ్గర ఈ వృద్ధాప్యం గడిచిపోతే అంతకంటే ఏమి కావాలని ఆమె ఆరాటం, కోర్కె. ఇవాళ ఆ మాటే ఎలాగైనా చెప్పేయాల్సిందే అనుకున్నది. కానీ ధైర్యం చాలటం లేదు.. భర్త మనస్తత్వం, ఆదర్శం తెలిసీ ఎలా చెప్పేది... కొడుకు ఆఫీసరు... ప ంలో సకల సుఖాలు... ఆఫీసరుగా ఉన్న కొడుకు గొప్పదనం చూడాలి... ఆ గొప్పదనంలోని అనుభూతి ఎలా వుంటుందో... ఆమె మనస్సు కొడుకు వైపుకే ఆకర్షింపబడుతున్నది.

'అబ్బాయి దగ్గరకెళ్ళి ఉందాం... కొన్నాళ్ళ పాటు... మాట పూర్తికాక ముందే 'ఇక్కడ పనులెవరు చూస్తారు...?' రామయ్య గద్దించాడు. 'కట్టుబడి కిచ్చేయండి...' ఆమె మాట నోట్లోని అణిగిపోయింది. చెంప చెళ్ళుమంది. చేయి చేసుకోవడం తన మీద ఇదే మొదలు. రామయ్య పళ్ళు పటపటా కొరికాడు. 'చివరికి ఎలాంటి ఆలోచనలు వస్తున్నాయి. నీకు కూడా... ఇలాంటి మాటలు వినకముందే నేను చచ్చిపోయినా బావుండేది... భగవంతుడా ఏమిటీ శిక్ష...?

ఏడుస్తూ కూర్చుంది సీత. ఏడుపు వస్తున్నా మగవాడు కా ట్టి అతి ప్రయత్నం మీద ఆపుకుంటూ కళ్ళు మూసుకున్నాడు రామయ్య.

స్వాతంత్ర్యం రాక ముందు దేశ దౌర్భాగ్యాని , దు , జాతి వికసించకపోవటానికి అదే కారణమనుకున్నాం. స్వతంత్రం ్చి రెండు దశాబ్దాలయినా మానసిక పరివర్తన రాలేదే... భౌతిక లువలు పెరుగలేదే... అవినీతి పోటీపడి పెరిగిపోతున్నదే.. జాతిలో ఐక్యత లేదే... ఎటు చూసినా రాజకీయ ప్రయోజనాలు ప్రధానంగా నిలబడి అసలు సమస్యలను మరింత

వికృతం చేస్తున్నాయి. మనిషి కన్నా, జాతికన్నా, దేశం కన్నా స్వప్రయోజనాలు ప్రధానం అవుతున్నాయే?.. ఒకరి మేలును ఒకరు కోరుకొనే బదులు, తన స్వార్థం కోసం తనకు లభించాలనుకున్న ఎండమావుల వంటి తాత్కాలిక సుఖాలకోసం, ఎదుటివారేమైనా తన పరిసరాలు నాశనమవుతున్నా, దేశం బలహీన పడుతున్నా ఏమీ పట్టించుకోని మనస్తత్వం ఎక్కడిది?... గాంధీ కలలుకన్న గ్రామ రాజ్యం రామరాజ్యమేనా ఇది??? ప్రతి వారి దృష్టి పట్టణాల మీదే... తరతరాలుగా వస్తున్న భూమాతను, తరతరాలుగా ఆ భూమాత పాలు త్రాగి పెరిగిన శరీరాలు ఏవేవో సుఖాలనాశించి ఆ తల్లిని కాలదన్ని ఎంతో తెలివిగల పని చేసినట్లు భుజాలు ఎగురవేసుకొనే దుస్థితి... వంశపారంపర్యంగా తమను పోషిస్తూ వచ్చిన కుటీర పరిశ్రమలను తృణీకరించి అవహేళన చేసే స్థితి ఎక్కడిది? ఆ పరిశ్రమకు మరింత పుష్టి చేకూర్చి అభివృద్ధికి తీసుకు రావాలనే మనస్తత్వం ఏది? ఎందుకు కలుగడం లేదు... బిక్షగానిలా పరాయి దేశాల సహాయం కోసం తహతహలాడి, వాళ్ళ తిండిగింజలు లేనిదే బ్రతకలేమేమో అనే స్థితి ఇన్ని సంవత్సరాల స్వతంత్ర దేశానికి పట్టిన దుర్గతి. ఈ విషవలయాన్ని ఛేదించాలనే ఆలోచన లేదే... చేయగల, చేసి చూపించగల పట్టుదల, దీక్ష లేనప్పుడు దేశ పౌరునిగా ఉండే స్థానం ఏమిటి... వందకోట్ల చేతులున్నాయి... పని చూపించమని ప్రభుత్వ, యంత్రాగంవైపు, నాయకుల వైపు వెర్రిగా, ఆశగా చూస్తూ ఎంతో కాలాన్ని వృధా చేస్తూ పోయే బదులు తమంత తాము ఏదో చేయాలని ఆలోచించరు? ఒక వేళ అలా ఆలోచన చేసినా కొందరికి తగిన అవకాశాలు వుండవు.. తండ్రి చేసిన పనినే కొడుకు చేయడానికి చదువు. అందువల్ల ఏదో తన వ్యక్తిత్వం పెరిగిందనుకొనే తత్వం అడ్డొస్తున్నది.. రామయ్య మనసు ఈ విధంగా ఆలోచిస్తున్నది.

పోస్టుమాన్ రావడంతో ఆలోచనలు ఆగిపోయాయి. సీత పైటకొంగుతో మొహం తుడుచుకొని పోస్టుమాన్ ఇచ్చిన కవరు చించింది. కొడుకు నుంచి వచ్చిందని తెలియడంతో ఆమె మోములో అప్పటి వరకు క్రమ్ముకున్న నీడలు కాస్త తొలిగాయి. ఉత్తరం చదువుతూ మధ్య మధ్య భర్తవైపు అనుమానం గానూ, ఆశ్చర్యంగానూ చూసింది. 'అబ్బాయి వ్రాశాడండీ ఉత్తరం... ఆమె చదివాక -

కివ్వబోయింది. రామయ్య అలాగే చూస్తూండి పోయాడు... ఉత్తరం కూడా తీసుకోలేదు. ఉత్తరంతో పాటు ఏదో పత్రిక వచ్చింది.

'క్రిందటి ఉత్తరంలోనే వ్రాశాడు గదండీ డబ్బు పంపమని... పంపలేదా...' సీత సంకోచిస్తూ అన్నది.

'మన కొడుకు చాలా గొప్పవాడు... వాడికి నేను డబ్బు పంపడమా... పెద్ద ఉద్యోగి... ఆఫీసరు... చూడు గొప్పదనం... వెటకారంగా అన్నాడు రామయ్య.

'పాపం చిట్టి నాన్న ఎంత ఇబ్బంది పడుతున్నాడో..'

'అన్నొందలు వస్తున్నాయి... ఏమవుతున్నట్టు... మనకు ఎంత ఖర్చు అవుతున్నది. కాస్త ఆలోచించావా... నెత్తికెక్కించుకునే ఇట్లా తయారు చేశావు..

'మనకేం తక్కువండీ.. ఉన్నదొక్కడూ సుఖంగా ఉంటే అంతేచాలు' ఎప్పుడూ ఖర్చు పెడతాడా ఏమిటి... వయసులో ఉన్నవాడు.. ఉత్తరంతోపాటు ఏదో పుస్తకం కూడా వచ్చింది... భర్త ఒడిలో ఉంచింది: ఉత్తరం, పుస్తకమూ. 'ఊ ... మా చెప్పావులే గానీ నోరు మూస్తావా లేదా... ఉరిమినట్టు అ డు. యాథాలాపంగా ఒడిలోని పుస్తకాన్ని తిరగేశాడు. ందులో కొడుకు రు కనపడింది. మనసులో ఏదో కుతూహలం రేగిం . సరిగా కూర్చున్నాడు సర్దుకుని. 'నిరుద్యోగ సమస్య పరిష్కారమ [illegible] లా?...' శీర్షి ను చది న తరువాత మరింత ఉత్కంఠ కలిగింది. ఏకబిగువున వ్యాసం ఆసాం ం చదివాడు. అన్నీ తన భావాలే. అలా ఆవ్రాయగలిగిన వాడు మరి ఎందుకు ఆచ ంచ కుండా ఉన్నాడు - అనే ప్రశ్న కలిగింది. ఇదంతా ఎక్కువగా కొందరు నాయకులు అనుసరించే పద్ధతిలా అనిపించింది. ఆచరించలేని [illegible] చెప లి... ఆచరించగలిగేట్టయితే తన కొడుకు ఒక్క క్షణం ఉద్యో[illegible] ఉ డడు. [illegible] లు కట్టుకుని తన స్వయం కృషితో లీనం కావాలి'. చెప్పేది [illegible], మం[illegible]కటి అయితే ఇది మరింత ప్రమాదకరమైన స్థితి - అ [illegible] చి [illegible] య్యకు. ఒక వేళ కొడుకు మనసు నిజంగా మా ందేమో? [illegible] .. నిజంగానే మారేడేమో... నిజంగానే మారితే అంతకం కా సిందే టుంది...

'మనబ్బాయిలో చాలా మార్పు వచ్చినట్టుందేవ్ సీతా... చూడు ఏం శ్రాశాడో. తండ్రికి తగ్గ కొడుకు...' భర్త మాటలకు సీత ఆశ్చర్యం పోయింది... ఉన్మాద లక్షణాలు కాదు గదా అన్న తలపు కలుగకపోలేదు. నోరు తెరచి అలాగే చూస్తూండి పోయింది మీరనేదేమిటన్నట్టు.

బయట బండి చప్పుడయింది. తమ ఇంటిముందే ఆగింది. ఎవరా అని సీత బయటకు వెళ్ళి చూసింది. 'అరే... నీవా... ఏమండోయ్ అబ్బాయండీ... అబ్బాయి వచ్చాడు... ఇంతకు ముందే నీ ఉత్తరం వచ్చింది... మాటమాత్రంగానైనా రాయలేదే....' ఆశ్చర్యపోతూ ఆనందం పట్టలేక అన్నది.

కొడుకు వెనకనే ఒక అమ్మాయి దిగడంతో ఆమె ఆశ్చర్యానికి అవధులు లేకపోయాయి. ఎవరన్నట్లు చూసింది. సూర్యం సిగ్గుపడినట్లు బుర్ర వంచేసుకున్నాడు. ఆమె మాత్రం సీతకు వంగి కాళ్ళనద్దుకుంది, ''ఎంత బావుంది అమ్మాయ్... లోపలికి పదండి...' సీత అన్నది.

'ఈమె నా స్నేహితురాలు లక్ష్మి... అమ్మా... 'సూర్యం తడబడుతూ చెప్పాడు.

రామయ్య కూర్చున్న కుర్చీనుంచి లేవనే లేదు. కళ్ళు మూసుకుని ఏమీ ఎరగనట్లు, తెలియనట్లు కూర్చుండిపోయాడు.

''అమ్మా... నాన్న ఏరి... పొలం వెళ్ళారా ...' కొడుకు అడుగుతున్నాడు తల్లిని. 'ఇక్కడే ఉన్నానురా బాబూ...' అని అందామనుకున్నాడు. లేచి ఎదురెళదామనుకున్నాడు. బలవంతంమీద ఏమీ చేయలేదు; మనసును సమాధాన పెట్టాడు.

'లేదు... ఇంట్లోనే ఉన్నారు...' సీత అన్నది.

క్షణాల్లో తన దగ్గరకొస్తాడు. మనసు పరిపరివిధాలా ఆలోచిస్తున్నది. మనసు మారిందేమో.. ఏమో... తెలుస్తుందిగా ... ఈ అమ్మాయి ఎవరు? ఎప్పుడూ ఇలాంటి పని చేయనివాడు ఇప్పుడు వెంట ఎందుకు తీసుకువచ్చినట్లు...

'నాన్నా... నాన్నా... నిదురపోతున్నట్లున్నారమ్మా...' కొడుకు దగ్గరకు వచ్చి రెండడుగులు వెనక్కు వేశాడు. రామయ్య కళ్ళు మరింత గట్టిగా

మూసుకున్నాడు.

'స్నానాలు అవీ కానీయండి... వంట చేస్తాను...' సీత వంటఇంటి వైపు దారి తీసింది. ఆమె వెనుకే లక్ష్మి కదిలింది. 'అన్నట్లు మరచేను... లక్ష్మి... ఇదిగోనమ్మా యీ గదిలో నీ సామాను పెట్టుకో...' అని సీత ఒక గదిలోకి తీసికెళ్ళింది.

'తరువాత సర్దుకుంటాలెండి... మీకు కాస్త సాయం చేయనీయండి...' లక్ష్మి అన్నది.

'బలేదానివమ్మా... నీ చేత పనిచేయించటమా... అతిథులచేత పని చేయించకూడదు...'

'పరాయిదాన్ని కానులెండి....' లక్ష్మి అని పెదవి కరుచుకుంది.

'అంటే... ' సీత అవును పరాయిదానివని ఎవరన్నారు.. పరాయిదానివి కాకుండా మా ఇంట్లోనే అచ్చంగా వుండిపోకూడదు... అంతకంటే కావలసింది... ఏముంటుంది...

మనసులో కోడలిని ఊహించుకొని అంటున్నది.

'పెళ్ళి చేసుకోమని చిలక్కి చెప్పినట్లు చెప్పాం... ఎప్పటికప్పుడు టలాయిస్తూ వస్తున్నాడు తొందరేముందంటూ... ఆ దేవుడు ఎప్పుడు రాసిపెట్టాడో...' సీత తన ధోరణిలో చెప్పుకుపోతున్నది.

రామయ్య ఏమేమో ఆలోచిస్తూ నిజంగానే నిద్రపోయాడు. మెలకువ వచ్చేసరికి పొద్దువాలుతూన్నది, ఆవిలించి ఒళ్ళు విరుచుకుని కూర్చున్నాడు.

ప్రక్కనే పడుకుని ఆలోచిస్తున్న సీత . మేలుకుని కూం వడంతో ఆమె కూడా కూర్చుంది.

'అబ్బాయి వచ్చాడండీ...'

'ఉహూ... ఎందుకు వచ్చాడట?...'

'అదేమిటండీ పాపం వాడు వస్తే...'

'పాపం ... అదే ఎందుకు వచ్చాడు... ఏమి పనిమీద వచ్చాడు.. డబ్బు

పంపలేదని... ఆస్తి పంపకానికి వచ్చాడేమో...'

'అవేం మాటలండీ... ఎవరన్నా వింటే నవ్విపోతారు...'

'ఎవరో నవ్వుకుంటారని నాకేమీ బాధ లేదు... అయితే ఎందుకొచ్చాడంటావ్.. అడిగావా?...'

'అడగలేదు...' నిజంగా ఎందుకనో ఆమెకి అడిగితే బావుండుననిపించింది నిజంగా భర్త అన్నట్లు తెగతెంపులు చేసుకోవడానికి గాని రాలేదుకదా డబ్బు పంపలేదని కోపం వచ్చిందేమో... ఏమో మరి? అయితే ఆ అమ్మాయి ఎవరు? స్నేహితురాలన్నాడు.

ఇంతలో భర్త అడగనే అడిగాడు. 'ఒక్కడే వచ్చాడా, ఇంకెవరయినా ఉన్నారా? 'ఏమీ తెలియనట్లు అడిగాడు.

'ఎవరో లక్ష్మిట... స్నేహితురాలన్నాడు...'

'అదీ వ్యవహారం... వీడు ఎంతకు తెగించాడు... చూశావా... మనం బ్రతికి ఉండగానే...'

'ఇంతకీ ఏమంటారు....' అర్థం కానట్లు అమాయకంగా అడిగింది.

'వాళ్ళిద్దరూ ప్రేమించుకున్నారేమో... ఇంతకీ వాళ్ళేరీ...'

'ప్రేమా... అంటే పెళ్ళి చేసుకుంటారన్నమాట... ఎంత బావుందండీ... పేరుకు తగ్గ అందం.... నిజమేనంటారా.. మన పొలంకేసి వె. రు... మరి కులం... ఏమిటో, సంప్రదాయం ఏమిటో వంశం ఎలాంటిదో ... త అన్నది.

'వాళ్ళకు నచ్చినప్పుడు అవన్నీ మన కెందుకు గానీ,... నాదొకటే షరతు... నేను చెప్పినట్లు వింటే వాడు చెప్పినట్లు వింటాను... 'రామయ్య అన్నాడు. 'ఏమిటండీ.. అది? ఎవరమ్మాయో ఏమిటో తెలుసుకోకుండానే...' సీత అన్నది.

'అవన్నీ నాకు అనవసరం. వాళ్ళు ఇద్దరూ ఇష్టపడినప్పుడు మధ్యమనకేమిటి... వాళ్ళ సుఖమేగా మనకూ కావలసింది... కాలంతోపాటు

మంచి అనుకున్నప్పుడు మనమూ అంగీకరించాలి.... ' రామయ్య అన్నాడు.

'నలుగురి నోట్లో నానమటండి.. వేరే విధంగా జరిగితే... ఏ కులమో ఏమో... అయినా మన ఇది గానీ పెళ్ళి చేసుకోబోయే అమ్మాయిని సరాసరి వెంట బెట్టుకొస్తాడుటండీ.. అదేమీ అయి వుండదనుకుంటాను...' సీత అన్నది.

రామయ్య ఏమీ మాట్లాడలేదు.

కాళ్ళూ చేతులు కడుక్కుని మజ్జిగ గి బయలుదేరాడు రామయ్య. సీత కూడా ఆయన వెంట బయలుదేరింది. 'మన తోటలో ఈ సంవత్సరం పళ్ళ దిగుబడి బాగా తగ్గిపోయిందన్నాడు పాలేరు... నాకేమో అనుమానంగా ఉంది... దొంగతనం ఏమయినా జరుగుతున్నదేమో...' సీత అంది.

'ఉహూ అదేం లేదు.. దిగుబడి తక్కువగానే ఉంది. మనలాగానే తోటకూడా దిగులుగా ఉంది... 'రామయ్య అన్నాడు.

సంధ్య కిరణాలు ప్రకృతికి బంగారు ముసుగు కప్పుతున్నాయి. మేతకు పోయిన పశువులు ఇంటి ముఖం పట్టాయి.

'చూడు వాతావరణం ఎంత అందంగా ఉందో... ఎన్నాళ్ళుగానో చూస్తున్న నాకు ప్రతిరోజూ ఏదో క్రొత్తదనం కనిపిస్తుంటుంది. నీకు పట్టణంలో ఈ వాతావరణం దొరుకుతుందా... నాకు ఎప్పుడు వెళ్ళినా ఉన్న నాలుగు రోజులు తోచదు. ఎప్పుడు ఇంటికి వెళ్ళిపడదామా అనిపిస్తుంది... ఇది వాస్తవికత. ఇది అధ్యాత్మికం అది భౌతికం.... ఇక్కడ ఆనందం కొనుక్కోనక్కరలేదు... అక్కడ కొనుక్కున్నా లభించదు.... అదొక ముసుగు..... ఆ ముసుగులో ఏదో ఉందని భ్రమ... ఎండమావులో నీళ్ళు వున్నట్లు భ్రమించినట్లుగానే ఉంటుంది. అక్కడ ఉన్న సౌకర్యాలు మనం కూడా ఇక్కడ కలుగజేసుకోవచ్చు. మన ఇల్లు ఉంది... ఎంత సౌకర్యంగా ఉంటుంది.... నా కు ఇదే స్వర్గం అనిపిస్తుంది...' రామయ్య అంటున్నాడు.

'అబ్బాయిగోరూ... ఏరో అమ్మాయిగారు కూడా నారండీ...' పాలేరు ఎదురొచ్చి చెప్పాడు.

'వాళ్ళకు మంచీ చెడ్డ ఏమైనా చూశావా... సీత అడిగింది.

★ ★ ★

'వీరు నాన్నగారు...' సూర్యం లక్ష్మితో అన్నాడు.

పాదాభివందనం చేసింది. రామయ్య ఆశీర్వదించాడు. 'పేరు లక్ష్మి నాన్నా... మేష్టరు ఉద్యోగం చేస్తున్నది...' అన్నాడు సూర్యం.

'చాలా సంతోషం...' రామయ్య అన్నాడు. 'మీ ఇద్దరికీ ఏకాంతంగా తిరిగే అంతటి సంబంధం ఏమిటి...?' అన్నట్లు చూశాడు.

'మీరిద్దరూ ప్రేమించుకున్నారు కదూ...' ఎంతకీ ఎవరూ మాట్లాడకపోతే రామయ్యే అన్నాడు నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ.

అంతసూటిగా అడిగేసరికి అందరికీ ఒకవిధమైన భయం కలిగింది. లక్ష్మి తల కుంగి పోయినట్లయింది. సిగ్గుతో. 'అవును' అన్నట్లు గుటకలు మింగాడు సూర్యం.

'ఎవరమ్మాయి... ఏమిటి... కులం గోత్రం... పెద్దవాళ్ళం ఉన్నామనే గౌరవం లేకుండా...' రామయ్య మాటలు బరువు అయినప్పటికీ, ఆ అనే ధోరణి మాత్రం కటువుగా లేదు.

'మీకు చెప్పకుండా నేనేమీ చేయను... అందుకే.... తీసుకువచ్చాను.. స్వయంగా చూస్తారని...' సూర్యం నీళ్ళు నములుతున్నాడు.

'మేమే వచ్చేవాళ్లం గదా నాయనా...' సీత అన్నది... 'వాళ్ళ పెద్దవాళ్ళు ఏమనుకుంటారు.... కుర్రనాగన్న... అన్నీ చిన్న తనపు చేష్టలే...'

'పరాయిది కాదు.. మన రాధమ్మత్త కూతురు...' సూర్యం మాటలు నమ్మకం కలిగించనట్లుగా సీత, రామయ్య ఒకరినొకరు చూసుకుంటున్నారు.

'ఏమిటిరా నీవనేది సూర్యం.. అదెప్పుడో చనిపోతేను...' రామయ్య వణికే కంఠంతో అన్నాడు.

'లేదు నాన్నా బ్రతికే ఉంది... ఈ నాటికి బ్రతికే ఉంది' ఒక ఫోటో తండ్రికి అందించాడు సూర్యం.

'అయితే వెంట పెట్టుకురాకపోయావా దాన్ని కూడా..' రామయ్య గొంతు గాద్గదికమైంది.

'మీరు ఇంట్లో అడుగు పెట్టనిస్తారో లేదో అని... ఊర్లో నలుగురూ నాలుగు విధాల ఇష్టం వచ్చినట్లు అనుకుంటారని.. ఈ విధంగా అందరం చిన్నపోవాల్సిన అవసరం లేకుండా పోవాలని..' సూర్యం అన్నాడు.

'పాపం చిట్టితల్లి ఎన్ని అవస్థలు పడిపోయిందో.. నమ్మి మోస పోయింది... అందరూ హేళన చేశారు.. పాపిష్టిదని కన్న తల్లిదండ్రులే ఇంటినుండి గెంటేశారు.. ఏమయినా రాధ గొప్పది... ధైర్యంగా నిలబడి బ్రతుకును సార్థకం చేసుకుంది.. కూతురుని ఇంతదాన్ని చేసింది... నీకు ఎట్లా తెలిసింది.. ' రామయ్య అన్నాడు.

'అంతా దైవలీల. ఒకరోజున ఇంటికోసం తిరుగుతూ వీరున్నచోటికి వెళ్ళాను.. తరువాత వివరాలతో నన్ను ఆమె పోల్చుకోగలిగింది.. మొదట్లో తమ వివరాలు నాకు తెలియనీయలేదు. నేనూ అక్కడే ఒక గది తీసుకుని ఉన్నాను... నన్నెంతో ఆప్యాయంగా చూసుకునేది అత్తయ్య. నాకు కావలసిన సదుపాయాల విషయంలో ఎంతో శ్రద్ధ తీసుకునేది. ఆప్తులు చూసుకున్నట్లుగానూ, స్వంత ఇంట్లో ఉన్నట్లుగానూ అనిపించేది. లక్ష్మి కూడా నాతో ఎంతో చనువుగా ఉండేది. మేం దగ్గరవడం గమనించింది అత్తయ్య. ఒకనాడు లక్ష్మిని పెళ్ళి చేసుకుంటానని అత్తయ్యతో చెప్పాను. మా నాన్న అమ్మకు కూడా వ్రాస్తాను... అని అన్నాను. అప్పుడు అత్తయ్య వారించింది. మేము భ్రష్టులం బాబూ... అంటూ కథంతా చెప్పింది. ఏమయినా సరే వివాహం చేసుకుంటే లక్ష్మినే చేసుకుంటాను లేకపోతే లేదన్నాను. 'ఇలాంటి మాటలు నమ్మే నేనూ మోసపోయాను, అలాగే నా లక్ష్మి నాలాగే మోసపోకూడదు. ఏదో ఉద్రేకంలో ఏదో అంటున్నావు బాబూ... అన్నది. అత్తయ్య అన్నదాంట్లో కూడా నిజం లేకపోలేదు... ఎవరు చేసిన తప్పుకు వారు శిక్ష అనుభవించాలి.... నాకు అర్థం కాలేదు. ఏ పాపం ఎరుగని లక్ష్మి జీవితానికి' ఎలాంటి అనా ౦ం రుగ డదు అని నిశ్చయించుకున్నాను. అందుకే వెంట సుకు ను. మీరు తప్పక అంగీకరిస్తారని...' సూర్యం అన్నాడు.

'ఏమో అనుకున్నా... గట్టివాడవే... నిర్ణయించుకున్నాక ఇంక మా.

సమ్మతి ఎందుకు!... చేసుకోపోయారూ రిజిస్ట్రరాఫీసుకుపోయి....' రామయ్య మాటల్లో వ్యంగ్యం ధ్వనించింది. 'అయినా ఏమమ్మా లక్ష్మి నీవేమంటావు? నీకు ఇష్టమేనా? లక్ష్మివైపు తిరిగి చూస్తూ అన్నాడు.

'నాదొక షరతు మామయ్యా... అలాగయితేనే నేను బావను పెళ్ళిచేసుకుంటాను లేకపోతే....' సూర్యంవైపు కొంటెగా చూస్తూ అన్నది.

'ఏమిటమ్మా అది... సీత అన్నది' 'తనంత తాను చేసుకుంటానన్నాడనేగా అంత అలుసు. చులకన...'

'కాదు అత్తయ్యా... మామయ్య వ్రాసే ప్రతి ఉత్తరమూ చదివేదాన్ని... మామయ్య చెప్పినట్లు చేస్తే నాకేమీ అభ్యంతరంలేదు...' లక్ష్మి అన్నది.

'మామయ్యను మంచి చేసుకుంటేగాని కుదరదని అప్పుడే ఎంత పెద్ద ఎత్తు వేసింది... చూడమ్మా నన్ను ఉద్యోగం మానేయమంటూన్నది...' సూర్యం అన్నాడు.

'లక్ష్మి ఎంత మంచిదానవమ్మా నీకయినా అర్థం అయింది, నా మనస్సు.... నీవు చెబితే వింటాడేమోనమ్మా... నామాట వినేట్లులేడు.. సరైన ఆలన పాలన లేక ఈతోట ఎలా దిగ జారిపోతుందో... పొలం కూడా అలాగే ఉంది. ఇవన్నీ వదులుకొని ఉద్యోగం వెలగబెడుతున్నాడు. చదువుకున్నవాళ్ళంతా పట్టణాలకు వెళ్ళిపోతుంటే గ్రామాలు ఏమయిపోతాయి. చదువుకొనేది ఉద్యోగం కోసమనుకుట్లయితే చదువుకున్నవాళ్ళందరికీ ఉద్యోగాలు ఎక్కడనుండి వస్తాయి... చదువుకున్నామనే గర్వంతో శరీరకష్టానికి దూరమయి సుఖాలను కొనుక్కోవాలని చూస్తున్నారు తల్లీ... కృత్రిమ వాతావరణానికి అలవాటు పడిపోతున్నారు. పై తళుకులకు మోసపోయి అసలు జీవితాన్ని అనుభవించలేక పోతున్నారు. భౌతిక సుఖాలనాశించి మానసిక ఆనందం, అనుభూతి పొందలేక పోతున్నారు... పోనీలేమ్మా వారికి అర్థం కాకపోయినా నీకయినా అర్థం అయింది..' రామయ్య ఒకవిధమైన ఆనందానుభూతితో అన్నాడు.

'అంతంత మాటలనకండి నాన్నగారూ... అప్పుడే కోడలిని పొగిడేస్తున్నారు.. నాకంటే మీ మనసు అర్థం చేసుకున్నవారు ఎవరూ ఉండరను

కుంటాను.. నాకు చాలా బాధగా ఉంది. అంతా నాటకం.. లక్ష్మిని వివాహం చేసుకోవాలనే ఉద్దేశ్యంతోనే ఇలా చేశాను. మిమ్మల్ని చాలా బాధ పెట్టాను.. క్షమించండి.. ఉద్యోగానికి రాజీనామా ఇచ్చేశాను. మీరు కలలు కన్నట్లు నా చదువుతో మన భూమిలో బంగారం పండిస్తాను. రైతు రామయ్య కొడుకు సూర్యం అని నలుగురు చెప్పుకోవాలి...' సూర్యం మాటలకు తండ్రి హృదయం పొందిన ఆనందం వర్ణనాతీతం. రామయ్యకు భవిష్యత్తు బంగారు బాటలా కనిపించింది. కళ్ళనీరు కదలింది.. అది వట్టి నీరు కాదు ఆనంద భాష్పాలు... కొడుకును కౌగిలించుకున్నాడు. 'ఇన్నాళ్ళు అందరం బాధపడ్డాం అనవసరంగా. ఈ విషయం ముందే చెబితే ఎంత బావుండేదిరా సూర్యం.. పూర్తిగా నన్ను అర్థం చేసుకోలేదురా నీవు... నేను ఆధునికులలో ఆధునికుడిని. ప్రాచీనులలో ప్రాచీనుడిని.. మంచిని మాత్రమే ఆలోచించగల మనస్సు.. మనమూ, మన పొరుగూ, మన ఊరు, మన దేశం.. అందరం సుఖంగా ఉండాలనే ఆశ నాది. ఆ సుఖాన్ని మనంత మనం సంపాదించుకోవాలనే తపన నాది... మన దేశ సౌభాగ్యం మన చేతుల్లో ఉందన్న దృఢ విశ్వాసం కలవాడ్ని నేను... గ్రామాభ్యుదయమే దేశ అభ్యుదయం అన్న గాంధీ మాటలను అక్షరశః నమ్మినవాణ్ణి.. ఇవాళ నాకు పండగ. అబ్బ చాలా ఆకలి వేస్తున్నది.. పద సీతా... ఇంటికి పోదాం. మీరూ త్వరగా వచ్చేయండి.. 'రామయ్య మనస్సు ఆనంద డోలికల లూగుతున్నది. రామయ్య దంపతులు గృహోన్ముఖులవుతున్నారు. లక్ష్మీ, సూర్యంలు మనస్సులోనే అనుకున్నారు ఎంత అదృష్టవంతులం అని. పెనుతుఫానును ఎదుర్కోవలసి వస్తుందేమో అని ఊహించుకుని, అందుకు తామెంత స్థయిర్యంగా మెలగాలని రిహార్సల్సు వేసుకున్న ఆ ప్రేమికులకు ఆ విధంగా నిరాశే కలిగిందని చెప్పాలి. ఇంత త్వరగా తమకు ఆమోదముద్ర లభించినందుకు వారికి కలలో జరిగినట్లుగా ఉంది.

'చూశారా మామయ్య నన్ను అప్పుడే ఎంత మెచ్చుకున్నారో.. మీరు ఎప్పుడూ చెప్పలేదే. మామయ్య ఇంతింత మంచివారని. నా అదృ ్. అత్తయ్య కూడా ఎంత మంచివారు. ఇంత మంచి త దండ్రులు ఈ ప్రపంచంలో ఎందరికి ఉంటారంటావ్.. ఇంతకీ అదృష్టవంతులం మనం..' లక్ష్మి అన్నది పట్టలేని

ఆనందంతో. సూర్యం ఆమె బుగ్గ మీద చిటికవేసి.. గున్నమామిడి కొమ్మమీద లేచిగురుటాకుల మధ్య ఊసులాడుకుంటున్న గువ్వ జంటను చూపించాడు.

'ఛః పొండి.. అవి మనల్నే చూస్తున్నాయి...' కొంగుతో మొహం దాచుకుంది.

కోకిల కమ్మగా పాట ప్రారంభించింది. సిగ్గుపడిపోతున్నట్లు సూరీడి మొహం కందిపోయింది. ఏదో ఆనందం వెల్లివిరియబోతున్నట్లు నింగిలో చుక్కలు దోబూచులాడుకుంటున్నాయి.

***

# ్రామసీమ

రచన :

ఎస్. వి. సత్యనారాయణ మూర్తి

ఆగ్రామం ఒకప్పుడు అందాలసీమ. ఆనందాల స్వర్గసీమ. ఒకనాడది తాను కడుపునిండుగా తినగా, అతిథి- అభ్యాగతులకు పెట్టగా యింకా మిగుల్చుకొనేది. ''జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ'' అనే లోకోక్తికి అదొక మచ్చుతునకగా ఉండేది. మంచిరోజుల్లో మహా వైభవం అనుభవించింది. భూమి సమస్త సస్యాలను ఫలించి ఆనందాన్ని ప్రతిఫలించింది.

కాలం మారింది. కానిరోజు లొచ్చాయి. అదృష్టచి( ం అటు రిగింది.

గ్రామంలో కరువు - కాటకాలు రాజ్యమేలుతున్నాయి. మంచి అనేదానికి ప్రస్తుతం నిలువనీడలేదు. అయిదు తరాలుగా గ్రామంలో నీటికే కరువా- -ది. కనీసం దాహం అడిగినా తీర్చేవారూ - ఆర్చేవారూకూడా కరువైనారు. గ్రామానికి ఆయువుపట్టు నీటివసతి. వరుణదేవుడు ఒక దశాబ్దంగా ఆ గ్రామంపైన శీతకన్నేశాడు. మిగిలిన నాలుగు నీటిచుక్క-ల్నీ సూ ́ డు జీర్ణించుకున్నాడు. భూమి - గ్రామం కూడా జీర్ణించి, శిథిలా ం నికి వస్తున్నాయి. ఆరు నిలువులలోతు తవ్వినా టిచాలు కన డటమే కష్టం. ఉన్న ఒక్క- చెరువుకూడా ఎండెండి పూడికవేసుకుపోయిం . పాడిపంటలు దిగజారిపోయాయి. ఎప్పుడైతే -ˆనాధారాలు ర్థమైపోయాయో అప్పుడే గ్రామంలో - ఆశ్చర్యం - మంచితనం కూడా అదృశ్యమవుతూ వచ్చాయి. వాటిస్థానాన తరతరానికీ అజ్ఞానం, దారిద్ర్యం పెరుగుతూవచ్చి దానిని కృంగదీసి

బురదగుంటలా మార్చాయి. ఈనాడది తనను తానే పోషించుకోలేని అయోమయస్థితిలో వుంది.

అజ్ఞానం - అవిద్య, అనారోగ్యం, దారిద్ర్యం అనైకమత్యం, కక్షలు, కోట్లాటలూ నిత్యం విలయతాండవం చేస్తున్నాయి.

ఆ గ్రామానికి రైలుప్రయాణం తరువాత బస్సెక్కాలి. బస్సు ఎక్కినతరువాత ఎద్దుబండెక్కాలి. మడమలోతు బురదబాటవెంట ఆరుమైళ్ళు ఒళ్ళు హూనమయేలా ప్రయాణం చేసిన తరువాత గ్రామం చేరుతారు. ఈ బాధంతా పడలేక సామాన్యంగా ఎవరూ ప్రయాణంచేయరు. అత్యవసరమైన సరకులు కొనుక్కునే నిమిత్తం మాత్రం రెండు మూడు నెలలకోమారు యిరవైమైళ్ళ దూరంలో వున్న నాటుబస్తీకి పోయివస్తుంటారు. అందుచేత ప్రపంచానికీ ఆ గ్రామానికీ అసలు సంబంధమనేది ఉన్నట్లు కనబడదు. చుట్టూదట్టమైన అడవి. వారెవరూ తమ పిల్లలకు చుట్టుప్రక్కల అయిదారుమైళ్ళ పరిధిలోతప్పితే వేరేచోట సంబంధం చెయ్యరు. వారి ఆలోచన ఎంతసేపూ వారి పరిధిని దాటిపోదు. తమస్థితిలాగో బాగుపడితే.... అనే ఆశవుందిగాని తామే బాగుపరచుకోవాలనే ఆశయంలేదు. నూటికొకడు అక్షరంముక్క తెలిసినవాడు. అక్కడ నోరుగలవాడిదే అధికారం. మంచితనమనేది చేతగానితనం క్రింద జమ. అందుకని ఎవడూ మంచిని ప్రదర్శించడు. అందుకని ఎవరూ ఆ గ్రామానికిరారు. చూసే దాతలేక దేవాలయం, సత్రం దాదాపు పాడుబడ్డాయి.

ఒక మంచిపని చేయాలన్నా ఎవరికీ వీలుపడదు. ఎందుకంటే అక్కడ రెండు పక్షాలున్నాయి. ఒక పక్షంవారు అవునంటే, రెండో పక్షంవారు తప్పకుండా కాదంటారు. ఆ రెండు పక్షాలకీ రాజీకుదరదు. ఏపనీ సాగదు. కాదని ఎవరైనా పనికి నడుంకట్టేడా వాడితల రాత్రికి రాత్రే పుచ్చకాయమాదిరి పగిలేను. ఎవరు కొట్టారంటే ఏమో.

కనుక మంచిపనేదీ జరగదు! అయ్యా! అదీ ప్రస్తుత కథ!

ఇది యిలావుండగా నరమాంసం మరిగిన ఒక పెద్దపులి గ్రామానికి

యముడిలా దాపురించింది. ఊళ్ళో సగందాకా పాడిగొడ్లను పొట్టబెట్టుకున్నది. చాలక పైగా మనుష్యులను వేసుకుపోవటం సాగించింది. ఊళ్ళో కక్షలు యిందుకు బాగా దోహదమిచ్చాయి. పులి ఎదుటిపక్షంతాలూకు మనిషిని ఎత్తుకుపోతే అవతలిపక్షంవారికి పండుగ. అలావుంది. అయితే నానాటికి తీసికట్టునాగంభొట్లు అన్నట్టు గ్రామానికంతటికి మహామ్మారై పట్టుకుంది పెద్దపులి. అందరికీ అంతో యింతో నష్టం కలిగించింది. ఇక ఎట్లాగూ తప్పదని తాత్కాలికంగా గ్రామమంత ఒకటై పులిని కొట్టడానికి ప్రయత్నించింది. చిక్కితేకదా?

పులిని కొట్టే వేటగాడిని తీసుకురమ్మని నలుగురు పెద్దలూ ఒక మనిషిని జిల్లా కేంద్రానికి తరిమారు. వాడు పోతూ పోతూ పులినోట పడ్డాడు పొలిమేరలోనే. అయిదువారాలైనా మనిషి అతీగతీ తెలియదు. అయిపులేకుండా పోయాడు. మరొక మనిషిని తరిమారు. ఆ మనిషి నానాగడ్డికరిచి, తలక్రిందులై ఎట్లాగో ఒక నల్లదొరగారిని గ్రామానికి లాక్కువచ్చాడు. ఆయన ప్రఖ్యాత ''షికారి'' యట. పాతిక బెంగాల్ పులుల్నీ, రెండు ఏనుగుల్ని ట్టాట్ట, ఇంకా ఎన్నిటినో కొట్టాట్ట. వేషం చూడబోతే పిట్టలదొరలా కన్పించాడు. ఆయనకి ఇద్దరు అనుచరులు. దొరగారు అన్నదానికల్లా తందాన - తానా పాడడమే వీరిపని.

''ఏదీ పులి? కమాన్ చూపండీ కాల్చిపారేస్తాన్'' అని గర్జించారు దొరగారు. జీపుకారు దిగి గ్రామంలో అడుగుపెడుతూనే. డబల్ బారెల్‌గన్ గట్టిగానే పట్టుకున్నాడు. పులి ఎదుటనే వున్నట్లు. పెద్దలందరూ దొరగారికి విశ్రాంతి - సౌకర్యాలు సమకూర్చి, పులి రాత్రిగానీ రాదని విన్నవించుకు రు. ఆయనకు తాత్కాలికంగా సత్రంలో రెండుగదులు బాగుపరచి బస ఏర్పాటుచేశారు. దొరగారు మకాం పెట్టారు. పులికోసం మాటూపెట్టారు.

పులి మామూలుగా చెరువుకడ్డంబడి అర్ధరాత్రివేళో ఆకలేసినవేళో ఊళ్ళోకి షికారు వచ్చి పోతూండడంకద్దు. మూడుం జుల ందట పెదనాయుడుగారి గొడ్లకాపరి సిట్టెం అన్నను కొట్టుకు యింది. మ ృ నేడో రేపో రావచ్చును.

నల్లదొరగారు సేకరించిన సమాచారం యిది. కను చెరువుగట్టున

మర్రిచెట్టుమీద మాటేసి, క్రింద మేకను ఎరబెట్టి, చెట్టుచుట్టూ పదడుగుల లోతు, అయిదడుగుల వెడల్పున గొయ్యి తవ్వించి, పైపైన ఆకూ- అలమూ వేయించాడు. కావలసిన ఆహారపదార్థాలూ, తాగడానికి నీరు వగైరా జాగ్రత్త చేసుకుని, దొరగారు యిద్దరు అనుచరులతో మాటులో కూర్చున్నారు. గ్రామస్థులందర్నీ వెళ్ళిపొమ్మని చెప్పారు.

ఒక రోజు ప్రశాంతంగా గడిచిపోయింది.

దొరగారు పులి పారిపోయిందేమోనని అనుమానం వెలిబుచ్చారు. ''అస్సాం అడువుల్లో పుల్లు యిట్లా దాక్కోవు. పట్టపగలే గుట్టుచప్పుడు కాకుండావచ్చి, గప్‌చుప్‌గాపైన పడతాయి. నడుస్తుంటే మీదికి ఉరుకుతాయి. ఇదేమిటి?'' అని ఏమేమో కోస్తున్నాడు నల్లదొర నరహరిరావు యిద్దరు అనుచరులతో.

దూరంగా పులి గాండ్రింపు వినబడింది. నరహరిరావు బడాయిలు కొట్టడం మానేసి, తుపాకీతోసహా వణకడం ప్రారంభించాడు. ఇక అతని అనుచరులు భద్రయ్య, అచ్చయ్య అప్పుడే సహంప్రాణాలు వదిలేశారు.

నిజం చెప్పాలంటే నరహరిరావు అనుభవస్థుడైన వేటగాడు కాడు. కేవలం కొందరు వేటగాళ్ళవెనుక తిరిగి, అంతో యింతో తుపాకి కాల్చడంలో నేర్పు సంపాదించాడు వేటలో కొన్ని కిటుకులు నేర్చుకున్నాడు. కోతలుకోసి, టోపీవేసి కడుపునింపుకొనడం అతనిపని. వేరే ఉద్యోగంగాని, వ్యాపకంగానీ, ఆదాయంగానీ హుళక్కి. అదృష్టవశాత్తు అతని కోతలవలలో చిక్కనివారు అరుదు. తన తెలివే అతని ఆస్తి, ఆదాయం, పెట్టుబడీ అన్నీ.

పులి నెమ్మదిగా తారాడుతూ వస్తూంది నరహరిరావు చడీ, చప్పుడూ లేకుండా కూర్చున్నాడు. పులి తిన్నగావచ్చి, అరుస్తున్న మేకవంకకు మెల్లగా అడుగులు వేయసాగింది. చటుక్కున కాలుజారి లోతుగా వున్న గోతిలో జారిపడి, మహాగ్రోధంగా అరుస్తూ, అలజడి చేయసాగింది. దానివల్ల ఇక ప్రమాదమేమీలేదని నిశ్చయించుకొన్న తరువాత నరహరిరావు నెమ్మదిగా చెట్టుదిగి, పులిపైన తుపాకీతో రెండుబారులు కాల్చాడు. ఒక్క మూలుగుతో

పులి ప్రాణాలు వదిలింది.

మరునాడు ఉదయం గ్రామస్థులు నరహరిరావుకు బ్రహ్మరథం పట్టారు. వారికోరికపైన కొంతకాలంపాటు గ్రామంలో వుండటానికి అతడు సమ్మతించాడు. పైకి యిష్టంలేనట్లు నటించినా, అతడికీ అక్కడ మకాం పెట్టాలనే వుంది. గ్రామస్థులని సులభంగా మాయచేసి, తన యిష్టంవచ్చినట్లు వారిని ఆడించవచ్చునని గ్రహించాడు.

కొద్దిరోజుల్లో సత్రం ముందు ''ప్రజాసేవా సమాజము'' అనే బోర్డు వెలిసింది. క్రింద, 'ప్రసిడెంటు: నరహరిరావు' అనికూడా వ్రాయబడింది. ఒక పాతిక మంది జనాన్ని పోగుచేసి ఉపన్యాసాలు దంచడం ప్రారంభించాడు. గ్రామం బాగా అభివృద్ధి చెందాలనీ, అందుకు అందరి కృషీ, సహకారమూ అవసరమనీ నొక్కిచెప్పాడు. వీధులూ- వాడలూ పని గట్టుకొని తిరిగి సమాజం నిమిత్తం చందాలు వసూలుచేశాడు. శిథిలమైన దేవాలయం బాగుచేయిస్తానని వూళ్ళో సంపన్నులందరిదగ్గరా పెద్దపెద్దమొత్తాల్లో విరాళాలు వసూలుచేసాగాడు. ఇంకా పని ప్రారంభించరేం అని ఎవరేనా అడుగుతే, ''యిదిగో, అనుకున్నంత మొత్తం జమపడనీయండి.'' అని అనేవాడు.

గ్రామంలోవన్న కక్షలూ - కలహాలూ నరహరిరావుకి లాభదాయక మయ్యాయి. ఎప్పటికెయ్యది ప్రస్తుతమో ... అప్పటికది చెప్పి, తన స్వార్థాన్ని చక్కగా చక్కబెట్టుకొనేవాడు. కాలక్రమాన . మంలో ఏ గొడవ జరిగినా, దాని వెనుక నరహరిరావు చెయ్యి కూడా వుండేది. నారదుడిలా నరహరిరావు ఉత్త కలహభోజనుడేకాదు. అందువల్ల తనకి తప్పకుండా లాభంకలిగేటట్లు చూసిమరీ రంగంలోకి దిగేవాడు. కానీ అటువంటి గొడవల్లో తానున్నట్లు ఆచూకీ దొరకనిచ్చేవాడుకాదు. ఇరుపక్షాలతోనూ స్నేహం నటిస్తూ, అచిరకాలంలోనే అందరినీ మించిపోయాడు.

తన స్వార్థం కోసం అతడుచేసే ఎత్తులతో గ్రామంలో అదివరకే ఉన్న కక్షలు రెండితలయ్యాయి. దినదినాని నరహరిరావు ఆస్తి చూస్తుండగానే పెరిగి, ఒకమేడా, ఒకతోడా నాలుగెకరాల భూమీ, వ వా పారరూపంలో అయిదువేల

నగదుగా రూపొందింది. అదెలా వచ్చిందని అడిగే ధీరుడు లేకపోయాడు.

ఎవరైనా నోరుజారి అడిగితే మర్నాటికి మంచం పట్టేవాడు. అలా ఎక్కడినుంచో వచ్చి యిక్కడ గ్రామంలో మకుటంలేని మహారాజయ్యాడు నరహరిరావు. అతడి మాటకి ఎదురు లేదు ఇప్పుడు. ఆరునెలల్లో అమాంతం అధికారం చేతికొచ్చింది. కనకపు సింహాసనమున శునకమును గూర్చుండబెట్టిన బాపతుగా వుంది వ్యవహారం. అహంభావంతో ప్రవర్తించసాగాడు. యధారాజా - తథా ప్రజా అన్నట్లు అతని అనుచరులు భద్రయ్య, అప్పయ్య పెద్ద రౌడీలుగా రూపొందారు.

''ప్రజా సేవాసమాజం'' మందిరంలో విచ్చలవిడిగా జూదం, మద్యపానం సాగుతున్నాయి. దానిని నడిపిస్తున్నది నరహరిరావు. అక్కడ పేకాట ఆడి, నాటుసారా, సీమసారా తాగి గ్రామంలో సహంమంది చెడ్డారు. తాచెడ్డ కోతి వనమంతా చెరిచిందన్నట్లు తన స్వార్థం కోసం నరహరిరావు మొత్తం గ్రామాన్నే బలిచేసి, డబ్బు దోచసాగాడు!

అలాగే మరికొంతకాలం ఆ అవినీతిని సాగనిస్తే ఏమవునోకానీ - గ్రామ ప్రజల అదృష్టమా అన్నట్లు పట్నంనుండి చదువులు ముగించుకొని గ్రామపెద్ద నరసింహయ్య కొడుకులు సూర్యం, చంద్రం స్వగ్రామానికి వచ్చారు. వారికి గ్రామ సంస్కరణ చేయాలనే అభిలాష చాలా కాలంగా వుంది. తమ చదువులు ముగియగానే తమ గ్రామంతోనే సంస్కరణోద్యమం ప్రారంభించాలని వారు ''చాలా కాలంగా ఉత్సాహం చూపుతున్నారు. సూర్యం ఇంజనీరింగు, చంద్రం మెడిసిన్ కోర్సు విజయవంతంగా ముగించారు.

గ్రామంలో పరిస్థితి చూసి వారికి ఆశ్చర్యం కలిగింది. ఈ నరహరిరావెవరు? అతడికింత అధికారం ఎలా వచ్చింది? గ్రామంలో ఇన్ని కక్షలూ - కలహాలు ఏమిటి?

నరశింహయ్య వారికి పరిస్థితులను వివరించాడు.

సూర్యం ''అయితే వాడు చెప్పిందానికల్లా జోహారు అంటున్నారన్న మాట. పాపం గ్రామ ప్రజల్ని ఆ నరహరిరావు యిన్ని విధాల మోసగిస్తున్నాడా?

ఇదేమని మొహంమీద అడిగే మొగాడే గ్రామంలో లేకపోయాడా?'' అన్నాడు.

నరశింహయ్య నవ్వి ''అలాటి మొగాడే వుంటే వాడే అందరికన్నా మొనగాడని ఒప్పుకుంటాను. కానీ దురదృష్టవశాత్తూ ఎవరూ అంత గుండెగల మనిషి కన్పట్టంలేదు'' అన్నాడు. సూర్యం తమ్ముడి వంక చూసి కన్నుగీటాడు. చంద్రం తల పంకించాడు.

''చూస్తావుగా నాన్నా! ఆ నరహరిరావు బండారమేమిటో కొన్ని రోజుల్లో బయటపెట్టేస్తాం'' అన్నాడు సూర్యం.

''అందరిలా మోసపోవటానికి మేమూ అమాయకులం కాదు'' అన్నాడు చంద్రం.

''జాగ్రత్త, వాడొక విషపు త్రాచు. ఎప్పుడు ఎవరిని కొట్టేస్తాడో చెప్పలేం'' అని హెచ్చరించాడు నరశింహయ్య.

మరునాడే సూర్యం, చంద్రం తమ కార్యక్రమం ప్రారంభించారు, తమ మాట పాటించే నలభైమంది యువకుల జట్టును కూడగట్టారు. చంద్రం ఉచిత వైద్య శాలను తెరిచి బీదబిక్కీ జనానికి వైద్యం చేయసాగాడు. అతడిది అమృతహస్తం. కొద్దికాలంలో రోగం నయమయ్యేది. చంద్రం హస్తవాసి మంచిదనీ, అతడంతటి ఉదారహృదయుడు గ్రామంలోనే లేడనీ కొద్దిదినాల్లో వాడుకపడింది. గ్రామంలో నిత్యం అనారోగ్యం తాండవిస్తూనే వుంటుంది గనుక, గ్రామప్రజలకి చంద్రం అపరధన్వంతరిలా, ఒక దేవతలా గోచరించసాగాడు. ఇంటింటికీ వెళ్ళి కొన్ని ఆరోగ్య సూత్రాలుబోధించి, అమల్లోపెట్టసాగాడు.

అతడి నిర్విరామకృషి ఫలితంగా గ్రామం కాస్త ~ ..డింది. రోగాలు, చావులు తగ్గాయి. గ్రామాన్ని నిరంతరం అంటిపెట్టుకొ వుండే కలరా, మశూచీ వగైరా అంటురోగాలు కాస్త తెరపినిచ్చాయి.

మరో ప్రక్క సూర్యం వయోజనపాఠశా , రాత్రి పా శాల పెట్టి పిన్నలకూ, పెద్దలకూ విద్య, బుద్ధి గరపసాగాడు. న ప్రతివారి ఐకమత్యం ఆవశ్యకత నూరిపోశాడు. చాలా మందిని తన ంతకు ఆకర్షించుకున్నాడు. విజ్ఞానం గురించి వివిధ విషయాలు వివరించి చెప్పి వారి అజ్ఞానాన్ని

పారద్రోలడానికి ప్రయత్నించసాగాడు. దేశంలోగల అత్యవసర పరిస్థితిని గురించి వారు మొట్టమొదట విన్నది అతని ద్వారానే.

నరహరిరావుకి యిదేం నచ్చలేదు. గ్రామప్రజల్లో మూఢవిశ్వాసాలు అంతరించిపోతే తనకు నష్టం. ఆ అజ్ఞానంతోబాటే తానూ పోవాల్సి వస్తుంది. అందుకని అడుగడుగునా సూర్యానికీ, చంద్రానికీ ఆటంకాలు కలిగించ సాగాడు. అతి రహస్యంగా వారి పనులన్నింటినీ చెడగొట్టించేవాడు. ఈ సైంధవుడెవరో అన్నదమ్ములిద్దరికీ మొదట్లో అంతుబట్టకపోయినా మెల్లగా అసలు విషయం అర్థంకాసాగింది. ఆపైన తామూ ఎత్తుకి పైఎత్తు వేస్తూ వచ్చారు. నరహరిరావు తన ఎత్తులతో తానే చిత్తవుతూ వచ్చాడు. మనపట్లా జనంమీద అతని పాచికలు పారటంలేదు. ఒకరోజున మబ్బులేని పిడుగులా సూర్యం నరహరిరావుమీద విరుచుకుపడ్డాడు.

అది నరహరిరావు పెట్టుబడి పెట్టి భద్రయ్య చేత నడిపిస్తున్న కాఫీహోటలు, కాఫీ అని వచ్చిన సూర్యానికి గుసగుసలాడుతున్న నరహరి, భద్రయ్యలు కంటబడ్డారు.

''నమస్కారమండి'' అన్నాడు అతి వినయం నటిస్తూ సూర్యం.

నరహరిరావు అతడిని ఎగాదిగా చూసి, విషపునవ్వొకటి పారేసి తప్పనిసరిగా ప్రతి నమస్కారం చేశాడు.

''మన వ్యాపారం బాగా సాగుతోందను కుంటాను.''

అది భద్రయ్యతో అన్నాడో, తనతో న్నాడో నరహరిరావుకి బోధపడలేదు. తికమకపడి, భద్రయ్య వంకచూసి ''ఏదో... అట్లా సాగుతోంది తమబోటివారి దయవల్ల'' అన్నాడు విషయం ఒలకబోస్తూ.

భద్రయ్య కాస్త అతితెలివి ప్రదర్శించబోయాడు.

''శివయ్యా! అయ్యగారికి రోస్టుస్పెషలు పెసరట్టు! డబల్ స్ట్రాంగు కాఫీ!''

సూర్యం చిరునవ్వు నవ్వాడు.

''భద్రయ్యా! నువ్వు నన్ను కాకా పట్టవలసిన రోజులు ముందున్నాయిలే. అప్పుడేవద్దు. నాకు మామూలు కాఫీచాలు. చింతగింజల పొడిదేలే. అసలు కా పొడివాడితే నువ్వారిపోవూ. పైగా పెట్టుబడి ఆ అయ్యగారిదయ్యె.''

''ఇహిహి'' అని ఇకిలించాడు భద్రయ్య, నరహరిరావు కళ్ళతోటే వాడిని అదిలించి ''అదేవిటోయ్ సూర్యం, నాకున్నదల్లా పావలావాటాయే. మిగతాదంతా వాడి కష్టఫలితం. నీవు భద్రయ్యనలా తేలిగ్గా తీసిపారేయడం మంచిదికాదు'' అన్నాడు. సూర్యం జవాబు చెప్పకుండా సర్వరు తెచ్చిపెట్టిన కాఫీని పరీక్షిస్తున్నాడు. నరహరిరావు అతడిని మింగేసేలా చూస్తున్నాడు.

సూర్యం కాఫీగ్లాసు తీసుకొని భద్రయ్య దగ్గరకు వెళ్ళాడు.

''హోటలు నీదేకదూ?'' అన్నాడు.

భద్రయ్య తలూపాడు.

''కాఫీ చాలా బాగా చేశారు....''

భద్రయ్య నవ్వాడు అర్థంకాక.

''నీళ్లపాలు, చింతగింజలపొడి స్టాకు బాగా వుందనుకొంటాను.'' సూర్యం చటాలున ఆ కాఫీ భద్రయ్య చొక్కామీద పారబోశాడు. భద్రయ్య పళ్ళుకొరుకుతూ వచ్చి సూర్యం చొక్కాపట్టుకొన్నాడు. రహరిరావు మెల్లగా అవతలకు జారుకొని కిటికీలోనుంచి తొంగి చూడసాగాడు.

''ఏం కళ్ళు నెత్తికెక్కినయా ! కా మీద పోశావ్?'' అని ఉరిమాడు భద్రయ్య. సూర్యం జంకలేదు. బ లో యింతకుమించిన కొమ్ములుతిరిగిన రౌడీలనే నేలకరిపించాడు. భద్రయ్య చెయ్యిని ఏదో సరదాకన్నట్లు మెలిపెట్టాడు. బాబోయ్ అని అరిచాడు భద్రయ్య.

''భద్రయ్యా! భద్రం! కళ్లు నాకు నె కి రాలేదు. కానీ నిజం కళ్ళకు ఎక్కింది. నువ్వు అన్నిసరకులూ క చేస్తున్నావా? లేదా? నిజంచెప్పు. లేకుంటే చెయ్యి విరిచేస్తాను ఖబడ్దార్. సూర్యం అంటే ఎవరనుకున్నావు?''

''బాబ్బాబు! మీకాళ్ళట్టుకుంటాను. బుద్ధిగ తి వేసినమాట

నిజమే. మరొప్పుడూ సెయ్యను.'' అని కాళ్ళావేళ్లాపడటం ప్రారంభించాడు.

''అలా దారికిరా, రేపట్నుంచీ కల్తీ సరకులమ్మేవని తెలిసిందో, హోటలు మూయించటమేగాక, నీ ఒళ్ళు హూనం చేస్తాను. జ్ఞాపకముంచుకో.''

సూర్యం భద్రయ్యను విడిచిపెట్టి వెళ్ళిపోయాడు.

ఆ హెచ్చరిక భద్రయ్యకుకాదు, అసలు సూత్రధారుడు నరహరిరావుకి. అతడు కుతకుత ఉడికిపోయాడు. భద్రయ్య, సూర్యం అటుగుమ్మం దాటగానే యిటు కుట్ర ప్రారంభించాడు.

''అయ్యగారూ! యికీళ్ళని ఒకసూపు సూడాల్సిందే. ఊరుకొంటే లాభం లేదు. ఏకైవచ్చిన మనిషి మేకై కూర్చున్నాడు. మీరు ఊ అనండి. ఇవాళ రాత్రికే....'' అన్నాడు నరహరిరావుచెవిలో. నరహరిరావు సరేనన్నాడు.

ఆరాత్రి భద్రయ్య, అప్పయ్య మరిద్దరు రౌడీలు ముసుగులతో నరసింహయ్య ఇంట్లో జొరబడ్డారు. పిల్లుల్లా చప్పుడు చెయ్యకుండా పడగ్గదిలో జొరబడ్డారు. అంతవరకూ తెరచుకొని వున్న తలుపులు చటుక్కున మూసుకున్నాయి. వచ్చిన నలుగురికీ గదిలో బాగా దేహశుద్ధి జరిగిన తరువాత నలుగుర్నీ మెడబట్టుకు వీధిలోకి పడగొట్టారు సూర్యం మనుషులు.

సూర్యం వీధరుగుమీద చేతిలాంతరుతో నిలబడి ''ఏం భద్రయ్యా! కుక్కతోక ఎంత సాగతీసినా వంకరేనన్నట్లు నీకింకా బుద్ధిరాలే. మళ్ళీ ఇటువంటి పనులకి పూనుకున్నావని తెలిస్తే యీవూళ్ళోనే నిలువనీడలేకుండా తరిమేస్తాను? జాగ్రత్త!'' అని హెచ్చరించాడు. ఆ నలుగురూ మాట్లామాట్లాడకుండా పడుతూ లేస్తూ పోయారు. అప్పుడే వచ్చిన చంద్రం ''వీళ్ళెందుకు వచ్చారిక్కడికి?'' అని అడిగాడు. సూర్యం రుసరుసలాడుతూ ''మరెందుకు వస్తారు? వాళ్ళ ఆటలు మనం సాగనీయటం లేదుగా? అందుకని నరహరి మనని కొట్టించడానికి పంపారు మనుషుల్ని. వాడి స్వభావం నాకు బాగా తెలవబట్టే నా జాగ్రత్తలో నేనున్నాను అనుకున్నట్లే వచ్చారు'' అన్నాడు.

చంద్రం ''అన్నయ్యా! ఒక ముఖ్య విషయం మాట్లాడాలి'' అన్నాడు.

''చెప్పు తమ్ముడూ!''

''చెరువులోని పూడికంతా తీయించేసి, ఒక నిలువులోతు తవ్వితే మళ్ళీ జలపడుతుందని నా అభిప్రాయం. ఊళ్ళో నీటికున్న కటకట నీవు ఎరుగనిదికాదు. పాపం నాలుగుమైళ్ళ దూరంపోయి తాగేందుకు నీరు తెచ్చుకోవాల్సి వస్తోంది. ఊళ్ళో ఉన్న ఒక్క బావీ స్నానానికే తప్ప త్రాగేందుకు ఉపయోగపడ్డంలేదు. ఊళ్ళో సాగుకి లాయకీయైన భూమిలో మూడొంతులు నీటి వసతి లేకపోవటంవలన బీడుగా మారిపోయింది. కొంతమంది కరువుబాధ పడలేక వలసకూడా పోతున్నారు. కొంతకాలం యిలాగే జరుగుతే మొత్తం గ్రామమే పాడుపడుతుంది. కనుక ఎలాగైనా చెరువుబాగు చేయించి తీరాలి.''

''చంద్రం! నేను యిదివరకోమాటు ఆ మాటే నలుగురిలో అంటే అందరూ హేళనగా మాట్లాడారు. ఆ చెరువులో ఎంతతవ్వినా ఇక ఒక చుక్కకూడా జలపడదన్నారు. ఇదంతా నరహరిరావు కల్పించినది. నానమ్మకం కూడా తప్పక జలపడుతుందనే. కానీ గ్రామంలో అందరికీ పనిచెయ్యాలంటే బద్ధకం.''

''హుం! సోమరితనం! మనిషి తలచుకొంటే కొండలు పిండి అవుతాయి. మహారణ్యాలు మహానగరాలవుతాయి. ఆ చెరువు తవ్వించడం పెద్ద పనికాదు. చేయించడానికి, పురికొల్పడానికి తగిన మనిషుండాలి. అంతవరకూ తమ శక్తి తమ అవసరం గుర్తించరు మనుష్యులు. వారిని నిద్రలోనుంచి లేవగొట్టాలి. సోమరితనాన్ని పారద్రోలాలి. నన్నడిగితే ''కృషితో నాస్తి దుర్భిక్షం'' అని చెబుతాను. మనం ముందు కష్టపడాలి. తరువాతనే ఫలితం.''

''సెహభాష్ చంద్రం! బాగా చెప్పావు. రేపే యిందువిషయమై సభ యేర్పాటుచేస్తాను. నువ్విదే విషయం గ్రామస్థులకు నచ్చచెప్పి ఒప్పించాలి. ఆ తరువాత బాధ్యతంతా నేను వహిస్తాను.''

మరునాడు సభ ఏ ంది.

చంద్రం ఆవేశంతో ఉ న్య ంచాడు!

''మీరు చెరువులో యిక నీరు పడదనేగట్టి నమ్మకంతో చేతులు

కట్టుకొని, శుష్క వేదాంతాలతో కాలం గడుపుతున్నారు. అదివట్టిది. మానవుని చేతిలో వున్న మహాశక్తిని మీరెరుగరు. ప్రయత్నించకుండానే ఫలితం లేదని అనే మనిషి మూర్ఖుడు. చెరువులో నీరు పడదని మీరెప్పుడైనా ప్రయత్నపూర్వకంగా తెలుసుకున్నారా? లేదు. అది కేవలం మూఢనమ్మకం మాత్రమే ప్రయత్నిస్తే జేయలేనిపనంటూ వుండదు. లేవండి. లేచి నడుంచ బిగించండి. మీ మూఢనమ్మకాన్ని వీడండి. కష్టపడి మీ మంచికోసం మీరే కృషిచేయండి. అందుకు తగిన ఫలితం తప్పకుండ పొందుతారు. ఎవరెవరు యీ కార్యక్రమంలో పాల్గొనదలచుకొన్నారో ముందుకు వచ్చి పేర్లివ్వండి. మీకు తోచిన ధన, ధాన్య, వస్త్రాదులను విరాళంగా యివ్వండి; రండి.''

నరహరిరావు యిటువంటి నిజమైన విషయాలు ఎప్పుడూ చెప్పలేదు. కనుక గ్రామస్థులకి చంద్రం ఆ విషయం చెబుతుంటే ఆశ్చర్యంగా విన్నారు. నేనంటే నేనని పనికోసం ముందుకు వచ్చారు. విరివిగా విరాళాలు వచ్చాయి.

విఘ్నేశ్వర పూజ జరిపి యాభైమంది జట్టు అత్యుత్సాహంతో చెరువులో పూడిక తీయసాగారు. తట్టలతో మరో జట్టు ఆ పూడికను దూరంగా పారబోస్తూంది. మరికొందరు చెరువుచుట్టూ పెరిగిన కశ్మలాన్ని తొలగించడానికి పూనుకున్నారు. అక్కడే పనిచేసేవారి నిమిత్తం భోజనశాల అప్పటికప్పుడు ఏర్పాటు చేయించాడు సూర్యం. అత్యుత్సాహంతో పని సాగుతోంది. అందరూ ఎవరికి తోచిన పని వారు చేస్తున్నారు. అన్నాళ్ళూ వారిని ఆవహించిన సోమరితనం దూరంగాపోయింది. పూడికంతా తీసివేశారు. చెరువు చుట్టుపట్ల శుభ్రంగా తయారైంది. చెఱువు తవ్వకానికి రెండవజట్టు వచ్చి మొదటి జట్టుకు విశ్రాంతి నిచ్చింది.

అంతవరకూ చెమటోడ్చి పనిచేసిన చంద్రాన్ని సూర్యం భోజనం చేయమని పంపాడు. సూర్యం ప్రోత్సాహమిస్తుండగా ఒకటిన్నర నిలువులలోతు తవ్వారు. సూర్యం రివ్వున గునపంతో పొడిచి లాగేసరికి దానివెంటనే జల రివ్వున పైకెగసింది. అక్కడి అందరి ఆనందం వర్ణనాతీతం. ఉరుకులు పెడుతూ గట్టుకుచేరుకున్నారు. కొబ్బరికాయలు కొట్టి, నిమ్మపళ్ళుకోసి విసిరారు.

చూస్తుండగానే చెరువునిండుగా నీటితోనిండి నిర్మలంగా మెరవసాగింది. జనం ఆనందంతో సూర్యాన్ని, చంద్రాన్ని భుజాలమీద ఎక్కించుకొని ఊరేగారు. ఉత్సవాలు జరిగాయి. ఊళ్ళో యిక నీటికి కరువులేదు. తాము కోల్పోయిన పాడి-పంటలు యిక తిరిగొస్తాయి.

ఆదేవూపున చెరువునుంచి అందరి పొలాలకూ నీరు అందేటట్లు కాలువలు తవ్వించాడు సూర్యం. ఆనాటిరాత్రి సూర్యంకి, చంద్రానికి సన్మానసభ సరిగింది. సూర్యం తను వ్రాసిన బుర్రకథను పాడించాడు.

''భారత్- చీనా భాయి భాయి అని - సై

భారతీయులకు వెనుపోటు పొడిచారూ - సై

దొంగచాటుగవచ్చి దురాక్రమణ జరిపారూ - సై

మనమాతృభూమిని మింగేయజూచారు - సై

ఆవిధంగా దురాక్రమణ చేసిన చైనాను చూసి భారతీయులేం చేశారయ్యా అంటే....?

ఏం చేశారూ?

''అంతటు అఖండభారతానని అంత

ఒక్కటై - భళాభళి

శత్రుని సేనల హిమాలయముల ఎదిరించి - భళాభళి

అడుగు అడుగునా నిలిపి పోరి

వారిని వారించి - భళాభళి

సరిహద్దు పొడుగునా మనహక్కు

స్థాపించారు - భళాభళి

సైనికులు పోరాడుతునా రు, సరేగాని, అన్నయ్యా, మరి మిగతా భారతీయులందరూ ఏం చేస్తున్నారు? చూస్తూకూర్చున్నారా?

ఒరే తమ్ముడూ, అందరూ నీలాగే ''కడుపే కైలాసం - వంటిల్లే

వైకుంఠం'' అని భావించర్రా! విను మరి...

భారతదేశపు ప్రజల హృదయంలో - సై
పొంగిపొర్లేది వీర రసంగాని నీరసం కాదు - సై
మంచి మాటలు చెప్పి మత్తుమందుజల్లి - సై
మిత్ర భారతానికి ముప్పుతలపెట్టిన
చైనా - సై
అందుకు తగినశిక్ష అనుభవిస్తుంది - సై
అయితే, అన్నయ్యా, మనమేం చెయ్యాలంటావ్?
చెయ్యాలనుకుంటే ఎన్నోవున్నాయి తమ్ముడూ. ఏదిచేసినా దేశసేవే....
విశాల భారత విజయానికై - సై
వీరసిపాయిల అండదండలకై - సై
విరివిగ విరాళాలు విరజిమ్మాలి - సై
దేశభక్తి జనశక్తిలో పురిగొల్పి - సై
జాతిలో జాగృతి రేకెత్తించాలి - సై
ఓహో, అలానా! అప్పుడేమవుతుంది?
అది మన దేశశక్తికీ దోహదం - భళాభళి
జాతీయ విజయానికి కీలకం - భళాభళి
వినరా భారత వీరకుమారా - భళాభళి
అనే నిజం నిలకడమీద తేలుతుంది - జైహింద్!
జాతీయ రక్షణనిధి విరాళాలు వర్షంలా కురిశాయి!

నరహరిరావుకిదంతా చూస్తుంటే కన్నుకుట్టింది. ఇప్పుడు ఎవ్వరూ తనమాట వినిపించుకోవటంలేదు ఎవరినోటవిన్నా సూర్యం - చంద్రం పొగడ్తలే! అక్కడికి కడుపుమండింది. వారిద్దరిమధ్య ఏదో కలహం రేపెట్టి, విడదీస్తేనేగానీ తన కక్ష చల్లారదు. తన పేరు నిలబడదు. అందుకోసం అవకాశం వెతకసాగాడు.

వీలు దొరికింది. తన కుతుంత్రం ప్రారంభించాడు.

ఆ గ్రామంలోకల్లా మోతుబరి ఆసామీ గురునాథం నరసింహయ్య బావమరిది. ఆయనకు ఒక్కర్తే కూతురు సరోజ. చాలా అందమైనది, చదువుకొన్నది. సూర్యం, చంద్రాలతోబాటు పాటుబడుతోంది. గ్రామపునరుద్ధరణ కార్యక్రమంలో. ఆమె సూర్యం - చంద్రలు యిద్దరికీ యిష్టమే. ఇద్దరూ ఒకరికి తెలియకుండా మరొకరు సరోజను ప్రేమిస్తున్నారు. పెళ్ళిచేసుకోవాలని ఆశిస్తున్నారు. అయితే సరోజ మనసు చంద్రంమీదుంది. ఆ సంగతి సూర్యానికి తెలియదు. పైకిమాత్రం ఆమె తమిద్దరితోటీ చనువుగానే మసలుతూండడంవలన సూర్యం, ఆమె చంద్రాన్ని ప్రేమిస్తుందన్న సంగతి గ్రహించలేదు.

ఆవులిస్తే ప్రేవులు లెక్కబెట్టే నరహరి రావు అన్నదమ్ముల చిత్తవృత్తి ఎలాగుందో గ్రహించాడు. ఇక వలవేయడం ప్రారంభించాడు. ముందర గురునాథంతో దోస్తీ కలిపాడు. నరహరిరావు అల్లిన సాలెగూటిలో గురునాథం చిక్కుకున్నాడు. నరహరిరావు యిప్పుడుకాస్త అతిమంచిగా నటించడం ప్రారంభించాడు. లోలోపల గొణుక్కుంటూనే సత్రం, దేవాలయం బాగుచేయించాడు. సూర్యాన్ని నెమ్మదిగా తనవంకకు ఆకర్షించుకోవడం ప్రారంభించాడు. సూర్యం తనకు తెలియకుండానే నరహరిరావు కబంధ హస్తాల్లో యిరుక్కున్నాడు. నమ్మకూడదనుకుంటూనే నరహరిరావును నమ్మాడు. ఆ మనిషి మారిపోయాడనే విశ్వసించాడు.

నరహరిరావు, సూరా నికి - గ్రామా ంచి కి ఒకబాట, రైలుస్టేషనుకి ఒకబాట కంకరతో వేయి బాగు టుంద సూచించాడు. వాటివల్ల తమ గ్రామానికేకాక, చుట్టుప్రక్కలున్న అయిదారు . మాలకికూడా లాభముంటుందని సూ ం అంచనా వేశాడు. తమ . మమొక్కటే కంకరరోడ్లు వెయ్యడానికయ్యే ఖరు । ‹ా భరి ‹లేదు. ఆ గ్రామాలవారుకూడా కలిసివస్తే పని సులభమవుతు ు. ామం ్రోభి ్ౖరిక్కీ, రుగుదలకూ రోడ్డు చాలా అవసరం. బ కి రోడ్డు డితే తమ పంటల్ని సులభంగా మార్కెట్టుకు చేర్చి

అమ్ముకోవడానికి వీలు. అదివరకు వర్షాకాలమంతా గ్రామం విడిచి అవతల అడుగు పెట్టడానికి వీలయ్యేదికాదు. కావలసిన సరుకులు తెచ్చుకోవడానికిగానీ, చేతిలో సరకు అమ్ముకోడానికిగానీ వర్షాకాలం మూడు నాలుగు నెలలపాటు అసలు జరగని పని. రోడ్డువేస్తే ఆబాధ తప్పుతుంది. రైలు స్టేషనుకి వేసేరోడ్డు వల్ల ప్రయాణం సులభమవుతుంది. బస్సు అవసరం లేకుండా గ్రామానికి సరాసరి దగ్గర దారి ఏర్పడుతుంది. బస్సే గ్రామంమీదుగా వెళ్ళే రోజుకూడా రావచ్చును. ఇదంతా ఆలోచించి సూర్యం సరేనన్నాడు. నరహరిరావుతో చుట్టుప్రక్కల గ్రామాల్లో రోడ్డు వేయాల్సిన ఆవశ్యకతను గురించి చెప్పి సహాయం రాబట్టడానికి బయల్దేరాడు.

చంద్రానికి నరహరిరావు యీ కార్యక్రమాల్లో జోక్యం కలిగించుకోవడం నచ్చలేదు. తమకు ప్రతిపనిలోనూ అంతవరకూ అడ్డుపుల్లలు వేసినది అతనేనని చంద్రానికి బాగా తెలుసు. ఇప్పుడు ఏ దురుద్దేశ్యంతో తమతోచేతులు కలుపుతున్నాడో దురూహ్యం. దాని వెనకేదో అతడిస్వార్థం తప్పకుండా ఉంటుంది. మేకతోలు కప్పుకున్నంత మాత్రాన పులి సాధువవుతుందా? నరహరిరావు తమకెప్పుడూ పక్కలోని బల్లెమే. చంద్రం అన్నని హెచ్చరించాడు.

''అన్నా! నువ్వా నరహరిని వూనుకు తిరగడం నాకేం నచ్చలేదు.''

''చంద్రం! ఎప్పుడో తప్పులు చేశాడని ఆయన జీవితాంతం తప్పులు చేస్తాడనుకోకూడదు. చూస్తున్నావుగా ఆయన ఈ మధ్య ఎంత మంచిగా ఉంటున్నాడో?''

''ఆఁ. పుట్టినబుద్ధి పుడకల్తోగాని ఆయనకు పోదని నాకు బాగా తెలుసు. నువ్వాయన తీపి మాటలకు మోసపోతున్నావు.''

''చాల్లేరా, మరీను. మరీ అంతగా పరిస్థితి చెడితే అప్పుడు చూద్దాంలే.''

అన్నదమ్ములమధ్య కొద్దిగా వైషమ్యాలు వచ్చాయి. నరహరిరావు వేసిన విరోధబీజం అంకురించింది. రోడ్డుకార్యక్రమంలో చంద్రం కలుగజేసుకోన లేదు. నరహరిరావుకిది సంతోషజనకమైంది. తనకుతంత్రం ఫలిస్తోంది. వారిద్దరిమధ్యా అగాధం సృష్టించాలి. విడదీయాలి. గర్భశత్రువులుగా మార్చాలి.

చుట్టుప్రక్కల గ్రామాలవారు రోడ్డు వేయడానికి సహాయం చేయడానికి అంగీకరించారు. పని ప్రారంభమై, సూర్యం నిర్వహణక్రింద చకచక సాగుతోంది. బ వంక, రైలుస్టేషన్ వంక చకచక కంకరరోడ్డు పడుతోంది. తహాగా సూర్యం సివిల్ యింజనీరింగులో ప్రవీణుడు కావడంవలన యీ కార్యక్రమం చురుగ్గా నడిపిస్తున్నాడు. ఉదయం నుంచి చీకటి పడేదాకా నిర్విరామంగా పనిచేస్తున్నాడు. సూర్యం ఎంత పిలిచినా చంద్రం రాలేదు. తనకు అర్జంటుగా చూడాల్సిన వైద్యశాలపనులున్నాయని తప్పించుకున్నాడు.

ఒకరోజు సాయంత్రం చంద్రం, సరోజ చెరువుగట్టున కూర్చొని మాట్లాడుకుంటున్నారు. ఫర్లాంగుదూరాన జీపుమీద తిరిగొస్తున్న సూర్యం, నరహరిరావులకంటబడింది ఆ దృశ్యం. ఆ జంటను చూసిన సూర్యంలో కొద్దిగా అసూయ రగులుకొంది. జీపును ఆపమన్నాడు. కావాలనే జీపును అటువంకగా తీసుకొనివచ్చిన నరహరిరావు జీపును ఆపకుండా పోనిస్తూనే, సూర్యంలోని తహతహ ంటు చూస్తూ ''పాపం! ఆ ప్రేమికుల సరదాను చెడగొట్టకో . నువ్వెళ్ళితే మీ తమ్ముడు విసుక్కుంటాడేమో? అందుకనే కదా అతడు మ రాకుండా వున్నది. అన్నట్టు చంద్రం సరోజని పెళ్ళిచేసుకుంటాడటగా అని విషం కక్కాడు.

ఈ మాటలు సూర్యం హృదయంలో బాకుల్లా దిగబడ్డాయి. తనతో రాకుండా చంద్రం సరోజని మచ్చిక చేసుకుంటున్నాడా? దన్నమాట అతడి అర్జంటుపని.!

నరహరిరావు మరికొంత ద్వేషం పుట్టించాడు అ యివీ చెప్పి, సూర్యానికి తమ్ముడి మీద తాత్కాలికంగా అసహ్యం కలిగింది. తన మనసు సరోజ మీదుందని తెలియదూ? అసూయా - అహం మనిషి మీద కాలకూటవిషాల్లా పనిచేస్తాయి.

సూర్యం - చంద్రాల మధ్య కలివిడి త ంది. ఎడమొహంపెడముఖాలుగా వుంటున్నారు. చంద్రానికి అన్న తన గురించి ప్రదర్శిస్తున్న వైముఖ్యానికి కారణమేమిటో అర్థంకాలేదు. కాని అందుకు కారకుడు నరహరిరావే

అయుంటాడని గ్రహించాడు. కానీ తాను చేయగలిగినదేమీ లేకపోయింది. సూర్యం పూర్తిగా నరహరిరావుచేతిలో కీలుబొమ్మయి పోయాడు. అతడెలా ఆడిస్తే అలా ఆడుతున్నాడు.

చంద్రం అత్యవసరమైన మందుకోసం బస్తీకి పోవాల్సివచ్చింది. సూర్యం రహస్యంగా సరోజని కలుసుకున్నాడు. తన ప్రేమని వెల్లడించాడు. చంద్రాన్ని నిందించాడు. ఆమెముందు, తనని పెళ్ళిచేసుకోమని ప్రాధేయపడ్డాడు. సరోజకి అర్థమైంది అతడి ఆవేదన. అన్నదమ్ముల మధ్య వైరానికి కారణం తెలిసింది. తానే! అయితే తనని పాచికగా వాడినది నరహరిరావు.

''సూర్యం! నువ్వు నరహరిరావు మాయలోపడి మోసపోయావు. నేను చంద్రాన్నే మొదటినుండీ ప్రేమిస్తున్నాను. నీతోకూడా చనువుగా మెసలడంవలన, అసలు విషయం ముందే చెప్పకపోవడంవలన యింతవరకూ వచ్చింది. నన్ను క్షమించు సూర్యం. నా మనసు చంద్రం మీదనే వుంది. నరహరిరావు నీతో చెప్పినవన్నీ పచ్చి అబద్ధాలు. వాడొక మాయగాడు. నిన్ను పూర్తిగా మోసగించాడు.''

సూర్యం మతి గిర్రున భ్రమించింది. చేదు విషంలాంటి నిజం. తమ్ముడిని తానెంతో అనుమానించాడు. అవమానించాడు కూడా. పాపం ఒక్కమాటకూడా ఎదురుచెప్పకుండా వెళ్ళిపోయాడు. దీనికంతకూ ఆ నరహరిరావు కారణం. వాడిని....

''సరోజా! నీవే నన్ను క్షమించాలి. మిమ్మల్ని అర్థంచేసుకొన లేకపోయాను నరహరిరావు వలలో పడ్డాను. నన్ను నేనే వంచించుకున్నాను. సరోజా! చంద్రానికీ, నీకూ వివాహం జరిపిస్తాను. నా పాపానికి ప్రాయశ్చిత్తం చేసుకుంటాను.''

అప్పుడే గురునాథంగారింటికి ఏదో వ్యవహారం చర్చించడానికి వచ్చిన నరహరిరావు చెవిలో యీ మాటలు పడ్డాయి. సూర్యానికి నిజం తెలిసి పోయింది. తను కంటబడితే ఎముకలు విరగ్గొట్టడం ఖాయం. చల్లగా అవతలికి జారుకొని తన మకాంకి చేరుకున్నాడు. ఇంక గ్రామంలో నిలవనీయడు సూర్యం,

అతడిచేతికి చిక్కకుండానే దాటుకోవాలి. భద్రయ్య, అప్పయ్యలతో విరాళాలుగానూ, తదితర విధాలగానూ సంపాదించిన సొమ్మంతా మూటగట్టి ముందుగా స్టేషన్‌కుపోయి కాచుకొని వుండమన్నాడు. అప్పటికే చీకటిపడింది.

నరహరిరావు చాలారోజులుగా సరోజమీద కన్నేసివున్నాడు. ఆమెను తనకిచ్చి పెండ్లిచేయమని గురునాథాన్ని అడిగి విఫలుడయ్యాడు. లేచిపోతూ, ఆమెనుకూడా ఎత్తుకుపోవడానికి సాహసించాడు. సరోజ ఆ సమయంలో చెరువుగట్టున తిరుగుతూ వుంటుంది. జీపుమీద చెరువుగట్టుకుపోయాడు. సరోజను తనతో రమ్మని బలాత్కరించ సాగాడు. తుపాకి చూపి బెదరించాడు.

నరహరిరావును వెతుక్కుంటూ సూర్యం అటువచ్చాడు. సరోజను బలాత్కరిస్తున్న నరహరిరావును చూసి అతడిమీదకు విరుచుకుపడ్డాడు. నరహరిరావు తుపాకీ నాలుగుమార్లు కాల్చాడు. రెండ్లుగుండ్లు సూర్యంకి తగిలి గాయాలయ్యాయి. గాయాల్నుంటి రక్తంకారుతున్నా లక్ష్య పెట్టకుండా నరహరిరావుమీద పడ్డాడు. అతడిని చావగొట్టాడు. రైలుస్టేషన్నుంచి నలుగురు మనుషులతో ఎడ్లబండిమీద వస్తున్న చంద్రం ఆదృశ్యం చూసి పరుగెత్తి వచ్చాడు.

చంద్రంతో వచ్చిన మనుషులు నరహరిరావును తాళ్ళతో కట్టేశారు. ఆ గతే రైలు స్టేషనులో డబ్బుతో పారిపోబోతున్న భద్ర అప్పయ్యలకు పట్టింది. డబ్బుతోసహా చిక్కిపోయి బండిలో కొరలూడిన పాముల్లా పడున్నారు. సరోజ, సూర్యాలనూ బండిమీద కూర్చుండబెట్టి, నరహరిరావుని లాక్కొని గ్రామానికి చేరుకున్నాడు. నరహరిరావు చేసిన దుష్కృత్యాలన్నీ వెల్లడైపోయాయి. అతడినీ, అతడి అనుచరులనీ పోలీసులకు అప్పగించారు. డబ్బంతా గ్రామపంచాయితీకి అప్పగించబడింది.

చంద్రం తన శక్తంతా ధారపోసినా సూర్యాన్ని రక్షించుకొనలేకపోయాడు. సూర్యం కోరికమీద అతడి కళ్ళముందే చంద్రం సరోజల వివాహం జరిగింది. వారిని ఆశీర దించి ఆనందాశ్రువులు రాలుస్తూ ''తమ్ముడూ! నీకృషిని కొనసాగించు, నా పేరు నిలబెట్టు'' అని చెప్పి కళ్ళుమూశాడు. అతడి ప్రాణవాయువులు అనంత విశ్వంలో కలిసిపోయాయి.

చంద్రం - సరోజల నిర్విరామకృషి ఫలితంగా అనతికాలంలోనే గ్రామంలో సౌభాగ్యం మూడుపువ్వులూ - ఆరుకాయలుగా విలసిల్లింది.

సూర్యం స్మృతిచిహ్నాలుగా ''సూర్యా మెమోరియల్ హాస్పటల్'' ''సూర్యా మెమోరియల్ హైస్కూల్'' వెలసి వెలుగొందుతున్నాయి.

చంద్రం - సరోజలు తమకు పుట్టిన మొదటి పిల్లాడికి ''సూర్యం'' అని పేరుపెట్టి తమ స్మృతిని శాశ్వతంగా నిలుపుకున్నారు.

***